ప్రతులు ౧౦౦౦

ఈ గ్రంథము

శ్రీ సురవరం రంగారెడ్డిగారి

షష్టిపూర్త్యుత్సవ

చిహ్నము

వెల 3—0—0

# తొలిపలుకు

"ఇదమంధంతమః కృత్స్నం జాయేత భువనత్రయం
యది శబ్దాహ్వాయం జోతిరాసంసారం నదీప్యతే."

విద్య, విజ్ఞానము మానవునికి ఔన్నత్యమును, ఆనందమును జేకూర్చునట్టివి. అట్టి విజ్ఞానమును దేశీయులలో వ్యాపింపఁజేయఁ దలపెట్టిన పరిషత్ప్రయత్నమును ఈసారి శ్రీ సురవరం ప్రతాపరెడ్డి బి. ఏ. బి. ఎల్. గారు ఫలవంతముగా నొనర్చినారు.

ఈ "యువజన విజ్ఞాన" గ్రంథమున సంకలితములైన ప్రార్థన, నీతిపద్యములు, శకములు, మతములు, భాషలు, ఆంధ్రవాఙ్మయము, పండుగలు, భూగోళము, ఆరోగ్యవిధులు, ప్రపంచమహనీయులు, రాజకీయపరిజ్ఞానము, విజ్ఞానవిశేషములు, గ్రామసమస్యలు, అను విషయములు సామాన్య భాషాజ్ఞానము కలవారికి వివిధమైన విషయ పరిజ్ఞానమును గలిగించుటకు మిక్కిలి సమర్థములై యున్నవి. యువజనవిద్య (వయోజనవిద్య) ను ప్రచారముచేయువారి హస్తకమలముల నలంకరించుట కెంతేయుఁ దగినది ఈ గ్రంథరాజము.

దేశీయుల విజ్ఞానము నభివృద్ధిపరచుటకు దీపకళిక వంటిదైన యిట్టి యుత్తమగ్రంథమును రచించి విజ్ఞానవర్ధినీ పరిషత్పక్షమునఁ బ్రకటించుట కామోదించిన శ్రీ ప్రతాపరెడ్డిగారియెడల పరిషత్తు కృతజ్ఞతాబద్ధమగుచు, ఈ గ్రంథమును జదివి లాభమును పొందవలసినదని ఆంధ్రలోకమును గోరుచున్నది.

బహుళవ్యయముచేత గాని సాధ్యపడని యీ గ్రంథముద్రణమునకు వలసిన వ్యయమునంతయు భరించి, తమ షష్టిపూర్త్యుత్సవ చిహ్నముగా పరిషత్పక్షమునఁ బ్రకటింపించి, ఆంధ్రలోకమునకు మహోపకార మొనర్చిన శ్రీ సురవరం రంగారెడ్డిగారి (క్యాతూరు) యౌదార్యమును ప్రశంసించుచు, భగవానుడు వారి కాయురారోగ్యచిరసౌఖ్యముల నొసఁగుగాక యని ప్రార్థించుచున్నాము.

విజ్ఞానవర్ధినీపరిషత్తు,
సుల్తాన్‌బజార్, హైద్రాబాద.
1—2—1951.

ఇట్లు,
కేశవపంతుల నరసింహశాస్త్రి,
గౌ॥ కార్యదర్శి.

# శ్రీ సురవరం రంగారెడ్డిగారు

సురవరమువారు మఱెవాడ (మోటాటి) రెడ్డిశాఖకు చెందిన వారు. ఈ వంశమువారు పూర్వము సురపుర (షోరాపూరు) సంస్థానములో నాయకపదవియందుండి ఇంచుమించు ౨౦౦ సం॥కు పూర్వము అచ్చటినుండి తరలి పలుశాఖలై ఒకశాఖ తుదకు ఇటికేలపాటి (అలంపూరు తాలూకా) లో నిలిచెను. అప్పటినుండి వీరిని సూరాపురంవారు అనిరి. అదే సురవరమయ్యెను. వీరికి స్వశాఖీయులైన వనపర్తి మున్నగు సంస్థానాధిపతుల స్నేహ బాంధవ్య గౌరవములు కలవు. శ్రీ రంగారెడ్డిగారికి పూర్వులైన ఎల్లారెడ్డి, పాపిరెడ్డి రాజగౌరవములను పొంది, ప్రజాహిత కార్యములుచేసి, ఆయుర్వేదము మొదలయిన విద్యలను గడించి అసమాన కీర్తి వైభవములచే విలసిల్లినవారు. ఈ వంశము వారి యునికిచేత స్వగ్రామమైన ఇటికేలపాడు వన్నెకెక్కుట యటుంచి అలంపూరు పరగణా అంతయు విద్యా విజ్ఞాన వైభవములతో సాటి పరగణా లన్నిటిలోను మేటి యనిపించుకొన్నది. అలంపూరుతాలూకా యందుగల రెడ్డికుల శేఖరు లందరికిని సురవరమువారు ఆదర్శపాత్రియు లనుట సత్యదూరముకాదు.

శ్రీ రంగారెడ్డిగారి జనకుడు వెంకటరెడ్డిగారు. వెంకటరెడ్డిగారికి నారాయణరెడ్డి, వెంగళరెడ్డి, రామకృష్ణారెడ్డి యనువారు ముగ్గురును సోదరులు. ఈ సోదరచతుష్టయము సర్వసద్గుణసంపన్నము. అందరును ధీర గుణోపేతులు. అందరికిని విద్యా వినయ సౌశీల్యములు వెన్నతో బెట్టిన గుణములు. నారాయణరెడ్డి ఋషివంటి వాడనియు, ధర్మాత్ము డనియు జనులు చెప్పుకొందురు. అంతటి పుణ్యశాలి కనుకనే ఆయనకు అసమానప్రతిభా ధురంధరులు, సకలవిద్యా కోవిదులు, బహుగ్రంథ కర్తలునైన శ్రీ ప్రతాపరెడ్డిగారు సురవర వంశమున జనించిరి. నారాయణరెడ్డిగారి సుగుణములన్నియు శ్రీ ప్రతాపరెడ్డిగారిలో మూర్తీభవించి యున్నవన్నచో వేరుగా నారాయణరెడ్డిగారిని గురించి చెప్ప వలసిన యవసర ముండదు.

వెంగళరెడ్డిగారును సద్గుణోపేతులు, వంశమర్యాదాభిజ్ఞులు, దాతలు, మంత్రిశాస్త్రప్రవీణులు అని చెప్పుట సహజమైన విషయము. వారికిని పుత్రపౌత్రాదికమగు సంతానసంపద యున్నది.

ఇందులో ముఖ్యముగా పేర్కొనదగినవారు రామకృష్ణారెడ్డిగారు. వీరికి కులధర్మమైన కర్షకవృత్తియందు ఎంతశ్రద్ధయో జాతిధర్మమైన విద్యార్జనయందు అంతెమక్కువ. సామాన్య కృషీవలుని పొలముపనుల యందెట్లు ప్రోత్సహించెనో ద్విజులను విద్యాకృషికై యట్లు ప్రోత్సహించెడివాడు. ఈయన పొందని గౌరవములేదు. పూర్వపు వనపర్తి రాజా శ్రీ. శ్రీ. రామేశ్వరరావు మహాభూపాల్ గారికి రామకృష్ణారెడ్డిగారియందు ఆదరాభిమానములే కాక చెలిమియు నుండెడిది. రామకృష్ణారెడ్డిగారు అలంపూరు తాలూకాలోనే కాక కర్నూలు పట్టణము నందును మిక్కిలి ఖ్యాతిని గడించి అసమానమైన ప్రజాసేవ చేసినవారు. కర్నూలు నందలి సంస్కృతపాఠశాలా పాలకవర్గమున అధ్యక్షస్థానము నలంకరించిరి. పురపాలకసంఘము మున్నగు సంస్థలయందలి సభ్యత్వము వారిని వరించినది. అనేక పుణ్యకార్యములు, విద్యార్థివేతనములు, బీదల కన్యాదానము చేయుట మొదలగు సత్కార్యములు వారికి నిత్యకృత్యములు. స్వయముగా సంస్కృతాంధ్ర భాషలయందు మంచి ప్రవేశము గలవారు. శ్రీ రంగారెడ్డిగారికిని, శ్రీ ప్రతాపరెడ్డిగారికిని సంస్కృతభాషయందు మక్కువ కలిగించి అందు ప్రవేశపెట్టినవారు రామకృష్ణారెడ్డిగారే. పండితులను సత్కరించుట, సంస్కృత విద్యార్థులను స్వయముగా పరీక్షించుట, ఆంగ్లవిద్యార్థుల కర్థసహాయము చేయుట, ప్రతి ధర్మకార్యమునకును, ప్రతి జాతీయోద్యమమునకును నడుముకట్టి ముందు నిలుచుట మొదలయినవి రామకృష్ణారెడ్డిగారికి సహజధర్మములు. వారికిని పుత్రపౌత్రాది సంపద కలదు వారికుమారులు శ్రీ సురవరం లక్ష్మీకాంతరెడ్డిగారు.

ఇక అగ్రజులును, అందరికిని ఆదర్శప్రాయులును అయిన వెంకటరెడ్డిగారు శ్రీ రంగారెడ్డిగారి జనకులు. వారిని గురించి పెద్దమందడి

వెంకటకృష్ణకవి తన "నిర్వచన మహాభక్తవిజయ" పీఠికలో (ఈగ్రంథమును శ్రీ రంగారెడ్డిగారే అచ్చువేయించిరి.) ఇట్లు పేర్కొనినాడు.

ఉ॥ 'వారలయందు నగ్రజుఁడవక్రి పరాక్రమ విక్రమ క్షమో
దారవదాన్య లోకహిత ధర్మసహోదర దోహదాఢ్యుఁడై
సారపరోపకార సుభిషజ్మణియై నృపలోకపూజ్యుడై
వీరజనాగ్రిగణ్యుడయి వెల్గెను వెంకటరెడ్డి యెంతయున్''.

✓ కనుక వెంకటరెడ్డిగారు ధీరగుణశాలి యనియు, వదాన్య శేఖరుడనియు, పరోపకార ధురీణుడనియు, ఉత్తమ వైద్య విద్యా సంపన్నుడనియు, వేరుగా పేర్కొన నవసరము లేదు. ఆ వెంకటరెడ్డిగారు తులసెమ్మ, శంకరమ్మ యను కన్యకలను వివాహము జేసికొనిరి. వారిలో శంకరమ్మయే శ్రీ రంగారెడ్డిగారి జనని. ఈ శంకరమ్మ పుట్టినింటివారు మారంవారు. ఈ మారంవంశమువారు బిజ్జులవారి బంధువులు. (బిజ్జులవారు అలంపూరు పరగణాకు క్రీ. శ. 16 నుండి 19 వ శతాబ్దివరకు అధిపతులుగానున్న రెడ్డిరాజులు. వీరిలో బిజ్జుల తిమ్మభూపాలుడు క్రీ. శ. 17 శతాబ్దియందు అనర్ఘరాఘవమును రచించిన గ్రంథకర్త. ఈ వంశమువారు సంస్థానమును కోల్పోయి ఒకగ్రామమును మాత్రము నిలుపుకొన్నారు. ఆ గ్రామము అలంపూరు తాలూకాలోని దేవినపల్లెపాడు అనునది) మారంవారు పల్లెపాటిలో నున్నారు. ఆపల్లెపాడు గ్రామమే శంకరమ్మ పుట్టినయిల్లు. అట్టి కులీనత, సౌశీల్యము మొదలయిన సద్గుణముల కాశ్రయులైన పుణ్యదంపతులు, శ్రీ వెంకటరెడ్డి శంకరమ్మలకు వ్యయసంవత్సర ఫాల్గున శుద్ధసప్తమి సౌమ్యవారము శా. శ. ౧౮౦౮ నాడు శ్రీ రంగారెడ్డిగారు ఇటికేలపాడు గ్రామములో జననమొందిరి.

వీరు మొదట ప్రౌఢసరస్వతి బిరుదాంకితులైన అలంపూరు కుమారశాస్త్రులవారివద్ద కొంతవరకు సంస్కృత మభ్యసించిరి. తర్వాత వీరి విద్యాభ్యాసము కర్నూలునగరములో జరిగినది. ఆంగ్లవిద్య అప్పుడప్పుడే గ్రామీణులను ఆకర్షించుటచేత వ్యవహార జ్ఞానమునకు

మాత్రమవసరముగ మిడిల్ స్కూలు విద్యను పూర్తి చేసిరి. మాతృభాష యగు తెలుఁగును అభ్యసించుట వంశక్రమాగత మగుటచేత ఆంధ్ర భాషయందు మంచి జ్ఞానమును సంపాదించిరి. నిరంతర పండిత సహవాసము, పెద్దల ప్రోత్సాహము కారణములుగా సంస్కృత విద్యనుగూడ కొంతవర కభ్యసించిరి. ఆ సంస్కృతాంధ్ర పరిచయమే వారి రసజ్ఞతకును, ఆయుర్వేద విజ్ఞానమునకును దోడ్పడినది.

విద్యాగుణ సంపన్నులైన రెడ్డిగారికి యుక్తవయస్సున కులశీల సౌందర్యవతియగు రత్నమ్మ యను కన్యతో వివాహము జరిగెను. ఆయమ పుట్టినిల్లు గద్వాల సంస్థానమునందలి ఇటిక్యాల. తరువాత రెడ్డిగారు అలంపూరు తాలూకా క్యాతూరు గ్రామమునందలి బస్సమ్మ యను కన్యను వరించి వివాహమాడిరి. ఇద్దరియందును సమానురాగముతోనుండి గార్హస్థ్యమును ధర్మసంపన్నము గావించిరి. పదిసంవత్సరముల తరువాత ప్రేమాస్పదురాలైన బస్సమ్మయు ఆమె శిశువులును మృతినొందిరి. పిమ్మట మొదటి భార్యయగు రత్నమ్మతో తాను, ఇల్లటము వచ్చిన క్యాతూరు గ్రామమునందే కాపురముచేయ నారంభించిరి.

ధర్మపత్నియైన రత్నమ్మ గర్భఫలముగా శ్రీ రెడ్డిగారికి వరుసగా ఒక కూతురు, ఒక కుమారుడు, మరియొక కూతురును జన్మించిరి. అందరికిని విద్యాబుద్ధులు నేర్పి సంపన్నములైన బాంధవ్యములతో వివాహములు చేసిరి. కుమారుడు ఉన్నత విద్యాసంపన్నుడు. ఎం. బి. బి. ఎస్. లో ఉత్తీర్ణుడైనవాడు. ఈయన పేరు వేంకటరెడ్డి వయస్సు 32 సంవత్సరములు. సద్గుణముల యందును త్యాగమునందును తండ్రికి తీసిపోనిదిట్టు. నెలకు 350 రూపాయల వేతనముగల ప్రభుత్వోద్యోగమును మానుకొని స్వగ్రామములో బీదలందరికిని ఉచితముగా ఔషధముల నిచ్చుచు నిజమైన దేశసేవను చేయుచున్నారు.

ప్రజాహిత కార్యము లన్నచో శ్రీ రంగారెడ్డిగారికి మిక్కిలి యుత్సాహము. తనకు అభిమానవిద్యయగు వైద్యశాస్త్రమును ప్రజా

హితముకొఱకే అధికమైన వ్యయ ప్రయాసములతో సాధించిరి. కొంత కాలము ఒక ఆయుర్వేదవైద్యుని (శ్రీ ఓరుగంటి రామచంద్రశర్మ, "ఆయుర్వేద విద్వాన్") వేతన మిచ్చియుంచి, ఉచిత వైద్యాలయ మును నడిపించిరి. ముప్పది సంవత్సరములనుండి అపర ధన్వంతరివలె ప్రజలకు ఔషధామృతమును ప్రసాదించుచున్నారు. ప్రతిదినమును కనీసము 50 మంది రోగులకు ఔషధములను ఉచితముగా నిచ్చు చుందురు.

శ్రీవారి దాతృత్వము అసమానమైనది. అలంపూరు తాలూ కాలో ఏ ప్రజాహితకార్యము నారంభించినను చందాపట్టికలో మొదటి పేరు శ్రీ సురవరం రంగారెడ్డిగారిదే. పదులనుండి వేలవరకు దానము చేసిన త్యాగమూర్తులు. భాగ్యనగరమునందలి రెడ్డివిద్యార్థి వసతిగృహ మునకు (రెడ్డిహాస్టల్) స్వయముగా 500/ రూపాయిలనిచ్చి, తమపలుకు బడితో 5000/ అయిదువేల మొత్తమును పోగుచేసి విరాళముగా పంపిరి. హరిజనసేవ శ్రీవారికి మిక్కిలి అభిమానపాత్రమైనది. పెక్కు హరిజన సంస్థలను పోషించినారు. తాలూకా ఆంధ్రమహాసభకు ఒక మారు అధ్యక్షతవహించి కావలసిన సహాయమును జేసిరి. సుప్రసిద్ధమైన "ఆంధ్రదేశ గ్రంథాలయసభ" యొక్క ౨౬ వ వార్షికోత్సవమును క్యాతూరిలోనే జరిపించిరి. ఆ సమావేశమునకు ఆహ్వాన సంఘాధ్యక్షు లుగానుండి ఉత్సవవ్యయమును భరించిరి. ఉత్సవసమయములో పెక్కుం డ్రువిద్వాంసులను సత్కరించుటయేగాక గ్రంథాలయ మహాసభకు 1000/ వేయిరూప్యముల విరాళము నొసగిరి. ఈవిధముగా ప్రజాహిత కార్యములకు వారు వెచ్చించిన ధనము అసంఖ్యాము.

శ్రీ రెడ్డిగారికి విద్వద్గోష్ఠి మిక్కిలి ప్రియమైనది. పండితులను బహూకరించుటయు, సత్కృతులను అంకితముగా గ్రహించుటయు వారి రసజ్ఞతకు తార్కాణములు. సుప్రసిద్ధ కవిపండితులైన అనుముల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు (కర్నూలు) రెడ్డిగారికి బహిఃప్రాణము.

వారికృతుల నందిరి, వారి 'కథాకల్లోలిని' మొదలగు గ్రంథములను ముద్రింపించుటయేగాక వారికి ఒక యెకరము మాగాణిని, సువర్ణవస్త్ర మాల్యాదులను బహూకరించిరి. ఎందరో కవిపండితులకు 100 మొదలు కొని 500 అయిదువందల రూప్యములవరకు సత్కారము లొసగిరి. మహబూబునగరం జిల్లాలోని పెద్దమందడి గ్రామవాస్తవ్యుడగు వెంకట కృష్ణకవి రచించిన "నిర్వచన మహాభక్తవిజయము" ను ముద్రింపించి, కృతిని స్వీకరించి వారిని బహూకరించిరి. "విజ్ఞానవర్ధినీ పరిషత్తు" నకు 3000/ మూడువేల రూపాయలిచ్చుటకు వాగ్దానము చేసినారు. ఆ ధనమును మూలనిధిగా నుంచి, ఏటేట ఒక మంచిగ్రంథమును వ్రాయించి ముద్రింపించుటకై ఆదేశించినారు. ఈ "యువజన విజ్ఞానము" ను వారి షష్టిపూర్తి చిహ్నమునుగా స్వీకరించి ముద్రణ వ్యయమును (సహస్రాధికమైన ధనమును) భరించి అనుగ్రహించినారు. ఉచిత వైద్యము వీరి వంశ పరంపరగా వచ్చుచున్న విద్య. తండ్రి వైద్యుడు, పినతండ్రి (ప్రతాప రెడ్డిగారి తండ్రియగు నారాయణరెడ్డి) వైద్యుడు. రెండవ పినతండ్రి (రామకృష్ణారెడ్డి) వైద్యుడు. కుమారుడును వైద్యుడు.

శ్రీవారు క్యాతూరు గ్రామసంఘానికి అధ్యక్షులై ప్రభుత్వ సహాయమునుపొంది, గ్రామజనుల సహాయముతో గ్రామమంతటను రోడ్లు వేయించినారు. వృక్షములను పెంచినారు. బావులు త్రవ్వించినారు. ఆగంతుక శరణాలయము (ముసాఫిర్ ఖాన) ను కట్టించినారు. గ్రామమును పెక్కువిధముల అభివృద్ధిపరచినారు. ఈనాటి క్యాతూరుగ్రామ సౌందర్యమంతయు శ్రీ రెడ్డిగారి గ్రామసేవాఫలమే.

వారి షష్ట్యబ్దపూర్తి మహోత్సవమునాడు వారు తూగిన తులాభారధనము నంతటిని ప్రజాహిత కార్యములకై వెచ్చించిరి. అన్నదానమును గొప్పగా చేసిరి. నిరతాన్నదానమునందు వారి కత్యంతమైన ప్రీతి. షష్టిపూర్త్యుత్సవమునకు 'ఆంధ్రపితామహ' శ్రీ మాడపాటి హనుమంతరావుగారు, 'శిరోమణి' శ్రీ చెలమచర్ల రంగాచార్యులుగారు మొద

లయిన పెద్దలను ఆహ్వానించి గౌరవించిరి. బంధువులు, స్నేహితులు, హితులు, కవిపండితులు పలువురు సమావేశమైయుండిరి. అతివైభవముగా జరిగిన ఆ యుత్సవము శ్రీ రెడ్డిగారి యెడల క్యాతూరు గ్రామవాసులకును, తత్ప్రాంత జనసముదాయమునకును గల భక్తిస్నేహములను వెల్లడించినది.

సురవరము వారికి సాంఘికసేవయు వ్యవహార దక్షతయు వెన్నతో బెట్టిన విద్యలు. తాలూకా జనులకును బంధుకోటికిని సంబంధించిన యనేక వ్యవహారములను కోర్టులకు పోనీయక స్వయముగా పరిష్కరించిరి. అందులో శ్రీ రంగారెడ్డిగారు అతినిపుణులు. దైనందిన చర్యగా నెన్నియో క్లిష్టములైన వ్యవహారములు అతి రమణీయమైన వారి భవన ప్రాంగణమున పరిష్కరింప బడుచుండును. వేయేల ప్రజాసంబంధములగు పెక్కు విషయములకు ఆ ప్రాంతమున న్యాయమును పరిష్కరించుటయందు ప్రముఖపాత్ర వహించుచుందురనుట లోకమెఱిగిన సత్యము. త్యాగభోగములయందు శ్రీవారి సద్గుణధురీణత యెంతయు శ్లాఘాపాత్రమైనది.

ఇంతటి ప్రజాసేవకులైన శ్రీ రంగారెడ్డిగారు కృతిభర్తలగుటయు, శ్రీ ప్రతాపరెడ్డిగారు కృతికర్తలగుటయు నీ 'యువజన విజ్ఞానము' నకు అపూర్వములైన యదృష్టములు. ఇద్దరును సురవరము (దేవతా ప్రసాదముగల) వారు. ఈ గ్రంథముద్వారా వీరు యువజన సముదాయమునకును, తద్ద్వారా ఆంధ్రదేశమునకును చేసిన సేవ అసాధారణమును అవిస్మరణీయమును అయినది. ఇట్టి గ్రంథమును ఆంధ్రలోకమునకందింపగలిగిన మా 'విజ్ఞానవర్ధనీ పరిషత్తు' ధన్యము. భగవానుడు కృతిభర్తకును కృతికర్తకును ఆయురారోగ్యభాగ్యములను ప్రసాదించుగాక.

ఇట్లు,

హైదరాబాదు. కేశవపంతుల నరసింహశాస్త్రి "శిరోమణి"

౫. ౨. ౧౯౫౯. వి. వ. ప., కార్యదర్శి.



శ్రీ సురవరం రంగారెడ్డిగారు

( క్యాప్టెను )

# పీఠిక

అనేక సంవత్సరములనుండి పెద్దబాలశిక్షను ఆధునికపద్ధతులకు పనికివచ్చునట్లుగా మార్చి వ్రాయదలచి యుంటిని. ఇంచుమించు ౧౨౦ సంవత్సరముల క్రిందటి పెద్దబాలశిక్ష ప్రజలకు చాలా సేవచేసెను. నావద్ద దానితాలూకు ప్రతి ఆద్యంతములు లేనిది యుండగా అందలి కొన్ని నీతులను పద్యములుగా మార్చియుంటిని.

పెద్దబాలశిక్షనుగూర్చిన విశేషములను వావిళ్లవారు దానిని కొంతమార్చి అందు భూగోళచరిత్ర లేశములను ఇంగ్లీషు కాలమాన ములనుచేర్చి ముద్రించుచు దానినిగురించి కొంత తెలిపినారు.

పెద్దబాలశిక్షను మొదటిసారి క్రీ. శ. ౧౮౩౨ లో మదాసులో ముద్రించిరి. అట్టి ౧౮౩౨ నాటి ముద్రితప్రతిలోని పీఠికను వావిళ్ళవా రిప్పటి పెద్దబాలశిక్షలో ముద్రించినారు. అది ముఖ్యమైనదికావున దానినిందు పూర్తిగా ఉదాహరించుచున్నాను. ఆ పీఠిక యిట్లున్నది:-

'శ్రీమదఖిలభువన భూషణంబగు చెన్నపురంబున నున్న వివేకగుణ సమృద్ధిగల శ్రీమంతులచే హిందూ విద్యాసభలో సంస్కృత పండితు లైన పుదూరి సీతారామశాస్త్రిచేత నాంధ్రభాషాభ్యాసము నందదల చిన బాలురకు ప్రథమశిక్షకు నుపయుక్తముగా నేర్పరుపబడిన బాలశిక్ష యను పుస్తకము. దీనియందు ముందుగా నక్షరసంఖ్య మొదలైనవి, తదనంతరము త్రివిధగుణితము, తదనంతరము నామావళియు, తదనంత రము నీతివాక్యములు, తదనంతరము ప్రాసవాక్యములు, తదనంతరము దృష్టాంతవాక్యములు, తదనంతరము ద్వంద్వవాక్యములు, తదనంతరము లెక్కలు, తదనంతరము ప్రభవలు చెప్పబడియున్నవి. దీనిని క్రమముగా నభ్యాసము చేయువారికి ననాయాసముగా నక్షరజ్ఞానముతో నీతియుం గలుగును. మరియు బాలురకు ఇంక విశేషమైనబుద్ధి సులభముగా ఉత్పన్నమై కాలానుగుణమైన లెక్కలను తేలికగా తెలిసి చెప్పుటకు

తగిన సాధకములయిన కొన్ని లెక్కలను, కాలనిర్ణయ దినచర్య నక్షత్ర నిర్ణయము మొదలైనవి తెలియుటకు యుక్తమైన కొంచెము జ్యోతిశ్శాస్త్రమును, మిక్కిలి చిత్రములైన కొన్ని కథలును, ఈ పైనజెప్పిన సీతారామశాస్త్రిగారి తమ్ములు పండితులును అయిన నారాయణ శాస్త్రిగారిచేత యేర్పరుపబడిన ప్రతిపద్ధతికి వేంకటకృష్ణశాస్త్రులవారి చేత పరిష్కరింపబడి శాలివాహనశకవర్షంబులు ౧౭౬౯ కి సరియైన సాధారణసంవత్సర వైశాఖబహుళ ౮ యందు ప్రభాకర ముద్రాక్షర శాలయం దచ్చువేయబడినది. దీనివెల ౧-౮-౦. ౧౮౪౭."

పెద్దబాలశిక్షను కొంత పరిష్కరించి వావిళ్లవారు ముద్రించినను అది చాలదనియు ఆ పద్ధతులపైననే క్రొత్త గ్రంథము వ్రాయవలెననియు డిసెంబరు ౧౯౪౫ లో సంకల్పించి ప్రకరణములను విభజించుకొని సంగ్రహముగా కొంత వ్రాసితిని. దానికి 'క్రొత్త బాలశిక్ష'' అని పేరుపెట్టితిని.

పలువురుమిత్రులు దానిని చదివి అది క్రొత్త బాలశిక్ష కాదనియు, వయోజనులకు పనికివచ్చునదనియు అందుచేత పేరు మార్చవలెననియు సూచించిరి. అందుపై ఈ గ్రంథమునకు యువజనవిజ్ఞానమని పేరిడితిని.

ఈమధ్య వేసగిపాఠశాలలు, వయోజనపాఠశాలలు, విశేషమైనవి. అందు బోధించువారు దొరకుట కష్టమైనది. పల్లెజనులకు అందు ముఖ్యముగా వయోజనులకు ఉపయుక్తమగురీతిగా ఇందువ్రాసినాను. సాధారణముగు తెనుగు వచనపుస్తకములను నవలలను చదివి అర్థముచేసుకొను సమర్థతకలవారై యింగ్లీషువాసన లేనివారుగా నుండు జనులకు పనికివచ్చునట్లుగా గుర్వపేక్షలేనట్లుగా వీలైనంతవరకు సులభముగా వ్రాసినాను. ఇందు నా ప్రతిభకాని సమర్థతకాని యేమియు లేదు. బహుపుస్తకములను చూచి అందలివిషయాలను క్లుప్తపరచి కూర్చినాను. దీనిని ముద్రణకుముందు చూచిన పలువురు నిజానికో

మొగమోటమునకో బాగున్నదని ప్రోత్సహించినందున ముద్రణయోగ్యమని తలపవలసివచ్చెను. అశక్తతవల్ల ముద్రించక అట్లే యింతవరకుంచియుంటిని.

గోపాలపేట చిన్నరాణీగారగు శ్రీమతి రాణీ లలితాదేవిగారీ సంకలనమును తిలకించి యిది గ్రామజనులకు చాలా యుపయుక్తముగా నుండునని తలచి దీనిని ముద్రించుటకై తొందరపెట్టి ప్రోత్సహించిరి. వారికి కృతజ్ఞతాబద్ధుడను.

ఇంతలో మా అన్నగారగు శ్రీ సురవరము రంగారెడ్డిగారి షష్టిపూర్త్యుత్సవము ౧౯౫౮లో జరిగెను. వారు మా సభ్యులకోరికపై షష్టిపూర్తిసంచిక నొకదానిని ముద్రించుటకగు ౧౦౦౦ రూపాయల వ్యయము ఇచ్చివేసిరి. గ్రామజనులకు పనికివచ్చు గ్రంథమునే నా షష్టిపూర్తిసంచికగా ముద్రించుడు అని వారుకోరిరి. మా విజ్ఞానవర్ధనీ పరిషత్సభ్యులీ యువజనవిజ్ఞాన గ్రంథమే వారికోరికను సమర్థించునని అభిప్రాయపడి నన్నీగ్రంథమును తమ సంస్థపక్షాన ప్రకటించుటకై ఇయ్యవలెనని కోరిరి. దీనిలోని ముఖ్యభాగాలను పరిషత్సభవారు విని దీని నందుకొనిరి.

సంకలనకర్త

సురవరము ప్రతాపరెడ్డి.



# విషయసూచిక



ఇండోచీనాఇండ్లు. పుట ౧౯౬



ఎస్కిమోలు. పుట ౧౯౧



పైసా (Pisa) వంకర బురుజు. పుట ౨౯౩



నీగ్రోబాలుడు. పుట ౧౮౪



టిబెట్టులోని 'యాక్' జడలమన్నపోతు పుట ౧౭౭

కాఫిర్—నీగ్రోల గుడిసెలు పుట ౧౦౪



బూమరాంగ్. పుట ౧౯౪

# యువజన విజ్ఞానము

## ౧ వ ప్రకరణము

### భగవత్ ప్రార్థన

### జాతీయ గేయములు

ఇందు కేవల నిర్గుణ బ్రహ్మను గురించిన స్తోత్రములే కలవు. వేద మంత్రములకు పలువురు పలు విధములుగా అర్థము చెప్పుదురు. ఇందు దయానందీయ పద్ధతిపై అర్థము తెలుపబడినది. అది కోరనివారు మూలమునే ప్రధానముగా తీసుకొని తమకు వచ్చిన అర్థమును గ్రహించవచ్చును. పాఠకుల సౌకర్యము కొఱకై వేద మంత్రములకు ఉదాత్తాది స్వరములను సూచించు గుర్తులను ఉంచలేదు.

జాతీయ గేయములు కొన్ని మాత్రమే సంకలితములు. అభిలాషులు ఈ క్రింది గ్రంథములు చూడవలయును.

౧ దేశీయ కీర్తనలు (బెజవాడ)

౨ ఆశ్రమ భజనావళి — నాగర లిపి

( నవజీవన ప్రకాశన మందిరము అహమ్మదాబాదు )

3 ఆర్య సమాజము వారిచే ప్రచురితమైన హిందీ అర్థము గల "ఆర్యాభివినయము" అను వేద మంత్రముల పుస్తకము.



# ఓం

౧. ఓం సహనావవతు । సహనౌ భునక్తు
సహ వీర్యం కరవావహై । తేజస్వినావధీతమస్తు
మావిద్విషావహై । ఓం శాన్తిః శాన్తిః శాన్తిః ॥
— తైత్తిరీయారణ్యకము — ౯. ౧.

జగదీశ్వరా! నీ కృపచే మేము ఒకరినొకరు రక్షించుకొందుముగాక. మేమందరమును కలసి సకలానందములను అనుభవింతుముగాక. మేము పరస్పర సహాయముచేత వీర్యవంతులమగుదుముగాక. మా విద్య నిరంతర తేజస్సుతో వృద్ధినొందుగాక. మేమెన్నడును విరోధించుకొనకుండునట్లు అనుగ్రహింపుము.

(ఇది కృష్ణ యజుర్వేద శాంతి పాఠము)

౨. విశ్వాని దేవ సవితుర్దురితాని పరాసువ
యద్భద్రం తన్న ఆసువ॥ యజుర్వేద. ౩౦. ౩.

ఓ దేవా! సర్వజగదుత్పాదకుడవగు ఓ సవితా! మా సమస్తదుఃఖములను పాపములను పోగొట్టుము. ఏది కల్యాణకరమో దానిని మాకు ప్రాప్తింపజేయుము.

౩. యో భూతంచ భవ్యంచ సర్వం యశ్చాధితిష్ఠతి
సర్వస్యచ కేవలం తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణేనమః ।
యస్యభూమిః ప్రమాంతరిక్షముతోదరం
దివంయశ్చక్రేమూర్ధానం తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణేనమః ।
యస్యసూర్యశ్చక్షుశ్చంద్ర మాశ్చపునర్ణవః
అగ్నింయశ్చక్రఆస్యంతస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణేనమః ।
యస్యవాతః ప్రాణాపానౌ చక్షురంగిరసోభవన్
దిశోయశ్చక్రేప్రజ్ఞానీస్తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణేనమః॥
— అథర్వ. ౧౦ కాం ౨౩ ప్ర, ౪ అను ౩౨, ౩౩, సూక్తములు.

ఏ పరమేశ్వరుడు త్రికాలములందలి సర్వ వ్యవహారములను ఎరిగి యున్నాడో, ఎవ్వడు కేవల సుఖ స్వరూపుడో సర్వోత్కృష్టుడగు ఆ బ్రహ్మమునకు నమస్కారము. పరమేశ్వరుడున్నాడనుటకు భూమి మున్నగునవి దృష్టాంతములు. ఆపరమేశ్వరునికి భూమి పాదస్థానము. అంతరిక్షమే ఉదరము. సూర్యాది ప్రకాశముతో కూడిన దివము ఆతనికి మస్తకము. అట్టి ఉత్కృష్ట పరమేశ్వరునికి నమస్కారము.

అతనికి సూర్య చంద్రులు నేత్రములు. ప్రతికల్పమందును అతడు సూర్య చంద్రాదులను క్రొత్తగా రచించును. ముఖస్థానమువలె అతడు అగ్ని నుత్పత్తి చేసెను. అట్టి పరబ్రహ్మకు మా నమస్కారము. ప్రాణాపాన విధానమున బ్రహ్మాండ వాయువును అతడు సృజించెను. ప్రకాశించెడి కిరణములను చక్షువులవలె అతడు సృజించెను. సకల వ్యవహారములను సిద్ధింపజేయు దిక్కులను అతడు సృష్టించెను. అట్టి పరబ్రహ్మకు మా నమస్కారములు.

౮. ఓం ద్యౌః శాంతి రంతరిక్షం శాంతిః పృథివీ శాంతి
రాపశ్శాంతి రోషధయః శాంతిః
వనస్పతయశ్శాంతి ర్విశ్వే దేవాః శాంతిర్బ్రహ్మ
శాంతిస్సర్వం శాంతి శ్శాంతి రేవ శాంతిః
సామా శాంతి రేధి, యతో యతః
సమీహాసే తతో నో అభయంకురు
శన్నః కురు ప్రజాభ్యోఽభయంనః పశుభ్యః॥

—యజు. అ ౩౬ మ. ౧౭. ౨౨.

ఓ పరమేశ్వరా! ఆకాశములోని సూర్యాదిలోకములు అంతరిక్షమందలి లోకములు, భూమి, జలము, ఓషధులు, వనస్పతులు, విశ్వేదేవతలు, బ్రహ్మమనబడు వేదము, సమస్తము సుఖదాయకములగు గాక. ఓ పరమేశ్వరా! నీవుఎచ్చటెచ్చట జగద్రచనను పాలనార్థము యత్నము చేయుదువో అచ్చటచ్చట మాకు భయములేకుండ చేయుము, మాకు,

ఇతర ప్రజలనుండియు పశువులనుండియు భయములేకుండ జేయుము మాకు సుఖమునిమ్ము.

౫. హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః
పతిరేక ఆసీత్ । సదాధార పృథివీం ద్యాముతే
మాం కస్మై దేవాయ హవిషావిధేమ యజు. ౧౩. ౪

సృష్టికి పూర్వము హిరణ్యగర్భుడగు పరమేశ్వరుడొక్కడే యుండెను. అతడు సమస్తజగత్తుయొక్క ప్రాదుర్భూతప్రసిద్ధపతి. ఆపరమాత్మ పృథివి మొదలుగా ప్రకృతిపర్యంత జగత్తును రచించి ధరించినవాడయ్యెను. అట్టి ప్రజాపతియగు పరమాత్మను భక్తితో భజించుచున్నాము.

౬. నమః శంభవేచ మయోభవేచ ।
నమః శంకరాయచ మయస్కరాయచ ।
నమః శివాయచ శివతరాయచ॥ యజు. ౧౬. ౪౧.

కల్యాణకరుడవగు కల్యాణరూపా! నీవు శంభవుడవు (అనగా మోక్షసుఖ స్వరూపుడవు. మోక్ష సుఖము నిచ్చువాడవు) నీకు నమస్కారము. నీవు మయోభవుడవు. (అనగా సాంసారిక సుఖములనిచ్చువాడవు) నీకు నమస్కారము. నీవు శంకరుడవు (అనగా శం, ఆనందమును. కర, ఇచ్చువాడవు. జీవులకు కల్యాణము నిచ్చువాడవు) నీకు నమస్కారము. నీవు మయస్కరుడవు (అనగా మనస్సు, ఇంద్రియములు, ప్రాణము, ఆత్మ వీటికి సుఖమునిచ్చువాడవు, నీవు శివుడవు (అనగా మంగళ మయుడవు) నీకు నమస్కారము. నీవ శివతరుడవు (అనగా అత్యంత కల్యాణకరుడవు) నీకు నమస్కారము.

(ఈ మంత్రమందలి శివశంకర శంభు శబ్దాలు వీర శైవులవని భ్రమింపరాదు, ఇవి పరమాత్మయొక్క మంగళకర గుణ వర్ణనలు)

౭. తచ్చక్షుర్దేవహితం పురస్తాచ్ఛుక్రముచ్చరత్
పశ్యేమ శరదశ్శతం జీవేమ శరదశ్శతం
శృణుయామ శరదశ్శతం ప్రబ్రవామ శరదః
శత, మదీనాః స్యామ శరదః శతం
భూయశ్చశరదః శతాత్॥ (యజు. ౩౬. ౨౪)

పరబ్రహ్మ సర్వద్రుక్కు కలవాడు. మనస్సు మొదలగు ఇంద్రియములకు హితకారి సమస్తమునకు ఆది, ప్రథమ కారణుడు అతడే. అతడు శుద్ధస్వరూపుడు. ప్రళయానంతరము అతడే యుండువాడు; అతని కృపచే మేము ౧౦౦ సంవత్సరాలవరకు చూడగలము జీవించగలము. వినగలము పలుకుచుండగలము పరాధీనులముగా ఉండము. నూరేండ్ల తర్వాత కూడా నీకృపచే సర్వాంగారోగ్యముచే స్వాధీన చిత్తులమై జీవించగలము.

౮. యోనః పితాజనితాయోవిధాతా
ధామాని వేద భువనాని విశ్వా
యో దేవానాం నామధా ఏక ఏవ
తం సంప్రశ్నం భువనాయంత్యన్యా॥ యజు. ౧. ౮.

ఎవడు మాకు పాలకుడగు తండ్రియో యెవడు మమ్ము సృజించెనో ఎవడు మాకు మోక్షసుఖాదిసిద్ధికర్తయో ఎవడు లోకలోకాంతర స్థితుల నెరిగినవాడో ఎవడు సూర్యాది దివ్యలోక వ్యవస్థను చేయువాడో అతడే అద్వితీయుడగు ఏకైక పరబ్రహ్మ. అట్టి పరమాత్మ కృప వలన పురుషార్థ ఫలసిద్ధి కలుగును. అన్యథా కానేరదు.

౯. అసతో మా సద్గమయ
తమసో మా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ

ఓ పరమాత్మా! మమ్ము అసత్తునుండి అసత్యమునుండి సత్తులోనికి అనిత్యమునుండి నిత్యస్థితిలోనికి తీసుకొనిపొమ్ము. మమ్ము తమస్సు

నుండి తామసమునుండి, అజ్ఞానమునుండి తొలగించి జ్యోతిలోనికి సాత్వికములోనికి జ్ఞానములోనికి జొరపెట్టుము. మమ్ము మృత్యువునుండి రక్షించి మాకు అమృతత్వ మొసగుము.

౧౦. తేజోసి తేజోమయి ధేహి । వీర్యమసి వీర్యం మయి ధేహి
బలమసి బలం మయి ధేహి । ఓజోసి ఓజోమయి ధేహి
మన్యురసి మన్యుం మయి ధేహి । సహోసిసహోమయి ధేహి॥

ఈ మంత్రము శుక్ల యజుర్వేదశాఖకు చేన, బృహదారణ్య కోపనిషత్తున ౧. ౩. ౨౮ లో కలదు. శుక్ల యజుర్వేదము ౧౯-౯.

నీవు తేజస్వంతుడవు నాలో తేజస్సునింపుము. నీవు వీర్యవంతుడవు నాయందు వీర్యమునింపుము. నీవుబలవంతుడవు నాయందు బలము నింపుము. నీవు ఓజస్సు కలవాడవు, నాలోఓజస్సును, (శక్తిని) నింపుము. దౌష్ట్యమును ఆగ్రహించువాడవు. అట్టి శక్తిని నాకిమ్ము. నీవు సహనశీలుడవు. నాకు సహనము ప్రసాదింపుము.

౧౧. ఓం శన్నో మిత్రః శం వరుణః, శంనో భవత్వర్యమా,
శంన ఇంద్రో బృహస్పతిః, శంనో విష్ణు రురుక్రమః,
నమో బ్రహ్మణే, నమ స్తేవాయో, త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి,
త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి, ఋతం వదిష్యామి,
సత్యం వదిష్యామి, తన్మామవతు, తద్వక్తారమవతు,
అవతుమాం, అవతు వక్తారమ్. ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః

కృష్ణ యజుర్వేద శాంతి పాఠము

మిత్రుడు మాకు సుఖకరుడగుగాక! వరుణుడు మాకు సుఖకరుడగుగాక. అర్యముడు, ఇంద్రుడు, బృహస్పతి, అంతటను వ్యాపించిన (ఉరుక్రముడైన) విష్ణువు వీరందరు మాకు శాంతకరులగుదురుగాక. బ్రహ్మకు నమస్సులు. ఓ వాయూ! నీకు నమస్సులు. నీవే ప్రత్యక్ష

బ్రహ్మము. నీవే ప్రత్యక్ష బ్రహ్మమని అంటున్నాను. సత్య భావములు కలిగి సత్యమునే చెప్పుచుండగలను. ఆ బ్రహ్మ నా గురువు నన్ను రక్షించుగాక, మరి మరి రక్షించుగాక. ముమ్మారు శాంతి గలుగుగాక.

**పై మంత్రము లోని కొన్ని దేవతా పదముల అంతరార్థము.**

మిత్రుడు—ప్రాణము పగటిని ఏలు దేవత, అనగా సూర్యుడు.
వరుణుడు—అపానాధిపతి రాత్రి కధిపతి.
అర్యముడు—చక్షుస్సు అధి దేవత. సూర్యుడు.
ఇంద్రుడు—బలమునకు అధి దేవత.
బృహస్పతి—వాక్కునకు జ్ఞానమునకు అధి దేవత.
విష్ణువు—సర్వవ్యాపి.
బ్రహ్మ—సర్వాంతర్యామి.

౧-౨. ఓం వాఙ్మే మనసి ప్రతిష్ఠితా, మనో మేవాచి
ప్రతిష్ఠితమా, వీరా వీర్మ ఏధి, వేదస్యమ ఆణీస్థః
శ్రుతం మేమా ప్రహాసీ, రనే నాధీతే నాహోరాత్రాణ్
సందధామ్యృతం వదిష్యామి । సత్యం వదిష్యామి।
తన్మామవతు । తద్వక్తార మవతు । అవతుమాం।
అవతు వక్తార మవతు వక్తారం ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.
(ఋగ్వేద శాంతి పాఠః)

నా వాక్కు మనస్సులో ప్రతిష్ఠితమగుగాక. నా మనస్సు వాక్కులో ప్రతిష్ఠితమగుగాక (వాక్కు మనస్సు ఒకటిగా నుండుగాక) (ప్రతిష్ఠితం+ఆవిః+ఆవీః+మే+ఏధి అని పదాల విరుపు)

ఆవిః—ఓం ప్రకాశమానమగు బ్రహ్మ నాయెడ ప్రసన్నుడవుకమ్ము. నా వాక్కు నా మనస్సు ఈ రెండును వేదమును సన్నిహితము చేయుగాక. నేను నా గురువునుండి నేర్చిన దానిని మరువకుందునుగాక. రాత్రింబగళ్లు వేదమును అభ్యసింతును గాక.

(మా+పరిహాసీః+అనేన+అధీతేన+అహోరాత్రాన్+సందధామి+ఋతం అని పదాల విరుపు) సత్యమునే ఆలోచించి సత్యమునే పలుకుదును(తత్) ఆ బ్రహ్మ నన్ను రక్షించుగాక, మా గురువును రక్షించుగాక; మమ్ము రక్షించుగాక.

౧౩. ఓం తచ్ఛంయోరావృణీమహే । గాతుం యజ్ఞాయ గాతుం
యజ్ఞపతయే । దైవీ స్వస్తిరస్తునః స్వస్తిర్మానుషేభ్యః
ఊర్ధ్వం జిగాతు భేషజం । శంనో అస్తు ద్విపదే శంచతుష్పదే ॥
ఓం శ్శాన్తిః శ్శాన్తిః శ్శాన్తిః.

ఋగ్వేద- పురుషసూక్త - శాంతి మంత్రం - మండలము ౧౦ అను ౮.

మా క్షేమమునకై ప్రార్థిస్తున్నాము. యజ్ఞమును స్తుతించుచున్నాము. యజ్ఞపతిని (దేవుని) స్తుతించుచున్నాము. మాపై దేవుని స్వస్తివాక్య ముండుగాక. (దేవుని అనుగ్రహ ముండుగాక) సకల మానవులకు స్వస్తి యగుగాక. (క్షేమమగుగాక) ఆరోగ్య మిచ్చు ఓషధులు సమృద్ధిగా (ఊర్ధ్వం) పెరుగుగాక. ద్విపాత్తులకు (మనుష్యులకు పక్షులకు) సుఖము కలుగుగాక. నాలుగు కాళ్ళ జంతువుల కన్నింటికిని సుఖమగుగాక.

(ఈ ప్రార్థనలో హిందువుల భావ వైశాల్యము కానవచ్చును. సకల చరాచర కోటికై ఆర్యులు ప్రార్థించుచు వచ్చినారు)

౧౪. ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్యధీమహి
ధియోయోనః ప్రచోదయాత్ ॥
(గాయత్రి)—నిత్య సంధ్యా వందన మంత్రము)
ఋగ్వేదము - మండలము. ౩. అ. ౬౨. సూ. ౧౦

ఏ దేవుడు మా ధీశక్తిని ప్రజ్వలింప జేయుచున్నాడో అట్టి సృష్టి కర్తయు (సవితుః) ఉత్తమోత్తముడును (వరేణ్యం) అయిన జ్యోతిర్మయుని (భర్గుని) ధ్యానించు చున్నాము (ధీమహి)

'సూ' అనగా పుట్టించుట; దానినుండి సవితః ఏర్పడినది. ఈ మంత్రముతో ద్విజులైన వారందరును నిత్యము త్రికాలములందు సంధ్యావందనము చేయుచున్నారు.

౧౫. శన్నో దేవిరభీష్టయే శన్నో భవంతు పీతయే
శంయోరభి స్రవంతునః

సామ. అగ్నే ను ౧. ౩౩.

దేవుని దివ్యశక్తి (దేవి) మా అభీష్టములు నెరవేరుటకై శుభదాయినిగా నుండు గాక. సచ్చిదానందము ననుభవించుటకు అనుకూలమగు గాక. సుఖపరంపరను మాపై వర్షించుగాక.

౧౬. ఓం ఆప్యాయంతు మమాంగాని, వాక్ప్రాణ శ్చక్షుః
శ్రోత్రమథో బల మింద్రియాణిచ సర్వాణి
సర్వం బ్రహ్మౌపనిషదం, మాహం బ్రహ్మనిరాకుర్యాం
మామా బ్రహ్మనిరాకరోదనిరాకరణ మస్త్వనిరాకరణం
మే అస్తు, తదాత్మని నిరతేయ ఉపనిషత్సు ధర్మాస్తే
మయి సంతు తే మయిసంతు ఓంశాన్తి శ్శాన్తి శ్శాన్తిః॥

[ సామవేదీయ శాంతి పాఠము ]

నాశరీరాంగములు ఉత్తమత్వమునొందు గాక. నా వాక్కు, ప్రాణము, చూపు, చెవులు, బలము, ఇంద్రియము లన్నియు ఉత్తమస్థితి నొందుగాక. ఉపనిషత్తులలో వర్ణింపబడిన బ్రహ్మ బ్రహ్మాండమంతటను నిండియున్నాడు. ఆబ్రహ్మను నేను నిరాకరింపక యుందును గాక. ఆ బ్రహ్మ నన్ను నిరాకరింపకుండుగాక. ఉపనిషత్తులలో పేర్కొనబడిన ధర్మము లన్నియు ఆ బ్రహ్మయం దాసక్తుడనైన నా యందు ఉండుగాక. తప్పక ఉండుగాక.

౧౭. ఓం భద్రం కర్ణేభిః శ్రుణుయామ దేవా భద్రం పశ్యే
మాక్షభిర్యజత్రాః, స్థిరై రంగైస్తుష్టువాంస్తనూ

భిర్వ్యశేమ దేవహితం యదాయుః
స్వస్తి న ఇంద్రో వృద్ధ శ్రవాః
స్వస్తినః పూషా విశ్వవేదాః
స్వస్తిన స్తార్క్ష్యో అరిష్ట నేమిః
స్వస్తినో బృహస్పతిర్దధాతు—ఓం శాన్తిశ్శాన్తిశ్శాన్తిః॥

అథర్వవేద శాంతిపాఠము.

ఓ దేవా! మా చెవులతో మంగళమును విందుముగాక. నీపూజకులమైన మేము మాకండ్లతో మంగళమును చూతుముగాక. నీ స్తుతి చేయు మేము స్థిరమైన అంగములతో శరీరములతో దేవుడనుగ్రహించిన దీర్ఘాయుస్సును అనుభవింతుము గాక.

(వృద్ధశ్రవుడు) ఇంద్రుడు ( సర్వాధిపతి ) మాకు క్షేమము కలిగించుగాక. సర్వమును పోషించు (పూష) దేవుడు సమస్తమును తెలిసినవాడు (విశ్వవేదాః) మాకు క్షేమము నిచ్చుగాక. అరిష్టములను పోగొట్టు (అరిష్టనేమి) తార్క్ష్యుడు. (దేవుడు) మాకు మంగళము నిచ్చుగాక. బృహస్పతి. ( విద్యాజ్ఞానాధిపతి యగు దేవుడు ) మాకు మంగళము నిచ్చుగాక.

౧౮. నమస్తే సతే తే జగత్కారణాయ
నమస్తే చితే సర్వలోకాశ్రయాయ
నమోఽద్వైతతత్త్వాయ ముక్తిప్రదాయ
నమో బ్రహ్మణే వ్యాపినే శాశ్వతాయ॥

నిత్యుడును, సత్యరూపుడును, జగత్కారకుడును అగు దేవునికి నమస్సు సకలలోకాలకు ఆశ్రయభూతుడగు చిన్మూర్తికి నమస్సు ముక్తిని ప్రసాదించు అద్వైతతత్త్వరూపునికి నమస్సు. సర్వ వ్యాపియు, శాశ్వతుడు నగు పరబ్రహ్మకు నమస్కారము.

౧౯. త్వమేకం శరణ్యం త్వమేకం వరేణ్యం
త్వమేకం జగత్పాలకం స్వప్రకాశం
త్వమేకం జగత్కర్తృపాతృప్రహర్తృ
త్వమేకం పరం నిశ్చలం నిర్వికల్పం.

నీవొక్కడవే శరణ్యుడవు. నీవొక్కడవే పూజింపదగిన వాడవు నీవొక్కడవే జగత్పాలకుడవు స్వయం ప్రకాశుడవు. నీవొక్కడవే జగత్తును సృజించి పాలించి సంహరించువాడవు. నీవొక్కడవే నిశ్చలుడవు. పరమాత్మవు.

౨౦. దిక్కాలాద్యనవచ్ఛిన్నానంత
చిన్మాత్ర మూర్తయే ।
స్వానుభూత్యేకమానాయ
నమశ్శాంతాయ తేజసే॥

భర్తృహరి సుభాషితము.

దిక్కు కాలము మొదలగు వానిచే పరిమితుడు కాక సర్వప్రదేశములందు సర్వకాలములందును ఉండువాడై అనవరతమైన జ్ఞానస్వరూపుడై తనను అనుభవించుటయే ముఖ్యప్రమాణముగ గలవాడై ప్రసన్నమగు తేజస్సు గలవాడును అగు పరమాత్మకు నమస్కారము.

అచ్ఛము దిక్కాలాద్యన
వచ్ఛిన్నానంతచిద్ఘనంబు నిజ
స్వచ్ఛానుభూతిమానము
సచ్ఛాంతము తేజ మేనజస్రము తలతున్॥

పై శ్లోకమునకు ఏనుగు లక్ష్మణకవి అనువాదము.

౨౧. ఎవ్వనిచే జనించు జగ మెవ్వని లోపలనుండు లీనమై
యెవ్వనియందుడిందు పరమేశ్వరు డెవ్వడు మూలకా

రణం బెవ్వడనాదిమధ్యలయు డెవ్వడు సర్వముదానయై
నవా డెవ్వడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేడెదన్॥

౨-౨. విశ్వకరు విశ్వదూరుని
విశ్వాత్ముని విశ్వవేద్యు విశ్వు నవిశ్వున్
శాశ్వతు నజు బ్రహ్మ ప్రభు
నీశ్వరునిం బరమపురుషు నే భజియింతున్।

భాగవతము



# రాష్ట్ర గీతములు

౧. వందేమాతరం,
సుజలాం సుఫలాం మలయజ శీతలాం
సస్యశ్యామలాం మాతరం
శుభ్రజ్యోత్స్నా పులకిత యామినీం
ఫుల్లకుసుమిత ద్రుమదళ శోభినీం
సుహాసినీం సుమధురభాషిణీం
సుఖదాం వరదాం మాతరం
త్రింశత్ కోటి కంఠకలకలనినాదకరాళే
ద్వాత్రింశత్ కోటి భుజైర్ధృత ఖరకరవాలే
కేబోలే మాతుమి అబలే
బహుబలధారిణీం నమామి తారిణీం
రిపుదళవారిణీం మాతరం — ॥వందే॥

తుమి విద్యా — తుమి ధర్మ
తుమి హృది — తుమి మర్మ
త్వంహి ప్రాణాః శరీరే
బాహుతే తుమిమా శక్తి
హృదయే తుమిమా భక్తి
తోమర యీప్రతిమా గడి
మందిరే మందిరే మాతరం — ॥వందే॥

త్వంహి దుర్గాదశప్రహర ధారిణీ
కమలా కమలదలవిహారిణీ
వాణీ విద్యాదాయినీ — నమామిత్వాం
నమామి కమలాం అమలాం అతులాం
సుజలాం సుఫలాం మాతరం — ॥వందే॥

శ్యామలాం సరళాం సుస్మితాం భూషితాం
ధరణీం భరణీం మాతరం
వందే మాతరం

ఠాకి. చంద్రుని రచన



జన మన గణ అధినాయక జయహే !
భారత భాగ్య విధాతా !
పంజాబ సింధు గుజరాత మరాఠా ద్రావిడ ఉత్కళవంగా
వింధ్య హిమాచల యమునా గంగా ఉచ్ఛల జలధితరంగా
తవశుభనామే జాగే, తవశుభఆశిసమాగే,గాహే తవజయగాథా
జన గణ మంగళ దాయక జయహే, భారత భాగ్యవిధాతా
జయహే! జయహే! జయహే! జయ జయ జయహే !
అహరహతవ ఆహ్వాన ప్రచారిత సునితవ ఉదారవాణీ
హిందూ బౌద్ధ సిఖ జైన పారసీక ముసల్మాన్ క్రిస్తానీ
పూరవపశ్చిమఆసే తవసింహాసన పావే,ప్రేమహార హాయగథా
జన గణ ఐక్యవిధాయక జయహే, భారత భాగ్యవిధాతా॥జయ॥
పతనయభ్యుదయ బంధుర పంథాయుగ ధావితయాత్రీ
తుమిచిర సారథి తవరథచక్రే ముఖరిత పథదిన రాత్రీ
దారుణ విప్లవమాఝే తవశంఖధ్వని బాజే సంకటదుఃఖత్రాతా
జనగణ పథ పరిచాయక జయహే భారతభాగ్యవిధాతా ॥జయ॥
ఘోర తిమిరఘననిబిడనిశీథే పీడిత మూర్ఛిత దేశే
జాగ్రత చిలతవ అవిచల మంగళ నతనయనే అనిమేషే
దుస్స్వప్నే అంతకెరత్రాకరి వేలంకే స్నేహమయీ తుమిమాతా
జన గణ దుఃఖత్రాయక జయహే భారతభాగ్యవిధాతా ॥జయ॥
రాత్రిప్రభాతిల ఉదిల రవి ఛవి పూర్వ ఉదయగిరిఫాలే
గాహే విహంగమ పుణ్య సమీరణనవజీవన రసఢాలే
తవకరుణా రుణరాగే నిద్రిత భారత జాగే తవచరణే నతమాథా

జయ జయ జయహే జయ రాజేశ్వర భారత భాగ్యవిధాతా
జయహే జయహే జయహే జయ జయ జయహే॥

రవీంద్రనాథ టాగోరు రచన

---

3. వైష్ణవ జనతో తేనే కహియే జోపీడ పరాయీ జాణే రే
పరదుఃఖే ఉపకార కరేతో యేమన అభిమానన ఆణే రే
సకలలోక మాంసహునే వందే నిందానకరే కేనీరే
వాచకాఛమన నిశ్చలరాఖే ధనధన జననీ తేనీరే
సమదృష్టినే తృష్ణాత్యాగీ పరస్త్రీ జేనే మాతరే
జహ్వథకీ అసత్యనబోలే పరధన సవఝాలేహా థరే।
మోహమాయా వ్యాపే నహిజేనే దృఢవైరాగ్య
జేనా మనమాంరె ॥ రామనామ శుంతాళీలాగి
సకల తీరథ తేనా తనమాంరే॥
వణలోభీనే కపటరహితఛే కామక్రోధనివార్యారే
భణేనరసైంయో తేనుం దరశనకరతాం
కుళఏకో తేర తార్యాంరే॥

- ఇది గుజరాతీ గానం - ఖమాజి రాగం - ఝుమాళి -

- నర్సింహ మెహ్తా భక్తుని రచన:- గాం. ధీమహాత్ముని కత్యంత ప్రియమైన ప్రార్థన -

---

## జాతీయ పతాక గానము

విజయీ విశ్వతి రంగా ప్యారా
జండా ఊంచా రహే హమారా
సదాశక్తి బరసానే వాలా
ప్రేమ సుధా సరసానే వాలా
మాతృభూమికా తనమనసారా ॥జండా॥
స్వతంత్రకే భీషణ రణమే
లఖకర బఢే జోష్ క్షణ క్షణమే

శాంపే శతృ దేఖకరమనమే
మిటజావే భయ సంకట సారా ॥జండా॥
ఇస్ జండేకే నీచే నిర్భయ
లే స్వరాజ్య యే అవిచలనిశ్చయ
బోలో భారతమాతాకీ జయ
స్వతంత్రతాహి ధ్యేయ హమారా ॥జండా॥
ఆవో ప్యారే వీరో ఆవో దేశ ధర్మపర్ బలి బలి జావో
ఏకసాసబఫ్ మిలకర్ గావో
ప్యారా భారత దేశ హమారా ॥జండా॥
ఇసకే శాసన జానే పావే
చాహే జాగ్ చలేహి జావే
విశ్వ విజయ కరకే దిఖలావే
తబ్ హోవే ప్రాణ పూర్ణ హమారా ॥జండా॥

---

## వీర గంధము

వీరగంధము తెచ్చినారము, వీరులెవ్వరో తెల్పుడీ
పూసి పోదుము మెడను వైతుము పూలదండల భక్తితో
తెలుగుబావుట కన్ను చెదరగ కొండవీటను నెగురునప్పుడు
తెలుగు వారల కత్తి దెబ్బలు గండికోటను గాచి నప్పుడు
తెలుగువారల వేడినెత్తురు తుంగభద్రను గలసి నప్పుడు
దూరమందున నున్న సహ్యజ కత్తి నెత్తురు గడిగినప్పుడు
ఇట్టి సందియ మెన్న డేనియు పుట్టలేదు రవంతయున్
ఇట్టి ప్రశ్నల నడుగువారలు లేకపోయిరి సుంతయున్
ఇదిగో యున్నది వీరగంధము, మై నలందుము మై నలందుము
శాంతిపర్వము చదువవచ్చును శాంతి సమరంబైన పిమ్మట
తెనుంగు నాటిని వీరమాతనుజేసి మాతృము తిరిగి రమ్మికక
బలు తుపాకులు బలు ఫిరంగులు త్రోవకడ్డము రాకతప్పవు.

నడుముగట్టిన తెలుగుబాలుడు వెనుకతియగం డెన్నడూ
బాస ఇచ్చిన తెలుగు బాలుడు పారిపోవం డెన్నడూ॥

---

(౬) ఆంధ్ర దేశపు మట్టి — అదిమాకు కనకము
ఆంధ్ర దేశపు జలము — అమృతంపురసము
ఆంధ్ర దేశపు గాలి — అది మాకు ప్రాణము
ఆంధ్ర దేశమె మాకు — అమరదైవతము

---

(౭) మేలుకోనమీ ఆంధ్ర పుత్రుడ — మే॥
ఆర్యగోత్రుడ మేలుకోనుమీ — శుభచరిత్రుడ
మేలుకోనవయ్యా — వత్సా — మేలుకో
తెల్లవారెను తూర్పు దిక్కున
అల్లభానుం డుదయమయ్యెను
ఎల్లవారును మేలుకాంచిరి.
ఎలమి మీరగనూ — వత్సా — మేలుకో
ఒళ్ళు తెలియక నిద్రపోతివి
ఇల్లు వాకిలి యేమి యయినదో
కళ్ళు తెరచుక చూచుకో
కలికాలమిదె సుమ్మీ — వత్సా — మేలుకో॥

---

(౮) ఆంధ్రమాత, శ్రీసమేత
అనుపమప్రపూతచరిత
అఖిలభక్తపారిజాత — అనఘ మంగళం
రామదాసాది భక్తరత్నములను
కన్నతల్లి తిక్కనాది కవులగన్న తల్లి — మం॥
ఆంధ్రవిష్ణు శాలివాహ
అమరవినుత రాజరాజ
ఆదినృపులగన్న తల్లి — అమల మంగళం
మొల్లముఖ్యకవయిత్రుల

మల్లమాది సాధ్వీమణుల
అల్ల రుద్రమదేవి గన్నతల్లి — మంగళం
కృష్ణరాయ రంగరాయ
ఖడ్గతిక్కనాది శూర
మండలమును గన్న వీరమాత — మంగళం
తిమ్మరుసు యుగంధరాది
దివ్యరాజ నీతిపరుల
వల్లభాది మతకర్తల తల్లి — మంగళం
నాగ్నజిత్తు ముఖ్య శిల్పి
నాయకులను గన్న తల్లి
ఆపస్తంబాది మునుల — అంబ మంగళం

(౯) వందేత్వాం భూదేవీ మార్య మాతరం
జయతు జయతు పదయుగళం తే నిరంతరం
శుభ్రశరచ్చంద్రయుక్త చారుయామినీం
వికసితనవకుసుమమృదులదామశోభినీం
మందస్మితయుక్తవదనమధురభాషిణీం
సుజలాం సుఫలాం సరళాం శివవరదాం
చిరసుఖదాం ముకుళరదాం ఆర్యమాతరం ॥వందే॥
బహుళాధికకోటిజనకంఠనాదినీం
అమితభుజాం ధృతసదసీం తనయతారిణీం
హిమనగజాం స్వాభిమానబుద్ధిదాయినీం
కమలాం అమలాం అతులాం రిపుహారిణీం
బలకరిణీం ధృతనలినీం ఆర్యమాతరం ॥వందే॥
ధర్మస్త్వం మర్మత్వం త్వాంయశోబలం
శక్తిస్త్వం భక్తిస్త్వం కర్మచాఖిలం
ప్రతిసదనం ప్రతి మాతే త్వం మహాఫలం
ధరణీం భరణీం జననీం కవిప్రతిభాం
నతసుసఖాం జగదంబాం రాష్ట్రమాతరం ॥వందే॥

# యువజన విజ్ఞానము

## నీతిపద్యములు

## ౨వ ప్రకరణము

---

నీతిపద్యములను కొన్నిటిని కూర్చి కొందరు ప్రకటించినారు. ఇందు పెక్కు ఉత్తమగ్రంథముల నుండి మంచి పద్యములేరి ప్రకటింప నైనది. వీటిద్వారా మూలగ్రంథములను చదువనభిలాష పాఠకులకు కలుగవచ్చునని నా ఆశయము.

---

# నీతిపద్యములు

అచ్చుపడ నీతిశాస్త్రంబు వచ్చెనేని
పోరి నిరుద్యోగి ఫలసిద్ధి పొందలేడు
తెల్ల మంధుండు కరమున దీప ముండె
నేని యచటి పదార్థంబు గానలేడు.

నారాయణామాత్యుని పంచతంత్రము.

పెక్కేల నీతిశాస్త్రము
దక్కక నెవ్వండు సదువు ధర నెవ్వాడు పెం
పెక్కగ వినునాతడు దా
జిక్కడు సురపతికినైన సిద్ధంబెందుఁ.

ప్రజలవర్తనంబు పరికింప నోపని
రాజు కేల గలుగు రాజ్యసుఖము
వారి మేలుకీడు వరుసన తనకును
కీర్తికరమగు నపకీర్తికరము.

వెనుకకుబోక, ఆగునక, వేసటనొందక, బంతి బంతిలో
బెనపక, కానమిం బ్రిమసి బెగ్గిల, కెంతయు మున్ను సూచుచుఁ
గనుకని యక్షరాక్షరము కందువ దప్పక, యేకచిత్తుడై
యనుపమభక్తితోఁ జదువువాతని వాచకు డండ్రి సజ్జనుల్

శ్రుతశీలబలోపేతులు
సత్రివ్రతాపులునునైన యంధకవృష్ణుల్
అతిపానదోషవశమున
ఘాతమ్మొంది యడంగి రనిన నన్యులవశమే.

వాయువు దూరని చోటను
తోయజబాంధవునిరశ్మి దూరని చోటన్
ధీయుతులబుద్ధి దూరు ని
రాయాసంబునను కార్య మగు తద్వృద్ధిన్.

ధనమును ప్రాతచ్ఛాయయు
వనితాజనయౌవనంబు వండినయన్నం
బును కడు మూర్ఖస్నేహం
బును నిల నవి యల్పకాలభోగ్యము లరయన్.

సకలనీతిసమ్మతము

ఎడపక దుర్జనుం డొరుల కెంతయు కీడొనరించు గాని యే
యెడలను మేలుసేయ డొకయించుకయైనను చీడపుర్వు తా
జెడదిను నింతెగాక పుడిసెండు జలంబిడి పెంపనేర్చునే
పొడవగుచున్న పుష్పఫలభూరుహ మొక్కటినైన భాస్కరా!

ఎడ్డెమనుష్యు డేమెరుగు నెన్నిదినంబులు గూడియుండినన్
దొడ్డగుణాఢ్యునందుగల తోరపువర్తనలెల్ల ప్రజ్ఞబే
ర్పడ్డవివేకిరీతి, రుచిపాకము నాలుకగా కెరుంగునే
తెడ్డదికూరలో గలయ ద్రిమ్మరుచుండిననైన భాస్కరా.

మతియు కళాకృషిబీజము
మతియుతనుఫలప్రదక్షమాజము తలపన్
మతియు చెలి, మతియుచుట్టము,
మతిహీనులుచూడ మొరడు మ్రాకులు ధాత్రిన్.

చెలిమి శిలాక్షర మెప్పుడు
అలుక జలాక్షరము సుజనులగు వారలకున్
చెలిమి జలాక్షర మెప్పుడు
అలుక శిలాక్షరము కుజను లగువారలకున్.

కేయూరబాహుచరిత్రము

అ తిథి కడునల్పుడైన నత్యధికుడైన
నింటి కేతేర బ్రియమాడు నెవ్వడేని
వానిగౌరవ మది గౌరవంబుగాని
కాదు గౌరవ మాకార గౌరవంబు.

శాస్త్ర మాచార్యసన్నిధి జదువడేని
ఇద్ధబోధంబు మది సంగ్రహింపడేని
తెగువమీరి ప్రతిజ్ఞ సాధింపడేని
జ్ఞాతిజయు మందడేని తజ్జనుడు జనుడె.

కా శీఖండము

అక్కరకురాని చుట్టము
మ్రొక్కిన వరమీని వేల్పు మోహరమున దా
నెక్కిన బారని గుఱ్ఱము
గ్రక్కున విడువంగవలయు గదరా సుమతీ.

ఉడుముండదె నూరేండ్లును
బడియుండదె పేర్మి పాము పదినూరేండ్లున్
మడువున కొక్కెర యుండదె
కడు నిల పురుషార్థపరుడు కావలె సుమతీ.

ఉపకారికి నుపకారము
విపరీతము గాదు సేయ వివరింపంగా
నపకారికి నుపకారము
నెపమెన్నక సేయువాడు నేర్పరి సుమతీ.

ఎప్పుడు సంపద కలిగిన
నప్పుడు బంధువులు వత్తు రది యెట్లన్నన్
దెప్పలుగ చెరువు నిండిన
కప్పలు పదివేలు చేరు గదరా సుమతీ.

కులకాంతతోడ నెప్పుడు
కలహింపకు వట్టితప్పు ఘటియింపకుమీ
కలకంఠికంటికన్నీ
రొలికిన సిరి యింటనుండ నొల్లదు సుమతీ.

తలనుండు విషము ఫణికిని
వెలయంగా తోకనుండు వృశ్చికమునకున్
తలతోక యనక యుండును
ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ.

వెలకాంత లెందరైనను
కులకాంతకు సాటిరావు కువలయమందున్
పలువిద్యలెన్ని నేర్చిన
కులవిద్యకు సాటిరావు గువ్వలచెన్నా

అంగీలు పచ్చడంబులు
సంగతిగాను శాలుజోడు సరిగంచులమేల్
రంగగు దుప్పటులన్నియు
గొంగడి సరిపోలవన్న గువ్వలచెన్నా.

గానుగమొద్దుకంటె వడి కాయము బెంచి మదించి ముష్కరుల్
గూనలవంటి దేహములు గొప్పగ బెంచుచు నిద్రి సీల్గుచున్
బోనుల రాజవ్యాఘ్రముల పోలిక వాహనమెక్కి సోలుచున్
బూనిన గొప్పలేదు విను భూస్థలి దాతృత గొప్పచూడగా
దానములేని హస్తములు దగ్ధమయా శరభాంకలింగమా॥

వండెడివాని, సత్కవిని, వైద్యుని, మంత్రిని, తంత్రివాదినిన్
కొండెముపల్కువాని, రిపుగూడినవాని, ధనేశునిన్, మహీ
మండలమేలువాని, తనమర్మమెరింగినవాని, శిష్టునిన్
ఖండితమాడునే నదియు గండమయా శరభాంకలింగమా.

కోరనివాడె యోగి, యిది కొమ్మని యిచ్చిన వాడె త్యాగి, సం
సారమునం గలంతలకు సంతస మందినవాడె భోగి, యిం
పారెడు నన్యభోగముల కారడిచెందినవాడె రోగి, యో
మార విశారదూర ఫణిమండన యో శరభాంక లింగమా.

ఆశచేత ధనము నార్జింపగా నేల
మట్టిక్రింద బెట్టి మఱువ నేల
ధనము పోవు వెనుక ధర్మంబ దేలరా
విశ్వదాభిరామ వినర వేమ.

ఈతకన్న లోతు నెంచంగ బనిలేదు
చావుకన్న కీడు జగతిలేదు
గోచిపాతకంటె కొంచెం బికనులేదు ॥వి॥

పుత్త్రుడికలవాని పుండు బాధయుగూడ
వసుధలోన చాల వార్త కెక్కు
పేదవాని యింట పెండ్లైన నెఱుగరు వి॥

అల్పబుద్ధివాని కధికార మిచ్చిన
దొడ్డవారి నెల్ల దొలగ గొట్టు
చెప్పు దినెడు కుక్క చెరుకు తీపెరుగునా? వి॥

అల్పు డెపుడుబల్కు నాడంబరముగాను
సజ్జనుండు బల్కు చల్లగాను
కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగునా ? వి॥

అనువుగాని-చోట నధికుల మనరాదు
కొంచె ముండుటెల్ల కొదువ గాదు
కొండ యద్దమందు కొంచమై యుండదా ? వి॥

గంగిగోవుపాలు గంటెడైనను చాలు
కడవెడైననేమి ఖరముపాలు
భక్తిగలుగు కూడు పట్టెడైనను చాలు వి॥

పెట్టిపోయువాడు కట్టడి గలదాత
తిట్టిపోయువాడు తుట్టె పురువు
రట్టుసేయువాడు రాణింపునకు రాడు వి॥

తామసించిచేయ దగదెట్టికార్యంబు
వేగిరింప నదియు విషము మగును
పచ్చికాయ దెచ్చి పడవేయ ఫలమౌనె? వి॥

నిక్కమైన మంచి నీల మొక్కటి చాలు
తళుకుబెళుకు రాలు తట్టెడేల
చదువ పద్య మరయ చాలదా యొక్కటి వి॥

పట్టు విడువరాదు పదిలక్షలకునైన
పెట్టి దెప్పరాదు పేదకైన
వెట్టి గాలువ రాదు విభు డెట్టిఘనుడైన వి॥

మేడిపండు చూడ మేలిమై యుండును
పొట్ట విచ్చి చూడ పురుగు లుండు
బెరుకువాని మదిని బింక మీలాగురా వి॥

గొడ్డుటావు బిదుక కుండ చేకొని పోవ
పండు ఊడ దన్ను బాల నియదు
లోభివాని నడుగ లాభంబు లేదయా వి॥

దొరలేనివాని విద్యయు
దరిద్రుమహిమయును మూర్ఖతపమును బాడిం

బోరయని నరపతి రాజ్యము
పరికింప నిరర్థకంబు బద్దె నరేంద్రా!

మాసినవాడె మాల, యభిమానమె మేరువు, దాన ధర్మముల్
జేసినవాడె వేల్పు, కృషి సేయనివాడె దరిద్రు డాప్తులన్
బాసినవాడె బేల, యొరు బల్కనివాడె ప్రభుండు, రాజులన్
డాసినవాడె ధీరుడు, దృఢంబిది నన్నన గంధవారణా.

నీతిశాస్త్ర ముక్తావళి

దూరము వ్యవసాయకులకు,
భారంబు సమర్థులకును, భాసుర విద్యా
పారగులకును విదేశము,
వైరము ప్రియవాదులకును వసుమతి గలదే?

నీతిసారము

కోపము, నుబ్బును, గర్వము,
ఆపోవనియునికియును, దురభిమానము, ని
ర్వ్యాపారత్వము, ననునివి
కాపురుష గుణంబు లండ్రు కౌరవనాథా.

ధనమును విద్యయు వంశం
బును దుర్మదులకు మదంబు బొనరించును, స
జ్జనులైన వారి కడకువ
యును, వినయము నివియు తెచ్చు నుర్వీ నాథా!

వెలది, జూదంబు, పానంబు, వేట, పలుకు
ప్రల్లదంబును, దండంబు పరుసదనము,
సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ముసేత,
యనెడు సప్త వ్యసనముల జనదు తగుల.

తను లోకము కొనియాడగ
విని యుబ్బడు సజ్జనుండు వెండియు గడు నే
లోనరించు, గీడొకించుక
యును దనదెస దోపనీక యుడుగుచు వచ్చున్

తనువున విరిగిన యలుగుల
ననువున బుచ్చంగవచ్చు నతి నిష్ఠురతన్
మనమున నాటిన మాటలు
విను మెన్ని యుపాయములను వెడలునె యధిపా.

ఉద్యోగపర్వము

తివిరి యిసుమున దైలంబు దీయవచ్చు
తవిలి మృగతృష్ణలో నీరు ద్రావ వచ్చు
తిరిగి కుందేటి కొమ్ము సాధింప వచ్చు
చేరి మూర్ఖులమనసు రంజింప రాదు.

విద్య నిగూఢ మగువిత్తము రూపము పూరుషాళికిన్
విద్య యశస్సు భోగకరి విద్య గురుండు విదేశబంధుడున్
విద్య విశిష్టదైవతము విద్యకు సాటిధనంబు లేదిలన్
విద్య నృపాలపూజితము, విద్యనెరుంగనివాడు మర్త్యుడే ?

మొదట జూచిన గడు గొప్ప పిదప గురుచ
ఆది గొంచెము తర్వాత నధిక మగుచు
దనరు, దినపూర్వ పరభాగ జనితమైన
చాయపోలిక కుజన సజ్జనుల మైత్రి !

ఆయువు వీచి చంచలము, యౌవనమల్పదినోచితంబు, పు
ష్పాయుధ కేళిజన్య సుఖ మస్థిర, మర్థము వాంఛవోలె సా
పాయము, భోగముల్ మెఱుపులట్లు భ్రమించు, భవాబ్ధిలంఘనో
పాయము బ్రహ్మచింతనము బాయక సేయుదు సజ్జనోత్తముల్.

ఆయువు నూరు వత్సరములందు సగంబు నశించె నిద్రచే
నాయరలో సగంబు గతమయ్యెను బాల్యజరాప్రసక్తిచే
బాయక తక్కినట్టి సగబాలు గతించు ప్రియాసవృత్తిచే
నాయువు చంచలం బగుడు బ్రాణుల కెట్లు సుఖంబు చేకురుఁ.

భర్తృహరి ఏనుగు లక్ష్మణకవి

మచ్చిక లేని చోట, అనుమానము వచ్చిన చోట, మెండుగా
కుచ్చితు లున్నచోట, గుణకోవిదు లుండని చోట, విద్యకుఁ
మెచ్చని చోట, రాజు కరుణించని చోట, వివేకి యుండి రే
నచ్చట మోసమందుడు, సుగుణాకర, పెమ్మయ సింగధీమణీ.

వాసన లేని పువ్వు, బుధవర్గము లేనిపురంబు, నిత్యవి
శ్వాసము లేనిభార్య, గుణవంతుడు కానికుమారుడుఁ, సద
భ్యాసము లేనివిద్య, పరిహాసప్రసంగము లేనివాక్యముఁ
గ్రాసము లేనికొల్వు, కొరగానివి పెమ్మయ సింగధీమణీ.

పెట్టక కీర్తిరాదు, వలపింపక యింతికి నింపు లేదు, తా
దిట్టక వాదు లేదు, కడు ధీరత వైరుల సంగరంబులో
గొట్టక వాడ లేదు, కొడుకొక్కడు పుట్టకముక్తిరాదయా
పట్టపురాజుకైన నిది పద్ధతి పెమ్మయ సింగధీమణీ॥

వెలయాలు, శిశువు, నల్లుడు,
నిల యేలిక, యాచకుండు, నేగురు ధరలో
కలిమియు లేమియు తలపరు
కలియుగమున కీర్తికాము కాటయ వేమా.

అభ్యుడున్న యప్పు డందరు పూజ్యులే
లెక్కమీద సున్న లెక్కినట్లు
అతడు పోవు వెనుక నందరపూజ్యులే
లెక్క లేక సున్న లేగినట్లు.

పిలువనికూటికిఁ, జెతలు పెట్టుభరావరు జేలువీటికిఁ
జలములు లేనియేటికిని, సారెకుబంధుగు లున్న చోటికిఁ
బలువురతోటిపోటికి, నృపాలురసాటికి, బోవరాదయా
బలవదరీ దరీకుహరభాస్వదరీ యదరీదరీహరీ.

తంత్రులు లేనివీణయును, తాళము రాగము లేనిగీతముఁ,
మంత్రము లేనిసంధ్యయును, మానము లేనితపంబు, వేదవి
ట్తంత్రము లేనియాగము, పదజ్ఞత లేని కవిత్వతత్త్వముఁ
మంత్రులు లేనిరాజ్యము సమానము లియ్యవి దుష్ప్రయుక్తముల్.
చాటుపద్యమణి మంజరి.

పౌరుషజ్ఞానకీర్తుల బరగనేని
వానిసంపద యొకపూట యైనజాలు
ఉదరపోషణమాత్రకై యుర్విమీద
కాకి చిరకాల మున్న నేకార్య మగును.

సాహసము లేనివానికి
నూహింపగ బ్రతుకు గలదె యొకట ధరిత్రిఁ
బాహువిజృంభితశత్రు
వ్యూహంబుల జంపు జచ్చు నొండె ఘను డిలఁ.

మంటికడవవోలె మహి దుర్జనస్నేహ
మధికశీఘ్రముననె హత్తు విరియు
కనకకలశభాతి గలసజ్జనస్నేహ
మొదవు పగుల బడక పదిల మగుచు.

చెలిమి కలకాల మెల్లను జెరుపకునికి
క్రోధ మాహార్ద్రె శీఘ్రించె కూడి విడుట
ఈగి నిస్సంగుడును బోలె నిచ్చి చనుట
ఇవి మహాత్ముల గుణములై యెన్నబడును.

నడువగ తొట్రుపా టొదవు, నాలుక యాడదు మాట లాడగా
దొడగిన నీరెలుంగువడు తొల్లిటిపొంకము డొంకి దేహముం
వడకు భయంబు గ్రమ్మి దురవస్థల తల్లడ మందు వేడుచో
జెడుగగు నర్థికిన్ మరణచిహ్నము లన్నియు దోచు నారయన్

✓పరగ నసత్యవాక్యములు పల్కుటకంటెను మౌనవృత్తి మే
లరుదుగ నన్యభామ గదియం జనుకంటె నపుంసకత్వవి
స్ఫురణము మేలు, కొండియము పూనుటకంటెను చావు మేలగున్
పరధనకాంక్షకంటె సులభంబగు భిక్షమె మేలు చూడగన్.

నిత్యసంతోషవంతుడై నెగడువాని
కన్ని చోటుల సంపద లాని యుండు
చెప్పు లిడుకొన్నకాళ్ల కీక్షితితలంబు
తోలు గప్పినచందమై తోచునట్లు.

పరభామ గన్నతల్లిగ
పరధనముం బెంటుగాగ భావించు మన
త్పురుషుండు సర్వజీవుల
నిరతము తనయాత్మగాగ నెమ్మది జూచున్.

నారాయణకవి పంచతంత్రము

సత్యమ తపమును యజ్ఞము
సత్యమె వేదంబు దాంతిశాంతులు నగుటన్
సత్యము దొరగిన నిర్మల
నిత్యానుష్ఠానములును నిష్ఫలములగున్. భారతము

దంతిపదములోన దక్కినజంతుచ
యంబునడుగు లెల్ల నడగి యుండు
న ట్లధర్మకోటు లన్నియు లోనగు
నిద్ధగుణ యహింస కింత నిజము. భారతము

బ్రదుక వచ్చుగాక బహుబంధనము లైన
వచ్చుగాక లేమి వచ్చుగాక
జీవధనములైన జెడుగాక పడుగాక
మాట దిరుగ లేరు మానధనులు. (భాగవతము)

విద్య యిచ్చుట సత్పాత్రవిషయము మైన
అవ్యయానంద పదము చేయంగ జాలు
తగగ దక్షిణ యిచ్చి పేదలకు విద్య
యీ నియోగించుటయు తత్సమాన కృతియు. (భారతము)

విజ్ఞుడగువాడు మెప్పొందు వికృతుడైన
సుందరుండగుమూర్ఖుని జూడరెవరు
వాసనలు కల్గుకురువేరు వాసి కెక్కు
అందమైనట్టి మోదుగు నడుగ రెవరు.

అనువు గానివేళ నడగి యుండుట మేలు
మిట్టిపడుట యెల్ల మిత్తి కొరకె
వరద రాగ వంగు ప్రబ్బలి మేలొందు
విఱ్ఱవీగు మ్రాను విరుగ బడును.
(పెద్దబా౹ శిక్ష వచనాలకు సుప్ర)

సదమలగుణాలి నాదరించెదరు గాని
యాదరింపరు జన్మము నార్యజనులు
చాత్రిణి విప్రుండె యయ్యె శూద్రత్వ మొనసె
సుతుముండయ్యె విదురుడు శూద్రుడయ్యె.

పరులమెడ గాటముగ గోపపడుట గాని
కటువివాద మదాంధత గాని తగదు,
శౌరిచే శిశుపాలు మస్తకము దెగియె
క్రూర వాగ్దంభంబులు కారణముగ.

(క్షేమేంద్రుని చారుచర్య.
దుక్కిపాటి వెంకటరత్నకవి అనువాదము)

కరుణారస హీనుండగు
ధరణీశునిరాష్ట్రమందు దక్కరు మనుజుల్
మరుభూములందు పైరులు
పెరుగక నాశంబు నొందువిధిని గిరీశా.

ఝకటము గల సంసారము
వికలంబగు తత్క్షణంబ; బెజ్జముగల పు
ట్టిక నీట దేల్ప గడగిన
దికమకముగ నద్ది మునుగు దెలియ గిరీశా.

[ఝకటము—తద్భవము జగడము.]

దండుగ బట్టెడుభూపతి
మండలమున వృద్ధి లేదు మనుజుల కెపుడుక్
మెండుగ నడచెడు మార్గపు
దండన నెటు మారిను పంట్లు దాల్చు గిరీశా.

(కీ. శే. తాయన్నగారి గిరీశ శతకము)

(తాయన్నగారు కర్నూలు వారు. చనిపోయి ఇంచు మించు ౧౫ ఏండ్లయ్యెను.)

నిజము భీష్మనంతటి జితేంద్రియునకైన
ఆశ పుట్టు మది నిరాశపుట్ట
దితరు లనగ నెంత యేకాంతమైయున్న
ధనముపట్ల యువతిజనముపట్ల.

ఏకాంత నైన పురుషుం
డేకాంతమునందు జేరె నేనియు నతనిన్
లోకాపవాద మంటదె
చీకాకుగ ధైర్య మెడల జేయుడె మనుజున్.

[ చేమకూర వేంకటపతి సారంగధర ]

ఎన్నిసుగుణాలు లోభియం దున్న నేమి ?
యెన్ని దుర్గుణములు దాత కున్న నేమి?
పరమదోషంబు లేదు లౌభ్యమునకన్న;
దానమునకన్న గుణము నిద్ధరణి లేదు.

కలిమి పొసగదు ధైర్యసంకలన లేక
జయము కలుగదు శౌర్యవిస్తరత లేక
మోక్ష మబ్బదు జ్ఞానసంపూర్తి లేక
యశము సమకూర దురువదాన్యతయు లేక.

అనయ మనుకూలదాంపత్య మైనయెడల
క్రమముగా నొంద గల్గు సర్వమును మోక్ష
మది తలంపగ విపరీత మైనయేని
కలుగబోదు సుఖం బైహికమున యేని.

( నీలకంఠ దీక్షితుని సభారంజనమునకు మక్కపాటి వేంకటరత్నముగారి తెనుగు )

సతికి పతికి సమానమై జరుగ దేని
నిరయమున లేదు వలపంత నిగ్రహంబు;
సతికి బతికి సమానమై జరిగె నేని
స్వర్గమున లేదు వలపంత సౌఖ్యమన్న.

నల్లి గల శయ్య నిద్రయు
చిల్లి గల ఘటంబునందు జేర్చిన నీరుఙ
తల్లి గల వేశ్య దగిలిన
వల్లవసుఖములును బోధివల్లవ సుఖముల్

(వైజంతీ విలాసము సారంగు తమ్మయ.)

మందారమకరందమాధుర్యమున దేలు
మధుపంబు పోవునే మదనములకు
నిర్మలమందాకినీవీచికల దూగు
రాయంచ చనునె తరంగిణులకు
లలితరసాల పల్లవఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకు
పూర్ణేందుచంద్రికా స్ఫురితచకోరకం
బరుగునే సాంద్రనీహారములకు
అంబుజోదరదివ్యపాదారవింద
చింతనామృతపానవిశేషమత్త
చిత్తమేరీతి నితరంబు జేరనేర్చు
వినుతగుణశీల మాటలు వేయునేల.

(భాగవతము సప్తమస్కంధము)

నెయ్యములేని సంగతియు, నిక్కములేని వచోవిలాసముఙ,
వియ్యములేని వైభవము, విందులసందడిలేని ముంగిలిఙ,
తియ్యము చాగముఙ మరియు ధీరతలేని యమాత్యకృత్యముఙ,
కయ్యములేని శూరతయు గైకొని యూరక మెచ్చవచ్చునే

(నాచనసోముని ఉత్తర హరివంశము.)

దుర్జనునికల్మి దురితంపుదోవ కగును
సజ్జనునికల్మి పుణ్యంబునరణి కగును

పాము బలిసిన గరళంబు ప్రబల మగును
గోవు బలిసిన దుగ్ధంబు గురియుచుండు.

(సీమంతినీ కల్యాణము; పెనుమళ్ల సోమనాంతి)

కయ్యమునకు, నెయ్యమునకు,
వియ్యమునకు సమతవలయు, వేరొకడైనన్
కయ్యము గెలువదు, నిలువదు
నెయ్యము, వియ్యంబు పొసగనేరదు మొదలన్.

(వేంకటనాథుని పంచతంత్రము)

పురుషార్థపరున కిహము
బరముం గల దండ్రు సత్యపరతంత్రు సురా
సురు లర్చింతురు గావున
బరహితసత్యములు విడువబడ వెప్పటికిన్



# యువజన విజ్ఞానము

## శకములు

## 3వ ప్రకరణము

---

ఏవిషయమైన జరిగిపోయి ఎంతకాల మైనది అని గుర్తుపెట్టు కొనుటకై జనులు ఏదైన ప్రసిద్ధమగు విషయము నాధారముచేసుకొని లెక్కింతురు. దానినే శకమందురు. చదువురానివారిని నీ వయసెంత అని యడిగిన పెద్దకరువుకు పదిపదేనేండ్లవాన్ని; పగటిచుక్కలు కనిపించినది నాకు కొద్దిగా గుర్తున్నది; జర్మనుయుద్ధానికి నాకు అయిదేండ్ల వయస్సు అని యందురు. అదేవిధముగా మరీప్రాచీన విషయాల కాలము తెలుపవలెనంటే గొప్ప రాజులకాలమునుండి కాని గొప్ప మతబోధకుల కాలమునుండి కాని లెక్కపెట్టుతూ వచ్చినారు. అవే

శకాలు. శకాలు ఒక్కొక్క దేశములో ఒక్కొక్క విధముగా నున్నవి. కారణమేమనగా ప్రతిదేశమువారు తమదేశములోని చాలా గొప్ప వారి కాలమునుండి లెక్కపెట్టుచూ వచ్చినారు. మన హిందూస్థానము లోనే చాలా శకాలున్నవి. వంగశకము, శాలివాహనశకము, విక్రమార్కశకము, చాళుక్యశకము, మలయాళశకము, గుప్తశకము, యుధిష్ఠిరశకము, వీరశకము, (అనగా మహావీరజైనశకము) హిజిరీ, ఫసలీ, కలిగతాబ్దములు మొదలైనవి కలవు. కాని అందు ముఖ్యమైనవి రెండే. ఉత్తరహిందూస్థానములో విక్రమార్కశకము, వింధ్యకు దక్షిణమందలి దేశమందంతటను శాలివాహనశకము ప్రధానమైనవి. ప్రపంచములోని శకాలలో ముఖ్యమైనవి.

౧. క్రీస్తుశకము. ౨. విక్రమార్కశకము.

3. శాలివాహన శకము. ౪. హిజిరీ. ౫. ఫసలీ

(౧) ఏసుక్రీస్తు అను గొప్ప మతకర్త పేర క్రీస్తుశకము మొదలైనది. ఇండియాలో ఇంగ్లీషువారి ప్రభుత్వములో ప్రచారమైన శకము క్రీస్తు శకమే. క్రీస్తువు పుట్టిన నాటినుండి లెక్కపెట్టి చెప్పేది క్రీస్తు శకము. దీనినే క్రీ. శ. అని పొడి అక్షరాలలో వ్రాయుదురు. అయితే క్రీస్తువునకంటె ముందు జరిగిన విషయాలను చెప్పవలె నంటే క్రీస్తునకు పూర్వము ఇన్ని యేండ్లని వ్రాయుదురు. క్రీస్తునకు పూర్వము అను పదమునే క్రీ. పూ. అని పొడి అక్షరాలతో వ్రాయుదురు. ఏదైన ఒక సంగతి ఎప్పుడు జరిగినదో తెలుపవలెననిన ఇన్ని సంవత్సరములకు పూర్వము జరిగెనని యీ సంవత్సరమున వ్రాసిపెట్టిన మరి ౧౦ సంవత్సరముల తర్వాత చదువుకొను వారికి దాని అర్థము సరిగా కానేరదు. ఒక్క విషయము ౧౦౦౦ ఏండ్ల కింద జరిగెనని ఈ నాడు వ్రాసిన మరిపదేండ్లకు ౧౦౧౦ క్రిందట జరిగెను అని వ్రాయవలెను. అదే విధముగా ఏండ్లు గడిచేకొలది లెక్కలను మార్చుచు పోవలెను. అది సరియగు పద్ధతి కాదు. అందుచేత ౧౯౫౦ సంవత్సరములో ఒక విష

యము ౧,౦౦౦ ఏండ్ల క్రిందట జరిగెనని వ్రాయుదలచిన క్రీ.శ. ౧౯౫౦ లో ఆ విషయము సంభవించెనని వ్రాసిన ముందు కాలములో చదువు వారు తమ కాలపు సంవత్సరము లోనుండి ౯౫౦ ని తీసివేసి ఇన్నేండ్ల క్రిందట ఆవిషయము జరిగెనని గ్రహింతుకొందురు. ... ఏసుక్రీస్తు పుట్టకముందు జరిగిన సంగతులను గూర్చి తెలుపవలెననిన ఎట్లు తెలుపవలెను? అట్టి సంగతులు క్రీస్తునకు పూర్వము ఇన్ని సంవత్సరముల క్రిందట సంభవించెనని వ్రాయుదురు. అప్పుడు క్రీస్తునకు పూర్వము అను పదాలకు క్రీ. పూ. అను సంకేతములను వాడుదురు. క్రీస్తునకు పూర్వము. ౨౬౯ (క్రీ. పూ. ౨౬౯) లో అశోక చక్రవర్తికి పట్టాభిషేక మయ్యెను. ఆసంగతిని. క్రీ. శ. ౧౯౫౦ లో చదువుకొను వాడను ఆ సంగతి ఎన్నేండ్లకు ముందు జరిగెనని లెక్కించ దలచిన ౧౯౫౦ ఏండ్లకు ౨౬౯ సంవత్సరములు చేర్చుకొని, అశోకుని పట్టాభిషేకము ౨౨౧౯ ఏండ్ల క్రిందట జరిగెగదా అని తెలిసికొనును. అలెగ్జాండరు క్రీ. పూ. ౩౨౬ లో హిందూస్థానముపై దండెత్తి వచ్చెను, అని చరిత్రలో వ్రాసిన, క్రీ. శ. ౧౬౫౦ లో దానిని చదువుకొనువాడు, లేక అటు తర్వాత సంవత్సరాలలో చదువుకొనువాడు తాను చదువు సంవత్సరముతో ౩౨౬ ను కలుపును. ౧౯౫౦ లో అయితే ౨౨౭౬ ఏండ్ల క్రిందట ఆ విషయము జరిగెనని పాఠకుడు తెలుసుకొనును. క్రీస్తు శకములో క్రీ. శ. మరియు క్రీ. పూ. అను పొడి అక్షరముల విధాన మిట్టిది.

(౨) విక్రమార్క శకము.

నాలుగేండ్ల క్రిందట విక్రమార్కశకము ౨,౦౦౦ ఏండ్లు నిండెనని ద్విసహస్రాబ్ద్యుత్సవమును భారతదేశమందు, అందు ముఖ్యముగా ఉత్తరహిందూస్థానమందు విరివిగా చేసిరి. కాని చిత్రమేమన విక్రమార్కుడెవ్వరు? అనే విషయమును నేటికిని ఎవ్వరున్నూ తేల్చలేదు. ఇప్పటి శకము లెక్క ప్రకారము క్రీస్తునకు పూర్వము ౫౭ ఏండ్లకు ముందు ఈ శకము ప్రారంభమయ్యెను. అప్పుడు విక్రమార్కుడు అను

పేరుగల రాజు హిందూస్థానములో లేకుండెను. విక్రమార్కుని గురించి హిందూస్థానమందంతటను వేల కథలు వ్యాపించి పోయినవి. అతని సాహసములు అత్యంతాద్భుతముగా కొల్లలుగా కల్లలుగా వర్ణించి వ్రాసినారు. అతనికి విక్రమార్కుడనియు, విక్రమాదిత్యుడనియు, నవసాహసాంకుడనియు, విక్రముడనియు బిరుదు లుండెను. విక్రమార్కుని కథలన్నియు భట్టి విక్రమార్కకథలనియు ద్వాత్రింశత్సాలభంజికా కథలనియు నానాకథలు సంస్కృతములో తెనుగులో భారతీయభాష లన్నింటిలో పద్యగద్యాత్మకములుగా చాలా గ్రంథాలు కలవు. అవన్నియు చారిత్రికదృష్టిలో అబద్ధపు కథలే.

ఇక ఈశక మెట్లేర్పడెనో చరిత్రకారు లేమి యూహింపగలిగినారో సంగ్రహముగా తెలిసికొందము. మాళవరాజులు, ఉత్తర హిందూస్థానములో స్థిరపడిన తర్వాత తమ పేర మాళవ శకమును స్థాపించిరట. ఆ శకమునే విక్రమశకమని యన్నారట. అయితే ఈ శకము క్రీ.పూ. ౫౭ నాడు ప్రారంభ మగుటకు కారణమమాత్ర మెవ్వరునూ చెప్పజాలకున్నారు. బహుశా మాళవరాజులుకానీ గుప్తరాజులుకానీ శకము నేర్పాటు చేసినారు. తమ వంశములో తమకు తెలిసిన ఆదిపురుషుని పేర తమకు తెలిసి ఆదికాలమునుండి లెక్కపెట్టి ప్రారంభించి యుందురు. కొందరు చరిత్రకారులు గుప్తచక్రవర్తులలోని రెండవ చంద్రగుప్తుడే యీ శకకర్తయని ఊహించినారు. ఈ రెండవ చంద్రగుప్తుడు క్రీ.శ. 3౭౬ లో రాజ్యారూఢుడయ్యెను. అతడించుమించు క్రీ. శ. ౪౧౪ లో చనిపోయెను. ఈ గుప్తచక్రవర్తులు గుప్త శకము నొకదానిని స్థాపించి యుండిరి. ఆ శకములోని లెక్కప్రకారము రెండవ చంద్రగుప్తుని కుమారుడగు కుమారగుప్తుడు గుప్తశకము ౯౬ లో రాజ్యారూఢుడయ్యెను. గుప్తశకమీవిధముగా ప్రత్యేకముగా నుండగా చరిత్రకారులు ఇతడే శకకర్తయనుట విచిత్రము. రెండవ చంద్రగుప్తుడును అతని తండ్రియగు సముద్రగుప్తుడును విక్రమాదిత్య బిరుదము వహించి యుండిరి. ఆబిరుదము నాధారముగా జేసుకొని అతడే శకకర్తయని యందురు. బహుశా అతని యాస్థానమందే కాళిదాసుండి యుండును. ఎందు

కనగా కాళిదాసు క్రీస్తుశకాదిలోని పుష్యమిత్రాది రాజులనుగూర్చి తన నాటకములో వ్రాసినాడు. విక్రమాదిత్యుడని పలువురు బిరుదులు పెట్టుకున్నందున అట్టి యందరి రాజుల సాహసచర్యలు తర్వాతివారు కల్పనలనుగా పెంచినారు. ఇద్దరుముగ్గురు పరిశోధకులు మృచ్ఛకటికా నాటకమును పద్మప్రాభృతక మనుభాణమును రచించిన శూద్రకరాజే విక్రమశక కర్తయని యభిప్రాయపడినారు. ఇంచుమించు క్రీస్తుశకాదిలో శూద్రకుడుండెను. ఆంధ్రభృత్యరాజగు స్వాతి ఉజ్జయినీలో రాజ్యము చేయుచుండగా అతని యాస్థానములో శూద్రకుడు అను బ్రాహ్మణుడుండెను. కొంతకాలమున కారాజు నోడించి శూద్రకుడే ఉజ్జయినీ రాజయ్యెను. అతనికి సాహసలాంఛన అను బిరుదుండెనేమో అనియు నూహింతురు. పల్లవరాజులు గంగావంశరాజులు కొందరు శూద్రక బిరుదమును విక్రమ బిరుదమువలె వహించి యుండినందున శూద్రకరాజు అసామాన్య సాహసోపేత ప్రభువై యుండి యుండును. ఈ కారణాలచేత అతడే నిజమగు విక్రమశక కర్తయేమో అని పలువు రూహించినారు.

ఏది యెటులున్నను శకకర్త యెవ్వరో ఇంకను నిర్ణయము కాలేదు. విక్రమార్క శకము క్రీస్తుశకము లెక్క ప్రకారము క్రీస్తునకు పూర్వము ౫౭ నుండి ప్రారంభమైనది. ఈ శకము వింధ్య కుత్తరమందలి ఉత్తర హిందూస్థానమందే ప్రచారములో నున్నది. దక్షిణ హిందూస్థానమం దంతటను శాలివాహన శకమే ప్రచారమం దున్నది.

(3) శాలివాహన శకము.

ఉత్తరహిందూస్థానములో విక్రమశక మటులనో దక్షిణ హిందూస్థానమందు అనగా వింధ్యకు దక్షిణమందు శాలివాహన శక మటుల ప్రచారములో నున్నది. విక్రమార్కుని గూర్చి మన కేమియు నెటుల తెలియదో శాలివాహనుని గూర్చియు అంతే. శాలివాహనుని గూర్చి కూడ నమ్ముటకు వీలులేని కథలను అల్లి ప్రచారము చేసినారు. శాలివాహనుడు విక్రమార్కుని జయించి. క్రీ.శ ౭౮లో [illegible]

స్థాపించె నందురు. తనకు ౧౩౩ ఏండ్లకు పూర్వముండిన విక్రముడనే శక కర్తను శాలివాహను డోడించినది నమ్ముటకు వీలులేదు. అయితే ఎవ్వరినో ప్రబలుడగురాజు నోడించి తన సామ్రాజ్యమును వ్యాపింపజేసుకొని యుండును. క్రీ.శ. ప్రథమశతాబ్దిలో, శకులు, హూణులు హిందూస్థానముపై దాడి చేసియుండిరి. ఆదాడులను పారదోలి శాలివాహనుడు తన రాజ్యమును స్థాపించియుండును. శాలివాహనులను శాతవాహను లనియు నందురు. వారు ఆంధ్రరాజులని పురాణము లన్నిటిలోను వ్రాసి యుండుటచేత అన్యథా నిర్ణయించుటకు వీలులేదు. వారి రాజధాని ప్రతిష్ఠానము. దానినే యిప్పుడు పైఠణ్ అందురు. అది ఔరంగాబాదు జిల్లాలో కలదు. శాలివాహనవంశరాజులసామ్రాజ్యము హైదారాబాదు సంస్థానము, మధ్య పరగణాలు, బొంబాయి రాష్ట్రము, మద్రాసు లోని తెనుగుమండలములు ఉత్తరమున గంగాతీరము వరకు ఒక కాలమందు వ్యాపించియుండెను. ఆరాజుల శాసనము లన్నియు విశేషముగా మహారాష్ట్ర సీమలో కలవు. అవన్నియు ప్రాకృత భాషలో నున్నవి. క్రీ. శ. ౭ వ శతాబ్దమువరకు తెనుగు దేశములోని శాసనము లన్నియు ప్రాకృతమందు లేక సంస్కృతమందు ఉండినవి. క్రీస్తుశక సంవత్సరము లలోనుండి ౭౮ తీసివేసిన శాలివాహనశకము లభించును. అనగా క్రీస్తుశకము ౭౮ ఏండ్లనాడు ఈ శక మేర్పడినది...........;

(౪) హిజిరీ—

హజరత్ మహమ్మద్ పైగంబరుగారు తన యిస్లాం మతమును అరబ్బులకు బోధించగా చాలామంది తమ పూర్వ మతమును వదలుకొన నొల్లక మహమ్మద్‌గారిపై తిరుగబడిరి. అప్పుడు మహమ్మద్‌గారు తన కొద్దిమంది అనుచరులతో మక్కానుండి మదీనాకు వెళ్ళి అచ్చట దాగియుండెను. అట్టి పోకడను అరబ్బీలో హిజరత్ అందురు. క్రీ. శ. ౬౨౨ లో జూన్ ౨౦ వ తేదినాడు అతడు మదీనాకు పారిపోయి యుండెను. అదే హిజిరీ శకప్రారంభము. ఈ హిజిరీ తేది ముసల్మానులలో అందులోను ముఖ్యముగా అరబ్బులలో మాత్రమే ప్రచారమందు కలదు.

(౫) ఫసలీ:—

పంటల కాలాలను బట్టి భూమిపన్ను వసూలు చేయుటకు అనుకూలముగా ఉండుటకై అక్బరు చక్రవర్తి ఈ ఫసలీ శకాన్ని ఏర్పాటు చేసెను. అక్బరు ౩౫౦ ఏండ్ల క్రిందటివాడే అయినను ఈ శకాన్ని హిజిరీకి అనుకూలముగా ఉండునట్లు కొద్దిగా మార్పుచేసెను. అందుచేత ఫసలీకి హిజిరీకి ౧౦ ఏండ్ల వ్యత్యాసమే కలదు. క్రీ. శ. ౧౯౫౦ కి సరియగు ఫసలీ సంవత్సరము ౧౩౫౯. హైదారాబాదులో హిజిరీ ఫసలీ శకాలను ప్రభుత్వము వాడుచున్నది. ఫసలీనెల తేదీలకు ఇంగ్లీషునెల తేదీలకు ౩—౪ దినముల భేద ముండెడిది. దాన్ని ౧౩౫౬ ఫసలీ ప్రారంభమునుండి తొలగించి రెంటిని సమానము చేసిరి.

ఈ శకాలలో భేద మున్నట్లు నెలలలోను భేదము కలదు. విక్రమార్క-శాలివాహన శకముల నెలల పేర్లేవనగా :—

| | | |
|---|---|---|
| ౧. చైత్రము | ౫. శ్రావణము | ౯. మార్గశిరము |
| ౨. వైశాఖము | ౬. భాద్రపదము | ౧౦. పుష్యము |
| ౩. జ్యేష్ఠము | ౭. ఆశ్వియుజము | ౧౧. మాఘము |
| ౪. ఆషాఢము | ౮. కార్తీకము | ౧౨. ఫాల్గునము. |

క్రీస్తుశకము వారి నెలల పేర్లేవనగా:—

| | | |
|---|---|---|
| ౧. జనవరి | ౫. మే | ౯. సెప్టెంబర్, |
| ౨. ఫిబ్రవరి | ౬. జూన్ | ౧౦. అక్టోబర్ |
| ౩. మార్చి | ౭. జూలై | ౧౧. నవంబర్ |
| ౪. ఏప్రిల్ | ౮. ఆగష్టు | ౧౨. డిసెంబర్. |

హిజిరీ నెలల పేర్లు అరబ్బి నెలల పేర్లు; అవేవనగా :—

| | | |
|---|---|---|
| ౧. మొహర్రం | ౫. జమాదిలవ్వల్ | ౯. రంజాన్ |
| ౨. సఫర్ | ౬. జమాదియుస్సాని | ౧౦. షవ్వాల్ |
| ౩. రబ్బియుల్ అవ్వల్ | ౭. రజబ్ | ౧౧. జిల్ఖాద్ |
| ౪. రబ్బీసాని | ౮. షాబాన్ | ౧౨. జిలహేజ్. |

ఫసలీ నెలల పేర్లేవనగా :—

| | | |
|---|---|---|
| ౧. ఆజూర్ | ౫. ఫర్వర్ది | ౯. అమర్దాద్ |
| ౨. దై | ౬. అర్దిబెహిస్త్ | ౧౦. షహరేవర్ |
| ౩. బహీమన్ | ౭. ఖుర్దాద్ | ౧౧. మెహర్ |
| ౪. ఇస్ఫందార్ | ౮. తీర్ | ౧౨. ఆబాన్. |

శాలివాహనశకమును అనుసరించేవారు ౬౦ సంవత్సరాల చక్రము నొకదాని నేర్పాటు చేసినారు. ౬౦ సంవత్సరాలకున్నూ పేరులు పెట్టినారు. ౬౦ సంవత్సరాలు పూర్తికాగానే మరల మొదటినుండి లెక్కపెట్టుదురు. ఈ ౬౦ సంవత్సరాలపేరు లేవనగా :—

| | | |
|---|---|---|
| ౧. ప్రభవ | ౧౧. ఈశ్వర | ౨౧. సర్వజిత్తు |
| ౨. విభవ | ౧౨. బహుధాన్య | ౨౨. సర్వధారి |
| ౩. శుక్ల | ౧౩. ప్రమాది | ౨౩. విరోధి |
| ౪. ప్రమోదూత | ౧౪. విక్రమ | ౨౪. వికృతి |
| ౫. ప్రజోత్పత్తి | ౧౫. విషు | ౨౫. ఖర |
| ౬. అంగీరస, | ౧౬. చిత్రభాను | ౨౬. నందన |
| ౭. శ్రీముఖ | ౧౭. స్వభాను | ౨౭. జయ |
| ౮. భవ | ౧౮. తారణ | ౨౮. విజయ |
| ౯. యువ | ౧౯. పార్థివ | ౨౯. మన్మథ |
| ౧౦. ధాత | ౨౦. వ్యయ | ౩౦. దుర్ముఖి, |

| | | |
|---|---|---|
| ౩౧. హేవళంబి | ౪౧. ప్లవంగ | ౫౧. పింగళ |
| ౩౨. విళంబి | ౪౨. కీలక | ౫౨. కాళయుక్తి |
| ౩౩. వికారి | ౪౩. సౌమ్య | ౫౩. సిద్ధార్థి |
| ౩౪. శార్వరి | ౪౪. సాధారణ | ౫౪. రౌద్రి |
| ౩౫. ప్లవ | ౪౫. విరోధికృతు | ౫౫. దుర్మతి |
| ౩౬. శుభకృతు | ౪౬. పరీధావి | ౫౬. దుందుభి |
| ౩౭. శోభకృతు | ౪౭. ప్రమాదీచ | ౫౭. రుధిరోద్గారి |
| ౩౮. క్రోధి | ౪౮. ఆనంద | ౫౮. రక్తాక్షి |
| ౩౯. విశ్వావసు | ౪౯. రాక్షస | ౫౯. క్రోధన |
| ౪౦. పరాభవ | ౫౦. నళ | ౬౦. క్షయ. |

ప్రాచీన కాలములో హిందువులు ప్రపంచ కాలమును నాలుగు యుగాలుగా భాగించిరి.

(౧) కృతయుగము. (౩) ద్వాపరయుగము.
(౨) త్రేతాయుగము. (౪) కలియుగము.

ఇప్పుడు నడిచేది కలియుగము. మొదటి మూడున్నూ జరిగి పోయినవి. ఒక్కొక్క యుగాని కిన్ని యేండ్లని నిర్ణయించిరి.

| | | |
|---|---|---|
| ౧. కృతయుగము | ౧౭ లక్షల ౨౮ వేల | యేండ్లు, |
| ౨. త్రేతాయుగము | ౧౨ లక్షల ౯౬ వేల | ,, |
| ౩. ద్వాపరయుగము | ౮ లక్షల ౬౪ వేల | ,, |
| ౪. కలియుగము | ౪ లక్షల ౩౨ వేల | ,, |

మన పూర్వులు దినానికి రాత్రింబగళ్ళు కలిసి ౬౦ గడియలని లెక్కపెట్టిరి. పాశ్చాత్యులు ౨౪ గంటలని లెక్కవేసిరి. ఇంగ్లీషువారి రాజ్యము మనపై ఏర్పడినప్పటినుండి వారి గంటల లెక్కయే ప్రచారములో నున్నది. మనపూర్వులు ౨౭ ముఖ్య నక్షత్రాలను లెక్కించిరి.

సూర్యుడు. ౧౨ రాసులలో నుండు ననిరి. నక్షత్రాల పేర్లు ఏవనగా:—

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౧. | అశ్వని | ౧౦. | మఖ | ౧౯. | మూల |
| ౨. | భరణి | ౧౧. | పుబ్బ | ౨౦. | పూర్వాషాఢ |
| ౩. | కృత్తిక | ౧౨. | ఉత్తర | ౨౧. | ఉత్తరాషాఢ |
| ౪. | రోహిణి | ౧౩. | హస్త | ౨౨. | శ్రవణం |
| ౫. | మృగశిర | ౧౪. | చిత్త | ౨౩. | ధనిష్ఠ |
| ౬. | ఆర్ద్ర | ౧౫. | స్వాతి | ౨౪. | శతభిషం |
| ౭. | పునర్వసు | ౧౬. | విశాఖ | ౨౫. | పూర్వాభాద్ర |
| ౮. | పుష్యమి | ౧౭. | అనూరాధ | ౨౬. | ఉత్తరాభాద్ర |
| ౯. | ఆశ్లేష | ౧౮. | జ్యేష్ఠ | ౨౭. | రేవతి. |

౧౨ రాసులపేరు లేవనగా :—

| | | | |
|---|---|---|---|
| ౧. మేషము | ౪. కర్కాటకము | ౭. తుల | ౧౦. మకరము |
| ౨. వృషభము | ౫. సింహాము | ౮. వృశ్చికము | ౧౧. కుంభము |
| ౩. మిధునము | ౬. కన్య | ౯. ధనుస్సు | ౧౨. మీనము. |

సంవత్సరానికి రెండు అయనములని మన పూర్వులు లెక్కపెట్టిరి.

ఒకటి—ఉత్తరాయణము. రెండవది—దక్షిణాయనము.

ఇప్పటికిన్ని మన పల్లెలలోని హిందువు లందరు దిన వార నక్షత్రాల లెక్కను పంచాంగములలో ప్రతిదినము చూచుకొందురు. మన వారికి పంచాంగము చాలా ముఖ్యమైనది. మనవారు సంవత్సరములో రెండుమాసముల కొక ఋతువని నిర్ణయించిరి. చైత్ర మాసారంభము నుండి ఆరు ఋతువులు. అవి యేవనగా :—

| | | | |
|---|---|---|---|
| ౧. | వసంతము | ౪. | శరత్తు |
| ౨. | గ్రీష్మము | ౫. | హేమంతము |
| ౩. | వర్షము | ౬. | శిశిరము. |

దాని యనుసారముగా కర్మ చేయుట ధర్మమే. పరమేశ్వరుని యొక్కయు ఆత్మయొక్కయు సంబంధము ధర్మము. అది ప్రాకృతిక వస్తువుతో కాని మనుష్యునితో కాని సంబంధము కలది కాదు. మతములో ఈ రెండును సంబంధించియుండును. మానవుడు తరించుటకుగాను జ్ఞానము, కర్మము, భక్తి, అను మూడు ముఖ్య మార్గములు కలవు. ఉపనిషత్తులలోను వాటి సారమగు భగవద్గీతలోను ఇవి బాగుగా నిరూపింపబడినవి.

ధర్మమునకు పది లక్షణము లని మనువు అనెను.

శ్లో॥ ధృతిః, క్షమా, దమో,ఽస్తేయం, శౌచ, మింద్రియ నిగ్రహః
ధీ; ర్విద్యా, సత్య, మక్రోధో, దశకం ధర్మలక్షణం. (౬—౯౩)

వేదానుయాయులగు ఆర్యులకు (హిందువులకు) ధర్మ ప్రమాణము లీ క్రిందివిధముగా మనువు నిర్ణయించెను.

శ్లో॥ వేదః, స్మృతిః, సదాచారః స్వస్యచ ప్రియ మాత్మనః
ఏత చ్చతుర్విధం ప్రాహుః సాక్షాద్ధర్మస్య లక్షణం

వేదము, స్మృతులు (ధర్మ శాస్త్రములు) సదాచారము, తన అంతరాత్మ ఏది యుత్తమ మని తెలుపునో అట్టిదియును, ధర్మలక్షణమే అని పెద్దలు నిర్ణయించిరి. ప్రతి మతములోను ఏవో కొన్ని మంచి విషయాలను ఆ మతానుయాయులకు ధర్మములుగా విధించినారు. యహూదు (జ్యూ జాతివారి) ప్రవక్తయగు మోసెస్ పది విధులను ( Ten Commandments ) ఏసుక్రీస్తు దశాజ్ఞలను విధించెను. జైనులకు దశ నియమితిధర్మాలు కలవు. మహమ్మద్ కూడా ముసల్మానులకు నిత్యమూ ఐదుచ నమాజు, హజ్ యాత్ర, జకాత్ దానము, ఉపవాస వ్యాప్తి మున్నగు విధించెను. సిక్కులకును అటులే కొన్ని నియమములు కలవు. దయానంద మహర్షులు దశనియమములను స్థాపించిరి. ఇవే ప్రతి మతములోని ధర్మ లక్షణాలు.

సూర్యుడు. ౧౨ రాసులలో నుండు ననిరి. నక్షత్రాల పేర్లు ఏవనగా:—

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౧. | అశ్వని | ౧౦. | మఖ | ౧౯. | మూల |
| ౨. | భరణి | ౧౧. | పుబ్బ | ౨౦. | పూర్వాషాఢ |
| ౩. | కృత్తిక | ౧౨. | ఉత్తర | ౨౧. | ఉత్తరాషాఢ |
| ౪. | రోహిణి | ౧౩. | హస్త | ౨౨. | శ్రవణం |
| ౫. | మృగశిర | ౧౪. | చిత్త | ౨౩. | ధనిష్ఠ |
| ౬. | ఆర్ద్ర | ౧౫. | స్వాతి | ౨౪. | శతభిషం |
| ౭. | పునర్వసు | ౧౬. | విశాఖ | ౨౫. | పూర్వాభాద్ర |
| ౮. | పుష్యమి | ౧౭. | అనూరాధ | ౨౬. | ఉత్తరాభాద్ర |
| ౯. | ఆశ్లేష | ౧౮. | జ్యేష్ఠ | ౨౭. | రేవతి. |

౧౨ రాసులపేరు లేవనగా :—

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ౧. | మేషము | ౪. | కర్కాటకము | ౭. | తుల | ౧౦. | మకరము |
| ౨. | వృషభము | ౫. | సింహము | ౮. | వృశ్చికము | ౧౧. | కుంభము |
| ౩. | మిథునము | ౬. | కన్య | ౯. | ధనుస్సు | ౧౨. | మీనము. |

సంవత్సరానికి రెండు అయనములని మన పూర్వులు లెక్కపెట్టిరి.

ఒకటి—ఉత్తరాయణము. రెండవది—దక్షిణాయనము.

ఇప్పటికిన్ని మన పల్లెలలోని హిందువు లందరు దిన వార నక్షత్రాల లెక్కను పంచాంగములలో ప్రతిదినము చూచుకొందురు. మన వారికి పంచాంగము చాలా ముఖ్యమైనది. మనవారు సంవత్సరములో రెండుమాసముల కొక ఋతువని నిర్ణయించిరి. చైత్ర మాసారంభము నుండి ఆరు ఋతువులు. అవి యేవనగా :—

| | | | |
|---|---|---|---|
| ౧. | వసంతము | ౪. | శరత్తు |
| ౨. | గ్రీష్మము | ౫. | హేమంతము |
| ౩. | వర్షము | ౬. | శిశిరము. |

దాని యనుసారముగా కర్మ చేయుట ధర్మ మే. పరమేశ్వరుని యొక్కయు ఆత్మయొక్కయు సంబంధము ధర్మము. అది ప్రాకృతిక వస్తువుతో కాని మనుష్యునితో కాని సంబంధము కలది కాదు. మతములో ఈ రెండును సంబంధించియుండును. మానవుడు తరించుటకుగాను జ్ఞానము, కర్మము, భక్తి, అను మూడు ముఖ్య మార్గములు కలవు. ఉపనిషత్తులలోను వాటి సారమగు భగవద్గీతలోను ఇవి బాగుగా నిరూపింపబడినవి.

ధర్మమునకు పది లక్షణము లని మనువు అనెను.

శ్లో॥ ధృతిః, క్షమా, దమో,ఽ స్తేయం, శౌచ, మింద్రియ నిగ్రహః
ధీః ర్విద్యా, సత్య, మక్రోధో, దశకం ధర్మలక్షణం. (౬—౯౩)

వేదానుయాయులగు ఆర్యులకు ( హిందువులకు ) ధర్మ ప్రమాణము లీ క్రిందివిధముగా మనువు నిర్ణయించెను.

శ్లో॥ వేదః, స్మృతిః, సదాచారః స్వస్యచ ప్రియ మాత్మనః
ఏత చ్చతుర్విధం ప్రాహుః సాక్షాద్ధర్మస్య లక్షణం

వేదము, స్మృతులు (ధర్మ శాస్త్రములు) సదాచారము, తన అంతరాత్మ ఏది యుత్తమ మని తెలుపునో అట్టిదియును, ధర్మలక్షణమే అని పెద్దలు నిర్ణయించిరి. ప్రతి మతములోను ఏవో కొన్ని మంచి విషయాలను ఆ మతానుయాయులకు ధర్మములుగా విధించినారు. యహూదీల (జ్యూ జాతివారి) ప్రవక్తయగు మోసెస్ పది విధులను ( Ten commandments ) ఏసుక్రీస్తు దశాజ్ఞలను విధించెను. జైనులకు దశవిధయతిధర్మాలు కలవు. మహమ్మద్ కూడా ముస[illegible]ంకు నిత్యమూ పంచ నమాజు, హజ్ యాత్ర, జకాత్ దానము, [illegible] ప్యాప్తి మున్నగునవి విధించెను. సిక్కులకును అటులే కొన్ని నియమములు కలవు. శ్రీమద్దయానంద మహర్షులు దశ[illegible]యమములను స్థాపించిరి. ఇవే ప్రతి మతములోని ధర్మ లక్షణాలు.

ప్రపంచములో అనేక మతాలు కలవు. ఎన్నో మతాలు నశించి పోయెను. ఇప్పుడు మానవులలో బహుళముగా నిలిచిపోయిన మతము లివి:—

౧. హిందూ మతము
౨. జరథుస్త్ర మతము
3. యహూదీ మతము
౪. జైన మతము
౫. బౌద్ధ మతము
౬. కన్ఫ్యూషస్ మతము
౭. లోట్జీ (Laotsze) మతము
౮. క్రైస్తవ మతము
౯. ఇస్లాం మతము
౧౦. సీఖ్ మతము

ఇంచుమించు నాలుగైదు వేల యేండ్ల క్రిందటను మూడు వేల రెండు వేల యేండ్ల క్రిందటను కొన్ని మతాలు వెలసి జాడలేకుండా పోయెను. అందు ముఖ్యమైన వేవనగా:—

అసీరియాలోని అషుర్ మతము, ఈజిప్టులో ఈశిరిస్, అష్టోరెత్ పూజ, బాబిలన్‌లోని ఇల్ లేక ఇలాహీపూజ, గ్రీసు (యవన ద్వీపాల) లోని జీయస్ ప్రభృతి ప్రకృతి దేవతాపూజ. రోములోని జ్యూపిటర్ ప్రభృతి ప్రకృతి పూజ, అరబులోని మక్కేశ్వరాది విగ్రహాల కొలుపు, అమెరికాలోని మెక్సికో, పెరూ, దేశాలలోని ఆదిమ మతాలు, ఇట్టి వెన్నో కాల గర్భమందు వాటి నాగరికలతో పాటు లీనమై పోయెను. వివిధ జీవన్మతములనుగూర్చి వ్రాయుటకు ముందు "దేవుడు" అను పదాన్ని గురించి కొంత వ్రాయదగినది కలదు. సృష్టికర్త యొకడున్నాడనియు, అతడు ప్రసన్నుడైతే వరము లిచ్చుననియు, కుపితుడైతే నాశనము చేయుననియు జనులు విశ్వసించిరి. ఆ సృష్టికర్తకు తమతమ భాషలలో నానావిధ నామము లిచ్చిరి. వైదికార్యులు ఇంద్రుడు మున్నగు పేర్లుపెట్టిరి. జరథుస్త్ర మతానుసారులు అహురమజధా (అసుర మేధావి) అనిరి. యహూదీలు ఎహోవా, జహోవా అనిరి. బాబిలోనియావారు ఇల్, ఇలాహీ అనిరి. బాబిలన్ నగరమును

వారు నిర్మించినప్పుడు బాబె ఇల్ – దేవుని గృహము – అని దానికి పేరు పెట్టిరి. మహమ్మద్ తన మతమును స్థాపించిననాడు జరథుస్త్ర్యా, యహూదీ, బాబిలోనియా, వారి దేవతా వాచకము లన్నింటిని స్వీకరించెను. జరథూస్త్ర్యమతమువారి కుజధాను ఏజద్‌గా తీసుకొనెను. యహూదీల జహోవాను యహ్వా చేసెను. బాబిలోనియావారి ఇలాహీంని పూర్తిగా స్వీకరించెను. వారి ఇల్ పదాన్ని అల్లా చేసెను. క్రైస్తవులును యహూదీలును, ముసల్మానులును దేవుని తండ్రిగా(పురుషునిగా) భావించిరి. "పరలోకములోని మా తండ్రీ! ( Our father in Heaven ) అని క్రైస్తవులు పూజింతురు. హిందువులు దేవుని స్త్రీపున్నపుంసక లింగా లన్నింటిలో స్తుతించిరి. ఇక ఆనుపూర్వికముగా ప్రాచీనతను బట్టి వరుసగా ఇప్పుడు ప్రపంచమందు ప్రచారమందున్న మతముల స్వరూపమును సంగ్రహముగా తెలుసుకొందము.

## ౧. హిందూ మతము :—

ప్రపంచములోని మతము లన్నింటిలో ప్రాచీనమైనది హిందూ మతము. పూర్వము హిందూ పదము లేకుండెను. మన జాతిని ఆర్యులనిరి. మతమును వేద మత మనిరి. ఇంచు మించు ౨౫౦౦ ఏండ్ల క్రిందట ఈరానీలు, గ్రీకులు మన దేశానికి పశ్చిమోత్తర హిమాలయ కనుమల ద్వారా వచ్చినప్పుడు వారికి సింధు నదియు, దాని యుపనదులును పంజాబు దాటువరకు తటస్థించుతూ వచ్చెను. అందుచే మన దేశాన్ని వారు సింధుదేశ మనిరి. ఈరానీ (ఫార్సీ ) భాషలో సకారమునకు తరచుగా హాకారము నుచ్చరింతురు. అందుచేత మన దేశాన్ని హిందూ దేశ మనియు, మనలను హిందువులనియు, మన మతాన్ని హిందూ మత మనియు పేర్కొనిరి. ఈ పదాలే క్రమక్రమముగా రూఢి యయ్యెను. హిందూ మతమునకు మూలాధారములు ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము అను నాలుగు వేదములు. దేవుడొక్కడే

అనియు అతన్ని బహు నామములచే పేర్కొందురని వేదములలో తెలిపెరి. (ఏకం సత్ విప్రా బహుధా వదంతి—ఋగ్వేదము).

ఈ భావమునే తరువాత వచ్చిన ప్రపంచ మతము లన్నియు బోధించెను. వేదాలలో దేవుని మహిమలు, నీతులు, ఆర్యుల కష్ట సుఖాలు, వర్ణింపబడినవి. వేదముల వివరించి ఆరణ్యాకములు రచింప బడెను. వేదముల ననుసరించి ఉపనిషత్తులు ఏర్పడెను. ఉపనిషత్తులలో ఉత్తమ తత్త్వము, వేదాంతము, నీతి, ధర్మములు వివరింపబడినవి. ఉపనిషత్తులు ౧౦౮ వరకు పెరిగెను. అందు ముఖ్యమైనవి పది. వాటిని దశోపనిషత్తు లందురు. అవేవనగా :—

ఈశావాస్య, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తిరీయ, ఐతరేయ, ఛాందోగ్య, బృహదారణ్యకోపనిషత్తులు. తరు వాత సూత్ర వాఙ్మయము వచ్చెను. శ్రౌత, గృహ్య, ధర్మ సూత్రము లని అవి మూడు విధములు, శ్రౌతసూత్రములు వేదములను వివ రించెను. గృహ్య సూత్రములలో ఆర్యుల నిత్యజీవనము శాసింప బడెను. ధర్మసూత్రములలో ఆచారము, వ్యవహారము, ప్రాయశ్చిత్తము (శిక్ష) నిరూపిత మయ్యెను. ధర్మసూత్రములే కాక ధర్మశాస్త్రములు కూడ తరువాత శ్లోక రూపముగా రచింపబడెను. ఒక్కొక్క కాల ములో ఈ విశాల దేశమందలి ఒక్కొక్క భాగములో ఆచారముల మార్పులను, వైవిధ్యములను, గమనించుతూ కాలానుసరణముగా రాజులు శాసించుటకై ధర్మ శాస్త్రములు బయలుదేరెను. వీటిలో ముఖ్యమైనవి ౧౮. అవేవనగా :—

శ్లో॥ మన్వత్రి విష్ణుహారీత యాజ్ఞవల్క్యో[illegible]ఙ్గిరాః
యమాపస్తంబ సంవర్త కాత్యాయన బృహస్పతిః
పరాశర వ్యాస శంఖ లిఖిత దత్త గౌతమః
శాతాతప వశిష్ఠాశ్చ ధర్మశాస్త్ర ప్రయోజకాః.

రాను రాను మనుస్మృతి యాజ్ఞవల్క్య స్మృతులుమాత్రమే ప్రాముఖ్యమందినవి.

వేదముల ననుసరించి వేదాంగములను షట్శాస్త్రము లేర్పడెను. అవేవనగా:—

శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము శిక్ష వేదముల స్వరూపములను తెలుపును. వ్యాకరణము ఏది సుశబ్దమో తెలుపును. ఛందము గాయత్రి మొదలగు ఛందస్సులను తెలుపును. నిరుక్తము వేదములలోని పదముల కర్థము నిరూపించును. జ్యోతిషము వైదిక కర్మలకు సంబంధించిన కాలజ్ఞానమును వివరించును. కల్పము యజ్ఞ కర్మల ననుష్ఠించు విధానమును విశదపరచును. ఇదే విధముగా క్రమక్రమముగా, వేదాంతము, తర్కము, న్యాయము, పూర్వ మీమాంస, ఉత్తర మీమాంసలు, అద్భుతముగా ప్రకాశమాన మయ్యెను.

ఉపనిషత్తులలోని ఉత్తమవిషయాలను అన్నింటిని సమన్వయించి, సంగ్రహించి, భగవద్గీతారూపమున శ్రీకృష్ణుడు వెలయించెను. అట్టి భగవద్గీతపై శ్రీశంకరాచార్యులు, శ్రీరామానుజాచార్యులు, శ్రీమధ్వాచార్యులు, మరికొందరు భాష్యములు వ్రాసిరి. పై ఆచార్యత్రయము వారి బోధల ననుసరించి హిందువులలో మూడు శాఖ లేర్పడెను. శంకరుని అనుయాయులు స్మార్తులు, రామానుజుని అనుయాయులు వైష్ణవులు, మధ్వాచార్యుని అనుయాయులు మాధ్వులు.

ఇంచుమించు ౨౫౦౦ ఏండ్ల క్రిందట పురాణాల రచన ప్రారంభ మయ్యెను. వేదాలలో, బ్రాహ్మణములలో, ఉపనిషత్తులలో, ఉన్న మూల కథలను పెంచి పురాణాలలో వ్రాసిరి. పూర్వకాలమందును తమకాలమందును తమకు తెలియవచ్చిన భూగోళమును, ప్రాచీన స్వదేశ విదేశ రాజుల చరిత్రలను వ్రాసిరి. అందే నీతి కథలను,

సాంప్రదాయికముల కనుకూలమగు కథలను రచించిరి. పురాణాలు పెరుగుచు పెరుగుచు ౧౮ మహాపురాణాలుగాను, ౧౮ ఉప పురాణాలుగాను ఇతర చిల్లర పురాణాలుగాను పెరిగిపోయెను. ఇంచుమించు అన్ని పురాణాలకు కర్తగా వ్యాసుని ఏర్పాటు చేసిరి. కాలాలు మారుతూ రాగా పురాణాలును మారుతూ పెరుగుతూ వచ్చెను. క్రీస్తుశకము ౧౧ వ శతాబ్దముదాక కూడ కొన్ని పురాణాలు పెరిగినట్లు పరిశోధకులు నిరూపించినారు. జనసామాన్యముపై పురాణాలే చాలా గొప్ప ప్రభావము కలవయ్యెను. ఎన్ని పురాణాలు వ్రాసినను జనులలో రామాయణము, మహాభారతము, మహాభాగవతము మాత్రనే నిలిచిపోయినవి. ౧౮ మహాపురాణా లేవనగా :—

శ్లో॥ బ్రాహ్మ్యం, పాద్మం, వైష్ణవంచ, శైవం, లైంగంచ, గారుడం,
నారదీయం, భాగవత, మాగ్నేయం, స్కాందసంజ్ఞికం,
భవిష్యం; బ్రహ్మవైవర్తం, మార్కండేయంచ, వామనం
వారాహం. మాత్స్య కౌర్మాణి, బ్రహ్మాండాఖ్య, మితి త్రిషట్.

ఉపపురాణా లేవనగా :—

ఉశన, కపిలి, కాళి, సనత్కుమార. శంఖు,
సౌర, దౌర్వాస, నందీయు, నారసింహ. నారదీయ,
పారాశర, ఆంగీరస, భృగు, మారీచ, మానవ,
వాసిష్ఠ, లింగ, వారుణ పురాణములు.

రామాయణము, భారతము, హరివంశము ఇతిహాసములుగా ప్రసిద్ధికెక్కెను. హిందువులకు ప్రమాణమైన పై వేద, శాస్త్ర, పురాణోపనిషత్తులన్నియు సంస్కృత భాషలో రచింపబడెను. ప్రపంచ భాషలలో ప్రాచీనతమమైనది సంస్కృత ( వేద ) భాష. ప్రపంచములోని ఆది గ్రంథము ఋగ్వేదము.

ఋగ్వేదకాలానంతరము నాలుగు వర్ణములు హిందువులలో నేర్పడెను. ఆదిలో నాల్గింటిలో పరస్పర బాంధవ్యములుండెను. కాని బుద్ధునికాలమునాటికి వర్ణములకు జాతి ప్రాధాన్యముకలిగి ఎచ్చు తచ్చుల భావాలు ముదిరెను. ఆ ఎచ్చు తచ్చులనుండి అనులోమ ప్రతిలోమ జాతు లేర్పడెను. అంటరానివా రేర్పడిరి. ఈ విధముగా హిందువుల ఆదికాలపు ఉన్నత భావాలలో లోపములు కలుగగా ప్రతికాలమందును కొందరు మహాత్ములు బయలుదేరి సంస్కరింప జూచిరి. కాని వారి సంస్కరణము లన్నియు క్రొత్త మతములను, క్రొత్త కులాలను సృష్టించిన వయ్యెను. వీరశైవులు, వీరవైష్ణవులు, భిన్న భిన్న మతాలను స్థిర పరచిరి. హిందువుల ప్రత్యేకత బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణాలలోను, బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్యాసములను ఆశ్రమ ములలోను నిలిచిపోయెను. వేదకాలములో ఉపనిషత్కాలములోను విగ్ర హారాధనము లేకుండెను. కాని క్రమక్రమముగా హిందువులందరును మూర్తిపూజకులైరి. విగ్రహారాధనము ముదిరినకొలది దేవతల సంఖ్య కూడా పెరుగుతూ వచ్చెను. తుదకు బాగా పరిశీలించుకొన్నట్లైతే మనము వైదిక దేవతలను—ఇంద్రావరుణ, ద్యావాపృథివి, మరున్నా సత్య, సోమాగ్ని, వాయుబ్రహ్మణస్పత్యాది దేవతలను తొలగించి వారి స్థానములలో పౌరాణిక దేవతలను నెలకొల్పినవార మని స్పష్టమగును. బ్రహ్మ విష్ణు మహేశ్వరులను త్రిమూర్తులును, వారి భార్యలగు సరస్వతి, లక్ష్మి, పార్వతులును, వారి కుమారులును, వారి రూపాంతరులును, శక్తులును, మన యిప్పటి ఆరాధ్య దేవతలు. ప్రతి కార్యమునకు ముందు గణపతి పూజ సేయుట ౨౦౦౦ ఏండ్లనుండి ప్రబలినది.

అయితే దేవుడు నిరాకారుడనియు, ఆదిమధ్యాంతరహితుడనియు, సర్వవ్యాపి యనియు, అండపిండబ్రహ్మాండనాయకు డనియు, హిందువు లలో విద్వాంసులకే కాక బిచ్చగాండ్రకును, చదువురాని కడజాతివారి కిని, పిల్లలకును, పెద్దలకును, మూర్ఖులకును, అందరికిని తెలియును. మూర్తి పూజ నిమిత్త మాత్రమే అని వారందురు.

హిందూ మతమును సంస్కరింప బూనిన మతాలలో బౌద్ధము, జైనము చేరినవి. వాటినిగురించి ప్రత్యేకముగా వ్రాయబడును. తర్వాత సంస్కరింప బూనినవారు శైవవైష్ణవ భక్తులు, ఆచార్యులు. నూరేండ్ల క్రిందట బ్రహ్మసమాజమును రాజారామమోహనరాయలు స్థాపించిరి. కాని దానికి జనులలో అవలంబనము లేకపోయెను. అదేకాలములో శ్రీమద్దయానందమహర్షులు ఆర్యసమాజమును స్థాపించిరి. అది హిందువులలో గొప్ప సంచలనమును, సంస్కారమును, మహత్తర శక్తిని కలిగించి దినదిన ప్రవర్ధమానమగుచు వచ్చినది. దాని విశిష్టత యేమనగా, విగ్రహారాధన నిషేధము, కులముల నిర్మూలనము, వేద ప్రాముఖ్యము, పరమతస్థులను శుద్ధిచేసి హిందువులనుగా చేయుడము మొదలైనవి.

హిందూమతమునకు చాలా దగ్గరి పోలికయు సంబంధమును కలిగిన ప్రాచీన మతము జరథుస్త్ర్య మతము. దానిని గురించి యిక తెలుసుకొందము.

## ౨. జరథుస్త్ర్య మతము

లోకములో రెండే వస్తువు లున్నవి. మంచివి, చెడ్డవి. మంచి దేవుడు. చెడ్డ దేవుడు. సృష్టిలోని మంచివన్నియు మంచిదేవుని సృష్టి. చెడ్డవన్నియు చెడ్డదేవుని సృష్టి. ఉభయ దేవతలకును యజ్ఞాలు చేయవలెను. మంచిదేవుడు మనకు మంచి నిచ్చుటకు, చెడ్డదేవుడు మనకు చెడ్డను రానీయకుండుటకు పూజ్యులగుదురు. మంచిదేవునిది వెలుతురు. చెడ్డదేవునిది చీకటి. మంచిదేవుడే ఆహురమజద్. చెడ్డ దేవుడే అహ్రిమాన్. మన జీవితములోని చర్యలను పరలోకములో వ్రాసియుంతురు. ఆత్మకు దాన్నిబట్టి ముక్తియో నరకమో దొరకును.

జరథుష్ట్రుడు ఈ మతస్థాపకుడు. ఇప్పటి ఈరాన్ దేశములో అతడు క్రీ. పూ. ౨౬౦౦ ప్రాంతములం దవతరించెను. జరత్—ప్రకాశించుచున్న ఉష్ట్ర—అగ్ని అని యర్థ మందురు. జమదగ్ని అనిన అదే

అధ్రమనియు జమదగ్నియే అతడై యుండుననియు కొందరందురు. నైవ స్వతవంశములో ఒక శాఖనుండి శ్రీరామచంద్రుడు వచ్చెననియు ఇంకొక శాఖలో పురుషాశ్వుడు జన్మించెననియు అందురు. జరథుష్ట్రుని తండ్రి పురుషాశ్వుడు. తల్లి దుగ్ధ్వ (పాలవంటి పవిత్ర). అతడు ఈరాన్ లోని ప్రాచీన ఆర్యాణమండలములో రాజిలేకరాయి అను గ్రామ మందుజన్మించెను. అది ఈరాన్ కుముఖ్యపట్టణముగ తహరానుకుమూడు మైళ్ళదూరమున నున్నది. జరథుష్ట్రుని జరథుస్త్ర అనియు అందురు. అతనిశతనామావళిలో "మిత్ర" అనునదొకపేరు. జరథుస్త్ర మతానికి ముఖ్య గ్రంథము "గాథా" అనునది. అందు ముప్పాతికపదాలు వైదిక సంస్కృతపదాలు. వారి మరొక పవిత్రగ్రంథము జండవెస్తా. జండ్ అను నది ఛంద అనుపదమే. అవెస్తా అనునది ఉపస్థా అనునదే కాన అది సంస్కృతములో ఛందోపస్థా అగును.

ఈ మతమువారికి అగ్నిపూజ ప్రధానము వైదికార్యులకును అగ్నియే ముఖ్యాతిముఖ్యము.

"అగ్నిమీళే పురోహితం"

అన్నది ఋగ్వేదములోని మొట్టమొదటివాక్యము. ఈ మతాను యాయులను పార్సీలందురు. వీరిలో కొందరు ఇస్లాముదెబ్బకు తాళలేక హిందూస్థానములోనికి వచ్చి ఉండిపోయిరి. అట్టి వీరిసంఖ్య ఒక లక్ష మాత్రమే. పూర్వము అథర్వవేద మేర్పడినకాలములో ఆర్యులలో రెండుశాఖలయ్యెను. ఒకటి ఈరానులో ఉండిపోయెను. రెండవది సింధు నదీ తీరాలలో చేరెను. ఈ రెండు శాఖలు కలిసిన కాలములో అసుర దేవ పూజలుండెను, వేరైనతర్వాత ఈరాన్ లోని ఆర్యసోదరులు జర థుస్త్రుని అనుసరించి అసురపూజకులైరి. అసురశబ్దము పార్సీలో అహుర అయ్యెను. అహురమజధా అనునతడే పార్సీల దేవుడు. అనగా మన ఋగ్వేదములోని అసురమేధా అనుపదమే అక్కడ అహురమజధా అయ్యెను. అథర్వవేదమును భృంగ్వాంగిరససంహిత యందురు. అందు భృగుసంహిత ఖిలమైనది (పోయినది) అని

హిందువులనిరి. అదే జరథుస్త్రునిచే ఈరానులో ప్రచారమయ్యెను. ఆర్యుల చాలా ఆచారాలు జరథుస్త్ర్యమతములో కలవు. మన సోమమే వారి హోమము అయ్యెను (సంస్కృత సకారము ఫార్సీలో హకారము గామారును. సింధు=హిందు, సోమ=హోమ, సప్త=హప్త, అసుర=అహుర.) మన యజ్ఞము వారిలో యశ్న అయ్యెను. మన పౌరాణికులు 33 దేవతలను విశ్వసించిరి. వారికిని 33 దేవతలు కలరు. మన యజ్ఞోపవీతము వారి నవజోతి అయ్యెను (నౌజోతి = నవజ్యోతి) అది మన ఉపనయనమువలె ఫార్సీలలో స్త్రీపురుషులకు ౮ వ సంవత్సరమున నడుమునకు మూడుదారాలు పేని కట్టుదురు. మనకు దేవ అనగా ఉత్తమ దేవత అయితే వారిలో దేవ అనగా దయ్యము. మనకు అసురుడు చెడ్డవాడైతే వారికి మంచివాడయ్యెను. మనము జీవికి పరమావధి అమరత్వము అని నమ్మినట్లే వారును "అమెరతత్" అను సిద్ధిని ఉత్తమజీవి పొందునన్నారు. మనద్వైతులవలె వారును జీవి దేవునితో ఐక్యమొందదందురు. జీవి దేవునిసేవలో ఉండును అని విశ్వసింతురు. సుఖదుఃఖములు, శీతోష్ణములు, చీకటి వెలుతురులు మున్నగు ద్వంద్వము లున్నవని వారి విశ్వాసము. మంచి చెడ్డలలో మంచి నెప్పుడును ఆశ్రయించి ఆచరించవలెననియు చెడ్డను ప్రతిఘటించవలెననియు జరథుస్త్ర్యుడు బోధించెను. అహురమజధాకు అమేషస్పెంట అను ఆర్గురు దేవతలు అధీనులై ప్రపంచమందలి వివిధ చేతనాచేతన వర్గాలను పాలింతురని వారందురు.

జరథుస్త్ర్యుడు విగ్రహారాధనను ఖండించెను.

ఈ మతమునుండియే యహూదీ ఇస్లాములు కొన్ని విషయాలను గ్రహించెను. హిందువుల వైదికభాషకు భావములకు అత్యంతసన్నిహితమైనది గాథాగ్రంథము. జరథుస్త్ర్య మతమును బాగాపరిశీలించిన హిందువుల బహుపురాణగాథలు చారిత్రికములుగా వెల్లడియగును.

## 3 కబూాది మతము

ఈ మతాన్ని ఇంగ్లీషులో జూడైజం (Judaism) అందురు. యహూదీలను జ్యూ జాతివారని అందురు. మరియుహీబ్రూలు అనియు నందురు. వారిభాషను హీబ్రూభాషయనిరి. హీబ్రూలే మన హిందువులు పేర్కొన్న అనార్యజాతివారగు శబరులు అనువారని యతీంద్రమోహన్ ఛటర్జీ గారనియున్నారు. (గంజాములోని సవరలు వేరు). మన సకారము ఫార్సీలో హకారమగును. శబరపదముహబర యగును. అదే అరబ్ హీబ్రూపదాలైనవి. హీబ్రూమతము క్రీ. పూ. ౧౫౦౦ ప్రాంతమందు ఏషియామైనరులో అందు ముఖ్యముగా పాలస్తీనులో వ్యాప్తిలో నుండెను. కాని దీనికి సంబంధించిన మతపురాణసంకలనము క్రీ. పూ. అయిదవ శతాబ్దములో జరిగెను.

హీబ్రూల పురాణ మిట్లుచెప్పుచున్నది. ఆదిలో ఆదం (ఆదిమ) ఈవ్ అను దంపతులను దేవుడు సృష్టించెను. వారు పతితులై భూలోకమున కంపబడిరి. ౯౩౦ ఏండ్లు జీవించి ఆదం చనిపోయెను. అతని సంతతిలో అబ్రహాం పుట్టెను.అతనికి దేవుడు వరములు ఇస్తూ ఉండెను. అతని వంశమువారు పలువురు ఈజిప్టులో నివసిస్తూ బానిసలై బాధపడుచుండిరి. అట్టి బానిసలలో క్రీ. పూ. ౧౫౦౦ లో మోసెస్ (హజరత్ మూసా) అను ప్రవక్త పుట్టెను. అతడు బాధితులైన హీబ్రూల నందరినీ ఈజిప్టు దేశమునుండి తీసుకొని పాలస్తీను దిక్కు వెళ్ళిపోయెను. ఈ జిప్టువారు వారిని చాలాబాధపెట్టినను దేవుడిచ్చిన మంత్రశక్తిచే మోసెస్ వారిని కాపాడెనట. దేవుడు ఒకనాడు మోసెసుకు కనబడితాను సినై గుట్టమీద హీబ్రూలకు దశనిబంధనలను (Ten Commandments) ప్రసాదింతు నని చెప్పెను. ఆ నిబంధనలను దేవుడే స్వయముగా హీబ్రూల కిట్లు వినిపించెను.

౧. నేను మీ దేవుడను మీరు వేరు దేవతలనుగాని విగ్రహాలనుగాని పూజించరాదు.

౨. దేవుని పేర ప్రమాణాలు చేయరాదు.

౩. ప్రతి ఆదివారమును పవిత్ర దినముగా భావించవలెను.

౪. మాతాపితరుల గౌరవింపుడు. ఇది మీకు దీర్ఘాయువు నిచ్చును.

౫. ప్రాణులను చంపవద్దు.
౬. వ్యభిచారము చేయవద్దు.
౭. దొంగతనము చేయవద్దు.
౮. తప్పుడు సాక్ష్య మియ్యవద్దు.
౯. పొరుగింటివాని (ఇతరుల) భార్యను కామించవద్దు.
౧౦. పొరుగింటి వాని ధనము నాశించవద్దు.

తర్వాత దేవుడు మోసెస్‌కు ప్రత్యేకముగా మరికొన్ని ధర్మ శాసనా లందించెనట. ఈ ౧౦ నిబంధనలు హీబ్రూమతానికి పునాదులు. తర్వాతమోసెస్ ఆ పర్వతాన్ని ఎక్కి అచ్చట ౪౦ దినాలుండి ప్రతిదినం దేవునితోనే స భాషిస్తూ ఉండెనట.(ఈ౪౦ దినాలసంఘటనను తర్వాతి ప్రవక్తలుకూడా తమసేవలోనికి తీసుకొన్నారు. పైగంబర్ మహమ్మద్ కూడా ఒక గుహాలో ఏకాంతముగా ౪౦ దినాలుండెనట అప్పుడే అల్లా అతనికి ఖురానుబోధలు ప్రసాదించెనట. ఏసుక్రీస్తు గూడా ౪౦ దినాలు ఒక ఎడారిలో ఉపవాసముండి దేవుని సాక్షాత్కార మొందెనట. ౪౦ దినాల కథ మోసెస్‌తో మొదలయ్యెను.)

మోసెస్ గట్టునుండి దేవుడే స్వయముగా వ్రాసియిచ్చిన రాతి శాసనములతో దిగివచ్చి, తనఅనుయాయులతో విగ్రహారాధకులను కత్తితో నరికి చంపుడని శాసించెను. ఒకే దినమున వారు ౨౩౦౦౦

విగ్రహారాధకులను చంపివేసిరి. తర్వాత ముస్లిములు పలువురు ఈవిధానాన్ని అవలంబించినట్లు చరిత్ర చెప్పుచున్నది. మోసెస్ ౧౨౦ ఏండ్లు జీవించి చనిపోయెను.

మోసెస్ తర్వాత హీబ్రూమతానికి ముఖ్యుడు డేవిడ్. అతడు క్రీ. పూ. ౧౦౫౫ లో నుండెను. అతనితర్వాత సాలమన్ (సులేమాన్) వారి రాజయ్యెను. అటుతర్వాత హీబ్రూమతము క్షీణిస్తూవచ్చెను.

హీబ్రూమతములో మొదట నరబలు లుండెను. తర్వాత పశుబలు లుండెను. వారి దేవుడు మానవులవలె శాపానుగ్రహాలు అపారముగా కలవాడు. కోపమువస్తే కష్టపెట్టేవాడు. అతన్ని ప్రార్థేయపడితే రక్షించేవాడు. అతనికి హీబ్రూలపైననే పక్షపాత ముండినట్లు వ్రాసుకొన్నారు. ఈ యహూదీలలోననే తర్వాత ఏసుక్రీస్తు జన్మించి ఆ మతాన్ని సంస్కరించి క్రైస్తవమతాన్నిస్థాపించెను.అందుపై యహూదీలు అతనిపై నేరాలుమోపి చంపించిరి. ఆ కారణముచేత క్రైస్తవులు యహూదీలను నేటివరకు ద్వేషిస్తున్నారు. యహూదీల మతగ్రంథమును ప్రాతనిబంధన ( Old Testament ) అనీ టాల్మడ్ అనీ అందురు. వారిలో ఖత్నా ( Circumcission సున్నత్ ) కలదు. వారు పందులను తినరు.

---

## ౪ జైన మ త ము

యహూదీ మతము తర్వాత ప్రాచీనమైనది జైనమతము. జైనులు హిందువులలోనుండి వేరుపడినవారు. హిందూసిద్ధాంతాలలో వేదప్రామాణ్యమును వీరంగీకరించలేదు. అందుచేత హిందువులు జైనులనునాస్తికులనిరి. ప్రపంచ నిర్మాతయగు పరమాత్మ కలడని వారొప్పుకొనరు. కాని జీవాత్మ కలదందురు. దానికి ముక్తి కలదందురు. ముక్తులైన జీవాత్మలను

వారు అర్హానులనియు జినులనియు అందురు. అట్టి జినులు ౨౪గురు కలరని వారినమ్మకము. వారిలో పార్శ్వనాథుడు ఉత్తమోత్తముడు. పదార్థములు ఏడు అని వారందురు. అవేవనగా:—

౧. జీవము:—ఇందు మూడు తరగతులున్నవి.
   (అ) నిత్యసిద్ధములు. ఉదాహరణము: అర్హానులు, జినులు.
   (ఇ) ముక్తులు: జినుల ఆదేశాలను తప్పకుండా ఆచరించినవారు.
   (ఉ) బద్ధులు: కర్మబద్ధులైన ఆత్మలు.

౨. అజీవము:—పృథివ్యప్తేజోవాయువులు. (ఆకాశమును వారొప్పుకొనరు)

౩. అశ్రవ:—కర్మలు.

౪. సంవర:—ఇంద్రియ నిగ్రహము.

౫. నిర్జర:—ఉపవాసము, కేశలుంచనము, మౌనము మొదలగు తపస్సులద్వారా పూర్వజన్మసంచిత పాపాలను తొలగించుకొనుట.

౬. బంధము:—ఆత్మను బంధించునది జననమరణాలకు కారణము.

౭. మోక్షము:—పూర్ణ జ్ఞానమువల్ల ఆత్మకు ముక్తి. జినదత్తసూరి జైనధర్మాల నిట్లు సంగ్రహించి తెలిపినాడు.

"వీర్యము, కామము, మోహము, నిద్ర, భయము, అజ్ఞానము, లౌల్యము, హాసము, అపేక్ష, అసహ్యము, ప్రేమ, అసహనము, ఇచ్ఛ, దుఃఖము, మోసము మున్నగునవి ౧౮ దుష్ట వ్యసనాలు. దివ్యజినుడు మా గురువు. అతడు నిజమైన తత్త్వాలను బోధించినాడు. వైదిక యజ్ఞయాగాదులలోని పశుహింసను జైనులు నిరాకరించిరి.అహింసయే వారి ప్రధాన ధర్మము. వాయువుద్వారా ముక్కులో సూక్ష్మజీవులు ప్రవే

శించి చచ్చునని ముక్కురంధ్రాల కడ్డముగా బట్టను కట్టుకొనిరి. గోరి గిన పేలు చచ్చునని వెంట్రుకలు పీకించుకొనిరి. బట్టలుకట్టిన అందులో క్రిములు నలిగిచచ్చునని బత్తలతిరిగిరి. అందుచేత వారినిది గంబరులనిరి. కొంతకాలానికి జైనులలో పలువురు తెల్లనిబట్టను కట్టిరి. వారిని శ్వేతాం బరులనిరి. వారిలో కులభేదాలు లేవు. వారు చేతులలోనే అన్నము తినిరి.వారు పూజించు ౨౪ జైనతీర్థంకరు లెవ్వరనగా:—

| | | | |
|---|---|---|---|
| ౧. ఋషభదేవ, | ౭. సుపార్శ్వ | ౧౩. విమల | ౧౯. మల్లి |
| ౨. అజిత | ౮. చంద్రప్రభ | ౧౪. అనంత | ౨౦. మణిసువ్రత |
| ౩. సంభవ | ౯. పుష్పదంత | ౧౫. ధర్మ | ౨౧. నిమి |
| ౪. అభినందన | ౧౦. శీతల | ౧౬. శాంతి | ౨౨. అరిష్టనిమి |
| ౫. సుమతి | ౧౧. శ్రేయాంస | ౧౭. కంతు | ౨౩. పార్శ్వనాథ |
| ౬. పద్మప్రభ | ౧౨. వసుపూజ్య | ౧౮. అర | ౨౪. వైధమన. |

అనువారు. వైధమన తీర్థంకరుని మహావీర యనియు నందురు.

జైనమత స్థాపకులలో పార్శ్వనాథుడే ముఖ్యుడందురు. తుదిజిను డగు మహావీరుడును చాలాముఖ్యుడు. జైనమతము బౌద్ధమతము కంటే కొంత పూర్వమైనది. మహావీరుడు క్రీ. పూ. ౪౭౮ లో చనిపోయెను. మహావీరుని వర్ధమానుడనియు సందురు. అతడు రచించిన ఉత్తరాధ్య యనుసూత్రము మన భగవద్గీతవంటి ముఖ్య జైనతత్వ గ్రంథము.

———

## ౫ బౌద్ధమతము

గౌతమబుద్ధుడు బోధించిన మతము బౌద్ధమతము క్రీస్తునకు పూర్వము ౫౦౦ ప్రాంతములో అది స్థాపితమయ్యెను. బుద్ధుడు హిందువుగా ఉండి వేదములను అంగీకరించక జైనమతమువలె అహింసకే ప్రాధాన్యమిచ్చి చాతుర్వర్ణ్యమును నిరాకరించి నూతన మతమును స్థాపించెను. దేవుడున్నాడో లేదో అది నిర్ణయములేదు అనెను. ఈజన్మములో మనకు అన్నియు దుఃఖాలే కలవు.వాటిని తొలగించుకొనుటకై పాటుపడవలెననెను. జైనులవలె నాలుగే భూతములనెను.జీవాత్మకలదనెను చిత్తమేఆత్మ.చిత్తము అయిదు స్కంధాలుగా కలదు.రూపస్కంధము, విజ్ఞానస్కంధము, వేదనస్కంధము, సంజనస్కంధము, సర్కాస్కంధము అని అయిదు విధాలు. బౌద్ధులు కర్మసిద్ధాంతము నొప్పుకొందురు. పునర్జన్మ నొప్పుకొందురు. అన్నిటికి మూలముఅజ్ఞానము దానినుండి కర్మపుట్టును. కర్మనుండి స్మృతి, దానినుండి పంచేంద్రియములు, వాటినుండి కాంక్ష ఆసక్తి, వాటినుండి పునర్జన్మ, దానినుండి మృతి కలుగును. ఇవి ౧౨ నిదానములని బౌద్ధులందురు. ఈ జన్మలోని దుఃఖములనుండి విముక్తి పొంది పునర్జన్మ లేకుండా చేయుటకు కర్మను నిర్మూలించవలెను. కర్మపోయిన అజ్ఞానముపోవును. అప్పుడు ప్రాణికి నిర్వాణమబ్బును. అతడు అర్హనుడగును. నిర్వాణములో దుఃఖములేదు పునర్జన్మలేదు అదిసచ్చిదానందస్థితి. ఇది బౌద్ధధర్మ సారము.

బౌద్ధులకు ప్రమాణగ్రంథాలు త్రిపిటకములు. అందు సూత్రపిటకము అనగా బుద్ధుని బోధలుకలది. వినయపిటకము అనగా శిక్షణవిధానము. అభిధర్మపిటకము అనగా తత్వము చేరినది. బుద్ధుని ధమ్మపదము ముఖ్యనీతిగ్రంథము. బౌద్ధ జాతకములు అనుబుద్ధుని పూర్వజన్మకథలు, నీతిబోధకములైనవి. బుద్ధుడు ఉచ్చనీచతలను, కులభేదాలను ధ్వంసముచేసెను. అందరును సమానులే అని బోధించెను. బౌద్ధధర్మ గ్రంథాలు విశేషముగా పాలీభాషలో వ్రాయబడినవి.

దృశ్యమాన ప్రపంచమంతయు నశించును. దానిపై వ్యామోహ ముంచరాదు. అదంతా మాయ. మాయను జయించవలెను ప్రాణి కర్మ వశమున మాటిమాటికి జన్మించును. కామాదులను జయించి ఇచ్ఛల నంతయు ఛేదించిననాడు ఆత్మ నిర్వాణసిద్ధిని పొందును. సర్వప్రాణుల ప్రేమించవలెను. ఇవి బౌద్ధమతములోని ముఖ్యనియమములు.

గౌతమబుద్ధుడు క్రీ. పూ. ౪౮౦ లో చనిపోయెను.

---

## ౬. కన్ఫ్యూషస్ మతము

ఇది చీనాదేశములో వ్యాపించినట్టిది. చీనాలోని షాంటంగ్ మండలములో లూ అను పట్టణములో క్రీ. పూ. ౫౫౧ లో అతడు జన్మించెను. క్రీ. పూ. ౪౭౮ లో మరణించెను. అతడు చాలా గొప్ప నీతులను బోధించెను. భక్తి, ప్రేమ, మర్యాద, మతము, పవిత్రత, అహింస, ఆత్మోపమ్య చర్యలు, ఇవి వారు బోధించిన నీతులు. జీవాత్మ లెచ్చటి నుండి వచ్చి ఎచ్చటికి వెళ్ళును అనే ప్రశ్న పొద్దుపోనివారి పని అనిరి. మన జీవితములను ఉత్తమ నీతితో సాగించుటయే మనపని అనిరి. ౨౨ ఏండ్ల వయస్సులో అతడు ఉపాధ్యాయ వృత్తి నవలంబించి తన బోధలను మొదలుపెట్టెను. అతడు గొప్ప సంగీత విద్వాంసుడు, దాని ఆనందములో భోజనముకూడా మరిచి పొయ్యేవాడు. తన రాజు ఓడి ప్రక్క రాజ్యమునకు వెళ్లెను. తానున్నూ వెళ్ళెను. దారిలో తాయిఅను పర్వతములో ఒక స్త్రీ విలపిస్తుండెను. కారణ మడుగగా తన భర్తను అతని తండ్రిని, కుమారుని ఒక పెద్దపులి చంపెనని అందుచే వారి గోరీలపై దుఃఖిస్తున్నానని చెప్పెను. అట్లయితే ఈ దేశం వదలరా అని లూ అడుగగా ఇచ్చటి ప్రభుత్వములో దౌర్జన్యం లేదనెను. వెంటనే శిష్యుల

కన్ఫ్యూషస్ ఇట్లనెను, "చూచినావా! దుష్టపరిపాలనమును ప్రజలు పెద్దపులి హింసకంటె ఘోరముగా భావింతురు". అతడు కొంతకాలము ఋామండలాన్ని పాలించెను. ప్రజలంతా సుఖించిరి. కాని వారి సేనల సందు రాజులు కానరైరి. అతని అనుయాయులు చీనాదేశమంతటా ఉన్నారు.

కన్ఫ్యూషస్ బోధలలోని నీతు లీవిధముగా నుండెడివి.

" జాగ్రత్త కలవా రెన్నడునూ తప్పుచేయరు "
" పరుల కుపకార మొనరించుము"

మరణాంతర విషయాలనుగురించి అతనిని విచారించగా అతడిట్లను చుండెను, " ఓయీ! మన జీవితములోని సంగతులే మనకు తెలియవు. జీవితాంతర విషయాలెట్లు తెలియ రాగలవు? "

కన్ఫ్యూషస్ తన శిష్యులకు బోధచేయు నప్పుడొక విషయము లోని నాలుగంశములలో ఒక యంశమును బోధించి మిగిలిన మూడంశ ములు అవగాహనమయ్యెనా అని విచారించుచుండెను. అవగాహనము చేసుకొన్నవారు మాత్రమే అతనివద్ద నుండెడివారు. తక్కిన వారికి సెల విచ్చి పంపివేయుచుండెను.

---

## ౭ లోట్జీ మతము

చీనాదేశములో కన్ఫ్యూషస్ కాలమందే లోట్జీ అను మహాను భావు డుండెను. దేవునిభక్తియే ముక్తికి ఏకైక సాధనము అని అతని మతము. కన్ఫ్యూషస్ దేవుడోగీవుడో అదంతా మన కెందుకు మాన

వులు నీతిపరులై జీవించితే అదే ముక్తి అనెను. చీనాలో లోట్జీ బోధించిన మతమును "టావో" (Tao) మతమని యందురు. టావో అనగా పంథ—మార్గము. లోట్జీ గుడిసెలో పుట్టిపెరిగిన దరిద్రుడు. తన విద్యాప్రజ్ఞాబలముచే చక్రవర్తి యొక్క గ్రంథాలయమునకు పాలకుడయ్యెను. అచ్చటి గ్రంథాల నన్నిటిని చదివి వాటిసారమును గ్రహించెను. విధేయత అణకువయే ప్రాణి కవసరమని తలచి రాజ ప్రాసాదము తగనితావని అడవి బాటపట్టెను. నగరమును వదలి అరణ్యాభిముఖుడై వెళ్లుట కుపక్రమింపగా ఒక వృద్ధుడెదురై "మహాత్మా! నాకొక గ్రంథమును వ్రాసి యిచ్చి పొండి" అని వేడెను. అతడట్లే వ్రాసియిచ్చెను. ఆ గ్రంథమే టావో మత బోధయయ్యెను. అందలికొన్ని నీతులిట్లున్నవి:—మనము పిల్లలవలె నిష్కల్మష మానసులమై యుండవలెను. నిష్కామకర్మయే మోక్షప్రదము. స్వార్థముచే చేయుపనులు వ్యర్థములు. అపకారికి నుపకారము చేయవలెను. అందరినీ సమానముగా చూడవలెను. యుద్ధాలు నిషిద్ధములు.

—

## ౮ క్రైస్తవ మతము

జీసస్—లేక యేసు అను ప్రవక్త పాలస్తీనాలోని గాలిలీ అను పట్టణములో చేరిన నాజెరత్ అను ఊరిలో క్రీస్తు శకానికి ఇంచుమించు పదియిరువై యేండ్లకుముందు జన్మించెను. అతని తండ్రిపేరు జోసెఫ్. తల్లిపేరు మేరీ. తండ్రి వడ్లవాడు. జీసెస్ ప్రవక్త అయినతర్వాత అతడు వడ్లవాని కొడుకంటే దర్జాగా ఉండదని భక్తులు అతన్ని మేరీ కన్యకు దేవునివల్లనే పుట్టెనని వ్రాసివేసిరి. అతడు జ్యూయహూదీ జాతివాడు. అతని మాతృభాష హీబ్రూ. అతడు నిత్యబ్రహ్మచారి.

జీసెస్ కాలమునకు ౩౦౦ ఏండ్లకు ముందే గ్రీసుదేశమునరకు బౌద్ధభిక్షులు, సన్యాసులు, బౌద్ధమత ప్రచారము చేసియుండిరి. జీసెస్ యహూదీ మతములోనివాడు. కాన ఈ రెండు మతాల భావాలు అతని పై తమప్రభావమును వేసెను. యహూదీలు నరకములో మండు అగ్ను లున్ననియు అందు పాపులుపడి బాధపడుదు రనియు విశ్వసించిరి. నర కాన్ని జెహన్నా అనిరి. అది జెరుసలెంసమీపపుకనుమ. అందు పూర్వము అగ్నిపూజలు జరిగెను. దానినే నరకమనిరి. ముస్లిములు నరకాన్ని జహన్నం అందురు. యహూదీలు దేవుడు ప్యారడైజ్ అను స్వర్గములో ఉండునని విశ్వసించిరి. "పరదేశ" అనుపదమే ప్యారడైజ్ ( paradise ) అయ్యెను. ప్రళయమునాడు దేవుడచ్చట సింహాసనాసీనుడై నరలోక ములోని జనుల పుణ్యపాపాలను విచారించుననిరి. ఆ వేవిశ్వాసాలను క్రీస్తుకూడా అంగీకరించెను.

బౌద్ధుల అహింసను అతడు బాగా బోధించెను. మానవులకు ముఖ్యమైనవి రెండని జీసస్ చెప్పెను. ఒకటి త్రికరణశుద్ధిగా దేవుని ప్రేమించుట రెండవది నీవలెనే నీ పొరుగువారిని ప్రేమించుట. "Do as you would be done by" నీ యెడ యితరు లెట్లాచరింప గోరు దువో నీవును వారియెడ అట్లే ఆచరించుమని బోధించెను. ఇదే భగవద్గీతలో ఇట్లున్నది.

"ఆత్మౌపమ్యేన సర్వత్ర"

"Leave off all thou hast and follow" నీ దంతయు త్యాగము చేసి నావెంటరమ్మని అని బోధించెను. భగవద్గీత యిట్లు బోధించెను.

"సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ"

"Sermon of the moun." పర్వతబోధ అను అతనిబోధ మతా నికి మూలసిద్ధాంతము. అదంతయు బౌద్ధుల అహింసా వాదమున కను కూలమైనట్టిది. పర్వతబోధలోని కొన్ని వాక్యాల నుదహరింతును.

"సాధువులే ధన్యులు—వారు భూమిలో పూజ్యులు.

Blessd are the meek for they shall inherit the earth.

"కరుణామయులే ధన్యులు, వారిపై దేవుడు కరుణించును."

"ధర్మ నిర్వహణములో బాధితులైనవారే ధన్యులు— వారు స్వర్గ మనుభవింతురు."

"నీవు దౌష్ట్యమును ప్రతిఘటింపకుము, నీ కుడిచెంపపై కొట్టిన ఎడమచెంప చూపుము. నీ కోటును తీసుకొన్న అంగినికూడ ఇమ్ము."

"నీ శతృవుల ప్రేమింపుము."

మరొకమారు జూడియాతీరములో జీసెస్ ఇట్లుబోధించెను, "నరహత్యలు చేయవద్దు. దొంగతనము చేయవద్దు. అబద్ధపు సాక్ష్యము చెప్పవద్దు."

ఈ విధముగా జీసెస్ నీతులు బోధించెను. యహూదీలలోని సాంఘిక దురాచారాలను తీవ్రముగా ఖండించెను. యహూదీల శాసనాలు మొరటుగానుండెను. ఒకని కంటి నింకొకడు పొడిచిన పొడిచిన వాని కన్నును తీయించుచుండిరి. అంగనష్టమైతే నిందితుని అంగాన్ని ఛేదించుచుండిరి. తమ దేవుని నమ్మని వారంతా దుష్టులనుచుండిరి. దేవుడున్నా క్షుణచిత్తుడు, క్రూరుడు. అట్టి మతమును సంస్కరించి ప్రేమ ప్రధానమగు మతమును జీసెసు బోధించెను. జీసెస్ విధానము యహూదీలకు భరింపరానిదయ్యెను. వారు తమ దేశమును అప్పుడేలుచుండిన రోము దేశమువారికి జీసెసుపై కొండెములు చెప్పి అతని శూలముపై నెక్కించి ఘోరముగా హింసించి చంపించిరి. అందుచేత జీసెసును క్రీస్తువు అనిరి. ఏసుక్రీస్తు చనిపోతూ ఇట్లు దేవుని ప్రార్థించెను.

"ఓతండ్రీ! ఈ హింసకుల క్షమింపుము. They know not what they do వారేమిచేయుచున్నారో వారికి తెలియదు" ఈ అపూర్వమగు ప్రేమగుణమే తర్వాత క్రైస్తవమత విజృంభణకు కారణమయ్యెను. ఏసుక్రీస్తుపవిత్ర జీవనము, అతని క్షమాగుణము, అతని ప్రేమదయాగుణములు ప్రపంచాన్ని ఆకర్షించెను. ఏసుక్రీస్తు చనిపోయిన నాటినుండి క్రీస్తుశకమేర్పడిన దందురు. అదితప్పు. ఏసుక్రీస్తు క్రీస్తుశకము 33 లో చనిపోయెను. అతని యనంతరము అతనిపన్నిద్దరు శిష్యులు అతని మతప్రచారము చేసిరి. ఇప్పుడు క్రైస్తవ మతము ప్రపంచమంతటా వ్యాపించుచున్నది. ప్రపంచ శక్తులలో ఇదొక మహాశక్తియై యున్నది.

---

## ౯ ఇస్లాం మతము

అరేబియా దేశములో విగ్రహారాధన, మూఢ విశ్వాసాలు, పరస్పర కలహాలు, హత్యలు విశేషముగా ఉండెను. అరబ్బులు చాలా మూర్ఖులుగా మొరటుగా ఉండిరి. అట్టి వారిలో హజరత్ మహమ్మద్ అను పైగంబరు (ప్రవక్త) జన్మించెను. అతడు ఇస్లాం మతమును స్థాపించెను. ఇస్లాం అనగా శాంతి అని యర్థము. దేవునితో శాంతి ప్రపంచముతో శాంతి కోరుట అని భావము. మహమ్మదుగారి బోధలను అరబ్బులు ప్రతిఘటించి అతన్ని చంపబూనిరి. అప్పుడు క్రీ. శ. ౬౨౨ లో పైగంబరుగారు అరబులోని మక్కాను వదలి మదీనాకు వెళ్ళెను. ఆనాటి నుండి ఇస్లాం వ్యాప్తమైనది. ఇస్లాములో యహూదీమత క్రైస్తవ మతములలోని ఉత్తమ బోధలు చేరినవి. ఇస్లాము మోసెస్, అబ్రహాం, యేసుక్రీస్తు మున్నగు యహూదీ క్రైస్తవ గురువులను అంగీకరించును. యహూదీ క్రైస్తవాచారాలను కొన్నింటిని ఇస్లాంస్వీకరించినది.

యహూదీల గడ్డాలను, వారి పందిమాంస విసర్జనమును, వారి ఖత్నాను (సున్నత్) స్వీకరించిరి. క్రైస్తవుల దేవదూతలను (ఫరిస్తాలను) సైతానును (షైతానును) తమ విశ్వాసాలలోనికి తీసుకొనిరి. స్వర్గ నరకాలను విశ్వసించిరి. యహూదీల పురాణములోని కథలను చాలా స్వీకరించిరి. అట్లు స్వీకరించినను ఇస్లాముకు ప్రత్యేక వ్యక్తిత్వమున్నది.

ఇస్లాములో మానవులంతా సమానులు. ఇస్లాములో చేరిన వారంతా సమానులేకాక సోదరతుల్యులు. ఇస్లాముకై ధనత్యాగము చేయుట ధనికులవిధి. ప్రతి ధనికుడు తన ఆదాయములో నూటికి౨పాళ్లు మతకోశానికి (బైతుల్ మాల్)కు ఇయ్యవలెను. ప్రతి సంవత్సరం రంజాన్ నెలలో పగలు ఉపవాసముండి రాత్రులందు మేల్కొని అల్లా స్మరణ చేయవలెను. పైగంబర్ గారికి దేవుడగు అల్లా ఖురాను అను పవిత్ర గ్రంథములోని సూక్తములను ప్రసాదించెననియు, హాజరత్ మహమ్మద్ గారే తుది ప్రవక్త (పైగంబరు) అనియు ముస్లిములు విశ్వసింతురు. ఇస్లాముకు అయిదు విశ్వాసాలు ప్రధానములు:—౧. దేవుడొక్కడే అతనికి రూపములేదు. అతడు కరుణామయుడు, అతనిని విగ్రహరూపముగా పూజింపరాదు. ౨. ఖురానును దేవుడు ప్రసాదించినాడు. 3. ముస్లిములు చనిపోయిన తర్వాత జన్నత్‌కో లేక నరకానికో వారి వారి మంచిచెడ్డల కర్మలనుబట్టి పోదురు. జన్నత్ అను స్వర్గములో పరీలు (అప్సరస్త్రీలు) సకలానందాలు ఉండును. ఒకనాడు ప్రళయమగును. ఆ నాడు దేవుడు పరలోకమందు సింహాసనాసీనుడై గోరీలనుండి మృతుల నందరిని పిలిపించి వారి వారి మంచిచెడ్డ పనుల కనుగుణ్యమగు శిక్షలను విధించును. ౪. నమాజు అయిదుమారులు ప్రతిదినం చేయవలెను. ౫. జకాత్, దానము చేయవలెను.

ఇవికాక చేతనైనవారు మక్కాకు తీర్థయాత్ర చేయవలెను. తమ పెద్దల తల్లిదండ్రుల ఆజ్ఞలను పాలించవలెను. కాని ఖురానువిరుద్ధమగు ఆజ్ఞ లిచ్చిన వారిని కూడా ప్రతిఘటించవలెను. ఇవి ఇస్లాములోని ముఖ్య విషయములు.

ఇస్లామును వ్యాప్తి చేయుట ప్రతి ముసల్మానుని విధి అని తలంతురు. ఇస్లాముకొరకు ప్రాణాలిచ్చినవారు పూజనీయులు (షహీదులు) అగుదురు. పైగంబర్ అనంతరం ఇస్లాంమతగురువులు ఖలీఫాలను వారేర్పడిరి. మొదటి ఖలీఫా అబూబకర్ రెండవవారు హజరత్ ఉమర్, మూడవవారు ఉస్మాన్, నాల్గవవారు మహమ్మద్‌గారి అల్లుడగు అలీ. ఈ నలుగురిని "ఖులఫాయెరాషిదా" అని యందురు.

ఇస్లాములో స్త్రీలకు పురుషులలో సగంఆస్తి దొరకును. స్త్రీలకు పర్దాకలదు. న్యాయము తీర్పుచేయువారు ఖాజీలు. అలీఖలీఫా కాలములో ఇస్లాములో రెండుశాఖలేర్పడెను. షియ్యాలనీ సున్నీలనీ రెండు తెగలైరి. వారిలో బద్ధవైరమేర్పడెను. మొహర్రం షియ్యాలకు ముఖ్యము. ముసల్మానులు చనిపోయిన శవాలనుపూడ్చివాటిపై గోరీలు కట్టుదురు. గొప్పవలీలు (భక్తులు) చనిపోయినచో వారి గోరీలను గౌరవముతో సంభావింతురు.



# ౧౦ సీఖ్ లేక సిక్కు మతము

పై యెనిమిది మతములు ప్రపంచములోని ముఖ్యమతములు. ఇవికాక మరికొన్ని మతములేర్పడినవి. అందు ముఖ్యమైనది సిక్కుమతము. దాని ప్రవర్తకులు గురునానక్, గురుగోవిందు మున్నగువారు. మొదట హిందూ ముస్లిం సాంప్రదాయముల కలయికచేసి భారతదేశమందొక ఏకైక విశిష్ట మతమును స్థాపింపవలెనని వారు చూచిరి. కాని ఔరంగజేబు సిక్కులను చాలాహింసించగా సిక్కులు ఇస్లాం విముఖులై తిరిగి హిందూమతముదిక్కు ఒరిగిరి. సిక్కుల ముఖ్యమగు ఆచారములు అయిదు:—నెత్తి నిండుగా వెంట్రుకలు పెంచుటను శిఖ యందురు. రెండవది సదా కృపాణము (కిర్‌పాన్) ధరించుట. సిక్కులు సాధారణముగా

తమ నెత్తి రుమాలలో చక్రమునుంచు కొందురు. చంకలో ఖడ్గమును ధరింతురు. మూడవది దువ్వెన. అది సాధారణముగా వారి శిరస్సులో నుండును. నాల్గవది గడ్డము పెంచుట. అయిదవది కుడిచేతిలో కడెమును ధరించుట. ఈ అయిదు వారికి ముఖ్యము.

సిక్కులకు అగ్నియందు భక్తి యెక్కువ. సాధారణముగా వారు చుట్టలు త్రాగరు. అగ్నిని అపవిత్రము చేసినట్లగునని దానిని పరిహరింతురు. ఒకే వేటుతో గొఱ్ఱెను, మేకను తెగనరికి దాని మాంసము భక్షింతురు.

## ఆటవికుల మతాలు

హిందూస్థానమందును, ఆఫ్రికా యందును, ఆస్ట్రేలియా యందును, ఆటవికులు చాలామంది కలరు. వారికి ఒక క్రమబద్ధమగు మతమన్నది లేదు. వారి మతాన్ని ఆనిమిస్టు ( Animist ) మతమని ఇంగ్లీషులో అందురు. వారు చాలా అనాగరికులు. సంపూర్ణముగా మూఢవిశ్వాసాలలో మునిగినవారు. ఏది వారికి భయంకరముగాతోచునో దానినంతా వారు పూజించేవారు అని చెప్పవచ్చును.

ప్రాచీనమందు గ్రీసులోను, రోములోను, బాబిలోనియా, అసీరియా, మీడ్, ఈజిప్టు, అరేబియా, మున్నగు దేశాలలో నానామతాలుండెను. అవన్ని అంతరించి యహూదీ క్రైస్తవ, ఇస్లాం మతాలలో లీనమై పోయినవి.

# నాస్తిక మతము

అన్నింటిని గురించి చెప్పితిమికాని ఇక ఒక్కటిమాత్రము మిగిలి యున్నది. అది నాస్తికమతము. ఇదిబహుశా తెగ తెలివి (అతిబుద్ధి) కల భారతదేశ మందే జన్మించెనేమో? దేవుడేలేడు. అంతయు ప్రకృతియే. అణుసంయోగ వియోగాలవలన ప్రకృతిలో మార్పు జరుగుచుండును. అనినాస్తికులు వాదించిరి. వినేవారికి మంచి తమాషాతర్కముగా వారి వాదాలు కనబడుచుండెను. వారు చారు (మంచి)వాక్కుకల వారగుట చేత వారిని చార్వాకులని మనపూర్వులనిరి. అట్టివారే లోకాయుతులు, వారుకాలనే ఈలోకాన్ని నడిపించుననియు బ్రతికినన్నిదినాలు అప్పైనా చేసి పప్పుధప్పళాలు భుజింపవలెనని వాదించిరి.

"యావజ్జీవేత్ సుఖంజీవేత్
ఋణంకృత్వాఘృతం పిబేత్
నిర్వాణస్య దేహస్య పునరాగమనంకుతః"

అని వారివాదము.

రామాయణ కాలములో నాస్తికులుండిరి. జాబాలి అను నాస్తికుడు శ్రీరామునితో పితృదేవతా తర్పణము వ్యర్థ ప్రయత్నమని వాదించెను.

అయితే హిందువులలో అసహన మెక్కువయై తమకు భిన్నమైన మతములను నాస్తికములని చెడతిట్టిరి. బౌద్ధజైనమతాలను నాస్తికమత ములని దూషించిరి. నాస్తికులను పాషండులని తిట్టి వారిని చూస్తే సచే లస్నానము చేయుమనిరి.

ఈ కాలములో నాస్తికమతము యూరోపుదేశమందు ముఖ్యముగా రష్యాకమ్యూనిస్టులలో వ్యాపించినది. ౧౦౦ సంవత్సరాలనుండి

# మానవజన విజ్ఞానము

## భాషలు

### ౫ వ ప్రకరణము

ప్రపంచములో ౨౭౯౬ భాషలుకలవు. అందు చాలా భాషలు కొద్ది మార్పులతో భిన్నించినవి. కావున ప్రధాన భాషలు మాత్రము నూరువరకు తేలిపోవును. ఈ నూరుభాషలు కూడా ఆదిలో కొన్ని ప్రధానభాషా కుటుంబములనుండి ఏర్పడినవని భాషాశాస్త్రవేత్తలు నిర్ణయించినారు. భాషాకుటుంబములను గూర్చి తెలుసుకొనుటకు ముందు భాషల ఉత్పత్తిని గూర్చి, ఆ భాషలకు ముఖ్యాంగమగు లిపిని గూర్చి తెలుసుకొనవలెను.

# భాషోత్పత్తి

మానవులలలో భాష యెట్లు ఉత్పత్తియయ్యెనో ఇంతవరకు భాషా శాస్త్రవేత్తలు నిర్ణయింపలేక కొన్నియూహలను మాత్రము వెల్లడించినారు. భాషాశాస్త్రమునకు మూలాచార్యులలో నొకరగు మోక్షమూలర్ పండితుని అభిప్రాయములో ఇతరజంతువులవలెనే మానవుడు ఆదిలో అవ్యక్తధ్వనులను చేసి క్రమముగా వ్యక్తధ్వనులను నేర్చుకొనెను. మానవుడు భాషావిశిష్టతకల జంతువేయనియు పరమాత్మయే మానవునికి భాషనిచ్చి సృష్టించెననియు పలువురందురు. డార్విన్ అను ఇంగ్లీషువాడు మానవులు కోతులనుండి పరిణామమొందిరని సిద్ధాంతము చేసెను. దానిని ప్రాచ్యులగు హిందువ్వాదు లొప్పుకొనరు. నూరేండ్ల క్రిందట యూరోపు పండితులు మానవునికి భాషను దేవుడిచ్చెనా లేక మానవుడే నేర్చుకొనెనా అను చర్చలను లేవదీసిరి. అట్టి చర్చలనే 3,000 ఏండ్లకంటె పూర్వమే హిందువులు చేసియుండిరి. భాష యెట్లు పుట్టెను ఆదిలో నదెట్లుండెను తర్వాత యెట్లు పరిణమించెను అను విషయాలను హిందువులు ప్రాచీనమందు చర్చించిరి.

మం॥ బృహస్పతే ప్రథమంవాచో అగ్రంయత్
ప్రైరతనామధేయం దధానాః
యదేషాం శ్రేష్ఠయదరి ప్రమాసీత్
ప్రేణాతదేషాం నిహితం గుహావిః ॥

ఋగ్వేదము. ౧౦. ౭౧. ౧.

దేవుడు బృహస్పతికి మొట్టమొదట వాక్కును ప్రసాదించెను. అని దీని యభిప్రాయము.

గంగూలీగారు ఇట్లభిప్రాయ పడినారు:—

వేదములలోని ద్యావాపృథివీ అను దేవతలు ఆదిమ స్త్రీపురుషులై యుందురు. మొట్టమొదట నీటినుండి భూమి బయటికి వచ్చెనని వేదములో వర్ణించినారు. అట్టి భూభాగము మంగోలియా ప్రాంతపీఠభూమియై యుండుననియు అందే ఆదిమసృష్టిజరిగి యుండుననియు వారి యూహ.

కృష్ణయజుర్వేదమునకు చెందిన తైత్తిరీయ సంహితయం దిట్లు కలదు:—

వాగ్వై పరాచ్యవ్యాకృతావదత్తే దేవా ఇంద్రమబ్రు
వన్నిమాంనోవాచం వ్యాకుర్వితిసోఽబ్రవీ
ద్వరంవృణై మహ్యాం చైవైషవాయవేచసహ
గృహ్యాతేతామిందో మధ్యతోఽవక్రమ్య
వ్యాకరోత్తస్మాదియం వ్యాకృతావాగుచ్యతే.

౬, ౪, ౭.

వాక్కు పూర్వమందు అవ్యాకృతముగా ఉండెను. (అనగా అస్పష్టముగా నియమరహితముగా ఉండెను.) అప్పుడు దేవతలు ఇంద్రునితో అయ్యా, మావాక్కునకు వ్యాకృతి కల్పింపుడు అని కోరిరి. అతడిట్లనెను. నాకును వాయువునకు సోమమును సమర్పించుడు. అట్లే వారిరువురికి సోమమిచ్చిరి. అప్పుడింద్రుడు వాక్కు మధ్యమందుచేరి దానికి వ్యాకృతినిచ్చెను. అందుచే నిప్పుడు స్పష్టమగు వ్యాకృతవాక్కేర్పడినది.

ఇట్టి చర్చలవలన ప్రాచీన హిందూవిద్వాంసులు భాషాశాస్త్ర చర్యల నానాడే చేసిరని తెలియును. హిందువుల సంస్కృత భాషను, వారి వ్యాకరణమును, వారినిరుక్తమును యిన్నూరేండ్ల క్రిందట యూరోపువాసులు చూచి భాషోత్పత్తి భాషాశాస్త్రముఅను చర్చలను లేవదీసిరి. యాస్కుడు వైదికశబ్దముల మూలతత్త్వమును తనకు తెలిసినంతవరకు నిర్ణయించెను. యాస్కునికంటే పూర్వము నిరుక్తమును వ్రాసినవా రుండినట్లు (నిరుక్త ౨-3)

“ నిరబ్రూయాత్ ———న

అన్వై యాకరణాయ, న అమత్ప్నాయ, న

అనిదంవిదేనా'' అను వాక్యాన్నిబట్టి ఊహింప నగుచున్నది. యాస్కునికన్న పూర్వము ప్రాతిశాఖ్యములు సంస్కృత ధ్వనుల విభజనమును గూర్చిచర్చించెను.

పాణిని క్రీ. పూ. ౭౦౦ ప్రాంతమువాడు. అతనికన్న పూర్వము ఆపిశలి, కాశకృత్స్న అనువారు ముఖ్యులైన యాకరణులు. వారి కన్నను పూర్వము ఐంద్రివ్యాకరణ శాఖయు లుండినట్లు శతపథ బ్రాహ్మణమందలి పైన నుదహరించిన మంత్రమునుండి బోధయగును. శాకల్యుడు, శాకటాయనుడు మున్నగువారు కూడా పాణినికన్న పూర్వులే. పాణిని తర్వాత కాత్యాయనుడు, పతంజలి, వార్తిక భాష్యములను వ్రాసిరి.

తర్వాతి కాలములో ప్రాకృతములు జన్మించెను. వాటికి హేమచంద్రుడు, లక్ష్మీధరుడు మొదలైనవారు వ్యాకరణములను వ్రాసిరి. ఇవన్నియుభాషాశాస్త్రములే. టి.జే. కెన్నడీ (Religion and philosophy) లోఆర్యభాషలు క్రీ. పూ. ౧౦,౦౦౦ ఏండ్లకంటే ముందే యుండినట్టి వన్నారు. పార్సీల జండ్ భాషలో పదింట ఏడుపదాలు సంస్కృత పదాలేనని సర్ విలియం జోన్సు అన్నాడు. యూరోపులోని ఎక్కువ భాషలు సంస్కృతమునుండి పుట్టినవి అని కార్పెంటర్ అనుసతడనెను. పీకాక్ (ఇండియాఇన్ గ్రీసు అను గ్రంథములో) గ్రీకుభాషకు తల్లి సంస్కృతమే అని యనెను. గ్రీకేకాదు లాటిన్ భాషకూడా సంస్కృతపు బిడ్డయే యని ష్లెగిల్ అనెను. హిందువుల వ్యాకరణ పద్ధతిలో ప్రపంచములో ఏభాషవారున్నూ వ్యాకరణము నేటివరకు వ్రాసినవారు కారు.

వాక్కునకు మూలస్థానము మనస్సు అని ఐతరేయ బ్రాహ్మణములో చెప్పినారు.

"మనసావా ఇష్టావాగ్వదతి........"

# లిపి

భాష ముందుపుట్టినది తర్వాత లిపి పుట్టెను. నేటికిని ఆఫ్రికా లోని, హిందూస్థానములోని, ఆస్ట్రేలియాలోని, శాంతి మహాసాగరము లందలి కొన్ని ద్వీపులలోని ఆటవికులైన ఆదిమనివాసుల భాషలకు లిపి లేదు. లిపులు ఒక్కొక్క భాషకు ఒక్కవిధముగా నున్నవి. యూరోపు భాషలలో చాలా భాషలకు రోమన్ లిపి కలదు. హిందూస్థానములో దేవనాగర లిపి, ఫార్సీ లిపి, ద్రావిడ భాషాలిపులు, దేవనాగర లిపియే కొద్దిగా మార్పు చెందిన లిపులు కలవు. చీనా, జపాను దేశాలలోని లిపి వేరు. ఆ లిపిని నిలువుగా ఒకొకక్షరముక్రింద మరొకటిగా పైనుండి క్రిందివరకు వ్రాయుదురు. అనగా కాగిదానికి ఉత్తరమునుండి దక్షిణము వరకు వ్రాయుదురు. అరబీ, ఫార్సీ లిపులును తూర్పునుండి పడమటికి అనగా కుడినుండి యెడమకు వ్రాయుదురు. తక్కిన లిపులను పడమటి నుండి తూర్పునకు అనగా ఎడమనుండి కుడికి వ్రాయుదురు. పూర్వకాల ములో ఖారోష్టీ లిపి అనునది ఇప్పటి ఆఫ్గనిస్థాన ప్రాంతములో నుం డెను. ఆ లిపిని కుడినుండి యెడమకు వ్రాయుచుండిరి. ఆ లిపిని కూడా ఆర్యహిందువులు కొంతకాల మాప్రాంతాలలో వాడియుండిరి.

ప్రపంచములోని భాషలన్నిటికి సంస్కృత భాషయే ప్రాచీనమైన దని చాలామంది పరిశోధకు లంగీకరించినారు. ప్రపంచ గ్రంథాలలో నెల్లను ఋగ్వేదమే ఆది గ్రంథమని ప్రపంచమంతా అంగీకరించినది. అట్లయితే ఆర్యహిందువుల లిపికూడా ఆదిలిపిగా నుండవచ్చునుకదా! అటు కాదనీ హిందువుల కాదిలో లిపి లేకుండెననీ వేదాలను వ్రాయ లేదనీ అందుచేతనే వాటిని శ్రుతులు(అనగా వినబడునవి) అని పేరే వచ్చెను కాని చదువబడినవి అను పేరు పొందలేదనీ హిందువులు పాశ్చా త్యులనుండి లిపిని సంగ్రహించిరనీ, క్రీ. పూ. ౧౨౦౦ ఏండ్లకుపూర్వము వారికి లిపి లేకుండెననీ పలువురు పాశ్చాత్య పరిశోధకులు వాదించి నారు. కాని వారి వాదమంతయు అజ్ఞానవిలసనమే అని యనవలెను.

మానవులకు తమ భావములను ప్రకటించుటకు మూడుమార్గాలు కలవు. ౧. శబ్దము. ౨. సంజ్ఞ. (సైగలు)3. లిపి. శబ్దము శ్రవణేంద్రియమునకు ( చెవులకు ) సంబంధించినది. సంజ్ఞ నయనేంద్రియములకు (కండ్లకు) సంబంధించినది. లిపి హస్తలేఖన పరికరములకు సంబంధించినది.

ఆదిలో లిపి చిత్రలిపిగా నుండెను. సింహాదిజంతువులను, మానవాకృతులను వారికృత్యములను, చిత్రములతో వ్రాసి దూరమున నుండువారికి తెలుపుచుండిరి. తర్వాత ఆ చిత్రములలోని ఒక్కొక చిహ్నము మాత్రము సంగ్రహముగా నిలిపిరి. దానిని తర్వాతి కాలములో మరింత సంకుచిత పరచిరి. ఈ జిప్టులోని ఇట్టి చిత్రలిపిని హిరోగ్లిఫిక్సులనిరి. చీనావారున్నూ ఇదే విధముగా చిత్రలిపిలో వ్రాసిరి. అదే తుదకు నూర్ల కొలది అక్షరాలయ్యెను. ఇప్పటికినీ చీనాభాషలో ౮౦౦౦ అక్షరాలున్నవని యందురు. ఉత్తర అమెరికా ఖండములో దక్షిణభాగమందున్న మెక్సికో దేశములో చిత్రలిపి యుండెను. ఈరానుకు పశ్చిమమున నున్న మెసపటోమియాలో కూడా చిత్రలిపి యుండెను. ప్రాచీన అషుర్ (అసీరియా) దేశములో ఇనుప చీలలవలె ( కీల చిహ్నములు Nail script) నుండు గుర్తులే అక్షరాలుగా ఉండెను. వాటిని మృణ్మయేష్టకలపై(పచ్చి ఇటుకలపై) చెక్కి కాల్చి పెట్టుకొనుచుండిరి. ఆ యిటుకలే వారిపుస్తకములు. ఇది క్రీ.పూ. ౨౫౦౦ ఏండ్లకంటెముందు నాటి మాట. ఈకీలలిపి నుండియే అరబీ హీబ్రూ ఫార్సీ లిపులేర్పడెను. ఈ లిపినే ఫినీషియావారు వృద్ధిపరిచిరి. అట్టివారినుండియే గ్రీకు లాటిన్ భాషలవారు తమ లిపులను వృద్ధిచేసికొనిరి. దేవనాగరలిపి కూడా దాని నుండియే వచ్చెనందురు. కాని అది గ్రాహ్యముకాదు. ఎందుకనగా ఆ భాషల వర్ణసమామ్నాయము అడ్డాదిడ్డిగా ఉన్నది. అలీఫ్, బే మొదలగునవి. అరబీ ఫార్సీకట్లో అటులే గ్రీకుభాషలో ఆల్ఫా, బీటా మొదలగున వయ్యెను. అవే లాటిన్ ఏ. బీ. మొదలగునవయ్యెను. సంస్కృతములో అట్టి కలగూరగంప లేదు. కంఠాదిస్థానాలను చక్కగా

విభజించినారు. ఫినీషియా భాషలో అచ్చులేలేవు. గ్రీకులు సంస్కృత మానసపుత్రులు కాన వారికవి అవసరముకాగా వాటిని సృష్టించుకొనిరి. సంస్కృతములో కూడా సృష్టించికొని యుండరాదా? అని యన వచ్చును. గ్రీకులాటిన్ లిపులలో అచ్చులు విడిగాకాని హల్లులతో చేరినప్పుడుకాని రూపాలు మారవు. కాని సంస్కృతములో అచ్చులు విడిగాఉన్నచో ఒక రూపము హల్లులతో సంధిపొందినచో వేరు రూపమును దాల్చును. ఈ పద్ధతి ఇండోయూరోపియన్ ( యూరోపుకోని ) భాషలలో ఎందునూ కానరాదు.

ఫినీషియానుండి ఖరోష్ఠి లిపిని బ్రాహ్మీలిపిని హిందువులు గ్రహించిరని యొక అపవాదమును పాశ్చాత్యులు సృష్టించిరి. క్రీ. పూ. ౨౭౨ లో నుండిన అశోకుని శాసనాలకన్న పూర్వపు లిపి హిందూస్థానములో దొరకలేదు కదా. అందుచేత ఈ అపవాదానికి బలముచే కూరినది. అయితే ఇప్పుడు సింధులో, పంజాబులో, మొహంజోదారో లోను, హరప్పలోను క్రీ. పూ. ౩౫౦౦ ప్రాంతపు నాటి కట్టడములు బయట పడినవి. అందు ఇటుకలపై వ్రాసిన లిపులున్నూ దొరికినవి. వాటినింకా చదువువారే దొరకలేదు. దీనికేమందురు?

బ్రాహ్మీ లిపినుండి నాగరలిపి వచ్చెను. నగరాలలో ప్రచారమందుండి నందున దానికాపేరు వచ్చెనేమోనని కొందరన్నారు. ఖరోష్ఠి లిపిలో ౨౨ అక్షరాలే కలవు. బ్రాహ్మీలిపిలో ౪౬ అక్షరాలు కలవు. బ్రాహ్మీలిపినుండి నాగరలిపియే కాక ద్రావిడభాషా లిపులున్నూ ఏర్పడెను. ఫినీషియావారినుండి క్రీ. పూ. ౮౦౦–౭౦౦ ఏండ్ల ప్రాంతమందు హిందువులు లిపిని గ్రహించిరని బుహ్లర్ పండితుడు అనెను. అది తప్పని హిందూ పరిశోధకులన్నారు. కీ. శే. కొమర్రాజు వేంకట లక్ష్మణరావుగారు "అక్షరములు" అను పదముపై ఆంధ్ర విజ్ఞాన సర్వస్వములో ఉత్తమోత్తమ వ్యాసము వ్రాసినారు. వారిట్లన్నారు. "వేదములలో మంత్రాలను వినుటయేకాక మంత్రాలను చూచుటను గూడా వర్ణించి

నారు. అనగా వారి కానాడే లిపి యుండేనన్నమాట. క్రీ పూ. ఆరవ శతాబ్దములో హిందూస్థానమందు (౬౪) వివిధ లిపులుండెను. బుద్ధుడు వాటినన్నింటిని నేర్చెనని లలితవిస్తారములో వ్రాసినారు. పాణిని బుద్ధుని కన్న పూర్వుడు. అతనికన్న పూర్వులు ఆపిశలి మొదలగువారు. వారి కాలములో అనగా క్రీ. పూ. ౧౦౦౦ ప్రాంతములో లిపి యుండెను కావుననే వారు వ్యాకరణాలు రచించిరి.''

సంస్కృత లిపికి దేవనాగర లిపి అనుపేరు ఏలవచ్చెనో వారిట్లు తెలిపినారు. తంత్ర శాస్త్రములో శ్రీచక్రమునకు దేవనగరము అని పేరు.

" అష్టా చక్రా నవద్వారా "

అథర్వ ౧౦, ౨; ౩౨-౩౪.

దానినుండియే దేవనాగర లిపి యేర్పడెను.

తాంత్రికులు కొన్ని సంకేతములను తమ పూజలలో ఏర్పాటు చేసికొనిరి. అవే లిపులయ్యెను. సిద్ధాంతసారావళి అను తంత్రిగ్రంథము నుండి యీ విషయము తెలియనచ్చును. తాంత్రికులనుండి లిపి యేర్పడుటకు కొన్ని యుదాహరణములు:—

| తాంత్రిక లిపి. | చిత్రాంకనం | అశోకలిపి | దేవనాగరి. |
|---|---|---|---|
| + | శివుడు కాముడు | + | क |
| △ | ఆదిశక్తి | △ | ए |
| | ఏక పాదము | | |
| ∴ | ఇంద్రాణి | | इ |
| +ᵛ | అమృత కలశము | | अ |

(వివరములకై ''అక్షరములు''—ఆం. వి. సర్వస్వమును చూడుడు)

కౌంటు జోర్న్స జర్నా (Bjrnbjerna) అను నార్వే పండి తుడు హిందువులలో క్రీ. పూ. ౨౫౦౦ ఏండ్లనాటి నుండియే లిపి యుండెనని వ్రాసెను.

ఋగ్వేదము ౧౦, ౭౧, ౪ లో
ఉతత్వః పశ్యన్ నదదర్శవాచ ముతత్వ
శ్రుణ్వన్ నశ్రుణో త్యేనాం.

ఋగ్వేదము ౧, ౧౬౪, ౨౪ లో
గాయత్రేణ ప్రతిమిమీతే.........
అక్షరేణ మిమితే సప్తవాణీః.

అను మంత్రములను బట్టి వేదమంత్రములను చూచుటను వర్ణించి నందున లిపి అప్పుడే యుండెననుట స్పష్టము.

సౌందర్యలహరిలో
"శివశ్శక్త్యాః కామః క్షితిధర......"

అను శ్లోకము పై నుదహరించిన తాంత్రిక లిపిని సమర్థించు చున్నది. శతపథ బ్రాహ్మణములోని (౧౪, ౪ మరియు ౨, ౨౨ మరియు ౯, ౧)

"తదేతత్ పశ్యన్ ఋషిమిదేవః ప్రతిపదే"
"తదేతత్ హ్యృషిః పశ్యన్నువాచ నియుత్వా
ఇంద్రసారథిః"

అను మంత్రములోను మంత్రములను చూచుటను వర్ణించినారు. కావున హిందువుల లిపి అతి ప్రాచీనమనియు స్వతంత్ర మైనదనియు యూరోపు పండితుల అభిప్రాయము తప్పనియు స్పష్టమైనది.

# భాషాభేదములు

ఒకే మూలభాషనుండి బహుభాష లెందు కేర్పడెను. వివిధ భాషల కన్నింటికినీ మూలభాష లెన్ని కలవు, అవి ఏ శాఖలకు చేరినవి అను విషయాలను తెలుసుకొందము.

ప్రపంచమందు ఆదిలో ఒకేభాష యుండెననియు దానినుండి వివిధశాఖ లేర్పడెననియు కొందరందురు. కాని భాషాశాస్త్ర నిపుణులు వివిధ భాషలలోని పదాలను, పద్ధతులను పరిశోధించిచూడ నాలుగైదు సంపూర్ణ విభిన్న మూలభాష లుండెనని చెప్పవలసి వచ్చినది. బైబిల్ లో పాత నిబంధన (ఓల్డు టెస్టమెంటు) లో ఒక కథ నిట్లు వ్రాసినారు.

“ప్రళయము రానున్నదని దివ్యబోధితుడై నోవా ( Noah ) అను నతడొక యోడను నిర్మించి దానిలో ప్రపంచ జీవరాసుల నుంచుకొని రక్షించి ప్రళయ జలమింకిన తర్వాత మరల మానవోత్పత్తికి కారకుడయ్యెను. అతనికి సెం, చాం, జాఫత్ అను ముగ్గురు కొడుకులు కలిగిరి. వారి సంతానము తామరతంపరగా అపారముగా వృద్ధి అయ్యెను. ఆ సంతాన మొకమారు దేవలోకానికి రాకపోకలకై ఒక మెట్ల బురుజును నిర్మింప తలపెట్టిరి. దాని పేరు బేబెల్ బురుజు. దేవునికి వారి దుడుకు తనముపై కోపమువచ్చెను. వారిభాష ఒకటిగా నుండకుండా ఒకరిమాట ఇంకొకరికి విపరీతముగా అర్థమగునట్లుగా శపించెను. ఒకడు కట్టుము అంటె ఇంకొకడు కూలగొట్టెను. ఒకడు రాయిని తెమ్మంటే ఇంకొకడు రాళ్ళను పారవేసెను. ఈ విధముగా బేబెల్ బురుజు నేలమట్టమయ్యెను. అప్పటినుండియే లోకములో భిన్న భిన్న భాషలేర్పడెను. సెం సంతతివారు ఏషియాఖండములో ఉండిపోయిరి. వారే సెమెటిక్ జాతివారు. వారి సంతానమే ఇస్రాయిల్ సంతతి. (ఇప్పటి యూదులు, అరబ్బులు ఈ సంతతిలోని వారు). చాం సంతతి వారు ఆఫ్రికా ఖండములోనికి వెళ్ళిరి. జాఫెట్ సంతతివారు యూరోపులో నిండుకొనిరి,

ఇది బేబెల్ కథ. క్రీ. పూ. ౩౦౦౦కు పూర్వమందిది వ్రాయబడెను. ఇది కట్టు కథయే కాని శాస్త్రచర్చకు పనికివచ్చునది కాదు. కాని ౫౦౦౦ ఏండ్లకు పూర్వమే పాలస్తీన్ ప్రాంతములలోని యహూదీజాతిపూర్వీకులు యూరోపు, ఏషియా, ఆఫ్రికా ఖండములలో భిన్న భిన్న భాషలుండెనని గుర్తించి అట్లవి యేర్పడుటకు కారణ మూహించి దానికి మూలము దేవుడేనని తలచి చర్చించిరని మాత్రము మనము గ్రహించవచ్చును.

బహుభాష లేర్పడుటకు కారణములను శాస్త్రీయముగా ఆలోచించిన అవి యిట్లు తోచును:—

లోకములో మూలప్రధాన భాషలు నాలుగైదు కలవు. వాటి నుండి మళ్లీ శాఖోపశాఖ లేర్పడెను. అట్లగుటకు కారణ మేమనగా:—

౧. మానవులందరు ఒకే విధముగా ఉచ్చరించరు. కొన్నివర్గాలవారు భిన్నముగా కొన్నిపదాల నుచ్చరించుటచేత కొన్ని శతాబ్దాల తర్వాత ఆ ధ్వనులు పూర్తిగా మారిపోయి ఒక క్రొత్త భాష యేర్పడుతూ వచ్చెను. ఈ మార్పును మన పూర్వులు అపభ్రంశమనిరి. పతంజలి మహర్షి తన మహాభాష్యంలో ఆదిలోనే పస్పశాహ్నికములో అపభ్రంశమును గూర్చి చర్చించెను. యాస్కుడు తన నిరుక్తములో (౨. ౨) కాంభోజ, ప్రాచీ, ప్రాంతాలలో సంస్కృతమును భిన్నముగా ఉచ్చరించు చుండిరని వ్రాసెను. అనగా అప్పటికే ప్రాకృతము లేర్పడి యుండెనన్నమాట.

౨. జనులు దీర్ఘపదాల నుచ్చరించ లేక వాటిని సంక్షేపము చేయుదురు. అట్టి ప్రయత్నాలవల్ల క్రొత్త భాషలకు మార్గమేర్పడెను.

౩. ప్రయోగ బాహుళ్యమువలన భేదాలు వచ్చును. పలువురు అహం అనుటను మాని హం అనిరి. అది హిందీ భాషలో పదమయ్యెను.

౪. శ్రుతికటువును, పరుషములను, మహాప్రాణుల (ఒత్తు అక్ష రాల) తో కూడిన పదాలను జను లుచ్చరించ లేక వాటిని సరళముగా పలికిరి. ఇవే తద్భవములు, ప్రాకృతము లయ్యెను.

౫. స్వర భేదము వల్ల కూడా భాషాభేదము లేర్పడెను. "యథేం ద్రశత్రుస్స్వరతో పరాధాత్" అని పతంజలి పస్పశాహ్నికములో చర్చించెను. పాశ్చాత్య భాషలలో నేటికినీ స్వరమే భాషకు జీవనము. (ఈ చర్చకే వర్ణ ర్నులా అనునది వర్తించును. ఇది భాషాశాస్త్రము లోని శాస్త్రీయ చర్చకాన ఇందు వివరించుటకు వీలులేదు. )

౬. పరభాషలనుండి ఎరవు తెచ్చుకొనుటలోఉచ్చారణ భేదము వచ్చును. (మన వ్యాకరణాలలో ఆదేశ, ఆగమ, వ్యత్యయములు, అను చర్చలు వీటికి సంబంధించినవి.)

౭. తప్పుపోలికల వలన (False analogy) కూడా భాషలు భిన్నిం చును. (ఇదియు శాస్త్రచర్చకాన వివరించుట అనవసరము.)

ప్రపంచమందు మూలభాషలు నాలుగైదు అని తెలిపినాము అవేవనగా:—

౧. ఉత్తర దక్షిణ అమెరికా ఖండముల భాషలు.
౨. శాంతి మహాసాగర ద్వీపముల భాషలు.
3. ఆఫ్రికా ఖండభాషలు.
౪. యూరేషియా భాషలు. అనగా యూరోపు ఏషియాఖండములలోని భాషలు.

౧. అమెరికా ఖండములో వలసగా వెళ్ళి స్థిరపడి పోయిన యూరోపు జనుల భాషలుకాక స్థానికముగా అనాదిగా యీ క్రింది దేశీ భాషలు కలవు:—

ఎస్కిమోభాష – ఇది గ్రీన్ లెండులో కలదు.

ఆజ్టెక్ భాష – ఇది మెక్సికోలో కలదు.

మయభాష – ఇది యుకెటన్, ఆరంకాన్, పెరూ, ఛిల్లీ దేశాలలో కలదు. ఇంకా ఇట్టివి పలుభాషలు పై రెండు ఖండాలలో కలవు.

౨. శాంతిమహా సాగరములోని భాషలు:—

మలయాభాష:—మలయా, జవా, బోర్నియో మొ॥ లో కలవు.
మలనేషియా భాష— న్యూగినీ, ఫిజీ మొ॥ ,,
టగలాభాష .. ఫిలిప్పైన్ దీవులలో, నికోబార్॥ ,,
పోలినీషియా భాష— హవాయి మొ॥ దీవులలో
ఆస్ట్రికు భాష— ఆస్ట్రేలియా ఖండములో.

3. ఆఫ్రికా ఖండములోని భాషలు:—

బుషెన్, బంటూ, సూడాన్, హామిటిక్, సెమెటిక్, మొదలగు భాషలు.

౪. యూరేషియాలో ఏడు ముఖ్యశాఖలు కలవు:—

౧. యూరల్ ఆల్టాయు శాఖ
౨. చీనీ ,,
3. ద్రావిడ ,,
౪. కకేషియా ,,
౫. సెమెటిక్ ,,
౬. ప్రకీర్ణ భాషలు అనగా ఏ వర్గానికిన్ని చేర్చుటకు వీలు కాని ఎట్రిస్కా, అక్కేడియా, బస్క్, జపానీ, కొరియా భాషలు.

౭. ఇండోయూరోపియన్ లేక ఆర్యభాషా కుటుంబము.

పై శాఖలలో ద్రావిడభాషలు ప్రత్యేకభాషాకుటుంబములోనివా లేక సంస్కృతమునుండి ఏర్పడినవా అనుచర్చను పండితులు రెండు పక్షాలలో తీవ్రముగా వాదించు కొంటున్నారు. కాల్డ్వెల్ అనునతడు అవి వేరేశాఖ యనెను. డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు అవి సంస్కృత జన్యములే యనెను. ఉభయవాదాలలో సమానముగా సార మున్నది. తుది నిర్ణయము కాలేదు.

పై భాషాశాఖలలో మనకు సంబంధించిన ఇండోయూరోపియన్ (ఆర్యభాషా శాఖను) గూర్చి మన మెక్కువగా తెలుసుకొనవలెను.

ఇండోయూరోపియన్ అనగా ఆర్యభాషా కుటుంబములో ఈ క్రిందివి చేరినవి.

ఇండోయూరోపియన్ భాష

| ఆర్యా | ఆర్మీనియన్ | అల్బేనియన్ | బాల్టో స్లావిక్ | ఇటాలిక్ | గ్రీకు | కెల్టిక్ | జర్మనిక్ |
|---|---|---|---|---|---|---|---|
| ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ |

మొదటినాల్గింటిని శతంభాషలందురు. తక్కిననాల్గింటిని కెంటుంభాష లందురు. మూలభాషనుండి భిన్నించుచుతూ వచ్చినపుడు మొదటి నాల్గింటిలో ఊష్మములు నిలిచెను. అవే తక్కిన నాల్గింటి కంఠ్యములయ్యెను. శకారము కకారమయ్యెను. శతం కెంటుంఅయ్యెను. అందుచేత పై సంజ్ఞ లేర్పడెను.

పై అష్టశాఖలలోని ఆర్యభాషలో ఈ క్రింది యుపశాఖలు కలవు

ఆర్యభాష

| వైదిక భాష | సంస్కృత భాష | జంద్ | అఫ్గానీ బెలూచీ | ఈరానీ ఫార్సీ పహ్లావీ | రోమనీ |
| --- | --- | --- | --- | --- | --- |

సంస్కృత భాషనుండి ప్రాకృతములు ఏర్పడెను. అవేవనగా:—

శ్లో॥ మగధ్య వంతిజా ప్రాచ్యా శూరసే న్యర్ధమాగధీ
బాహ్లీకా దాక్షిణాత్యాశ్చ సప్తభాషాః ప్రకీర్తితాః.

మాగధి, అవంతి, ప్రాచ్య, శౌరసేని, అర్ధమాగధి, బాహ్లీక, దాక్షిణాత్యభాషలు, అనునవి ఏడు ప్రాకృత భాషలని కొందరనిరి. హేమచంద్రుడు పైశాచి, లాటి, అను మరిరెండు భాషలను చేర్చెను. మరికొందరు ఆరేప్రాకృతభాష లనిరి. అవేవనగా మాగధి, పైశాచి (చూళికా పైశాచి), శౌరసేని, మహారాష్ట్రి, అర్ధమాగధి, అపభ్రంశ (పాళి). వరరుచి అనునతడు క్రీస్తు శకారంభమందుండినవాడు. అతడే మొట్టమొదటి ప్రాకృత ప్రకాశ అను వ్యాకరణమును రచించెను. తర్వాత క్రీ.శ. ౧౦౦౦ ప్రాంతమందుండిన హేమచంద్రుడు అను ఉద్దండ జైనపండితుడు ప్రాకృతభాషలకు వ్యాకరణమును రచించెను. నేటి హిందూస్థాన భాషలు పైప్రాకృతభాషల నుండియే యేర్పడినవి. దాక్షిణాత్యభాషలలో ౧. ఆంధ్రము (తెనుగు, తెలుగు) ౨. కన్నడము (కర్ణాటకము) ౩. అరవము (తమిళము) ౪. మళయాళము ౫. తుళు అను భాషలు చేరినవి. తక్కిన హిందూస్థానీ భాషాలలో ముఖ్యమైన వేవనగా బంగాలీ, హిందీ, ఉర్దూ, పుష్టు, సింధీ, ఓఢ్రము మహారాష్ట్రము, గుజరాతి,

ఇటాలిక్ నుండి లాటిన్ పుట్టెను. జర్మనిక్ నుండి స్వీడన్, నార్వే, డేన్, డచ్చి, ఇంగ్లీషు జర్మనీభాష లేర్పడెను. తక్కినవాటి నుండి యూరోపులోని మిగత భాషలేర్పడెను.

హిందువులు తమ సంస్కృతమే సకల మానవ భాషలకు తల్లి భాషయనిరి. "తల్లి సమస్త భాషలకు దైవత భాషయు" అని వర్ణించిరి. ఈ భావమును పాశ్చాత్యు లంగీకరించలేదు. సెమిటిక్ భాషలగు అరబీ, హీబ్రూవంటి భాషలకు, మంగోలియన్ శాఖలోని చీనీ జపాను, శాంతి సాగరద్వీపాల భాషలకును, ఆఫ్రికా ఖండమందలి నీగ్రోల భాషలకును మెక్సికో పెరూ గ్రీన్ లెండువంటి ఉత్తరదక్షిణ అమెరికాలోని ఆదిమ వాసుల భాషలకును సంస్కృతానికిని ఏమిన్ని సంబంధము లేదు.

ఇండోయూరోపియన్ భాషలకును సంస్కృతమునకును సన్నిహిత సంబంధముకలదు. అందు ప్రాచీన పార్సీభాషయగు జండ్ (ఛంద) భాషకును వైదికభాషకును భేదము చాలా కొద్దిపాటిదే. సంస్కృతమునకు ఈరానీ (పహ్లావీ–ఫార్సీ) భాషకును సన్నిహిత సంబంధము కలదు. ఒక విధముగా ఆర్యుల మూలస్థానము ఈరాన్ దేశమే అనవచ్చును. అచ్చటి ఆర్యబీజ మండలమును ఇప్పుడు అజుర్ బాయిజాన్ అందురు. అదే ఆర్యుల బీజస్థానమని జండవెస్టా ( ఛందోఽవస్థా ) అను పార్సీల (జరధుస్త్ర) మత గ్రంథములో వర్ణించినారు. సంస్కృతానికి లాటిన్ గ్రీకుభాషలకును దగ్గరి సంబంధము కలదు.

౨౦౦ ఏండ్ల క్రిందట సంస్కృతమును కొందరు ఫ్రెంచి ఇంగ్లీషు పండితులు చదివి అందలి యుత్తమ గ్రంథాలను తమ భాషలలోనికి అనువదించిరి. వాటిని చదివినవారిలో భావవిప్లవము కలిగెను. సంస్కృతమునకు లాటిన్ గ్రీకుభాషలకును సంబంధ ముండుటయేకాక గ్రీకు లాటిన్ భాషలలోని పదాలకుధాత్వర్థము చెప్ప లేకుండుట సంస్కృతములో ప్రతిపదానికి ధాత్వర్థముండుట చూచి ఆశ్చర్యపడిరి. అందుపై

ఇంచుమించు ౧౦౦ సంవత్సరాల క్రిందట భాషాశాస్త్రము ఉత్పత్తి యయ్యెను.

ఫ్రిడ్రిక్ ష్లెజల్ (క్రీ. శ. ౧౭౭౨–౧౮౨౯) ఈ శాస్త్రమును ప్రారంభించిన వాడనవచ్చును. ఫ్రాన్సుబాప్ (క్రీ. శ. ౧౭౯౧–౧౮౬౭) మొదట భాషాశాస్త్రమును గూర్చి గ్రంథరచన చేసెను. జోకబ్ గ్రిం (౧౭౮౫–౧౮౬౩) గ్రిమ్సులా అను భాషాసూత్రాన్ని కనిపెట్టి భాషాశాస్త్రములోని కొన్ని విషయాల సమన్వయము చేసెను. పాట్ (౧౮౦౨–౧౮౮౭) శబ్ద సామ్యముల పట్టికను కనిపెట్టెను. మాక్సు ముల్లర్ (౧౮౨౩–౧౯౦౦) ఈ శాస్త్రములో అగ్రగణ్యుడు. భాషాశాస్త్రమును విపులముగా శాస్త్రీయముగా వ్రాసెను. బ్రిగ్మన్ పాల్ అను పండితులు సజీవులు గొప్ప భాషాశాస్త్ర పరిశోధకులైయున్నారు. ఇంకా చాలామంది పాశ్చాత్యులీవిషయములో కృషి చేసినారు. వీరి కృషిఫలితముగా భాషాశాస్త్రమనునది ఇతర సైన్సు శాస్త్రాలవలె స్థిరపడి పోయినది.

పై పండితుల పరిశోధనములవల్ల ఆర్యభాషలకు గల పరస్పర సంబంధము వివరింపబడినది. ఒక భాషాకుటుంబములోని భాషల సంబంధము రెండు విధాలుగా నుండును.

౧. జన్యజనక సంబంధము.

౨. సోదరీసంబంధము లేక జ్ఞాతిసంబంధము.

సంస్కృతమునుండి ప్రాకృతములు జనించుట, ప్రాకృతములనుండి హిందీ, గుజరాతీ మొదలగు భాషలు జనించుట, తల్లి బిడ్డల సంబంధ మనిపించుకొనును. అదే విధముగా పైన చూపించిన బాల్టోస్లావిక్ శాఖనుండి లితుయెనియా, రష్యా, స్లావనికా మున్నగు భాషలు పుట్టెను.

సోదరీ సంబంధ భాషలు సంస్కృతము, లాటిన్, గ్రీక్, బాల్టో స్లావిక్ మున్నగునవి. ఈ భాషలన్నింటికి ఒక మూలప్రకృతిభాష యొక టుండెనని అది పూర్తిగా నశించి దానిబిడ్డలే నిలిచెనని పరిశోధకుల ఊహ.

అట్లయితే ఈ భాషలు అక్కసెల్లెండ్రని ఒకే తల్లిబిడ్డలుగా నుండిన వని యనుటకేమి ఆధారములు? ఈ సోదరీ భాషలలో పోలికలు కలవు. ఏవో పోలికలున్నంత మాత్రాన అక్కసెల్లెండ్లగునా ?

| తెలుగులో | ఇంగ్లీషులో |
|---|---|
| ఈను | ఈన్ |
| వ్రాయుట | రైట్ ( write ) |
| లేబరము | లేబర్ |

అను పదాలున్నందున ఇంగ్లీషునకు తెనుగు అక్కవరుస యగునా? కాదు. ఏవో కాకతాళీయముగా పది పన్నెండు పదాలు సమానముగా ఉంటే చాలదు. నిత్య వ్యవహారములందుండు సంఖ్యా వాచకములు, కుటుంబబాంధవ్యసంకేతములు అనగా తల్లి తండ్రి అన్న అక్కమున్నగు పదాలు, సర్వనామములు, పశుపక్షుల పేరులు, ఏ భాషలలో ఇంచు మించు సమానధ్వని కలవిగా ఉండునో ఆ భాషలు సోదరీభాషలనుటకు చెల్లును.

ఒక భాషవారు ఇంకొక భాషవారిని పాలించిన ఉభయుల భాష లలో ఉభయభాషాపదములు కొన్ని చేరును. ఇంగ్లీషువారి భాషలోని పదాలు మన దేశములోని అన్ని భాషలలో చేరిపోయినవి. కోర్టు, పోలీసు, ఫోర్డు, రైలు, రేడియో, సినిమా, మార్కెట్టు, లెవీ, గోదాం (గోడౌన్) అట్టివే. అదే విధముగా మనభాషలలోని పదాలను ఇంగ్లీషు లోనికి తీసుకొన్నారు. బండి ( Bandy ) మామిడి ( Mango )

మాంగో) భత్త ( Bhatta ) భ్యాట, జెయిల్, ఘీ ( నెయ్యి ) జంగల్, మున్నగునవి. ఇట్టి పదాలవల్ల ఉభయభాషలు సోదరీభాష లనరాదు.

పైన చూపించిన నాలుగువిధాల సామ్యములు ఇండోయూరోపియన్ భాషాకుటుంబములో కలవనుటకు కొన్ని యుదాహరణములు చూపింతుము.

౧. సర్వనామములు:—

| సంస్కృతం. | లాటిన్. | గ్రీక్. | గాథిక్. (జర్మనీ) | ఇంగ్లీషు. |
|---|---|---|---|---|
| అహం | ఇగో | ఇగో | ఇక్ | ఐ. |

౨. సంఖ్యావాచకములు:—

| సంస్కృతం. | గ్రీకు. | లాటిన్. | ఇంగ్లీషు. | జండ్. |
|---|---|---|---|---|
| ద్వా | ద్వో | ద్వో | టూ (Too) ఇందు వకారలుప్తమై దాగియున్నది | ద్వ |
| చత్వారః | తెస్సరిస్ | క్వాత్వర్ | ఫోర్ | చత్వార |
| పంచ | పెంటె | క్వింక్వె | ఫైవ్ | పంచ |
| సప్త | హెప్త | సెప్తం | సెవెన్ | హప్త |
| అష్ట | ఆక్టో | అక్టో | యెయిట్ | అస్ట |
| దశ | డెక | డెకెం | టెన్ | దస |
| శతం | హెకటం | కెంటుం | హుండ్ హండ్రెడ్ | సత. |

3. బాంధవ్యసూచక శబ్దములు:—

| ఇంగ్లీషు. | సంస్కృతం. | లాటిన్. | గ్రీక్, | గాదిక్ (ప్రాచీన జర్మనీ) | జండు (ప్రాచీన పార్సీ) |
|---|---|---|---|---|---|
| ఫాదర్ | పితర్ | పెటర్ | పెటర్ | ఫాడర్ | పిత |

| | | | | | |
|---|---|---|---|---|---|
| మదర్ | మాతర్ | మెటర్ | మెటర్ | మాతర్ | మాతృ |
| బ్రదర్ | భ్రాతర్ | ఫ్రేటర్ | ఫ్రెటర్ | బ్రదర్ | బిరావర్ |

౭. జంతువుల నామములు:—

| ఇంగ్లీషు. | సంస్కృతం. | లాటిన్. | గ్రీకు, | గాథిక్, | జర్మన్. |
|---|---|---|---|---|---|
| హార్స్ | అశ్వ(స్) | ఇక్వాస్ | హిప్పాస్ ఇక్కాస్ | ఐహ్వస్ | అస్వ |
| గూస్ | హంస | అన్సర్ | ఖేన్ | గాన్స్ | |
| వుల్ఫ | వృక | లుపస్ | లూకస్ | | |

పై నాలుగు సామ్యములే కాక కొన్ని వ్యాకరణ పద్ధతులలోను సామ్యములుండవలెను. వర్నర్, గ్రీం అను భాషాశాస్త్ర పరిశోధకులు దేశకాల భేదములచేత సోదరీ భాషలలో భిన్నధ్వనులు, భిన్నరూపములు ఏర్పడుటను బట్టి కొన్ని సూత్రములను నిర్ణయించిరి. ఆ సూత్రములను వర్నర్సులా, గ్రిమ్సులా, అని యందురు. ఆ సూత్రాధారముతో సోదరీ భాషలలోని సామ్యతను నిర్ణయించ వచ్చును. ఈ చర్చ చాలా లోతులోనికి పోవును కాన ఇచ్చట సూచించి వదలి వేయవలసి వచ్చినది.

ఇక ప్రాకృత భాషలనుండి ఈ నాటి హిందూస్థాన భాషలేవి యేర్పడెనో కనుగొందము. ఈ భాషలన్నియు ఆంధ్ర దేశమునకును కర్ణాట దేశమునకు ఉత్తరమున నుండుభాషలే. అట్టి యుత్తర భాగములోని ప్రాకృతములను దాక్షిణాత్య, ప్రాచ్య (తూర్పు) మధ్య, ప్రతీచ్య (పడమట) ఉదీచ్య (ఉత్తర) ప్రాకృతములని పేరుపెట్టుకొనిరి. ఉత్తర హిందూస్థాన మందలి నాలుగు దిక్కులలోనుండు ప్రాకృత భాషలు వాటినుండి ఏర్పడిన ఆధునిక భాషలను తెలుపు పట్టికను ఈ క్రింద తెల్పుచున్నాము.

# ప్రాకృతభాషలు.

- మహారాష్ట్రి ౧
  - మరాటి
  - కొంకణి
  - గోవాళీ
  - (దాక్షిణాత్య)
- మాగధి ౨
  - బెంగాలీ
  - ఆస్సామీ
  - ఓఢ్రము
  - బిహారీ
  - (ప్రాచ్య)
- అర్ధమాగధి 3
  - అవధి
  - పూర్వ హింది
  - ఛత్తీస్ ఘడీ
- శౌరసేని ౪
  - పశ్చిమ హిందీ
  - కనౌజీ (వ్రజ)
  - బుందేలీ
  - (మధ్య)
- సౌరాష్ట్రి ౫
  - మాలవ
  - మేవాడి
  - గుజరీ
  - మర్వాడి
  - గుజరాతీ
  - (ప్రతీచ)
- ఖశ ౬
  - నెపాళీ
  - గఢ్వాలీ
  - పంజాబీ
  - సింధీ
  - (ఉదీచ్య)
- పైశాచి ౭
  - కాశ్మీరీ
  - కాహిస్థానీ
  - కాఫిరీ
  - చిత్రాలీ

భాషాశాస్త్రమును గూర్చి ఎక్కువగా తెలుసుకొనగోరు వారీ గ్రంథములను చదువవలెను.

1. Tarapore wolla, Elements of the scienec of language.
2. Max muller, Scienec of language 2 vols.
3. Gune's comparative philology.
4. భాషోత్పత్తి క్రమము కోరాడ రామకృష్ణయ్యగారు.

# ద్రావిడ భాషలు

పైన తెలిపిన ప్రాకృత భాషలలోను, వాటి సంతానములోను ద్రావిడభాషలు చేరలేదు. ఇవి ప్రత్యేకకుటుంబములోనివని కాల్డ్వెల్ అను పాశ్చాత్యపండితు డొక ఉద్గ్రంథమును రచించి నిరూపించెను.

ద్రావిడభాషలలో ఆంధ్రము, కన్నడము, తమిళము, మళయాళము, తులు అనునవి చేరినవి. ఇవికాక వీటికి సంబంధించిన ఆటవిక భాషలు చాలాకలవు. కుడగు, తోడ, కోట, కురుఖు, మల్తో, గోండి, కోదు,కోలామి, బ్రాహ్వీ, కొరవ, కైకాడి, బుర్గండి, సవర, బడగ, కురుమ్వారీ, కోయ, ఎరుకల, భీలీ మొదలైనవి. ఈ భాషలలో చాలా భాషలు తెనుగునకు దగ్గరగా ఉన్నవి. అయితే ఈభాషలమాట్లాడు ఆటవికులు ఎక్కువగా లేరు. అందుచేత క్రమక్రమముగా ఆటవికభాషలన్నియు పై ప్రధాన పంచద్రావిడభాషలలో చేరిపోవచ్చును .

ద్రావిడభాష లన్నియు ఒకకుటుంబమునకు చేరినవని సంఖ్యావాచకములందు, సర్వనామములందు, జంతువుల పేరులందు, బంధువర్గ నామములందు కల సామ్యమువలన నిశ్చయించవచ్చును. అచ్చ తెనుగు పదాలు విశేషముగా తమిళపదాలను బోలినవి. ద్రావిడజాతి వేరనియు క్రమక్రమముగా వారు ఆర్యులకు లోబడి కొంత ఆర్యభాషను సంస్కృతిని స్వీకరించిరనియు, ద్రావిడభాషలు సంస్కృత ప్రాకృతముల నుండి భిన్నించినవనియు చెప్పుటకు సందేహించ నవసరములేదు.

ద్రావిడభాషలను గూర్చి వివరముగా తెలుసుకొనగోరువారు ఈ క్రింది గ్రంథాలను చదువవలెను.

Caldwell, Grammar of dravidian languages Grierson- linguistic Surway of India

మారేపల్లి రామచంద్రశాస్త్రిగారి—తెనుగు తోబుట్టువులు.

డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారి—ఆంధ్ర భాషాచరిత్ర ౨ సంపుటములు— ( ఆంధ్రా యూనివర్సిటీ ప్రచురణము )

కోరాడ రామకృష్ణయ్యగారి భాషాశాస్త్ర వ్యాసములు.

టి. యం. శేషగిరిశాస్త్రిగారి ఆర్యద్రావిడ ఫైలాలజీ. ( వేదం వెంకటరాయశాస్త్రి కంపెనీ. మద్రాసు. )



# యువజన విజ్ఞానము

---

## ఆంధ్ర వాఙ్మయ చరిత్ర

### ౧వ ప్రకరణము

---

ఆంధ్రభాష, ఆంధ్రవాఙ్మయము, చాలా ప్రాచీనమైనదే కాని మనకు లభించిన మొదటి గ్రంథము ౯౦౦ ఏండ్లనాటి ఆంధ్రమహాభారతమే. ఆంధ్రుల ప్రశంస సంస్కృత మహాభారతములో, రామాయణములో, ఐతరేయ బ్రాహ్మణములో ఇట్టి అతి ప్రాచీన గ్రంథాలలో లభించినది. ఆంధ్రులు క్రీ. పూ. ౨౦౦ ఏండ్ల ప్రాంతమునుండి మహాసామ్రాజ్యాలు స్థాపించి ప్రపంచఖ్యాతి కాంచినవారు. అట్టివారి భాషలో క్రీ. పూ. ౨౦౦ ఏండ్లనాటినుండి క్రీ. శ. ౧౦౫౦ వరకు అనగా నన్నయభట్టు కాలమువరకు ఇంచుమించు ౧౨౦౦ ఏండ్ల కాలములో వ్రాసిన ఒక గ్రంథముకూడా లభించకపోవుట చాలా ఆశ్చర్యకరము. నన్నయభట్టుకు పూర్వము తెనుగుభాష, తెనుగు కవిత్వము లేదని కాదు. ఆ రెండున్నూ ఉండెను. కాని మనకు గ్రంథ మొకటైన దొరకలేదనుటయే విచారకరమైనది.

నన్నయకంటె ఏడునూర్లేండ్లకు పూర్వమునుండి అనగా క్రీ. శ. నాల్గవ శతాబ్దమునుండి తెనుగురచనలు ఉండినట్లు మనకు కొన్ని నిదర్శనాలు కనిపించుచున్నవి. దినేశచంద్రసర్కార్ గారు తన "శాతవాహనుల తర్వాతివారు" (సక్సెసర్స్ ఆఫ్ ది శాతవాహనాస్) అను ఇంగ్లీషు గ్రంథములో ఇట్లు వ్రాసినారు.

"ఇక్ష్వాకురాజులయొక్క కొన్ని ప్రాకృతశాసనాలు జగ్గయ్యపేటలో లభించినవి. నాగార్జున కొండలోని రికార్డుల భాషనుగూర్చి" అది ఒకవిధమగు ప్రాకృతమని బహుశ అది కన్నడమైయుండునని అనవలెను. అని స్టెన్ కొనోవ్ గారు అభిప్రాయపడిరి. నాగార్జున కొండలో కొన్ని ప్రాకృతశాసనాలు దొరికినవి."

అయితే జగ్గయ్యపేట, నాగార్జునకొండ అను నీ రెండు స్థలాలు తెనుగునడిగడ్డలో నున్నందున అచ్చటి ప్రాకృతభాష తెనుగురూపమైయుండి యుండును. కాని కన్నడము కానేరదు. కన్నడమైనను క్రీ. శ. నాల్గవ శతాబ్దిలో తెనుగునుండి అంతగా భిన్నించినట్టిదికాదు.

ఇక్ష్వాకులు అశ్మక, ములక దేశములు రాజ్యముచేసినట్లు వాయుపురాణము చెప్పుచున్నది. ములక దేశము నిప్పటికిన్ని మొలకసీమ అని పిలుచుచున్నారు. అది యిప్పటి పాలమూరు జిల్లా. అక్కడినుండి మొదలుకొని ములకసీమ (మురికినాడు) కర్నూలు, కడప మున్నగు ప్రాంతాల నాక్రమించుకొని యుండెను.

(శాలంకాయనులు అను రాజవంశమువారు తెనుగు దేశములో క్రీ. శ. ౫ వ శతాబ్దమందు రాజ్యము చేసినవారు.) వారి శాసనాలలో మన కర్థమగు కొన్ని తెనుగుపదము లున్నవి. ఊరు, చెరువు, మునుడు, ఇట్టి పదాలు కొన్నిగలవు. క్రీస్తుశకము అయిదవ శతాబ్దమందు అనగా నన్నయభట్టుకంటె ౬౦౦ ఏండ్లకు ముందు ఆంధ్రదేశమును రాజ్యము చేసిన విష్ణుకుండినరాజుల దానశాసనములలో నొకదానియందు

'వర్షంబుల్'' అను తెనుగుపదము కలదు. ఇట్టి నిదర్శనములను బట్టి తెనుగుభాషయు, తెనుగు రచనయు (శాసనములలోనే అనుడు) క్రీ.శ. ౭౦౦ నుండి యుండెననుట స్పష్టము.

విష్ణుకుండినరాజుల వంశములోని వాడగు జయాశ్రయుడు అను బిరుదుగల మాధవవర్మ నన్నయకు అయిదునూరేండ్లకు ముందుండిన వాడు. అతడు జయాశ్రయచ్ఛందము అను ఛందశ్శాస్త్రమును వ్రాసెను. అందు శీర్షలక్షణము అనగా సీసపద్యలక్షణమును తెలిపినాడు.

నన్నయకు పూర్వము తరువోజ, సీసము, అక్కరలు, విశేషముగా ఉండియుండును. నన్నయ తరువోజలు, అక్కరలు అను కొన్ని పద్యాలను మహాభారతములో వ్రాసెను. తర్వాతికవులు వాటిని పరిహరించిరి.

నన్నయకంటే ముందు ద్విపదలోను, దాని భేదములగు వృత్తములలోను వ్రాసి జనులు పాటలుగా పాడుకొనుచుండిరి. ఇంచుమించు క్రీ శ. ౧౨౮౦ నుండి ౧౩౦౦ వరకుండిన పాల్కురికి సోమనాథుడు తన కన్న ముందుకాలములోనుండిన చాలావిధములైన పాటలనుగూర్చి ఇట్లు తన పండితారాధ్యచరిత్రలో వ్రాసెను.

" మదినుబ్బి సంసార మాయాస్తవంబు
పదములు, తుమ్మెదపదముల్, ప్రభాత
పదములు, పర్వతపదము, లానంద
పదములు, శంకరపదముల్, నివాళి
పదములు, వాలేశుపదములు, గొబ్బి
పదములు, వెన్నెలపదములు, సెజ్జ
వర్ణన, మరి గణవర్ణనపదములు.

ఇట్టివెన్నో యుండెనట!

నన్నయభట్టు రాజమహేంద్రవరము రాజధానిగా పరిపాలించిన రాజరాజనరేంద్రుని ఆస్థానకవి. అతడు క్రీ. శ. ౧౦౫౦ ప్రాంతమందుండినవాడు. అతనికంటే ముందుండిన కవితలో కొన్నిపద్యాలు కొన్ని శాసనాలలో మనకు లభించినవి. గుంటూరు మండలములోని అద్దంకిలో ఒక శాసనము దొరికినది. అది క్రీ. శ. ౮౪౮ ప్రాంతములోనిది. అనగా నన్నయభట్టుకంటే యిన్నూరేండ్లకు పూర్వమునది. నన్నయ కంటే ముందు మనకు తెనుగురచనలే దొరకలేదనుటచేత మనకు దొరికిన ఈ అద్దంకిశాసనములోని ఒకపద్యము ఒకవచనము ఎంతైనా విలువ చేయుటచేత వాటినిం దుదాహరింతుము.

౧ తరువోజ

"పట్టంబుగట్టిన ప్రథమంబునేణ్డు
బలగర్వమొప్పంగ బైలేచిసేన
పట్టంబుగట్టిఞ్చ ప్రభుబణ్డరంగు
బఞ్చిన సమత్త ౧ పడువతోబోయ
కొట్టంబుల్వత్రెణ్డు గొణి౨ వేంగినాణ్టిం
గొఱల్చి౩ యాత్రిభువనాంకుశ బణనిల్చి
కట్టెపుదుర్గంబు గడుబయల్సేసి
కణ్దుకూర్బెజవాడ గావిఞ్చెమెచ్చి."

౧. సమత్త = సామంత
౨. పంట్రెండుగొణ్డి = పన్నెండు తీసుకొని
3. గొఱల్చి = గూర్చి అని యర్థమైయుండును.

వచనము:—

"పండరంగు పరమమహేశ్వరుణ్డు ఆదిత్యభట్టారనికి ఇచ్చి భూమి యెనుబోదివ్రుడ్ల ఆడ్లపట్టు నేల, దమ్మెపురంబున దమ్మెములు, వీనిరక్షిఞ్చువారికి అస్వ (శ్వ) మేధంబున ఫలంబు అగు"

నన్నయకంటె ముందటిదగు రెండవ శాసనము యుద్ధమల్లుని బెజవాడ శాసనము. అది క్రీ. శ. ౮౯౮ ప్రాంతముది. అనగా నన్నయభట్టుకంటె ౧౫౦ ఏండ్లకన్న ముందటి శాసనము. దానిలో ౫ మధ్యాక్కరలు ఒక వచనము మనకు లభించినవి. అందలి పద్యమొకటి యుదహరింతుము.

> " జననుత చేబ్రోలనుణ్డి బెజవాడజాత్రకు వచ్చి
> త్రినయను సుతుణ్డొణ్డు సోటమెచ్చక తివిరి యిన్నెలవ
> యనఘుణ్డు సేకొని యున్దుప్రత్యక్షుబయన్న నిచ్చ
> గని మల్లణ్డెత్తించె గుడియు మఠంబునుం గార్త్తికేయునకు."
>
> ( వివరములకై చూడుడు శాసన పద్యమంజరి. )

ఈ విధముగా నన్నయభట్టుకంటె ముందు తెనుగురచన లుండెను. నన్నయభట్టుకంటె ముందుకాలములో కొందరు తెనుగువారు కన్నడములో కావ్యాలను రచించిరి. నన్నయకన్న ముందుండిన తెనుగు వాఙ్మయస్థితి మనకింతకంటె యెక్కువగా తెలియదు. ఇక నన్నయ కాలమునుండి నేటివరకు ఆంధ్రవాఙ్మయచరిత్ర ఘట్టములను సంగ్రహముగా తెలుపుదుము. ఈ చరిత్రను ఏడు భాగములుగా విభజింపవచ్చును.

౧. ఆదియుగము ( పూర్వచాళుక్యయుగము )
౨. కాకతీయ యుగము.
౩. రెడ్డి యుగము.
౪. విజయనగర యుగము
౫. తంజావూరి యుగము.
౬. సంధి యుగము
౭. ఆధునిక యుగము.

ఈ యుగములనుగురించి వివరించుటకు పూర్వమొక విషయ మును స్మరించవలెను. ఆంధ్రవిజ్ఞానసర్వస్వములో అథర్వణాచార్యులను గూర్చి వ్రాయుచు ఇట్లు వ్రాసినారు.

" అథర్వణ కారికలలో పంచమకాండమం దిట్లున్నది. అథర్వణ శిఖోపనిషది. త్రిమూర్తీనాం సంస్కృతాంధ్ర ప్రాకృతాః ప్రియంకరాః" ......అందు మరొకచో ఇట్లు వ్రాసినారు.

" ప్రాకృతే షడ్విధేచాపి వాల్మీకిం వా మహేశ్వరం ధ్యాయేత్. అత్రతు మామేవ స్మరేత్ పండితసమ్మతః" అథర్వణకారికలలో పంచమ కాండము, ౧ వ కాండము ౪ వ కాండము అని యుదాహరించినారు. కాని వావిళ్లముద్రిత ప్రతిలో ఈ విభాగములేదు. మరియు ఉదహరింప బడిన విషయాలున్నూ కానరావు.) ఇంకను అందిట్లు వ్రాసినారు."ప్రా చీనాంధ్రవేత్తలుగా నీ క్రిందివారు (అథర్వణ కారికలలో) పేర్కొన బడినారు. బృహస్పతి, కణ్వుడు, హేమచంద్రుడు, పుష్పదంతుడు, రావ ణుడు, గౌతముడు, ధర్మరాజు. (౧ వ కాండములో నిది కలదట!)"అథ పౌలస్త్యరావణం" (౪ వ కాండిములోను) "అనుక్తం సర్వశాస్త్రంతు రావణీయే విలోకయేత్. (౧ వ కాండము) ఈ గంధ్రమందు పూర్వాం ధ్రవ్యాకర్తలుగా హరి, శ్రీకవి, విష్ణుశర్మ, ధూర్వహుడు, శృంగార భూషణుడు, అను వారుకూడా పేర్కొన బడినారు. ఈ ప్రాచీనాంధ్ర వైయాకరణులను గురించి మనకేమియు తెలియదు. సర్వస్వమువారేఅథ ర్వణ కారికలనుండి పైవాటి నుదహరించిరో తెలియదు. ఇప్పటిముద్రిత ప్రతిలో అవేవియు కానరావు.

నన్నయభట్టు ఆంధ్రశబ్దచింతామణిని వ్రాసెనందురు. కాని దానిని ఎలకూచి బాలసరస్వతియో మరెవ్వరో వ్రాసినారని కొందరి తలపు. నన్నయ ప్రయోగాలు కొన్ని ఆంధ్రశబ్ద చింతామణికి విరుద్ధ ముగుట దానికి తార్కాణ మందురు. సకలభాషా వాగనుశాసనుడు

అను బిరుదు పొందినవాడగుటచేత నన్నయ ఏదో వ్యాకరణము రచించి యుండును. ఇక పైన పేర్కొనిన ఆంధ్రసారస్వతచరిత్రలోని యేడు యుగములను వివరించుట అవసరము.

మ॥ మహిమన్, వాగనుశాసనుండు¹ సృజియింపన్, కుండలీందుప్రౌఢు,² తన్మహనీయస్థితి మూలమైనిలువ, శ్రీనాథుండు పోషింపన్, మహామహులై సోముడు,³ భాస్కరుండు⁴ వెలయింపన్ సొంపువాటించునీ బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమున దత్ప్రాగల్భ్య మూహించెదన్.

౧. నన్నయభట్టు. ౨. తిక్కన సోమయాజి. 3. నాచన సోముడు. ౪. భాస్కరుడు ( భాస్కరరామాయణ కర్త ).

ఈ పద్యమును రామరాజభూషణుడు తన వసుచరిత్రలో వ్రాసెను. అనగా వారే తనకన్న ముందుండిన మహాకవులని అతని అభిప్రాయము. ఆంధ్రసారస్వతమునకు మూలస్తంభము లనియు అతని భావము. తనకన్న పూర్వులైన ఇతరకవుల నతడు మెచ్చుకొనలేదన్న మాట!

## ౧ ఆదియుగము

నన్నయభట్టు మొదలుకొని తిక్కన సోమయాజి కాలమువరకు స్థూలముగా ఈ యుగమును విభజింపవచ్చును. (నన్నయ రాజరాజనరేంద్ర చాళుక్యరాజుయొక్క ఆస్థానకవి. క్రీ. శ. ౧౦౫౦ ప్రాంతమువాడు. అతడు మహాభారతములో ఆదిపర్వము, సభాపర్వము, అరణ్యపర్వములో ము ప్పాతిక భాగము రచించి చనిపోయెను. తర్వాత నెల్లూరిలో మనుమసిద్ధిరాజు రాజ్యము చేసిన కాలములో క్రీ. శ. ౧౨౫౦ ప్రాంతములో తిక్కనసోమయాజి విరాటపర్వము మొదలుకొని భారతము తుదివరకు తెనిగించెను.) తర్వాత రెడ్ల యాస్థానమందుండిన ఎఱ్ఱాప్రగడకవి

భారతములోని అరణ్యపర్వశేషమును పూరించెను. ఈ ముగ్గురల మహా భారత కవులను కవిత్రయము వారంటరు. వారు వాడిన పదాలు, చేసిన ప్రయోగాలు అన్నియు అందరికిని ప్రమాణమైనవి. మహాభారతము మన తెనుగులో ఆది గ్రంథమైనను అది నేటికిని ఉత్తమోత్తమ మని అంద రిచే గౌరవింపబడునట్టిది.

నన్నయ తర్వాత ఇంచుమించు నూరేండ్లకు నన్నెచోడుడు అను రాజు కుమారసంభవము అను చక్కని తెనుగు కావ్యమును రచిం చెను.

## ౨ కాకతీయ యుగము

ఓరుగంటిని రాజధానిగా జేసుకొని తెనుగు దేశమును కాకతీయులు క్రీ. శ. ౧౧౮౦ నుండి ౧౩౮౦ వరకు రాజ్యముచేసిరి. ఈ కాలములో మొదటి ప్రతాపరుద్రుడు, మహాదేవరాజు, గణపతిరుద్రుడు, అతని కూతురు రుద్రమ్మ ఆమె మనుమడు రెండవ ప్రతాపరుద్రుడు, కాకతీయ వంశపు రాజులు. ఢిల్లీసుల్తానగు అల్లావుద్దీన్ ఖిల్జీ కాలములో ఓరుగంటి రాజ్యము పడిపోయెను. కాని ౧౩౨౦ నుండి ౧౪౮౦ వరకు నామకార్థ ముగా కొంతకాలము హిందువుల పరిపాలన ముండెను.

కాకతీయుల కాలములో అనగా ౧౧౮౦ నుండి ౧౩౮౦ మధ్య కాలములో ఉత్తమ సారస్వతము బయలుదేరెను. ఈ కాలములోనే పాల్కురికి సోమనాథుడు ( క్రీ. శ. ౧౨౫౦—౧౩౦౦ ప్రాంతమువాడు ) బసవపురాణము, పండితారాధ్యచరిత్ర అను ద్విపద శైవవాఙ్మయమును రచించెను. ఇతడు జనగామతాలూకాలోని పాలకుర్తివాడు. కాకతీయుల సామంతుడును రాయచూరు ప్రభువును అయిన గోనబుద్ధారెడ్డి రంగ నాథ రామాయణమును తనతండ్రి విఠల (రంగనాథుని) పేర ద్విపదగా రచించెను. గోనబుద్ధారెడ్డి "కవిలోక భోజుండు". మల్లికార్జునపండితా రాధ్యుడు "శివతత్త్వసారము" అను మంచి శైవగ్రంథమును రచిం

చెను. ఈ కాలమందే నెల్లూరిలో మనుమసిద్ధిరాజుయొద్ద తిక్కనసోమయాజి యుండెను. ఇతనికన్న మించిన కవి నేటివరకు పుట్టలేదు. ఇతడు నిర్వచనోత్తరరామాయణమును, మహాభారతములోని ౧౫ పర్వాలను రచించెను. ఇతని గొప్పతనమేమన ఇతనికే అభినవదండి అనుబిరుదు గల కేతన తన దశకుమారచరిత్రమును అంకితమిచ్చి యిట్లు చెప్పుకొనెను.

"కవితజెప్పి యుభయకవిమిత్రు మెప్పింప
నరిది బ్రహ్మకైన నతడు మెచ్చ
బరగ దశకుమారచరితంబు జెప్పిన
ప్రోడ నన్ను వేరె పొగడ నేల!"

దశకుమారచరిత్రకథలు చాలా మనోహరములైనవి. తిక్కన సోమయాజి శిష్యుడగు మారన మార్కండేయపురాణమును రచించెను. తిక్కనశిష్యుని రచన కావున అది ఉత్తమమైనది. తిక్కనసోమయాజి ఉభయకవిమిత్రుడు, సకలవిద్యాకళా విచక్షణుడు, కవిబ్రహ్మ బుధజనవిరాజి, కావ్యప్రౌఢిబాటించు శిల్పమునఁ బారగుడు. తన కావించిన సృష్టి తక్కొరులు చేయలేదు. సాటిలేనివాడనిపించుకొన్న ఆంధ్ర కవికుల గురువు.

క్రీ. శ. ౧౩౦౦ ప్రాంతమున నున్న మంచన అనుకవి కేయూర బాహుచరిత్రమును రచించెను. పుస్తకము చాలా చిన్నదే కాని కవిత చాలా గొప్పది.

కాకతీయ యుగములోనే శతకము లారంభమయ్యెను. అందు ముఖ్యమైనవి (బద్దెన) భద్రభూపాలుడను నతనిచే రచితమని చెప్పబడు సుమతిశతకము, నీతిశాస్త్ర ముక్తావళి, పాల్కురికి సోమనాథుని వృషాధిప శతకము, యథావాక్కుల అన్నమయ్య "సర్వేశ్వర శతకము".

# 3 రెడ్డియుగము

అద్దంకి, కొండవీడు, కోరుకొండ రాజమహేంద్రవరములను రాజధానులనుగా జేసుకొని రెడ్డిరాజులు తెనుగుసీమను క్రీ. శ. ౧౩౦౦ నుండి ౧౪౫౦ వరకు రాజ్యముచేసిరి. ఒకదిక్కున కాకతీయ సామ్రాజ్య విచ్ఛిత్తి కాగా ఇంకొక దిక్కున రెడ్డిరాజులు ఆంధ్రులను రక్షించి పాలించిన వారైరి.

రెడ్డిరాజుల నాశ్రయించిన కవులలో ప్రఖ్యాతులైనవారు ఎఱ్ఱాప్రగడ, శ్రీనాథుడు, వామనభట్టబాణుడు, వెన్నలకంటిసూరన, నిశ్శంక కొమ్మన.

రెడ్డిరాజులు స్వయముగా సంస్కృత గ్రంథాలు, వ్యాఖ్యలు రచించిరి. కుమారగిరి వసంతరాజీయు మను నాట్యశాస్త్రమును సంస్కృతమున రచించెను. పెదకోమటి వేమభూపాలునికి సర్వజ్ఞచక్రవర్తి అని బిరుదముండెను. ఈ రాజుల రసికతవలన దేశమందు కవులు బహుళమై శ్రీనాథుని హాస్యమునకు పాత్రులైరి. శ్రీనాథుడు కొండవీటివీధిలో తిరుగు గాడిద నుద్దేశించి యిట్లు పద్యమల్లెను.

" బూడిదబుంగవై యొడలుపోడిమి దక్కి మొగంబు వెల్లనై
వాడలవాడలం దిరిగి వాడును వీడును ఛీచ్ఛిచో యనన్
గోడల గొందులం దొదిగి కూయుచు నుందువు కొండవీటిలో
గాడిద! నీవునుం గవివి కావుగదా యనుమాన మయ్యెడున్.

ఈ కాలములోని ఎఱ్ఱాప్రగడ భారతములోని అరణ్యపర్వశేషమును ముగించిన కవిత్రయములోనివాడు. అతడు నృసింహపురాణమును, హరివంశమును రచించెను. అతని నృసింహపురాణము ప్రబంధాలకు దారితీసెను. ఆ రచనలతో ప్రబంధపరమేశ్వరుడను బిరుదమును పొందెను.

రెడ్ల ఆస్థానకవియు, ఆస్థాన విద్యాధికారియునైన శ్రీనాథుడు ఆ నాటి వెలమరాజులను, విజయనగరచక్రవర్తులను, ఇతరరాజులను, దర్శించి వారిచే పూజితుడై దిగ్విజయ మొంది తనగొప్పదనమును చూపెను. విజయనగరములో డిండిమభట్టు అను ఉద్దండుని జయించి "నన్ను జయించేవారులేరు" అని కంచుఢక్కను మోగించుకొను చుండిన ఆ డిండిమభట్టుఢక్కను పగులగొట్టించి విజయనగరచక్ర వర్తిచే ముత్యాలశాలలో బంగారుదీనారాలతో స్నాతుడై కవిసార్వ భౌమబిరుద మందెను. అట్టి శ్రీనాథుడు శృంగారనైషధమును, కాశీఖం డమును, భీమఖండమును, రచించెను. ఇంకా యితరకావ్యాలు వ్రాసెను. పల్నాటివీరుల కథలను ద్విపదగా ఇతడే వ్రాసెనని యందురు. ఎవరు వ్రాసినను అది చక్కని వీరకావ్యము. శ్రీనాథుడు భోగి, బమ్మెర పోతన యోగి.

శ్రీనాథునికి సమకాలికుడగు వల్లభరాయుడు అను చిన్నరాజుం డెను. అతడు క్రీడాభిరామ మను శృంగారప్రధానమగు వీధినాటకమును రచించెను. కాని అది శ్రీనాథుడే వ్రాసినట్లు శైలి తెలుపుచున్నది. ఇద్దరునూ కలిసి వ్రాసిరో యేమో కాని కాకతీయులనాటి సాంఘిక చరిత్రకు క్రీడాభిరామమే ముఖ్యాధారమగు చక్కని గ్రంథము.

వెన్నలకంటిసూరన విష్ణుపురాణమును రచించెను. ఇది భారత భాగవతములవలె ఆంధ్రులలో ప్రచారమైనట్టిది కాదు. అయినను ఇత నిది చక్కని కవిత.

ఈ వంశమువాడే వెన్నలకంటి అన్నయ్య అను కవి యుండెను. అతడేకాలమువాడో తెలియదు కాని పరిశోధకులు అతడు క్రీ. శ. ౧౩ వ శతాబ్దానంతరము వాడన్నారు. బహుశః, ఈ రెడ్డియుగములోని వాడేనేమో. ఈ అన్నయ్యకవి "షోడశకుమారచరిత్రము". ను రచిం చెను, ఇది చక్కని కవిత. అచ్చుపోసినట్లుగా ఒకే ధోరణిలో విసు

గెత్తించు కవిత్వమును కథలనువ్రాసిన ప్రబంధకవురచలనను చదివినవారి కిట్టి కథలు చాలా ఆనందము నిచ్చును. ఈతని షోడశకుమారచరిత్ర కథలు మనోహరమైనవి. ఇట్టి కథలను వ్రాసినవారిలో పేర్కొన దగిన వారు వీరు.

జక్కన — విక్రమార్కచరిత్ర.
అనంతామాత్యుడు — భోజరాజీయము.
కదిరీపతి — శుకసప్తతి.
కొరవిగోపరాజు — సింహాసనద్వాత్రింశిక కథలు.
కేతన — దశకుమార చరిత్ర.
మంచన — కేయూరబాహుచరిత్ర.
వెంకటనాథుడు — పంచతంత్రము.
పింగలిసూరన — కళాపూర్ణోదయము.

ఇవన్నియు ఉత్తమ కవితలు.

ఇంచుమించు క్రీ. శ. ౧౩౮౦ ప్రాంతములో నుండినవాడు రావిపాటిత్రిపురాంతకుడు. సంస్కృతములో ప్రేమాభిరామము రచించెను. అది మాయమైపోయినది. త్రిపురాంతక కవిని ( తిప్పన్నను ) గూర్చి క్రీడాభిరామములో ఇట్లన్నారు.

" నన్నయభట్ట తిక్కకవినాయకులన్న హుళక్కిభాస్కరుం
డన్నను చిమ్మపూడియమరాధిపుడన్నను సత్కవీశ్వరుల్
వెన్నుదుటం గరాంజలులు నింతురు జేయని, రావిపాటి తి
ప్పన్నయు నంతవాడ, తగునా యిటు దోసపుమాట లాడగన్"

ఇతని తెనుగుకృతి త్రిపురాంతకోదాహరణము. అది ఒక్కటే మనకు లభించినది. అది ఉత్తమ శైలి కల్గినట్టిది.

రెడ్డిరాజుల సమకాలికులు రాచకొండ దేవరకొండలకు ప్రభువులైన వెలమరాజులు. అందు సర్వజ్ఞ బిరుదు వహించిన సింగమనాయుడు సంస్కృతములో రచనలు చేసెను.

అతనికాలమందే అతని సీమయందే కోలాచల మల్లినాథసూరి యుండెను. జనగామ తాలూకాలో బమ్మెర అను గ్రామముకలదు. అది పాల్కురికి సోమనాథుని పాలకుర్తికి రెండుమూడు మైళ్ళదూరమున నున్నది. ఆ గ్రామము పోతనామాత్యుని జన్మదేశమై పవిత్రమైనది. పోతనామాత్యుడు ఆంధ్రమహాభాగవతమును రచించిన మహాకవి. అతని భాగవతమును అనేకులు పారాయణము చేయుదురు. అతనికి శిష్యులైన ఏర్చూరి సింగయ్య, వెలిగందల నారయ్య, గంగయ్య అను వారు భాగవతములో కొన్ని భాగములను రచించిరి. సర్వజ్ఞ సింగ భూపాలుడు భాగవతమును తన కంకితమీయమనందున దానినిపాతిపెట్టించ గాఖిలమైన భాగాలను పోతనశిష్యులు పూరించిరను అపవాదము కల్పిత మయ్యెను. అది అబద్ధము. ఆ ముగ్గురు శిష్యులలో ఒకరుకూడా సూచన మాత్రముగానైనను ఆమాట వ్రాయలేదు. ఉన్నైతే వారెందుకు కొన్ని భాగాలను వ్రాసిరనగా పోతన తన శిష్యులను అనుగ్రహించుటకై వారిచే కొన్నిభాగాలను వ్రాయించి తనతోపాటిగా వారినికూడ వంద నీయులనుగా జేయ సంకల్పించి యుండెనేమో! ఆ ముగ్గురుశిష్యుల కవనముకూడా పోతనకవితకు కుడియెడమగా ప్రశంసాపాత్రముగా నున్నది.

పోతన భగవద్భక్తుడు. అతడు భక్తిరసాన్ని అద్వితీయముగా అసామాన్యముగా భాగవతమందు చిప్పిలజేసెను. భక్తిరసఘట్టములందు అతడు కవిత్రయాన్నే కాక ఆంధ్రకవు లందరిని కూడ మించినవా డయ్యెను. ప్రహ్లాదచరిత్ర, కుచేలోపాఖ్యానము, గజేంద్రమోక్షము, ధ్రువచరిత్ర, అంబరీషోపాఖ్యానము, ఉత్తమమైన భక్తిరసప్రధాన ఘట్టములు. అందు ప్రహ్లాదచరిత్ర అగ్రస్థాన మలంకరించును.

"మందారమకరంద మాధుర్యమున దేలు
మధుపంబు పోవునే మదనములకు."

అను పద్యమువంటి పద్యాలు అందు నిండుగా గలవు. క్రీ. శ. ౧౪౨౦ ప్రాంతములో రాచకొండరాజుల యాశ్రియములో నుండిన వాడు కొరవిగోపరాజు. అతని సింహాసనద్వాత్రింశిక మనోహరమగు విక్రమార్కకథల కావ్యము.

## ४ విజయనగర యుగము

క్రీ. శ. ౧౩౨౩ లో మహమ్మదీయులు ఓరుగంటిని పట్టుకొనిరి. ఆ సమయములో ఓరుగంటినుండి సంగమ అనునతని అయిదుగురు కుమారులు హంపీకిని, దానిదగ్గరనుండు కంపిలికిని వెళ్ళి అచ్చట విజయ నగర దుర్గమును తుంగభద్రా తీరమందు నిర్మించి క్రీ. శ. ౧౩౩౬ లో విజయనగరసామ్రాజ్య స్థాపన చేసిరి. ఆ సోదరులలో హక్క (మొదటి హరిహరరాయులు) బుక్క (రాయలు) ముఖ్యులు. క్రీ. శ. ౧౩౪౭ లో బహమనీరాజ్యము స్థాపిత మయ్యెను. అది కొంతకాలానికి అయిదు చీలి కలై పంచసుల్తానులకు మూలమయ్యెను. హరిహరరాయల కాలము బహమనీ సుల్తానులతో పోరాడుటతో సరిపోయెను. అతనికొడుకు రెండవ హరిహరరాయలు క్రీ. శ. ౧౩౭౯ నుండి ౧౪౦౪ వరకు రాజ్యము చేసెను. తర్వాత మొదటి దేవరాయలు రాజయ్యెను. అతనికాలములో బహమనీదాడి యెక్కువై బాధ కలిగించెను. రెండవ దేవరాయలు ౧౪౨౧—౧౪౪౮ వరకు రాజ్యముచేసెను. అతడును దుర్బలుడగురాజు. తుదకు క్రీ. శ. ౧౪౮౬ లో సాళువ నరసింహరాయలను చంద్రగిరి సామంతరాజు విజయనగరాన్ని ఆక్రమించుకొని రాజ్యముచేసెను. అతడు ప్రబలుడై రాజ్యమును విస్తరించి తురక ప్రభువుల నోడించి రాజ్యమును స్థిరపరిచెను. అతని కొడుకు ఇమ్మడి నరసింగరాయలు. అతన్ని క్రీ. శ. ౧౫౦౫ లో అతని సేనాని తుళువంశమువాడగు నరస నాయకుడు చంపి రాజ్యము నాక్రమించుకొనెను. అతని కుమారుడు శ్రీకృష్ణదేవరాయలు క్రీ. శ. ౧౫౦౯ నుండి ౧౫౩౯ వరకు దేదీప్య మానముగా జేగీయమానముగా రాజ్యముచేసెను. విజయనగరరాజ్యము గోదావరి నుండి రామేశ్వరము వరకు వ్యాపించి మహాసామ్రాజ్యమై

సుల్తానుల బలమును భంగపరచిన దయ్యెను. కృష్ణదేవరాయల తర్వాత అతని తమ్ముడు అచ్యుతరాయలు చక్రవర్తి యయ్యెను. అతడు దుర్బలుడు. అతని తమ్ముని కొడుకగు సదాశివరాయలు క్రీ.శ. ౧౫౪౨ లో చక్రవర్తి యయ్యెను. అతడు నామకార్థముగా రాజుగా ఉండెను కాని కృష్ణదేవరాయల అల్లుడగు అళియరామరాజు నిజమైన చక్రవర్తిగా పరిపాలించెను. క్రీ. శ. ౧౫౬౫ లో అయిదుగురు దక్కన్ సుల్తానులు కలిసి తళ్ళికోటయొద్ద రామరాజుతో యుద్ధముచేసి, అతనినిచంపి విజయనగరమును ధ్వంసము చేసిరి. కాని విజయనగరబలము నాశనము కాలేదు.

రామరాజు తమ్ముడు తిరుమలరాజు పెనుగొండను రాజధానిగా చేసుకొని విజయనగరసామ్రాజ్యాన్ని పాలించెను. అతని తర్వాత వేంకటపతిరాజు క్రీ. శ. ౧౫౮౫ లో పెనుగొండకు రాజయ్యెను. అతని తర్వాత శ్రీరంగరాయలు చంద్రగిరిని రాజధానిగా చేసుకొని ఇంచుమించు ౧౬౫౦ వరకు రాజ్యముచేసెను. అటుతర్వాత విజయనగరసామ్రాజ్యము సంపూర్ణముగా నశించెను.

ఇక ౧౩౫౦ నుండి ౧౬౫౦ వరకు తెనుగువాఙ్మయస్థితి యెట్టిదో కనుగొందము.

ఈ 300 ఏండ్ల కాలమును ప్రబంధ యుగమని చెప్పవచ్చును. ఈ కాలములో అష్టాదశవర్ణనలతో సంస్కృతపద భూయిష్ఠశైలితో, శబ్దాలంకారబాహుళ్యముతో, గొప్పగొప్ప ప్రబంధాలు రచింపబడెను.

మొదట బుక్కరాయలకాలములో నాచనసోమనాథుడను మహాకవి యుండెను. అతనికి గుత్తిదుర్గము క్రిందనుండు పెంచికలదిన్నెను అగ్రహారముగా బుక్కరాయలు దానము చేసినందున అతడా గ్రామము వాడనుట స్పష్టము. ఆ దానశాసనములో కవి నిట్లు వర్ణించినారు.

"యాజుషాణాం వరేణ్యాయ సకలాగమవేదినే
అష్టాదశపురాణానామభిజ్ఞాతార్థవేదినే
అష్టభాషా కవిత్వశ్రీవాణీవిజితసంపదే
సోమాయ నాచనాంభోధేః సోమాయామితతేజసే".

దీన్నిబట్టి అతని పాండిత్యకవిత్వమహత్త్వము సువ్యక్తమగుచున్నది.

తిక్కనవలె అతడు అసాధారణకవి. అతడు ఉత్తరహరివంశమును రచించెను. అతడు క్రీ. శ. ౧౩౪౦ ప్రాంతమువాడు. అతడు "సకలభాషాభూషణుడు" "సాహిత్య రసపోషణ సంవిధాన చక్రవర్తి" "ఎలికంబున యక్కిని ఇచ్చినట్టి సర్వజ్ఞుడు" "అష్టభాషాకవిత్వవిశారదుడు" "నవీనగుణసనాథుడు" సీసపద్యము ఇతని చేతిలో పరిణతి పొందెను.

కహ్లార మకరంద కలిత మందాకినీ
లహరీ పరీత కోలాహలంబు
బాలేందు చంద్రికా పరభాగ శోభా ప
రాగ సంభావితా రగ్వధంబు
సేవా సమాసన్న సిద్ధ సీమంతినీ
తాలవృంతోత్తాల తాండవంబు
కాత్యాయినీ దత్త కర్ణావతంస క
ర్పూర ఖండామోద పూరితంబు
మారుతంబదినామీద మలసియాడ
గలుగునాకో నాకు నొకనాడు కన్నులార
శివుని జూచు పుణ్యంబను చింత నెరయ
మొదలివేలుపు బొడగంటి మ్రొక్కగంటి.

ఈ నడకను శ్రీనాథుడు నేర్చుకొని తన సీసపద్యాలను తీర్చిదిద్ది యలంకరించుకొనెను. నాచనసోమనాథుడు సామెతలను ఎక్కువగా వాడిన మొదటి తెనుగుకవి. ఉత్తమమగు హాస్యమునకు కూడా ఇతడే మొదటివాడు.

మొదటి దేవరాయల మంత్రిగానుండిన సిద్ధనకు జక్కనకవి తన విక్రమార్కచరిత్రను అంకితమిచ్చెను. జక్కన క్రీ. శ. ౧౪౩౦-౧౪౪౭ ప్రాంతమందుండెను. తన కవిత్వమును గూర్చి యిట్లు వ్రాసుకొనెను.

చక్కన నీ వైదుష్యము
చక్కన నీ కావ్యరచన చాతుర్యంబుల్
చక్కన నీవాగ్వైఖరి
చక్కన నీవంశమహిమ జక్కన సుకవీ.

ఇతడు చక్కని కథలవ్రాసెను. సంస్కృతాంధ్రములందు అనర్గళ ధార కలవాడు.

కల్పాంత దుర్దాంత కలుషాంత కస్వాంత
దుర్వార వహ్నికి నోర్వవచ్చు
నిష్ఠుర నిర్ఘోష నిర్ఘాత సంఘాత
జాత మహావహ్ని సైపవచ్చు
ప్రళయకాలాభీల ఫాలలోచన ఫాల
భాగానలస్ఫూర్తి బ్రతుకవచ్చు
కాకోదరేంద్ర ఫూత్కార సంభవ తీవ్ర
కాకోల దహనంబు గదియవచ్చు
కాక సైరింపవచ్చునే లోకదహన
దర్పితంబైన యస్మత్ప్రతాపవహ్ని

తావకోత్సాహ సాహసౌదార్య ధైర్య
గతికి మెచ్చితి విక్రమార్క క్షితీంద్ర.

అని సంస్కృతపద జటిలముగా వ్రాసెను.

పలుకులువేయు నేటి కిక, బ్రాహ్మణసూనుడవీవు, నీకు దో
ర్బలమున కేమి కారణము, బాపనపోటును కప్పకాటునుం
గలదె ధరిత్రి, భట్టిమొన గట్టిగ నమ్మకు, మోసపోకు, నీ
కొలదులె రాచకార్యములు, కోమటిబుద్ధుల దీర్ప దీరునే.

అని లలితముగా గూడా రచించెను.

పిల్లలమఱ్ఱి పినవీరన సూర్యాపేట యొద్దనుండు పిల్లలమఱ్ఱి వాడని యందురు. అతడు జైమినీభారతము వ్రాసి సాళువ నరసింహరాయల కంకితమిచ్చెను. అతని శృంగార శాకుంతలము, జైమినీభారతము ప్రసిద్ధ కావ్యములు. "వాణి నారాణి" అని యెదవిరుచుకొని పలికిన దీ పినవీరనయేనట! ఈ వీరభద్రుడు "విపులచాటూక్తి నిర్నిద్రుడు"

తుళువవంశపు నరసింహరాయలకు నందిమల్లయ్య ఘంటము సింగయ అను జంటకవులు తమ వరాహపురాణము నంకిత మిచ్చిరి.

శ్రీకృష్ణదేవరాయల కాలము ఆంధ్రసారస్వతమునకు మహావైభవ కాలము. అతని యాస్థానములో అష్టదిగ్గజములు అను యెనిమిదిమంది కవులుండిరని ప్రతీతి. కాని అందు పేర్కొనబడిన కవులలో కొందరే అతని ఆస్థానమువారు కారు.

శ్రీకృష్ణదేవరాయలు స్వయముగా మహాకవి. అతడు ఆముక్తమాల్యదను వ్రాసెను. దాన్ని అతడు వ్రాయలేదనీ మనుచరిత్ర వ్రాసిన అల్లసాని పెద్దన వ్రాసెననీ అందురు. కాని ఈ రెండుపుస్తకముల శైలిని చూచిన రెంటికినీ ఏమిన్ని పోలికలేదు. ఆముక్తమాల్యదశైలి చాలా

బినను, మనుచరిత్రశైలి తీర్చిదిద్ది మృదువుగా, ఇంపుగా ఉండునట్లు వ్రాసినది. ఆముక్తమాల్యద సానబట్టని గనిలోని రత్నము. మనుచరిత్ర మెరుగిచ్చి వంకలుదిద్దిన వజ్రము.

మ॥ గృహసమ్మార్జనమో, జలాహరణమో, శృంగారపల్యంకికా
వహనంబో, వనమాలికా కరణమో, వాల్లభ్యలభ్యధ్వజ
గ్రహణంబో, వ్యజనాతపత్రధృతియో, దాద్దీపికారోపమో
నృహరీ, వాదములేల? లేరె యితరుల్ నీ లీలకుం బాత్రముల్
— ఆముక్తమాల్యద.

మ॥ బహురత్నద్యుతి మేదురోదర దరీభాగంబులంబొల్చు ని
మ్మిహికాహార్యమునం జరింతు మెపుడుం బ్రేమన్ నభోవాహినీ
లహరీ శీతల గంధవాహ పరిఖేల న్మంజరీ సౌరభ
గ్రహణేందిందిర తుందిలంబు లవి మత్కాంతార సంతానముల్.
— మనుచరిత్ర.

ఏపద్యము చూచినను రెంటిలో ఇట్టి శైలిభేద ముండును. కాన శ్రీకృష్ణరాయలే ఆముక్తమాల్యదను రచించెనని విశ్వసింపవలెను. బ్రాహ్మణేతరుల కవిత్వ మెంత మంచిదైనను అది "కాకజుష్టంబైన హవ్యంబువోలె గ్రాహ్యంబుకాదు" అని తిట్టిన అప్పకవి తన అప్పకవీయములో ఆముక్తమాల్యదను ఉదహరించి నప్పుడంతయు అది పెద్దన్నగారిది అని వ్రాసెను. అక్కడినుండి ఈ కథకు కాళ్ళువచ్చెను. ఆముక్తమాల్యదను విష్ణుచిత్తీయ మనియు అందురు. శైలి బాగుగా లేకున్నను అందలిభావములు వర్ణనలు అనితరకావ్య లభ్యములు.

(కృష్ణదేవరాయలకు ముఖ్యమైన ఆస్థానకవి అల్లసా[illegible]పెద్దన. అతనికి 'ఆంధ్రకవితాపితామహ' అని బిరుదమిచ్చి అతనికాలి[illegible]చక్రవర్తి స్వయముగా గండపెండేరమును తొడిగించెను) కృష్ణదేవరాయలు చని

పోయిన తర్వాత అల్లసానిపెద్దన అతనిని తలచుకొని వాపోయిన పద్యము చదువు ఆంధ్రులుకూడా ఆనాటి వైభవమును తలచుకొని దుఃఖించక మానరు. పెద్దన రాయలనుగూర్చి యిట్లు విలపించెను.

" ఎదురైనచో దనమదకరీంద్రము డిగ్గి
  కేలూత యొసగి యెక్కించుకొనియె
మనుచరిత్రం బందు కొనువేళ పురమేగ
  పల్లకి తనకేల బట్టి యెత్తె
బిరుదైన కవిగండపెండేరమున కీవె
  తగుదని తానెపాదమున దొడిగె
గోకటగ్రామాద్య నేకాగ్రహారంబు
  లడిగిన సీమలయందు నిచ్చె
ఆంధ్రకవితాపితామహ యల్లసాని
పెద్దనకవీంద్ర యని నన్ను బిలుచునట్టి
కృష్ణరాయలతో దివి కేగలేక
బ్రతికియున్నాడ జీవచ్ఛవంబ నగుచు."

శ్రీకృష్ణదేవరాయుల ఆస్థానమందలి అష్టదిగ్గజము లెవరనగా:—

౧. అల్లసానిపెద్దన.
౨. నందితిమ్మన (ముక్కుతిమ్మన)
౩. అయ్యలరాజు రామభద్రకవి
౪. ధూర్జటి
౫. మల్లన (ప్రౌఢకవి)
౬. పింగళిసూరన.
౭. రామరాజ భూషణుడు
౮. తెనాలిరామకృష్ణుడు.

తుదిముగ్గురు కృష్ణరాయల కాలములో గ్రంథాలేవీ రచింప లేదు.

నందితిమ్మనకు ముక్కు పెద్దదిగా నుండెనేమో ముక్కు తిమ్మన్న అనియే అతడు ప్రసిద్ధినొందెను.

"ముక్కుతిమ్మనార్యు ముద్దుపలుకు"

అని నానుడి యేర్పడెను. అతడు పారిజాతాపహరణమును రచించెను. అది ఉత్తమకావ్యాలలో చేరినట్టిది.

మ॥ జలజాతాసన వాసవాది సుర పూజాభాజనంబై తన
ర్చు లతాంతాయుధు కన్నతండ్రి శిర మచ్చో వామపాదంబునన్
దొలగందోసె లతాంగి యట్లయగు నాథుల్ నేరముల్ సేయు పే
రలుకం జెందినయట్టి కాంత లుచితవ్యాపారముల్ నేర్తురే.

ఇట్టి సుందర పద్యములను నందితిమ్మన వ్రాసెను.

కృష్ణరాయల కాలములో యెల్లనార్యుడు, నాదెండ్లగోపప్రధాని కూడా రచనలుచేసిరి. అవంత గొప్పవికావు.

ధూర్జటికవి కాళహస్తిమాహాత్మ్యము అను కావ్యమును రచించెను. అదిఉత్తమప్రబంధాలలో చేరినట్టిది. మల్లన రాజశేఖరచరిత్రము కూడా అదే శ్రేణిలో చేరినది.

అళియరామరాజు ఆస్థానకవి యగుటచే రామరాజభూషణుడు అను ఖ్యాతి గాంచిన భట్టుమూర్తికవి వసుచరిత్రను వ్రాసెను. అందు శ్లేషలు, యమకములు, ఉత్ప్రేక్షలు,విశేషముగా కలవు. అతడు వ్రాసిన పద్ధతిపై ఇతరులువ్రాయబోయి వెల్లకిల బడిరి. అతనిని పూర్తిగా ప్రతి పద్యములో అనుకరించినవాడు కొల్లాపుర మాధవరాయలు. అతడు చం ద్రికాపరిణయమును రచించె నందురు.

రామరాజు కాలములో పింగళిసూరన కళాపూర్ణోదయమును రచించెను. అది అద్భుతకల్పనాకథ. అది తెనుగు సారస్వతములో అపూర్వమగు గ్రంథము. ఇతని ప్రభావతీప్రద్యుమ్నము కూడా చక్కని గ్రంథము. ఇతడు మొదటి ద్వ్యర్థికావ్యమగు రాఘవపాండవీయము రచించెను.

ఇదేకాలములో తెనాలి రామకృష్ణుడు పాండురంగమాహాత్మ్యమును రచించెను. అందు మారు మూలపదాలు బహుళము. కొన్ని వర్ణనలు చక్కగా ఆకర్షకముగా నున్నవి.

విజయనగరసామ్రాజ్య కాలములో ఈ క్రిందివారు కూడా రచనలు చేసిరి. మనుమంచిభట్టు, దుగ్గన, తాళ్ళపాక చిన్నన్న, సంకుసాల నృసింహకవి (కవికర్ణ రసాయనకర్త) రామభద్రకవి, ఎర్రన (శృంగార మల్హణచరిత్ర కర్త) రామరాజ రంగప్ప, కుమారధూర్జటి (కృష్ణరాయ విజయము) చరిగొండ ధర్మన్న, అదుకుల వెంకయ్య (రామరాజీయము), తిరువెంగళనాథుడు, మున్నగు పలువురు తమతమ శక్తికొలది పద్యకావ్యాలు రచించిరి. కాని ఇవి ఉత్తమశ్రేణిలోనివి కావు.

విజయనగరపు తుదిరాజగు శ్రీరంగరాయలు చంద్రగిరిలో రాజ్యము చేసిన కాలముననో ఇంచుక తర్వాతి కాలముననో క్రీ. శ. ౧౬౦౦-౧౬౫౦ ప్రాంతములో నుండినవాడు కదిరీపతి. ఇతడు అనంతపుర మండలములోని కదిరి నివాసి. ఇతడు శుకసప్తతియను కథలపుస్తకమును రచించెను. ఈశుకసప్తతి తెనుగు సారస్వతములో తృతీయపంథ తొక్కినదన వచ్చును. ఇందు హాస్యము, తెనుగు నుడికారము, లలితమగు శైలి, లోకానుభవము, చక్కని శృంగారరసము, అన్నియు నిండి ప్రతిపద్యము మనోహరముగా నుండును. ఇతని వర్ణనలు ఇతర ప్రబంధ కవులవలె యథాంధానుకరణములుకావు. విరహతాపం కలిగితే కవులందరు చంద్రుని, గాలిని, చిలుకలను, వసంతుని తిట్టిరి. ఈ కవి కథలోని ఒక బ్రాహ్మణుడు విరహతాపము పొంది యిట్లవస్థ పడినాడు.

"ఒడిలోన పంచాంగ ముంచుకొన్నది గాన
కేటు పోయె ననుచు నూరెల్ల వెదకు
పనిలేనిపని వీధి జనుచు గ్రమ్మరు నాత్మ
గృహమంచు నెంచి యిల్లిల్లు దూరు
అపుడు భుక్తి యొసర్చి యవ్వనపే సంకటి
తింటినా యని యింటి తెరవ నడుగు
కురుచదోవతి కట్టుకొని యెవ్వరోయిట్లు
కట్టిపోయి రటంచు గలవరించు
గడియలో దెల్లవారె, భాస్కరుడు గ్రుంకె
జాగు లేలంచు సందెపై సందె వార్చు
కంతమాయల నుమ్మెత్త కాయ దిన్న
పోలుపు సారెకు డెల్పు నప్పుడమి వేల్పు."

ఏవర్ణన యైనను సరే సహజాలంకారములతో స్వభావోక్తులతో చక్కని జాను తెనుగుతో నిండి యుండును.

## గోలకొండ కవులు

విజయనగరరాజుల కాలములో గోలకొండ కుతుబ్షాల కాలములో అందు ముఖ్యముగా ఇబ్రహీంకుతుబ్ షా కాలములో పలువురు తెనుగుకవు లుండిరి. అందు ముఖ్యులు మొదటి అచ్చ తెనుగు కావ్య మగు యయాతిచరిత్రమును వ్రాసిన పొన్నగంటి తెలగనార్యుడు, మలిక్ ఇబ్రహీంకుతుబ్ షా (మల్కిభరాముని) ఆస్థానకవి యైన అద్దంకి గంగాధర కవియునై యుండిరి. ఇతడు తపతీసంవరణోపాఖ్యానమును రచించెను. గోలకొండఖిల్లాలో కరణముగా నుండిన సారంగుతమ్మయ వైజయంతీ విలాసమను మంచికావ్యమును రచించెను. ప్రౌఢకవి మల్లారెడ్డియు ఈ కాలమువాడే. అతడు దోమకొండ ప్రభువులకు పూర్వపురుషుడు, అతడు షట్చక్రవర్తిచరిత్ర మున్నగు పెక్కుగ్రంథాలను రచించెను. నిరంకుశోపాఖ్యానమును వ్రాసిన సంకుసాల రుద్రయ్యయు ఈ కాలమువాడే. ఓరు

గల్లును కొంతకాలము పాలించిన షితాబ్ ఖాన్ (సీతాపతి) కాలములో చరిగొండధర్మన్న చిత్రభారతమును రచించెను.

క్రీ. శ. ౧౪౫౦ ప్రాంతములో రాయచూరుమండలములో కృష్ణాతీరమందుండిన అనంతామాత్యుడు భోజరాజీయమను ఉత్తమ కావ్యమును రచించెను. ఇందలి శైలి సరళమేకాక విశిష్టపాండిత్యముతోకూడినట్టిది. స్వభావవర్ణన లిందెక్కున కలవు. ఇతడు గొప్పలాక్షణికుడు. రసాభరణము అను అలంకారశాస్త్రమును రచించెను. క్రీ.శ. ౧౬౦౦ ప్రాంతములో పాలమూరు జిల్లాలోని వేమావిళ్ల (నవచూతపురము) అను గ్రామవాసియగు అప్పకవి అప్పకవీయమును వ్రాసెను. తర్వాతివారికిది గొప్ప ప్రమాణగ్రంథ మయ్యెను. కాని ఇతని ననుసరించిన వారందరు చచ్చుకవిత్వమే వ్రాసి రనవలెను.

ఎలకూచిబాలసరస్వతి అను నతడు క్రీ. శ. ౧౬౦౦ ప్రాంతమువాడు. కొల్లాపురమురాజగు మల్లభూపాలు నాశ్రయించి మల్లభూపాలీయమును రచించెను. ఇది భర్తృహరి శతకత్రయానికి తెనుగుసేత.

ఇంచుమించు క్రీ. శ. ౧౩౬౦ ప్రాంతమున సర్వజ్ఞ సింగభూపాలుని పుత్రుడగు మాధవుని వద్ద రాచకొండలో నుండినట్టి గౌరన, అను కవి హరిశ్చంద్ర ద్విపదను, నవనాథచరిత్ర ద్విపదను రచించెను. ఈ రెండునుఉత్తమరచనలు. అందు హరిశ్చంద్ర ద్విపద యేమిన్న, ద్విపద ప్రబంధాలలో నిది ప్రాజ్యస్థాన మందినది. గౌరన కుమారుడు భైరవుడు. ఇతడు శ్రీరంగమహత్త్వము అను ప్రబంధమును రచించెను.

## ౫ తంజావూరియుగము

ఆంధ్రసామ్రాజ్యము క్రమక్రమముగా దక్షిణాభి ముఖమయ్యెను. విజయనగర సామంతులుగా మండలాధిపతులుగా (గవర్నరులుగా) మధురను, తంజావూరును నాయకరాజులు పాలించుచూ ఉండిరి. అందు

మధుర సారస్వతపోషణకు ప్రసిద్ధి కెక్కుదయ్యెను. తంజావూరు రాజులు మాత్రము ఆంధ్రసారస్వతమును పోషించిన తుదిరాజులు. అట్టిరాజులను గూర్చి ముందు కొంత తెలుసుకొన వలెను.

విజయనగరచక్రవర్తి యగు అచ్యుతదేవరాయలభార్యకు చెల్లెలి భర్త యగు చినచెవ్వప్ప నాయకుడు క్రీ. శ. ౧౫౪౦ ప్రాంతమందు తంజావూరికి నాయకరాజయ్యెను. అతని కుమారుడు అచ్యుతనాయకుడు క్రీ. శ. ౧౫౬౧ లో రాజై, ఇంచుమించు ౫౦ ఏండ్లు రాజ్యము చేసెను. అతని కుమారుడు రఘునాథరాయలు క్రీ. శ. ౧౬౧౪ నుండి ౧౬౩౩ వరకు తంజావూరు రాజ్యమును పాలించెను. అతని తర్వాత అతని కుమారుడగు విజయరాఘవ నాయకుడు క్రీ. శ. ౧౬౩౩ నుండి ౧౬౭౩ వరకు రాజ్యము చేసెను. అతని తర్వాత తంజావూరురాజ్యము క్షీణించి తుదకు శివాజీసోదరుడైన ఏకోజీ వశమై మహారాష్ట్రుల పాలనము లోనికి వెళ్ళి ఇంగ్లీషువారు ప్రభువులైన తర్వాత వారివశమైపోయెను.

తంజావూరి రాజులలో రఘునాథరాయల కాలమునను, విజయరాఘవుని కాలమునను ఆంధ్రసారస్వతము ఇంచుమించు నూరేండ్ల కాలము పోషింపబడినదయ్యెను. ఈరాజులకాలములో పలువురు స్త్రీలు, భోగస్త్రీలుకూడా సంస్కృతాంధ్రములందు రచనలు చేసిరి. రఘునాథరాజు స్వయముగా మహాపండితుడు. ఉత్తమకవి. సంగీతములో క్రొత్త రాగములను కనిపెట్టి ప్రచారము చేసినవాడు,అప్రతిహతవీరుడు. ఈతడు రచించిన బహు సంస్కృతాంధ్ర గ్రంథములు లభించినవి కావు. వాల్మీకి చరిత్ర మనున దొక్కటి ముద్రిత మైనది. అది యుత్తమశ్రేణిలో చేరిన గ్రంథము.

రఘునాథనాయకుని ఆస్థానకవి చేమకూర వేంకటపతి. "ఈ చేమకూర చక్కెర మడిలో అమృతము పారించి పెంచినట్టిది" అని శ్రీవేదము వేంకటరాయశాస్త్రిగా రనిరి. ఈచేమకూర వేంకటపతి సారంగధర చరి

త్రము, విజయవిలాసము అను రెండు ప్రబంధములను రచించెను. ఈ రెండును ఆంధ్రసారస్వతమందు అమూల్యమగు రత్నములు.

విజయరాఘవుని కాలములో ఉత్తమకావ్యాలు వెలువడ లేదు. కాని పలువురు స్త్రీ పురుషులు యక్షగానాలను, చరిత్రలను, మున్నగు వాటిని రచించిరి. అందు రంగాజమ్మ (మన్నారుదాసవిలాసము) ముఖ్యమైనది. కాళకవి, వేంకటపతిసోమయాజి యనువారును ప్రబంధాలు వ్రాసిరి.

## మధుర రాజులు

తంజావూరు రాజులెట్లు విజయనగరానికి సామంతులై యుండిరో అటులే మధురనాయకులును ఆదేకాలములో సామంతులై తర్వాత స్వతంత్రులై యించుమించు తంజావూరు పడిపోయినప్పుడే పడిపోయిరి.

వారికాలములో కొందరు సాధారణ ప్రబంధాలు వ్రాసిరి. అందు ముఖ్యులు శేషము వేంకటపతి (తారాశశాంకము). వేంకటకృష్ణప్పనాయకుడు అహల్యాసంక్రందనమును వ్రాసెను. అతడే జైమినీ భారతమును వచనముగా వ్రాసెను. మట్లఅనంతభూపాలుడు, విజయరంగచొక్కనాథుడును ప్రబంధాలు రచించిరి. వీరిలో శేషము వేంకటపతి తారాశశాంకము చక్కని శైలిగలది. కామాంధుల భావ చేష్టితములను రసవంతముగా వర్ణించినాడు. "బిసరుహమాకరందర సపేశలకౌశలవన్మృదూక్తులక్ రసికుల కింపుగా గృతిపరంపరలక్ రచియించి"న వాడని చెప్పుకొనినాడు. ఇతడు మధుర రాజగు విజయరంగచొక్కనాథుని కాలము క్రీ. శ. ౧౭౦౦ – ౧౭౫౦ ప్రాంతములో నుండినట్టివాడు.

## ౬ సంధియుగము

విజయనగర పతనానంతరము చిల్లరపాలెగాళ్లను, రెడ్లను, ధనికులను,ఆశ్రయించి పలువురు కవులు రచనలుచేసిరి. వారి నేయుగములోను చేర్చుటకు వీలులేనందునను. వారు మన ఆధునికయుగానికి పూర్వులయి

సందునను క్రీ. శ. ౧౭౦౦ నుండి ౧౮౦౦ వరకుండు కాలమును సంధి యుగమని పేర్కొనవైనది. ఈ కాలములో ఉత్తమరచనలు కాన వచ్చుట లేదు. అట్లున్నను సారస్వతచరిత్రలో ఆకవులను గూడా సూచిం చుట అవసరము. ఈ కాలములో ముఖ్యులైన కవులను వారి రచనలను సూచింతుము.

శంకరకవి — హరిశ్చంద్రోపాఖ్యానము.
చిత్రకవి సింగరార్యుడు — బిల్హణీయము.
కిరీటి వేంకటాచార్యులు — అచలాత్మజా పరిణయము.
కుమ్మరిమొల్ల — రామాయణము.
ముద్దుపళని — రాధికాసాంత్వనము.
అడిదముసూరకవి — రామలింగేశశతకము.
కూచిమంచి తిమ్మకవి — రసికజనమనోభిరామము.
మున్నగు బహుగ్రంథములు.
కూచిమంచి జగ్గకవి — చంద్రరేఖావిలాపము,
సుభద్రాపరిణయము.
శిష్టు కృష్ణమూర్తి — చాటువులు, కొన్నికావ్యాలు.
బిజ్జల తిమ్మారెడ్డి — అనర్ఘరాఘవము.
కాణాదము పెద్దన — అధ్యాత్మరామాయణము,
ముకుందవిలాసము.
తరిగొండ వెంకమ్మ — వెంకటాచల మాహాత్మ్యము.

ఈ సంధియుగములో ఇద్దరిని గురించి ప్రత్యేకముగా సూచించ వలెను. ఒకరు వేమన; ఇంకొకరు త్యాగరాజు. వేమన క్రీ. శ. ౧౭౦౦—౧౭౫౦ ప్రాంతములోనివాడు. అతడు ఆటవెలదులు వ్రాసినట్లుగా ఏ తెలుగు కవియు నేటివరకు వ్రాయలేదు. అతడు మహాకవి, గొప్ప వేదాంతి. అందులో సకలజనులకు అర్థమగు వేదాంతమును బోధించిన వాడు. అతడు అపూర్వసంఘసంస్కర్త. సంస్కర్తలు విమర్శిస్తేనే జను

లకు కోపము. వేమన లోపమున్నవారిని తిట్టి అందరినీ నవ్వించి మెప్పు పొందినవాడు. అతని పద్యాలైదైనా కంఠపాఠమురాని తెనుగు విద్యావంతుడు కానరాడు.

క్రీ. శ. ౧౭౫౯ నుండి ౧౮౪౭ వరకు తంజావూరిలోని తిరువాడిలో నివసించిన త్యాగరాజు ఆంధ్రులచరిత్రలో అద్వితీయుడైన గాయక చక్రవర్తి. అంతేకాదు మొత్తము ద్రావిడ భాషాకుటుంబమునకంతటికినీ ఇతడే సంగీతమందు ఆశ్రయభూతుడైనాడు. ఇతని కీర్తనలు పాడినవారే గాయకులు. ఇతని కీర్తనలు పాడలేనివారు దక్షిణదేశమందు గాయకు లనిపించుకోనరు.

ఈ యుగములోని తక్కిన కవులెవరనగా—:

కనుపర్తి అబ్బయ — కవిరాజ మనోరంజనము.
నారాయణ దిట్టకవి - రంగరాయచరిత్ర.
అయ్యలరాజు నారాయణకవి — హంసవింశతి.
చెవలువాడమల్లయ — విప్రనారాయణచరిత్ర.
కంకంటి పాపరాజు — ఉత్తరరామాయణము.
పుష్పగిరి తిమ్మన — సమీరకుమారవిజయము.
పిండిప్రోలు లక్ష్మణకవి — లంకావిజయము.
గోపీనాథము వేంకటకవి — గోపీనాథరామాయణము.
ఓగిరాల జగన్నాథకవి .. సుమనోమనోభిరంజనము.

## ౭ ఆధునిక యుగము

క్రీ. శ. ౧౮౫౦ ప్రాంతమునుండి యే రచనలు చేసినవారైనను వారు మనకాలములో ౧౯౦౦ తర్వాత గతించినవారు పలువురు రచయిత లుండినందున అట్టివారిని కూడా ఈయుగములో చేర్చనైనది. నిజముగా ఈ యుగము అచ్చు విరివిగా ప్రారంభమైన నాటినుండి అనగా ౧౭౭౦–౧౮౫౦ లో నుండిన బ్రౌన్, ఆ దేశకాలములో అతని యొద్దనుం

డిన జూలూరిఅప్పయ్య కాలమునుండియే లెక్కపెట్టవలెను. అచ్చుపద్ధతి యురోపునుండి మనకు లభించినది. క్రీ. శ. ౧౫౭౭ లోనే గోవాలో చేరిన పోర్చుగీసువారిచే ప్రవేశపెట్టబడెను. మొదటి తమిళనిఘంటువు క్రీ. శ. ౧౬౭౯ లో అచ్చయ్యెను. మొదటి అచ్చుపుస్తకాలు క్రైస్తవుల బైబిల్ గ్రంథాలే. మన తెనుగులో క్రీ. శ. ౧౮౦౦ ప్రాంతములో అచ్చుమొదలయ్యెను. కాని ౧౮౬౦ తర్వాతనే దానికి వ్యాప్తి కలిగెను. బ్రౌన్, అను ఇంగ్లీషుపండితుడు ఇంగ్లీషు తెనుగు నిఘంటును రచించెను. అతడు వేమనపద్యాలను ఇంగ్లీషులో అనువదించెను. తెనుగులో తాతాచార్యులకథలు అను పుస్తకాన్ని వ్రాసెను. అతడు తెనుగు తాటాకు పుస్తకాలను తెప్పించి మదాసులో ప్రాచ్యలిఖితపుస్తకాగారములో నుంచెను. మెకంజీ అను మరొక ఇంగ్లీషువాడు ౧౭౮౩ నుండి ౧౮౨౦ ప్రాంతమువరకు మద్రాసులో ఇంజనీయరుగా నుండెను. అతడు తెనుగు దేశములోని చారిత్రికగాథలను అన్నింటిని వ్రాయించి "కైఫీయతులు" సమకూర్చి అదే లిఖితపుస్తకాగారములో నుంచెను. నేటికిని అవి అమూల్యమైనవి కాని వాటిని ముద్రించు ఆలోచన ఎవ్వరున్నూ చేయనందున అవి శిథిలమై పోతున్నవి. యూరోపునుండి మన దేశమునకు వచ్చిన మిషనరీలకు మనము చాలా ఋణపడి యున్నాము. వారు మన దక్షిణభాషలలోని ఆటవికభాషలకుగూడా వ్యాకరణాలువ్రాసి ఆభాషలలో క్రైస్తవమతపుస్తకములను రచించి అచ్చువేసిరి. క్రీ. శ. ౧౮౫౬ లో కాల్డ్వెల్ అను ఇంగ్లీషుపండితుడు తెనుగు, తమిళము, కన్నడము, మళయాళము మున్నగు దాక్షిణాత్య ద్రావిడభాషల కన్నింటికిని ఒక భాషాశాస్త్రమును రచించి ముద్రించెను. కురుఖు అను లిపిలేని ఆటవిక భాషకు డాక్టర్ హాన్ అనువాడు వ్యాకరణము వ్రాసెను. మల్తో అను మరొక భాషకు డ్రోజేఅనువాడు వ్యాకరణము వ్రాసెను. గొండిభాషకు విలియంసన్ వ్యాకరణము వ్రాసెను. కోదుభాషకు బుషే మొదలగు ముగ్గురు పాశ్చాత్యులు వ్యాకరణములు వ్రాసి బైబిలును ఆ భాషలో ముద్రించిరి. గ్రీర్సన్ అను ఇంగ్లీషువాడు భారతీయ భాష లన్నింటిని గురించిన పుస్తకాల సంపుటముల ననేకముగా రచించి ముద్రించెను.

( Linguistic Surwey ) మన తెనుగునకుగూడా క్రీ. శ. ౧౮౫౦ ప్రాంత ములో ఫ్రెంచిమిషనరీలు నిఘంటువును, వ్యాకరణమును వ్రాసిరి. క్రీ. శ. ౧౮౦౭ లో తెనుగు వ్యాకరణ మొకటి అచ్చయ్యెను. ఈ విధముగా ఇంగ్లీషు, ఫ్రెంచి, పోర్చుగీసువారు మన ద్రావిడభాషలకు చేసినసేవలో దశాంశమైనను నేటికినీ మనము చేయలేదు.

ఇంగ్లీషువారు మన దేశమును జయించి మనల బానిసలనుగాచేసి మనలను రాజకీయముగా ఆర్థికముగా పతితులనుగా జేసిరి. కాని మన సారస్వతానికి వారు అపారముగా ఉపకారము చేసిన వారైరి.

ఒక వేయియేండ్లనుండి, మనము వ్రాసినపురాణాలనే వ్రాస్తూ వర్ణించిన శృంగారాన్నే మళ్ళిమళ్ళీ వర్ణిస్తూ వ్రాసినపద్యాలనే వ్రాస్తూ ఉండినవారము. మనలో గొప్పమార్పును ఇంగ్లీషువాఙ్మయము కలిగించెను. ఇంగ్లీషువిద్య దేశమందు వ్యాపించినకొలది మనలో మార్పులుకలిగెను. తత్ఫలితముగా వచనములు, నవలలు, నాటకాలు, సైన్సులు, చరిత్రలు, భూగోళము, చిన్నకథలు, ఖండకావ్యాలు, గేయములు, క్రొత్త వర్ణనలు, నూత్నవిధవిమర్శలు, వ్యాసములు, ఏకాంకికలు, హాస్యరచనలు, పరిశోధనలు, శాసనప్రచురములు, భాషాశాస్త్రము, వివిధపత్రికలు పరభాషా సారస్వతముల భాషాంతరీకరణములు, కుప్పతెప్పలుగా మనలో బయలుదేరెను. ఇతర దేశభాషల పరిచయమేకాక, ప్రపంచములో అన్ని భాషల పరిచయము మనకుకలిగెను. ఈకారణాలచేత మనవారి వేయేండ్ల కృషి ఒకయెత్తు ౧౮౫౦ నుండి నేటివరకు జరిగిన ఈ నూరేండ్లకృషి ఒకయెత్తు అనిన అతిశయోక్తి కానేరదు.

ఆధునికయుగములో కలిగిన మార్పులు సూక్ష్మముగా తెలుపనైనది. ఆ మార్పులకు కారకులైన కవి పండితుల పట్టికలను ఇచ్చుట సాధ్యముకాని పని. అందుచేత క్రీ. శ. ౧౮౦౦ నుండి ఇంతవరకు భాషా సేవ చేసినవారి పేరులు సూచించుటకు వీలులేదు.

ఆంధ్రవాఙ్మయచరిత్ర అతిసంగ్రహముగా ఇందు సూచితమైనది. ఇందు ఉత్తమ కృతులని సూచించిన వన్నియు సారస్వతప్రియులు చదువవలెను.

ఆంధ్రసారస్వతచరిత్రను విపులముగా తెలుసుకొనగోరువారీక్రింది గ్రంథములను చదువవలెను.

౧. ఆంధ్రకవులచరిత్ర — కందుకూరి వీరేశలింగము

౨. ఆంధ్రవాఙ్మయచరిత్ర, శతకవాఙ్మయచరిత్ర — వంగూరి సుబ్బారావు

3. ఆంధ్రవాఙ్మయచరిత్ర సంగ్రహము— కె. వేంకటనారాయణ

౪. ఆంధ్రసారస్వతచరిత్రసంగ్రహము —ఖండవల్లి లక్ష్మీరంజనం

౫. ఆంధ్రభాషాచరిత్రము— డాక్టర్ చిలుకూరి నారాయణరావు

౬. Dravidian Philolcgy. cald.vell

౭. గోలకొండ కవులసంచిక.

౮. తెనుగు తోబుట్టువులు — మారేపల్లి రామచంద్రశాస్త్రి

౯. కవిత్వతత్త్వవిచారము— కట్టమంచి రామలింగారెడ్డి

౧౦. కవిజీవితములు — గురిజాడ రామమూర్తి.

౧౧. నేటికాలపు కవిత్వము — అక్కిరాజు ఉమాకాంతము.

౧౨. కవులచరిత్ర — పెదగాడ గంగయ్య.



# యువజన విజ్ఞానము

## పండుగలు

### ౧ వ ప్రకరణము

మన దేశములో హిందువులు, ముసల్మానులు, క్రైస్తవులు తదితరులును కలరు. పై మూడుమతములవారి పండుగలను తెలుసుకొనుట బాగుండును. కాని ముసల్మానులయొక్క పండుగలగూర్చి ఉర్దూలో కాని ఇంగ్లీషులోకాని ఏ గ్రంథమున్నూ లేదు. తుదకు వెదుకగా బిల్గ్రామీ ౫౦ ఏండ్లకు పూర్వము వ్రాసిన నిజాంరాజ్య చారిత్రిక వర్ణనములు అను ఇంగ్లీషు పుస్తకములో కొంత లభించెను. అదే మనకు లభించు ఏకైకాధారము. "హిందువుల పండుగలు" అను విపులమగు పుస్తకము తెనుగులో ప్రకటితమైనది. హిందువుల పండుగలను వివరించి వ్రాయబూనిన అదొక్కటే మహాగ్రంథమగును. అందుచేత పండుగల సూచనమాత్రమే చేయనైనది.

క్రైస్తవుల పండుగలను గురించి ఇంగ్లీషులో కాని తెనుగులో కాని ఏ గ్రంథముకూడా లభింపలేదు. అందుచేత వారి ముఖ్యమగు మూడు పండుగలను గురించి సంగ్రహముగా తెలియవచ్చినంత వ్రాయనైనది.

పండుగలు అన్నిమతములలోను కలవు. ప్రతి మతమువారు తమ మత కర్తల జన్మదివసములను, వారి జీవితములోని ప్రధాన విషయములను, తమ మతములోని గొప్పవారి జన్మదినోత్సవాలను, పండుగలుగా చేసికొందురు. మరియు కొన్ని ఋతుదివసములను లేక చారిత్రిక జాతీయ విశేషములను పండుగలుగా చేసుకొని ఆనందింతురు.

హిందువులలో ఈ క్రిందిపండుగలు ప్రచారములో నున్నవి.

## చైత్రము

| పండుగ. | తిథి. | విశేషము. |
|---|---|---|
| ఉగాది. | శు॥ ౧ | ఆంధ్రులకు, మహారాష్ట్రీయులకు, కన్నడులకు సంవత్సరాది. |
| గౌరీతృతీయ. | శు॥ ౩ | మహారాష్ట్ర స్త్రీలకే ఇది ముఖ్యమైన పండుగ. |
| శీతలసప్తమి. | శు॥ ౭ | వంగదేశములో స్ఫోటకవ్యాధికై శీతలాదేవిని పూజింతురు. తెనుగు దేశములో ఈ దేవతను ఎల్లమ్మ అను పేరుతోను సుంకులమ్మ అనుపేరుతోను పూజింతురు. |
| శ్రీరామనవమి. | శు॥ ౯ | హిందువు లందరున్నూ శ్రీరాముని జన్మదివసముగా ఉత్సవాలు చేసుకొందురు. |
| హనుమజ్జయంతి. | పూర్ణిమ. | హనుమంతుని జన్మదివసమని మాధ్వులు చేయుదురు. |

## వైశాఖము

| | | |
|---|---|---|
| అక్షయతృతీయ లేక పరశురామజయంతి. | శు॥ 3 | పరశురాముని, జన్మదివసమని, కృతయుగారంభ దినమని విశ్వసింతురు. |
| నృసింహ జయంతి. | శు॥ ౧౪ | హిరణ్యాకశిపుని చంపిన నరసింహావతార మీనాడేనట. |
| కూర్మజయంతి. | శు॥ ౧౫ | కూర్మావతార మీనాడేనట. |
| బుద్ధజయంతి. | శు॥ ౧౫ | బౌద్ధమతమును స్థాపించిన బుద్ధభగవానుడను ౯వ అవతార మీనాడు జన్మించెనని అందురు. |

## జ్యేష్ఠము

| | | |
|---|---|---|
| వటసావిత్రి. | శు॥ ౧౫ | ఈనాడే సావిత్రి తనభర్తను బ్రతికించుకొనెనట. |
| ఏరువాకపున్నమ. | శు॥ ౧౫ | నాగండ్లను పూజించి ఈనాడు వ్యవసాయకులు భూమిదున్న నారంభింతురు. |

## ఆషాఢము

| | | |
|---|---|---|
| చాతుర్మాస్యము. | శు॥ ౧౧ | ఈనాడు నాలుగు మాసాల వర్షాకాలారంభము.తొలియేకాదశి అని దీని నందురు. |

## శ్రావణము

| | | |
|---|---|---|
| గరుడ పంచమి. | శు॥ ౫ | తూర్పు దేశములో దీనిని గరుడ పంచమిగా చేయుదురు. కాని రాయల సీమలోను తెలంగాణములోను దీనినే నాగుల పంచమి అని పొరపాటుగా చేయుచున్నారు. |
| శ్రావణ పూర్ణిమ. | శు॥ ౧౫ | దీనినే రక్షికాపూర్ణిమ లేక రాఖీ పున్నమ అని అందురు. ఈనాడు క్రొత్త జందెములను ద్విజులు ధరింతురు. |
| సంకష్టహరణ చతుర్థి. | బ॥ ౪ | కష్టాల నివారణార్థము ఈనాడు ప్రత్యేకముగా గణపతిపూజ చేయవలెనట. |
| జన్మాష్టమి. | బ॥ ౮ | శ్రీకృష్ణు డీనాడు జన్మించెనందురు. |

## భాద్రపదము

| | | |
|---|---|---|
| హరితాళిక. | శు॥ 3 | కన్యకలు అనుకూల భర్తలను పొందుటకు ముత్తయిదువలు విధవలుగా కుండుటకు దీనిని చేయుదురు. |
| గణేశచతుర్థి. | శు॥ ౪ | వినాయక విఘ్నేశ్వర అను పేరులు గల దేవతనుగూర్చి చేయుపూజ. |
| ఋషిపంచమి. | శు॥ ౫ | సప్తర్షులపూజ. ఇది పాపహరమందురు. |
| చంపాషష్ఠి | శు॥ ౬ | విశాఖానక్షత్ర కాలములో స్నానము చేసిన పాపహర మగును. |
| ఆముక్తాభరణము. | శు॥ ౭ | సంతానము లేనివా రీనాడు శివుని గూర్చి పూజ చేయుదురు. |

| | | |
|---|---|---|
| దూర్వాష్టమి. | శు॥ ౮ | రోహిణీనక్షత్రములో దూర్వాపూజను చేసిన స్త్రీలు వైధవ్యమును పొందరట. |
| వామనజయంతి. | శు॥ ౧౨ | వామనావతార మీదినమేనట. |
| అనంతచతుర్దశి. | శు॥ ౧౪ | విష్ణుపూజ ఈనాడు చేసిన సకలైశ్వర్యాలు కలుగునట. |
| మహాలయపక్షము. | బ॥౧ నుండి అమావాశ్యవరకు. | ప్రతికుటుంబములో చనిపోయినవారికీపక్షములోతర్పణాలిత్తురు. బ్రాహ్మణేతరులు దీనిని పెద్దల లేక పితర్ల అమాస అని యందురు. |

## ఆశ్వయుజము

| | | |
|---|---|---|
| దేవీనవరాత్రులు. | శు॥౧ నుండి ౯ వరకు | వీటినే మహానవమి అని అందురు. శక్తిపూజలు చేయుదురు. |
| విజయదశమి. | శు॥ ౧౦ | దీనినే దసరా అందురు. ఇది క్షత్రియుల పండుగ. అందుచేత ఆయుధపూజ జరుగును. |
| దీపావళి. | బ॥ ౧౪ | దీనిని నరకచతుర్దశి అందురు. నరకాసురుని చంపిన దీదినమునాడే అని చాలామంది నమ్ముదురు. కాని నరకవిముక్తికై యీనాడు యమపూజ చేయవలెను. |
| కేదారేశ్వరవ్రతము. | బ॥ ౩౦ | భక్తేశ్వర వ్రతమువలెనే శివపూజ చేసిన వ్రతకర్తలకు ఆరోగ్యాయుష్యములు కలుగునట. |

## కార్తీకము

| | | |
|---|---|---|
| యమద్వితీయ భ్రాతృద్వితీయ | శు॥ ౨ | రెండును ఒకటే. ఈనాడు యమునా నదీస్నానం చేసిన పుణ్యమట. |
| నాగులచవితి. | శు॥ ౪ | దీనిని ఉత్తర సర్కారు సీమలో ఈ తేదీన చేయుదురు. ఇదే సరియైనది. |
| స్కందషష్ఠి. | శు॥ ౬ | తెనుగులో దీన్ని సుబ్బరాయషష్ఠి అందురు. కుమారస్వామి పూజ ఈ నాడు చేయుదురు. ఇది అరవవారికి ముఖ్యము. |
| భీష్మైకాదశి. | శు॥ ౧౧ | భీష్మునికై తర్పణాలిత్తురు. |
| తులసీవ్రతము. | శు॥ ౧౨ | తులసీపూజ స్త్రీలకు ముఖ్యము |

## మార్గశీర్షము

| | | |
|---|---|---|
| దత్తాత్రేయజయంతి. | శు॥ ౧౦ | దత్తాత్రేయపూజ చేతురు. |

## మాఘము

| | | |
|---|---|---|
| వసంతపంచమి. | శు॥ ౫ | ఉత్తర హిందూస్థానములోని వసంతోత్సవము. |
| రథసప్తమి. | శు॥ ౭ | సూర్యునిపూజ. బ్రాహ్మణులకే ఇది ముఖ్యము. |
| మహాశివరాత్రి | బ॥ ౧౪ | శివుని గూర్చినవ్రతము. పగలుపవాసము. రాత్రి జాగరణము. శైవులకిది ముఖ్యము. |

## ఫాల్గునము

| | | |
|---|---|---|
| హోలీ. | శు॥ ౧౪ | వసంతోత్సవము. |

ఇవికాక స్త్రీల వినోదార్థమై వారవ్రతాలనీ లక్ష్మీవ్రతాలనీ గౌరీవ్రతాలనీ సత్యనారాయణవ్రతమనీ ఇంకా ఇట్టివెన్నో ఒక్కొక్క ప్రాంతములో పరిపరివిధాలుగా వ్రతాలు పెరుగుతూ పోయినవి.

హిందువుల పండుగలను గూర్చి ఎక్కువగా వివరముగా తెలుసుకొనగోరువారీక్రింది గ్రంథాలను చదువవలెను.

Fasts & feasts Hindu Holidays and festivals by B. A. Gupta

వ్రతచూడామణి — సంస్కృతము.
హిందువులపండుగలు — సురవరము ప్రతాపరెడ్డి.
ఆర్యపర్వపద్ధతి (హిందీ — ఆర్యసమాజ ప్రచురము)
వాచస్పత్యనిఘంటు — సంస్కృతము.
( వ్రతములు అను శబ్దమువద్ద )
ధర్మసింధువు, నిర్ణయసింధువు.

---

## ముసల్మానుల పండుగలు

మొహర్రం:—

దీనిని మన తెలుగువారు పీర్లపండుగ యందురు. పీర్ అనగా పూజ్యుడు. అరబ్బు దేశములో మహమ్మద్ ప్రవక్త చనిపోయినతర్వాత జరిగిన ఒక విషాదఘట్టమును ముసల్మానులలో షియ్యాలు ఈపండుగగా చేయుదురు. మహమ్మదు అల్లుడు అలీ. అతడు మహమ్మదు బిడ్డయగు ఫాతిమాను పెండ్లాడెను. ఆ దంపతులకు హసన్, హుసేన్ అను కుమారులు కలిగిరి. ఈ వర్గపు అనుయాయులే షియ్యాలు, తక్కినవారు సున్నీలు. అలీయు అతని కుమారులున్నూ కర్బలాయుద్ధములో బలిదానమై మృతులైనందున పీర్లపండుగలో యా అలీ, షాహుసేన్, భాయి హసన్, అను మాటలను మన తెనుగువారు అపభ్రంశ

ముగా యాలీ, సాపుసోౕ భాపుసేౕ అందురు. పైగా దూలా అనియు అందురు. అనగా హుసేౕ సోదరులలో ఒకడు పెండ్లికొడుకుగా ఉండి యుద్ధములో చచ్చెను. ఈ కర్బలాయుద్ధము మొహర్రం అను పేరుగల హిజరీనెలలో జరిగినందున దీనిని మొహర్రంపండుగ అందురు. ఈపండుగనాడు షియ్యాలు ఎదలు బాదుకొని లబలబపెద్దురు. కాని పల్లెలలో తురకలు హిందువులు కలిసి త్రాగి వేషాలు వేసుకొని చిందులు త్రొక్కుతూ గంతులు పెట్టుతూ వేడ్కలు చేసుకొందురు. ఈ పండుగలో తురకలకంటె హిందువులదే ఎక్కువ ఆర్భాటముండును. చాలామంది పీర్లకు మొక్కుకొందురు. సేవలు చేయింతురు, తుదినాడు పానకం పంచిపెట్టుదురు.

మొహర్రం చరిత్రను కొంత తెలుసుకొనవలెను. మహమ్మద్ పైగంబర్ చనిపోయిన తర్వాత అతనిఅల్లుడు అలీని ఖలీఫా చేయుటకు మారుగా ఉస్మాౕ అనునతనిని చేసిరి. అలీకది కోపకారణమయ్యెను. వరుసగా ముగ్గురు ఖలీఫాలుకూడా ఏర్పాటైరి. అలీయు యీతని గుంపువారున్నూ వారిని ప్రతిఘటిస్తూవచ్చిరి. యజిద్ అను నతడే ఈరాఖులో క్రూరరాజ్యము చేసెను. అతడేఖలీఫాఅయి అలీకుమారుడగుహుసేను తనకు లోబడుటకై ఆజ్ఞాపించెను. అంతలో యజిద్ ప్రజలుకూడా హుసేనును తమ్ము క్రూరరాజునుండి రక్షించుటకై కోరిరి. హుసేౕ తనకుటుంబముతో కొద్దిమంది అనుచరులతో యుద్ధసన్నద్ధుడై వెళ్ళెను. అతడు ఈరాఖులోనికివస్తే ప్రజలు సహాయపడుదురని యాజిద్ అతనిపై గొప్ప సైన్యమంపి కర్బలా అను స్థలములో ఒట్టడి వేయించెను. కర్బలా బగ్దాదుకు ౫౫ మైళ్ళ దూరములోను కూఫాకు 33 మైళ్ళ దూరములోను కలదు. యూఫ్రటీసునదికి సమీపముననున్నను దానినీరు వారికందకుండా ముట్టడించిరి. హుసేౕ హీజరీ ౬౧ వసంవత్సరము మొహర్రంనెల ౨వ తేదినాడు కర్బలా చేరెను. ౭ మొహర్రంనాటినుండి వారికి నీరు దొరకకుండ చేసిరి. హుసేౕ వెంట ౧౦౦౦ మంది సవారులు ౧౦౦ మంది కాల్బల ముండెననియు యాజిద్ సైన్యములో ౧౨౦,౦౦౦ మంది ఉండి

రనియు అబీముఖ్నిఫ్ వ్రాసెను. హుసేను పక్షాన తొమ్మిదిపదేండ్ల పిల్లలతో ౭౦ ఏండ్ల వృద్ధులతో ౬ నెలల శిశువులతో స్త్రీలతో ౭౨ మంది యుండిరనియు, యాజిద్ సైన్యములో ౨౨౦౦౦ మంది యుండి రనియు మరికొందరు వ్రాసినారు. ఎట్లయిననేమి హుసేన్ సైన్యము చాలా కొంచెము. యాజిద్ సైన్య మత్యధికము. మూడుదినాలు నీరు లేక వారు యుద్ధముచేసి చనిపోయిరి. లొంబడుమాట లేదయ్యెను. హుసేనుకూడా ప్రాణాలర్పించెను. మిగిలిన స్త్రీలను ఈరాఖురాజధాని యగు దిమిష్క(డమాస్కసు) లో నీచముగా వీధులందూ రేగించిరి. ఇది మొహర్రం పండుగకథ. ముసల్మానులు విగ్రహారాధకులు కారు కదా! పీర్లపండుగలోని పీర్ల ఆకారలేటివి ? అవి హుసేన్ సైన్యజండా గుర్తులట!

హుసేన్ వీరాతివీరుడనియు తన ప్రాణాలరక్షణకై దౌర్జన్యానికిలో బడక తాను తన బంధుమిత్రులు పిల్లలు మూడుదినాలు అన్నము నీరు లేక ఘోరముగా యుద్ధముచేసి స్వాతంత్ర్యదీక్షకై ప్రాణాలిచ్చిరనియు అందుచేత వారు పూజ్యులనియు ఈ కర్బలాయుద్ధము బోధిస్తున్నది.

రంజాన్:—

ముసల్మానులకిది ముఖ్యమైన పండుగ. రంజాన్ అనునది హిజిరీ శకములో ఒక నెల. ఆ నెలలోనే దేవుడు మహమ్మద్ ప్రవక్తకు ఖురాన్‌గ్రంథమును ప్రకాశమానము చేసెను. (ఖురానును సూరాలు అను ప్రకరణాలుగా విభజించినారు అందు ౧౧౪సూరాలు కలవు. ప్రతి సూరాలో ఆయతులు అను పద్యములు కలవు.)

ఖురాను, ప్రవక్తకు ప్రకాశమైనట్లు ఖురానులోనే వ్రాసినారు. (సూ౹౨. ఆయత్ ౧౮౫.) అందుచేత రంజాను నెల ముసల్మానులకు పవిత్రమైనది. అల్ బఖరా అను రెండవ సూరాలో ౨౩ వ రుకు (భాగము) లో రంజాన్‌లోని ఉపవాసాలను గూర్చి వ్రాసినారు.

రంజాన్ నెల అంతా ముసల్మానులు ఉపవసించవలె ననియు పూర్వులు కూడా అట్లే చేసిరనియు తెలిపినారు. ఆ యుపవాస విశేషాలను గూర్చి యిట్లు ఆదేశించినారు.

"మీరు రక్షణపొందుటకు కొన్ని దినాలు ఉపవాసం చేయవలెను. మీలో ప్రయాణము చేయువారుంటే జబ్బుపడినవారుంటే అట్టివారు వేరే నెలలో బాకీపడిన ఉపవాస దినాలను పూర్తి చేసుకోవచ్చు. అటు కూడా వీలులేనివారు బీదవాని కన్నము పెట్టి ఋణ విముక్తి పొందవచ్చును. దేవుడు మీ క్షేమము కోరుతాడు. మీకు కష్టాన్ని కోరడు. దేవుడు మీకు మార్గదర్శి అయినందులకు కృతజ్ఞత లర్పించుకోవలెను. ఉపవాస దినాలలోని రాత్రిలందు మీమీ భార్యలను పొందవచ్చును. మీరు ఆత్మవంచన చేసుకొందురని దేవుడెరిగి మీపై కరుణించి మీకు కష్టములేకుండా భార్యలపొందు అనుమతిని ప్రసాదించినాడు. చీకటి పడినప్పటినుండి తెల్లవారువరకు భోజనపానీయముల చేయవచ్చును. పగలంతా ఉపవసించి యుండవలెను."

పై ఆదేశము ప్రకారము రంజాను నెల పగటి ఉపవాసను నెలయై యున్నది. ఖురాను రంజాన్ తుదిదినాలలోని రాత్రికాలములో ప్రవక్తపై ప్రకాశితమయ్యెను (సూ ౨౨. ఆ. ౩).

మహమ్మదు మక్కాకు సమీప మందుండు ఎడారిలోని హీరా అను చిన్న గట్టులోని గుహలో తన కుటుంబముతో రంజాన్ నెల అంతయు ఉండివచ్చెనట. అధ్వనితో ఖురాను వారిపై ప్రకాశితమయ్యెనట.

ఆఖరీ చార్‌షంబా:—

ఆఖరీ చార్‌షంబా అనగా తుది బుధవారము. సఫర్ అను హిజిరీ నెలలోని తుది బుధవారమునాడు మహమ్మద్ ప్రవక్తగారు జబ్బుపడియుండి ఆరోగ్యమును పొందిరి. ఈ దినమునాడు మామిడియాకులమీద

ఏడు అరబీ ఆశీర్వచన మంత్రాలను వ్రాసి దానిని కడిగి ఆ నీటిని భక్తులు త్రాగుదురు. ఆ దినము హైదరాబాదు ముసల్మానులు స్నానము చేస్తే మంచిదికాదని భావింతురు. ఆ దినమునాడు జనులు క్రొత్త బట్టలతొడిగి రుచ్యాన్నములను వండుకొని వనభోజనము చేయుదురు.

బారావఫాత్ :—

ఈ పండుగను బారామాలాద్ అనియు నందురు. బారాఅనునది ఉర్దూపదము, పన్నెండు అనియర్థము. వఫాత్ అనగా చావు. అది అరబీ పదము. దీనినే ఫార్సీలో ద్వాజదహం (ద్వాదశి) అందురు. ఆ దినమున ముసల్మానులు ఉపవాసముందురు. ఆ దినమున మహమ్మద్ పైగంబరు గారు తన ౬౪ వ ఏట (క్రీ. శ. ౬౩౨—౬౩౩) చనిపోయెను. అతడు హిజిరీలోని రబియులవ్వల్ నెలలోని ౧౨ వ తేదినాడు చనిపోయెను. భక్తులు ఆ నెలయంతయు మసీదులలో ఇండ్లలో సభలుచేసి పైగంబరు గారి మహిమలనుగూర్చి యుపన్యాసాలిప్పించి విందురు. వచ్చినవారికి "కీరు" మరియు ఇతర రుచ్యపదార్థములను ఇత్తురు.

యాజ్దహాంషరీఫ్:—

యాజ్దహాం అనగా ౧౧ వ దినము, షరీఫ్ అనగా పవిత్రమైన అని యర్థము. పూర్వమొకప్పుడు షేక్ అబ్దుల్ ఖాదిర్ అనే ముస్లిం "షేక్" (సాధువు) రబ్బియుస్సానీ అను హిజిరీ నెలలో ౧౧ వ తేదినాడు చనిపోయెను. అతని మహిమలు చాలా హెచ్చుగా నుండెనని విశ్వసింతురు. అతనికి నానా పేరులు (హిందువుల శతనామావళివలె) కలవు. సయ్యద్ మొహియుద్దీన్ జీలానీ అనియు పీర్ దస్తగీర్ అనియు, మహిబూబ్ సుభానీ అనియు అతని యితర ప్రసిద్ధనామములు. ఈసాధువు జీలానీలో జన్మించి గొప్పసూఫీ వేదాంతియని ప్రఖ్యాతినొంది బగ్దాద్ నగరములో అనేక శిష్యులకు బోధించి అచ్చటనే చనిపోయెను. అతని గోరీ యచ్చటనే కలదు. ప్రసిద్ధినొందిన సాదీకవి అతని శిష్యుడు. కలరాతాని ఎట్టి

అంటుజాడ్యము కానీ ప్రబలమైనప్పుడు జనులు అతని పేర ఆకుపచ్చ జండాను ఊరేగించిన రోగములు తొలగిపోవునని విశ్వసింతురు. పిల్లలు లేనివారు, ఉద్యోగాలు కోరేవారు అతనికి మొక్కుకొందురు. ఇతనిని సున్నీలే యెక్కువగా కొలుతురు.

షబేబరాత్ (Night of record)

షబేబరాత్ అదృష్టనిర్ణయరాత్రి. ఆనాటిరాత్రి మానవులు జీవితముల కాలమును వారి అదృష్ట దురదృష్టములను దేవుడు నిర్ణయించి వేయునని విశ్వసింతురు. ఆనాటిరాత్రి జనులు వినోదముగా గడపుదురు. పటాకాలు కాల్తురు. భక్తులు రాత్రియంతయు ఖురాను చదువుదురు. మరునాడు ఉపవసింతురు. ఆ రాత్రి చనిపోయినవారి ఆత్మలు భూలోకానికితిరిగివచ్చి తమ పాతవిహారస్థలాలను ఇండ్లను, బంధువులను చూచిపోవునని విశ్వసింతురు. జనులు క్రొత్త "చట్టీల" (కుండల)లో హల్వాను, నీటిని, రొట్టెను పెట్టి వచ్చేఆత్మలకు సమర్పించుకొందురు. (హిందువులు మహాలయ పక్షములో పిండములుపెట్టి తర్పణా లిచ్చినట్లు.) స్నేహితులు బంధువులు పరస్పరం హల్వాలను ఇచ్చుకొందురు.

ఈదుల్ ఫితర్:—

ఈ పండుగనాడు దానధర్మాలు చేయుదురు. రంజాన్ నెల పొంతము ఉపవసించిన తర్వాత షవ్వాల్ నెల మొదటి తేదీనాడు బీదలకు అన్నదానము చేయుదురు. రంజాన్ నెలలో పగలంతయు ఉపవసించి సూర్యాస్తమయము కాగానే ఖర్జూరపండ్లు తిని తర్వాత భుజింతురు. రంజాన్ ౨౭ తేది రాత్రిని లైలతుల్ ఖదర్ అందురు. అనగా శక్తిరాత్రి యని యర్థము. ఆరాత్రి ఊర్ధ్వలోకమునుండి ఖురాన్ అవతరించెనట.

రంజాన్ అయిన మరునాటి యుదయము ముసల్మానులు సేవల పాయసములో ఖర్జూరపండ్లు వేసి యుడికించి తిందురు. దానిని షీర్ ఖుర్మా అందురు. స్త్రీ పురుషులు స్నానముచేసి అలంకరించుకొని "ఫితర్" లేక

"సద్కా" దానము చేయుదురు. అనగా రెండున్నర సేర్ల గోధుమలను, లేక యితర ధాన్యమును, ఖర్జూరములతో సహా బీదలకు దానము చేయుదురు. తర్వాతి ఈద్ గాహ్ (ప్రార్థనస్థలము) వద్దకు వెళ్ళి నమాజు చేయుదురు. అచ్చట ముల్లా ఖుత్బా ( శుక్రవారమునాటి ప్రార్థనను ) చదువును. అందుచేత కొన్ని తెనుగు ప్రాంతాలలో ఈ పండుగను ఖుత్బా పండుగ అందురు. అదే సమయములో తమమతస్థుడగు సుల్తానుయొక్క ఘనతను పొగడి అతనికై ప్రార్థింతురు. తర్వాత ఒకరినొకరాలింగనము చేసుకొని వెళ్ళిపోదురు. నవాబులు ఆనాటి సాయంత్రము నజరులను అందుదురు.

బక్రీద్ :-

దీనినే ఈదెఖుర్బాన్ అనియు, ఈదుజ్జుహా యనియు అందురు. ఈ దినమున మేకల, గొఱ్ఱెల, ఆవుల, ఒంటెలను కోసి వండి తిందురు. ఈ దినమునాడు అబ్రహాం అను యూధుల ఆదిమపవిత్ర దేవునికి తనకుమారుడగు ఇస్మైలును బలియిచ్చుటకు సిద్ధపడెను. ఈ పండుగను జిలహాజ్ అను నెలలో ౧౦ వ దినమున చేయుదురు. ఒక్కొక్కడు ఒక మేకనో గొఱ్ఱెనో బలియియ్యవలెను. లేదా ఏడుమంది కలిసి ఒక ఆవునో ఒంటెనో బలి యియ్యవలెను. జన్నత్ అను స్వర్గలోకమునకు పోవుదారి చాలా యిరుకుగా అసిధారవలె (ఖడ్గము అంచువలె) నుండుననియు అట్టి వారధిని దాటితే స్వర్గములోనికి పోవచ్చుననియు ముసల్మానులు విశ్వసింతురు. ఆవారధి పేరు "పులెసరత్" అందురు. బలియిచ్చిన జంతువులు భక్తులను సురక్షితముగా ఆ వారధిని దాటించునట. ఈ పండుగనాడు ముస్లిములు స్నానముచేసి అలంకృతులై ప్రార్థనాస్థానమునకేగి ఖుద్బా వింటురు. బలియిచ్చిన జంతుమాంసము లో కొంత దానము చేయుదురు.

---

# క్రైస్తవుల పండుగలు

క్రిస్టమస్:—

ఇంచుమించు డిసెంబరు ౨౫ వ తేదీనుండి డిసెంబరు నెల తుదివరకీ పండుగను చేయుదురు. డిసెంబరు ౨౫ వ తేదీన జీసెస్ క్రైస్టు జన్మించెనని క్రైస్తవుల విశ్వాసము. ఆనాటినుండి ౫ దినాల వరకు వారుత్సవాలు చేయుదురు. క్రైస్తవుల ఇండ్లలో క్రిస్మస్ చెట్టు నొకదానిని కల్పితమగు చెట్టువంటి దానిని పెట్టి దానికి అలంకారములు చేయుదురు. చిన్నపిల్లలకు క్రిస్మస్ తెల్లవారగనే బొమ్మలు, పుస్తకాలు, ఆటవస్తువులు, కేకులు అను మిఠాయిని ఇత్తురు. పిల్లలకు తెలియకుండ మొదటిదినమే అవన్నియు తెచ్చి దాచియుంచి వారు నిద్రనుండి లేచేవరకే వారిగదులలో వాటినుంచి రాత్రి "క్రిస్మస్ తాత" (క్రిస్మస్ ఫాదర్) తన ముద్దుపిల్లలకు ముద్దయిన వస్తువులిచ్చి పోయెనని చెప్పుదురు. తెల్లని మూరెడుగడ్డము పెద్ద తెల్లనిమీసాలు, పొడవైన పేర్వాని కలిగిన తాత నవ్వుమొగముతో పిల్లలతో ఆడుకొనునట్లు ఆ భావస్వరూపమును క్రైస్తవులు చిత్రింతురు. "శాంతిదూత" Prince of Peace) యగు యేసుక్రీస్తు శాంతిసందేశములను ఎప్పుడు తప్పినను ఆ క్రిస్మస్ పండుగలో నైనను స్మరింతురు. సంవత్సరమంతటను ద్వేషులై పరస్పరము కలియుటమాట్లాడుట ఆపివేసినవారు పలువు రానాడు క్రీస్తు స్మారకముగా ఒకరివద్ద కొకరు వెళ్ళి పలుకరించివత్తురు. ఈపండుగ అవతారపురుషుని జన్మదినోత్సవము కాన పవిత్రమైన దనుటలో సందేహము లేదు.

సంవత్సరాది:—

మనకు ఉగాదియెట్లో, ఉత్తరహిందూస్థానీలకు దీపావళి యెట్లో తమిళులకు పొంగలిపండుగ యెట్లో, క్రైస్తవులకు జనవరి ౧ వ తేది సంవత్సరాది పండుగ అట్లు. జనవరి ౧కిని, క్రైస్తవమతమునకును సంబంధము లేదు. యూరోపులో ప్రచారమం దున్న కాలమానము ఒక కలగూర

గంప, ఖాల్డియనులు, ఈ జిప్టుజనులు కనిపెట్టిన జ్యోతిశ్శాస్త్ర సిద్ధాంతములను తర్వాత గ్రీకులు వృద్ధిచేసిరి. మొదట వారు నెలలను పదివరకేర్పాటుచేసినట్లు కానవచ్చును. తుదిమాసము ఇప్పటి ౧౨వ మాసము పేరు డిసెంబరు (డెకా-దశ) అనగా పదవమాసమని యర్థము. తర్వాత రోము సామ్రాజ్యమువారు జూలై మాసమును తమ (క్రీ. పూ. ౫౫ నాటి)జూలియస్ సీజరు చక్రవర్తి పేరనుంచిరి. ఇటులే ఇతరనామములు కూడ లాటిన్ నామములుగా పరిణమించెను. ఈ విధముగా క్రీస్తు శకారంభకాలానికి వారి పంచాంగ మొకరూపానికి వచ్చెను. మధ్య క్రీ. శ. ౧౬, ౧౫ శతాబ్దాలలో కొద్దిమార్పుచేసిరి. అట్టి రోమకమాసములలో జనవరి మొదటినెల. ఆ నెలలే రోముసామ్రాజ్య ప్రాబల్యముచేత యూరోపు దేశమంతటను వ్యాపించెను. వాటినే అచ్చటి జనులు క్రైస్తవులైన తర్వాత తమవిగా స్వీకరించిరి. అంతేకాని మనలోవలె ఋతువునుబట్టి సంవత్సరాది యేర్పడలేదు.

ఈస్టర్:—

ఏసుక్రీస్తు చనిపోయిన దినమును ఈస్టర్ అందురు. ఆయన శుక్రవారమునాడు చంపబడె ననియు, అతనిని పూడ్చగా మూడవ దినము సోమవారమునాడు శవము మాయమయ్యె ననియు, అనగాఅతడు సశరీరముగా స్వర్గాని కేగెననియు, క్రైస్తవులు విశ్వసింతురు. ఈ పండుగ దినాలు ఒకనికరమగు తేదీలలోరావు. చాంద్రమానము ప్రకార మీపండుగను, మైకల్మస్ పండుగను క్రైస్తవులు నిర్ణయించుట చిత్రముగా ఉన్నది. జీసస్ పుట్టిపెరిగినది పాలస్తీనాలోని జెరుస లాంలో,యహూదీ (లేక హీబ్రూ, హెబర్, జ్యూ) అను జాతిలో. యహూదీ మతమును "జూడైసిజం" అనిరి. వారి ప్రవక్త మోసెస్ (మూసా). జీసెస్ కాలములో పాలస్తీను రోముసామ్రాజ్యములో దాస్యదేశమై యుండెను. దాస్యదేశాలలోనే మతప్రవక్త లందరును పుట్టినారు. వారి మతబోధలు దాస్యవిముక్తికి తోడ్పడినవి. ఈజిప్టువారికి 'యహూదీలు బానిసలై ఘోరకష్టా లనుభవించగా ఇంచుమించు నేటికి 3౫౦౦ ఏండ్ల క్రిందట

మోసెస్ వారికొక మతమిచ్చి వారికి దాస్యవిముక్తియు కలిగించెను. మహమ్మద్ పైగంబరు పుట్టిపెరిగిన కాలములో అరేబియా దేశము పర్షియాసామ్రాజ్యమునకు దాస్యదేశమై యుండెను. మహమ్మద్ తన మతముద్వారా అరబ్బులలో ఐక్యతను ప్రధానముగా కలిగించి యుద్ధాలు చేయించి అరబ్బులకు స్వాతంత్ర్య మిప్పించెను. సిక్కుమతోత్పత్తి క్రమము న్నూ అట్టిదే. అదేవిధముగా ఏసుక్రీస్తు బోధలవలన యహూదీల లోని విభేదములు, దురాచారములు, సమసిపోవచ్చెను. జీసెస్ క్రొత్త సిద్ధాంతాలు బోధించినందున మతములోని కుళ్ళును నిర్భయముగా బయటపెట్టి తమకు పలుకుబడి లేకుండ చేసినందున యహూదీలలో పలువురికి జీసెస్‌పై అసూయ, క్రోధము కలిగెను. బానిసలలోనే ద్రోహు లెక్కువగా నుందురు. యహూదీలు జీసెస్‌పై అబద్ధారోపణములు చేసి అతడు రోముసామ్రాజ్యముపై యహూదీలను తిరుగుబాటు చేయించుటకుసిద్ధపడినాడని చాడీలుచెప్పిరి. రోముసామ్రాజ్యాధికారి పైలేట్ అను వాడు న్యాయాధికారిగా ఏర్పడి జీసెస్‌ను విచారించి నేరముచేసినవాడే యని నిర్ణయించి రాజద్రోహానికి ఉరిశిక్షను నిర్ణయించెను. ఆకాలములో మరణదండనమును దొంగలకును విధించిరి. ఒక నిలువుకంబమును భూమిలోపాతి దాని పైభాగమందు అడ్డముగా మరొక కట్టెను సంధించి ఆ "సిలువ" (క్రాస్) అనుదానిపై నిందితులను బంధించి తల, గొంతు, ఎద, కాళ్ళు, అరచేతులు, వీటిలో మేకులుకొట్టి ఆమేకులు సిలువలోనికి పోవునట్లుగా గట్టిచేసి, దండితుని యమయాతనలతో మహా బాధలో చనిపోవునట్లుగా వదిలేవారు. అట్టి శిక్షనే జీసెస్‌కిచ్చిరి. అతడా సిలువ (క్రాస్) పై చనిపోయినందున అతనికి క్రైస్టు అను ఉపనామ మేర్పడెను. అతడు ఘోరబాధకు లోనైనను ఒకరిని కూడా పల్లెత్తు మాట అనలేదు. పైగా తుదిమారు ఊపిరివిడుచుచు పరమాత్మనుద్దేశించి "ఓ జనకా! నన్ను చంపినవారిని క్షమించుము. వా రేమిచేసినారో వారికి తెలియక అజ్ఞానముతో చేసినారు" అనెను. అతడు చనిపోయిన మూడవదినము శరీరముతో లేచిపోయె నన్నమాట అబద్ధము. తర్వాత భక్తులచే కల్పింపబడినది.

మైకల్మస్:—

ఈస్టరువలె దీనికిని చాంద్రమానముగా తిథి నిర్ణయము చేయుదురు. మైకేల్ అను క్రైస్తవ సంతు (Saint) భక్తుడు షైతానును ప్రతిఘటించి వానిని అణచివేసి క్రైస్తవుల నుద్ధరించె నందురు. అతడు గొప్ప భక్తుడు. అందుచేత అతని స్మారకముగా మైకల్మస్ పండుగను చేయుదురు. యహూదీలు, వారినుండి క్రైస్తవులు, ఆ యిరువురినుండి ముసల్మానులు, హీబ్రూ పురాణము (పాత నిబంధన) లో సృష్టింపబడిన షైతాన్ (సేటన్ Satan) కథను అంగీకరింతురు. దేవుని ప్రతిఘటించి తన దుష్టశక్తినే ప్రపంచమందు స్థాపించుకొనువాడు షైతాన్ అనగా దుష్టదేవుడు. పై మూడు మతాలవారున్నూ ఈ మంచిదేవుడు, చెడ్డ దేవుడు (షైతాన్) యను భావాన్ని జరథుస్త్రుని మతమునుండి స్వీకరించినవారే! మంచిదేవుడు "అహురమజధా" అనియు, చెడ్డదేవుడు "అహ్రిమాన్" యనియు, జరథుస్త్రుడు బోధించెను. అహ్రిమానే తుదకు సైతాన్ అయ్యెను. జరథుస్త్రుడే భృగువు. తుదకు ఆర్యఋషి కల్పితుడే సైతాన్ లేక షైతాన్ అని తేలినది. క్రైస్తవులు మైకల్మసును వారముదినాలవరకు చేయుదురు. ఇవి కాక మనము శంకరాచార్యాదుల జయంతి వర్ధంతులను చేసినట్లుగా క్రైస్తవులును తమ మతములోని గొప్పభక్తుల జయంతి వర్ధంతులను చేయుదురు.

ఏప్రిల్ మూర్ఖుల పండుగ:—

ఏప్రిల్ మాసము యూరోపువారికి వసంతోత్సవము వంటిది. మనము హోలీని చేసుకొన్నట్లుగా వారును మార్చి, ఏప్రెల్ నెలలలో ప్రాచీనమునుండియు బహువిధములుగా అల్లరి వేడుకలను, నీతిబాహ్యమగు శృంగారచేష్టలను చేయుచు వచ్చినట్టివారు. గ్రీసులో లూపర్కే

లియా, రోములో పల్లికా, ఫ్లోరేలియా, అనగా కామోత్సవము,పుష్పో త్సవము అని చేసెడివారు. దాని పరిణామమే ఏప్రిల్ మొదటి తేది నాటి పండుగ. దానిని వినోదముగా ఏప్రిల్ ఫూల్సు పండుగ అందురు. ఆనాడు పెద్ద చిన్న తారతమ్యము లేక అపహాస్యములు, వినోదములు, వికారములు చేసిన తప్పు పట్టుకోరాదట! ఆనాడు అందరున్నూ మూర్ఖులైనారు కదా!!



# యువజన విజ్ఞానము

## భూగోళము

## ౧వ ప్రకరణము

భూగోళాన్ని బోధించు పుస్తకాలు తెనుగులో కూడా కొన్ని ముద్రితమైనవి. కాని వాటిని చదివే విద్యార్థులకవి తలనొప్పి కలిగించును. అనేక పుస్తకాలలో అవసరమైనవి వదలి అనవసరమైనవి పెంచి వ్రాసినారు. ఇప్పుడు ఈ గ్రంథములో సంగ్రహముగా ప్రపంచ భౌతిక స్వరూపము, ప్రపంచజనులు, వారి ఆచారములు, వారి పరిశ్రమలు, పంటలు మున్నగునవి తెలుపబడినవి. ఇందలి విధానము సొంతముగా భూగోళము చదువుకొనువారికే కాక బళ్ళలో భూగోళము చదివినవారికిని ఉపయుక్తముగా నుండునని భావింపనైనది.

భూగోళమును చదువువారు తెనుగులో ముద్రితమైన దేశ ఖండ పటములు అట్లసుపటాల పుస్తకాన్ని ముందుపెట్టుకొనియే చదువవలెననియు, అది లేనిది చదువరాదనియు తెలుపుచున్నాము. ఇది ముఖ్యముగా గమనింపవలెను.

మనము నివసించు యీభూమండలమును గూర్చి మనము తెలుసు కొనవలసియుండిన మనవిద్యకు పెద్దలోటు!

మనము నివసించే భూమియే చాలా గొప్పదనిన్నీ తక్కిన సూర్యాదిగ్రహాలు, నక్షత్రాలు అన్నియు మిణుకుమిణుకుమనే చిన్నని అగ్నికణాలనీ అనుకొనే వారికన్న తెలివితక్కువవారు ప్రపంచములో ఉండరు. మనభూమి అండకోటి బ్రహ్మాండములో ఒక ఇసుకకణము అనుకోవలెను. భూలోకమువొక్క అడ్డుకొలత ౭౯౧౮ మైళ్ళు మాత్రమే! మనకు అన్నిటికంటే దగ్గరగా ఉండులోకము ఒక చంద్రమండలమే. అది ౨౩౯౦౦౦ మైళ్ళ దూరములో ఉన్నది. చంద్రుడు ఇంచుమించు నెల కొకమారు భూమిచుట్టు తిరిగివచ్చును. చంద్రుని తర్వాత మనకు చాలా దగ్గర ఉన్నట్టిది సూర్యమండలమే. అది భూమినుండి ౯కోట్ల 30 లక్షల ౫ వేల మైళ్ళదూరమున నున్నది. ఇకతక్కిన నక్షత్రాలన్నియు మనకు కోటానకోట్ల మైళ్ళదూరములో ఉన్నవి. చాలా నక్షత్రాలు సూర్యునికంటె వేల అంతలు, లక్షలంతలు, కోట్లఅంతలు, పెద్దగా ఉన్నట్టివి కలవు. కాని అవి మనకు చెప్పజాలనంతటి కోట్లకోట్ల కోటానుకోట్ల మైళ్ళదూరములో ఉన్నందున మనకు గూటిలోని దీపమంతవిగా కనబడుచున్నవి.

మనభూమిచుట్టూ ఎడతెగకుండా ప్రదక్షిణము చేస్తూ సేవచేసే వాడొక్కచంద్రుడే! కాని యురేనస్ (వరుణుడు)అను గ్రహముచుట్టు నాలుగు చంద్రమండలాలు తిరుగుతున్నవి. జ్యూపిటర్(బృహస్పతి)చుట్టు తొమ్మిది చంద్రమండలాలును, శనిగ్రహముచుట్టు ఎనిమిది చంద్రమండలాలును తిరుగుతున్నవి.

భూమండలము దినమొకమారు తనచుట్టు తిరుగుచు సంవత్సరానికొకమారుసూర్యునిచుట్టు తిరిగివచ్చును. అట్లు చుట్టుతిరిగివచ్చు దూరము ౫౮౩౮౨౫౭౫౮ మైళ్ళు. ఈ దూరమును ౩౬౫ ౧/౪ దినాలలో పూర్తి చేయును.

చంద్రమండలము సూర్యమండలమంత పెద్దగా మనకు కనబడును. కాని అది నక్షత్రాలన్నింటిలో ఒక చిన్న నక్షత్రము. అది మనకు చాలాదగ్గరగా నున్నందున పెద్దగా కనబడును. దాని అడ్డకొలత ౨౧౬౦ మైళ్ళు మాత్రమే. చంద్రునికి స్వయముగా ప్రకాశములేదు. సూర్యుని కాంతిని అద్దమువలె మనకది ప్రసరింప జేయుచున్నది.

సూర్యుడు మన భూమినుండి ౯ కోట్ల ౩౦ లక్షల చిల్లరమైళ్ళ దూరములో ఉన్నాడు కదా. అనగా మనకు చంద్రుడెంత దూరములో ఉన్నాడో అంత ౪౦౦ అంతల దూరములో సూర్యుడు ఉన్నాడు. సూర్యుని అడ్డకొలత ౮౬౪,౦౦౦ మైళ్ళు. (సూర్యమండలములో మన భూమండలాల వంటివి ౧౩ లక్షల మండలాలు పూర్తిగా ఇమిడిపోవును.)

నక్షత్రాలు మనకు చిన్నచుక్కలుగా కనిపించును. అవి సూర్యుని కంటె పెద్దవి. అవి మన భూమండలమునుండి సూర్యునికంటే ఎన్నో రెట్లు ఇంకాదూరములో నుండుటచేత మనకు చాలాచిన్నగా కనబడును.

అన్నిటికన్న మనకు దగ్గరగా ఉండే నక్షత్రము పేరు ప్రాగ్జిమా సెంటారీ అనేది. అది మనభూమికి ౨౫ లక్షలకోట్ల మైళ్ళదూరములో నున్నది. అంకెలలో ఆదూరమును చూపవలెనంటే అది యిట్లుండును.

౨౫౦౦౦౦౦,౦౦౦౦౦౦౦౦ మైళ్ళు.

అనగా మనకు సూర్యుడెంత దూరమున నున్నాడో అంత ౨౭౦,౦౦౦ అంతల దూరములో ఆ నక్షత్రమున్నది. మరి అదే మనకు చాలాదగ్గరగా ఉండేనక్షత్రమని అంటున్నారు. సూర్యచంద్రుల తర్వాత మనకు ప్రకాశమానముగా కనబడే నక్షత్రమునకు సిరియస్ అను పేరు పెట్టినారు. అదిమనకు ౫౧ లక్షకోటి మైళ్ళదూరములో నున్నది. అనగా మనకు దగ్గరగా ఉండే నక్షత్రమంత రెండంతల దూరములో నున్నది.

చంద్రమండలము తర్వాత మనకు దగ్గరగా ఉండే గ్రహమువీనస్ (శుక్రనక్షత్రము) అనునది.

శనిగ్రహము చాలాచిత్రమైనది. దానిచుట్టు (౮) చంద్రమండలాలు తిరుగును. దానికిచుట్టు మూడు ఉంగరములవలె కాంతిరేఖలు కనబడును. మన భూమండలము ౨౦౦కోట్ల యేండ్లనుండి ఏర్పడియున్నదని శాస్త్రజ్ఞులు అంచెనా వేసినారు. మన భూమండలము యొక్క తూకము ౫,౮౮౫,౫౧౬,౦౦౦,౦౦౦,౦౦౦,౦౦౦,౦౦౦ టన్నులని సైన్సువేత్తలు నిర్ణయించినారు. సూర్యుడు భూమికంటే ౩౩౨,౦౦౦ అంత లెక్కువ తూకము కలవాడందురు.

బ్రహ్మాండములోని నక్షత్రాలు మనకు కోటానకోట్ల మైళ్లదూరములో నుండుటచేత మైళ్ళ లెక్కను వదలుకొని వెలుతురు సంవత్సరాలతో వ్యవహరింపవలసి వచ్చినది. వెలుతురు ఒక చిటికలో ౧౮౬,౦౦౦ మైళ్ళదూరము ప్రయాణము చేయును. ఒక నక్షత్రము మన భూమండలానికి ఒక సంవత్సరము వెలుతురు దూరములో ఉన్నదనిన ౧×౩౬౫ (దినాలు) ×౨౪ (గంటలు) ×౬౦ (నిముషాలు) ×౬౦ క్షణాలు × ౧౮౬౦౦౦ (వెలుతురు క్షణవేగము) అని గుణింపవలెను. కొన్ని నక్షత్రాలు మన భూమండలాని కెంతదూరమున నున్నవో తెలుసుకొందము. సిరియస్ నక్షత్రము ఎనిమిదిన్నర సంవత్సరాల దూరములో ఉన్నది. అనగా ఒక క్షణానికి వెలుతురు ౧౮౬౦౦౦ మైళ్ళ వేగముచొప్పున ప్రయాణముచేసిన ఆ నక్షత్రమునుండి బయలుదేరిన వెలుతురు మన భూలోకమునకు ఎనిదిమిన్నర సంవత్సరాలకు చేరుకొనును. అనగా ఆ లెక్క యిట్లుండును.

౮ ౧/౨×౩౬౫×౨౪×౬౦×౬౦×౧౮౬౦౦౦.

పనిలేనివారు ఈ లెక్కను గుణించి తెలుసుకోవచ్చును. ప్రోక్స్యాన్ అను నక్షత్రము పదిన్నర సంవత్సరాల వెలుతురు దూరములో

ఉన్నది. ఇవికూడా దగ్గరి నక్షత్రాలలో జమా కట్టబడినట్టివి. కొన్ని నక్షత్రాలు ౧౮,౮౦౦౦ వెలుతురు సంవత్సరాల దూరములో, కొన్ని ౭౫౦,౦౦౦ వెలుతురు సంవత్సరాల దూరములో ఉన్నవి. ఇంకా అంత కంటే చాలాదూరములోనివి కూడా కలవు. 'పలువురు హిందువులకు సూర్యుడే పరమాత్మ. కాని మన సూర్యనారాయణుని కంటే వేల అంతలపెద్దవై వేలఅంతలకాంతి కలవైనట్టి సూర్యలోకాలు ఈ బ్రహ్మాండములో కలవు. బ్రహ్మాండములో ఎన్నికోట్ల లోకాలున్నవో ఆ "అఖిలాండకోటి బ్రహ్మాండనాయకునికే" ఎరుక. మనకు రెండులక్షల చిల్లర మైళ్ళలోనున్న చంద్రునియొక్క ముఖమే అనాదినుండియు కనిపించుచూ వచ్చినది. కాని వీపు యెట్టిదో ఆసృష్టికర్తకే యెరుక. ఇక దూరములో నుండేవాటిని గురించి మన మేమెరుగగలము? మన సైన్సువేత్తలు ౧౦ వేలకోట్ల నక్షత్రాలుండవచ్చునని అంచెనా వేసినారు. అన్నిటికంటే దూరములోనుండే నక్షత్రాలు మనకు ౨౫ కోట్లయేండ్ల వెలుతురు సంవత్సరాల దూరములో నున్నవట! దీనిపై నాస్తికు లేమంటారోయే మో. గంటకు ౬౭ మైళ్ళ వేగముతో పొయ్యే రైలులో ప్రయాణమైతే నెప్ట్యూన్ (ఇంద్రగ్రహాన్ని) మనము ౮౦౦౦ ఏండ్లకు చేరుకోగలము. మరియు మనకు చాలాదగ్గరగా ఉండే నక్షత్రాన్ని ౮కోట్ల ఏండ్లకు చేరుకోగలము!!

ఆకాశములోని ౧౨ రాసుల పేరులను మొదట ఈజిప్టు దేశము వారు నిర్ణయించిరి. మేకలు సమృద్ధిగా ఈనుకాలమును మేషము అనిరి. వారికి పూజ్యమైన ఎద్దుపేరు ఒక రాశికి పెట్టిరి. మేనెల ప్రాంతములో మేకలు రెండు రెండు పిల్లలను యీనును. కాన మిథునము అని ఆ రాశికి పేరుపెట్టిరి. సూర్యుడు కొద్దిగా తిరోగమనము చేయుకాలము కాన ఎండ్రకాయవలె వెనుకకు పోవునని ఒక రాశిని కర్కాటకమనిరి. సూర్యుడు మహాతేజస్సుతోనుండిన రాశిని సింహరాశిఅనిరి. కోతలకాలమును కన్యఅనిరి. దివారాత్రములు సరిగా నుండుకాలమును త్రాసుతో నిరూపించిరి. అక్టోబరు మాసములో రోగాలు ప్రబలుటచేత ఆ రాశిని

వృశ్చికమనిరి. తర్వాత జనులు వేటాడుకాలము కాన ధనుస్సు పేరి చ్చిరి. వర్షాకాలమును చేపతో సూచించిరి. నీటిలో చేపలుండు ననుట కా పేరును పెట్టిరి.

నక్షత్ర శాస్త్రమును ఇందు విరివిగా నుదహరించుటకు వీలు లేదు. అభిలాషులు ఇంగ్లీషులో (1) The Stars in Their Courses by J. Jeans 2. The mysterious universe, మరియు తెనుగులో కాళీపట్నం కొండయ్యగారు వ్రాసిన విశ్వరూపము అను ఉత్తమ గ్రంథాన్ని చదువ గలరు. మరియు ఇంగ్లీషులో టైమ్సు ఆఫ్ ఇండియా బొంబాయివారు ప్రచురించిన Every body's book of facts యను ఉత్తమ గ్రంథాన్ని చదువ వలెను.

మన భూమండలములో సముద్రము మూడుపాళ్లు భూమి ఒక్క పాలు కలదు. సముద్రములేవనగా:- ఉత్తరమున నుండు సముద్రము ఉత్తరధ్రువ మహాసముద్రము (దీనిని ఇంగ్లీషులో ఆర్కిటిక్ అందురు.) దక్షిణములో ఉండునది దక్షిణధ్రువ మహాసముద్రము (అంటార్కిటిక్). మన హిందూదేశానికి దక్షిణమున ఉండునది హిందూమహాసముద్రము (దీనిని మన ప్రాచీనులు మహాసాగరమనిరి.) అమెరికాకు, ఆఫ్రికాకు మధ్యనుండునది అతలాంతికమహాసముద్రము (అట్లాంటిక్) తూర్పున జపాను ఆస్ట్రేలియాలయొద్ద నుండునది శాంతిమహాసముద్రము (పాసిఫిక్).

ఇవికాక చిన్నచిన్న సముద్రాలు కొన్నికలవు. కొన్ని యే యే దేశాలయొద్దనుండునో ఆ దేశాల పేర్లతో పిలువబడును. బెంగాలు సముద్రము, అరేబియాసముద్రము అట్టివి. ఆఫ్రికాకు ఉత్తరాన యూరోపునకు దక్షిణాన ఉండేది మధ్యధరాసముద్రము. దానికి తూర్పులో కాస్యపసముద్రము (కాస్పియన్) కలదు. దానినే మన పూర్వులు క్షీర సముద్రమనిరి. ఈరానీలు యదే అర్థముగల షీర్వాన్ (క్షీరవాన్) సముద్రమనిరి. అరేబియాకు పడమట నుండునది ఎర్రసముద్రము(రెడ్ సీ)

దానినే మనపూర్వులు హితసాగరము అనియనిరి. ఉత్తరధ్రువములో ఎవ్వరును పోని ఉత్తరప్రాంతాలకు పియరీ,నాన్సన్ యనువారు వెళ్ళిరి. అదే విధముగా దక్షిణధ్రువ ప్రాంతాలకు షాకిల్‌టన్, కెప్టన్ స్కాట్ అను వారు వెళ్లి చాలా విషయాలు కనిపెట్టిరి.

సముద్రముల వైశాల్యము మొత్తము ౧౪ కోట్ల చదరపు మైళ్ళు.
అందు పసిఫిక్ మహాసాగరము ౬ కోట్ల ౭౦ లక్షల చదరపుమైళ్ళను,
అట్లాంటికు మహాసాగరము 3 కోట్ల ౪౦ లక్షల ౮ చదరపుమైళ్ళను,
హిందూమహాసాగరము ౧ కోటి ౮౦ లక్షల చదరపుమైళ్ళను,
ఆర్కిటిక్ మహాసాగరము ౫౪ లక్షల చదరపుమైళ్ళను,
అంటార్కిటిక్ మహాసాగరము ౧ కోటి ౨ లక్షల ౮ మైళ్ళను,

వైశాల్యముకలవి. అన్నిటికన్న ఉప్పునీరు కలది ఎఱ్ఱసముద్రము. పసిఫిక్ సాగరము 30 వేల అడుగుల లోతుగలది. కొన్ని తావులలో 3౫౦౦౦ అడుగుల లోతుకన్న హెచ్చుగా కలదు.

ఆయుఖండాలకు పేరు లేవిధముగా వచ్చెనో కనుగొందము. బాబిలోనియాలో ప్రాచీనముందుండిన అసీరియనులు సూర్యుడుదయించుటకు అసు అందురు. సూర్యుడుదయించు దేశముకాన ఆసియాఅనిరి. కొందరు సంస్కృతములోని ఉషస్సు అను శబ్దమునుండి ఆసియాపద మేర్పడినదనిరి. ఇది కూడా సమంజసముగా నున్నది. సూర్యాస్తమయమును వారు ఎరఫ్ అందురు. కావున యూరోపు పేరు వచ్చెను. ఆఫ్రికాను ప్రాచీనమందు లిబియాఅనిరి. ఋగ్వేదకాలమందు ఆర్యులుదానినే ఋభుదేశమనిరి. లిబియాలోని ఒక జాతిపేరును బట్టి తర్వాత ఆఫ్రికా అని రోమనులు పేరుపెట్టిరి. అమెరికస్ వెస్పూషియస్ అను యూరోపులోని ఫ్లోరెన్సువా డొకడు క్రీ. శ. ౧౪౯౦ ప్రాంతమందు పెట్టినందున అమెరికా పేరు ఏర్పడెనందురు. ఆస్ట్రిలిస్ అనగా-దక్షిణదేశము. అందుచేత ఆస్ట్రేలియా అను పేరు ఏర్పడెను. ఈ విధముగా మన భూమండలములోని ఖండములకు పేరులేర్పడెను.

ప్రపంచఖండముల వైశాల్యము ౧౯౩౨ లోని జనాభా ప్రకారము ఈ క్రిందివిధముగా ఉన్నది.

| ఖండము. | చదరపుమైళ్లు. | జనసంఖ్య. |
|---|---|---|
| యూరోపు. | ౩,౫౦౦౦౦౦ | ౫౧ కోట్ల ౪౭ లక్షలు. |
| ఆఫ్రికా | ౧౧౪౫౦౦౦౦ | ౧౧ ... ౪౩ ... |
| ఉత్తర అమెరికా | ౮౭౬౨౦౦౦ | ౧౭ ... ౨౧ ... |
| దక్షిణ ... | ౭౦౦౩౦౦౦ | ౮ ... ౭౩ ... |
| ఏషియా ... | ౧౭౨౫౦౦౦౦ | ౧౧౧... ౩౩ ... |
| ఆస్ట్రేలియా లేక ఓషీనియా | ౨౯౭౪౫౦౦ | ౧ ... — ... |

మొత్తము ప్రపంచములో ౧౯౩౨ సంవత్సరములో ౨౦౪ కోట్ల ౧౭ లక్షల మానవులుండిరి. పదేండ్లకు నూటికి ౧౦ ప్రకారము హెచ్చుట పరిపాటి కావున ఇప్పుడు ప్రపంచములో ఇంచుమించు ౨౨౫ కోట్ల జనులు నివసించుచున్నారు. ౧౯౪౧ జనాభా ప్రకారము భూమండలములో ౨౧౭ కోట్ల జనులున్నారు.

ఇటీవల దక్షిణధ్రువ ప్రాంతములో మంచుతోనిండి నిర్మానుష్య మగు గొప్పఖండమును కనిపెట్టినారు. దానికి అంటార్టికా అని పేరుపెట్టి నారు. దాని వైశాల్యము ౫౦లక్షల చదరపుమైళ్ళని అంచెనావేసినారు. దానిని గురించిన వివరా లంతకంటే యెక్కువ తెలియరాలేదు. మనమి ప్పుడు పై ఆరుఖండములను గూర్చియే తెలుసుకొనవలెను.

అవేవనగా:—

ఆసియాఖండము ( ఇదే పెద్దఖండము ). యూరోపుఖండము, ఆఫ్రికాఖండము, ఉత్తరఅమెరికా, దక్షిణఅమెరికా ఖండములు, ఓషీనియా లేక ఆస్ట్రేలియా ఖండము. ఈ ఖండాలలో జ్ఞాపక ముంచుకొన దగిన గొప్ప పర్వతములును గొప్ప నదులును ఏవనగా:—

పర్వతాలు:—హిమాలయము. ఇది హిందూస్థానములో ఉత్తరమునన్నది. ఇది ౧౫౦౦ మైళ్ళ పొడవునను ౨౯౦౦౦ అడుగులయెత్తు వరకును ఉన్నది. ప్రపంచపర్వతాలలోనెల్ల గొప్పపర్వతమిదే. హిందూకుష్ పర్వతాలు ఆఫ్ఘనిస్థానము పర్షియా దేశాల కుత్తరమునన్నవి.

ఆల్టాయి పర్వతాలు, హిమాలయము తర్వాత యెత్తయినవే. మధ్య ఏషియాలో చీనా కుత్తరములో ఉన్నవి.

ఫూజియామా అను అగ్నిపర్వతము జపానులో కలదు. దానిపై జపానీలకు చాలా భక్తి కలదు. దానిని వారొక పవిత్ర పర్వతముగా పూజింతురు.

యూరోపులో యూరల్ పర్వతము గొప్పది. అది ఏషియా యూరపుఖండాలకు మధ్యన ఉన్నది. ఆల్ప్సుపర్వతము, ఇటలీకుత్తరమున నున్నది. యూరోపు ఖండములో ఇవే పెద్ద పర్వతాలు. ఆఫ్రికాలోని పశ్చిమోత్తర భాగములో అట్లస్ పర్వతము కలదు. అది ౧౪,౫౦౦ అడుగుల యెత్తువరకున్నది. దక్షిణఅమెరికాలో ఆండీస్ అనే పర్వతశ్రేణి చాలాగొప్పది. అది ౫౦౦౦ మైళ్ల పొడవున ఉన్నది. ఒక తావున అది ౨౩౦౦౦ యడుగుల ఎత్తున్నది.

ఎడారులు:—

చెట్లుచేమలేక అఖండముగా ఇసుక భూములుగా నుండు భాగాలను ఎడారులందురు. అన్నిటికన్న పెద్దఎడారి సహారా,అది ౩౫ లక్షల చదరపుమైళ్ళ వైశాల్యము కలది. అందు ౧౪౦ డిగ్రీల ఎండయుండును. రాత్రి మరల చల్లగానుండును. అది ఉత్తరఆఫ్రికాలో కలదు. దక్షిణాఫ్రికాలో కలహారీ ఎడారికలదు. దాని వైశాల్యము ౧ లక్ష ౨౦ వేల చదరపుమైళ్లు. చీనాకు సమీపములో గోబీ యెడారికలదు. ౧౦౦౦ మైళ్లు అడ్డముగాను ౬౦౦ మైళ్ళు నిడివిగాను అదికలదు. హిందూస్థానములోని

థార్ ఎడారి అంతగొప్పదికాదు. అరేబియా దేశము ముప్పాతిక భాగము ఎడారియే. ఆస్ట్రేలియాలోకూడా చాలా ఎడారులు కలవు.

నదులు:—

పెద్దనదులలో తెలుసుకొనదగిన వేవనగా:—

హిందూస్థానములో:— గంగ, సింధు, బ్రహ్మపుత్రి, గోదావరి, కృష్ణ, కావేరి, నర్మద, తపతి.

చీనాలో:—హ్యాంగ్‌హో. దీనిని చీనాదుఃఖస్రవంతి (China's Sorrow) యని వర్ణింతురు. ఏటేట దీని వరదలవలన వేలకొలది జనులు చత్తురు గ్రామాలుకొన్ని పూర్తిగా కొట్టుకొని పోవును.

ఆఫ్రికాలో:—నీలనది (నైల్) కాంగో, నైగర్, జాంబీసనదులు. నీలనది ౨౦౦౦ మైళ్ళపొడవున పారును. కాంగోకూడ అంతపెద్దనదియే. జాంబీసనది ఒకచోట ౪౨౦ యడుగుల యెత్తునుండి దుముకును. దానికి విక్టోరియా జలపాతమని పేరుపెట్టినారు.

ఉత్తరఅమెరికాలో:- మిసిసిపీనది చాలాగొప్పది. రెండవది లారెన్సునది. దానిలో నొకచోట నయగారా జలపాతము కలదు. దాని నుండి జలవిద్యుత్తును (మన మైసూరులోని జోగ్, శివసముద్ర జలపాతములందువలె) సృష్టించినారు.

దక్షిణఅమెరికాలో:— అమెజాన్‌నది కలదు. అది 3౫౦౦ మైళ్ళ పొడవున ప్రవహించును.

యూరోపులో:—రష్యాలోని వాల్గానది, జర్మనీలోని రైన్‌నది, డాన్యూబ్ నదులు, గొప్పనదులు.

ప్రతి దేశములోను చిన్నవి గొప్పవి నదులు చాలాకలవు.

ఇక ఒక్కొక్క ఖండములోని దేశాలపేర్లను తెలుసుకొందము.

# యూరోపు ఖండము

యూరోపుఖండ వైశాల్యము 32 లక్షల ౬౦ వేల చదరపుమైళ్లు. ఆసియాఖండము దానికంటే ఐదంతలు పెద్దది. ఈ ఖండములో నూటికి 3౧ పాళ్ళు అడవికలదు. ప్రపంచములోని ఖనిజసంపదలో సగము యూరోపులోనే కలదు. అనగా నేలబొగ్గు, ఇనుము, పెట్రోలు, సీసము, రాగి,అల్యూమినం విశేషముగా కలవన్నమాట. యూరోపుఖండములో ౨3౦౮౦౦ మైళ్ళ రైలుదారి కలదు. ప్రపంచములోనెల్ల యూరోపులోనే పరిశ్రమలు ఎక్కువగాకలవు. ఆసరకులను వారు ఏషియా ఆఫ్రికా ఖండాలలో అమ్మి గొప్పలాభాలు పొందుచున్నారు. యూరోపులోకంటే ఎక్కువగా కనడా సంయుక్తఅమెరికారాష్ట్రములో మాత్రమే ౨౭౦౨౦౦ మైళ్ళ రైలుదారి కలదు. యూరోపులో ౫౦ కోట్ల జనులు కలరు.

యూరోపులోని పెద్దదేశము రష్యాదేశము. అచ్చట ఉత్తరభాగ మంతా ఏడాది పొడవున మంచుతోనిండి నివాసయోగ్యము కాకుండా ఉన్నది. ఆ ప్రాంతాలలో ౬ నెలలు పగలు ౬ నెలలు చీకటి యుండును. రష్యాలో ౨౦ కోట్ల మందికలరు. అనగా సగటునమైలుకు ౨౫ మందే కలరు. క్రీ. శ. ౧౯౧౭ న అది ప్రజారాజ్యమై యున్నది. ప్రపంచములో నెల్లను అత్యధికముగా గోధుమలుపండించేది రష్యాదేశమే. అందు ఖనిజసంపద విశేషముగా కలదు. ౬౦౦౦౦ మైళ్ల రైలుదారి కలదు. పూర్వము దాని ముఖ్యపట్టణము మాస్కో. ఇప్పుడు లెనిన్‌గ్రాడు ముఖ్యపట్టణమై యున్నది. బాకూ అనే దక్షిణములోని పట్టణము పెట్రోలు గనులకు చాలాప్రసిద్ధి. రష్యాలో ౧౭౦ భాషలు మాట్లాడు చున్నారు.

స్విట్జర్లాండు దేశము:—

ఇది పర్వతప్రాంతము. ౧౬౦౦౦ చ. మైళ్ళ వైశాల్యమున్నూ ౪౦ లక్షల జనసంఖ్యయున్నూ కలది. అచ్చట మూడు ముఖ్యభాషలు

మాట్లాడుదురు. గోధుమలు ముఖ్యమగుపంట. యచ్చట ద్రాక్ష యెక్కువగా పండింతురు. పర్వతాలు దేశమంతా నిండినందున అచ్చట చిన్న చిన్న నదులు నిరంతరము పారుచుండును. అందు చాలా జలపాతాలున్నవి. వాటినుండి ౩౧ తావులలో జలవిద్యుత్తును ఉత్పత్తి చేసి పరిశ్రమలు చాలావృద్ధిచేసి జనులకు గొప్ప జీవనాధారాలు కల్పించినారు. స్విస్సుదేశము గడియారాలు చేయుటలో అగ్రస్థానము వహించినది. స్విస్సుదేశములో ఆవులు, బఱ్ఱెలు విశేషముగా పాలిచ్చును. యచ్చటి జనులు పాలను పొడిచేసి డబ్బాలలోనింపి మనదేశమువంటి దేశాలకు పంపి అమ్మింతురు. యూరోపుదేశము పైకి స్విస్ దేశమే చాలాసుందర దేశమని యూరోపు ఖండఖేలనస్థలమని (Playground) ప్రసిద్ధిగాంచినది. స్విస్సుదేశము ముఖ్యపట్టణము బర్న్ (Berne). ఈ దేశములో ప్రజారాజ్యము కలదు. ఫెడరల్ విధానములో ఫెడరల్ కౌన్సిల్ ద్వారా పాలనము జరుగును.

హంగరీ:—

వైశాల్యము ౩౫,౭౫౯ చ. మైళ్ళు. జనసంఖ్య ౮,౬౮౮౦౦౦. ముఖ్యపట్టణము బుడాపెస్టు. ఇది డాన్యూబ్ నదికి రెండుదిక్కులా పెరిగిన నగరము. గోధుమలు, మొక్కజొన్నలు ముఖ్యమగు పంటలు. ఈ దేశములో ఇటీవలనే ప్రజారాజ్య మేర్పడినది.

బాల్కన్ రాజ్యాలు:—

ఇందు యుగోస్లావియా, బల్గేరియా, అల్బేనియా, గ్రీసు, టర్కీ దేశాలు చేరినవి.

బల్గేరియా చాలా బీదదేశము. వైశాల్యము ౪౦,౦౦౦ మైళ్లు. ఖనిజ సంపద మాత్రము బాగాకలదు. పట్టుపరిశ్రమ ముఖ్యమైన పరిశ్రమ. నూటికి ౮౦ మంది మన భారతదేశములోవలె వ్యవసాయముపై జీవిస్తున్నారు.

అల్బేనియా:— ఇదికూడా దరిద్రదేశమే. వైశాల్యము ౧౧౦౦౦ చ. మైళ్లు. ౧౦ లక్షల జనసంఖ్య. గ్రీసుదేశము చాలా ప్రాచీనమందు నాగరికతచెంది యిప్పుడు నామమాత్రముతో నుండుదేశము. ద్రాక్ష ముఖ్యమగు పంట. ఏథెన్సు అనునది ముఖ్యపట్టణము. ఈ దేశానికి సుల్తానుండెను. రెండవ ప్రపంచయుద్ధానంతరం ప్రజారాజ్య మేర్పడెను.

యుగోస్లావియా:—వైశాల్యము ౯౬౦౦౦ చ. మైళ్ళు. జనసంఖ్య ఒకటిన్నర కోటి. బెల్గ్రేడ్ దాని ముఖ్యపట్టణము.

టర్కీ:—ఇది కొంత యూరోపులోను కొంత ఏషియాలోనుకలదు. దీని ముఖ్యపట్టణము ఇస్తాంబూల్ (కాన్స్టాంటినోపల్). ఈదేశము రిపబ్లికుగా ఉన్నది.

హాలెండు:—వైశాల్యము ౧౨౫౭౯ చ. మైళ్లు. జనసంఖ్య ౮౦ లక్షలు. ఈ దేశము సముద్రముకంటే తగ్గులో సముద్రతీరమందే కలదు. అందుచేత సముద్రము పొడవున ఆనకట్ట కట్టినారు. ఇంత చిన్న దేశము ఇండొనీషియా, గయానా, మున్నగు శాంతిసాగర ద్వీపాలను జయించి పాలించి ౧౯౫౦ లో వాటికి స్వరాజ్యమిచ్చెను. హాలెండును నెదర్లెండు దేశమందురు. ఇందు ప్రతి చదరపుమైలులో కలపశువులు ప్రపంచములో మరెచ్చటను లేవు. అందుచేత వెన్న, జున్ను, డబ్బాపాలు విశేషముగా ఎగుమతి చేయుదురు. ప్రతిదినము తెల్లవారేవరకు ఇంగ్లండుకు వెన్న, కోడిగ్రుడ్లు, హాలెండునుండి పంపుతూ ఉందురు. దీని ముఖ్యపట్టణము ఆంస్టర్డాం. ఈ దేశమునకు రాజపరిపాలనము కలదు.

బెల్జియం:— జనసంఖ్య ౮౦ లక్షలు. హాలెండువలెనే ఇదియు చిన్న దేశము. వ్యవసాయమే ప్రధానవృత్తి. అందు పాలు, వెన్న మరీ ముఖ్యవృత్తి. బ్రస్సెల్సు అనేది దాని ముఖ్యపట్టణము. బెల్జియమునుండి ఇనుము, అద్దము, బట్టలు, జింక్, సిమెంటు ఎగుమతియగును. ఈ దేశమునకు రాజపరిపాలనము కలదు, రెండు శాసనసభలు కలవు.

డెన్మార్క్:— ఇది చాలా చిన్న దేశము. జనసంఖ్య ౪౦ లక్షలే. ఇది కేవలము వ్యవసాయ దేశము. గోధుమలు చాలాపండును. పాలు, వెన్న పరిశ్రమపై జనులు జీవింతురు. ప్రపంచములో నెల్ల నీ పరిశ్రమలకు ఇదే ప్రదేశము. కోపన్ హేగన్ ముఖ్యపట్టణము. ఈ దేశానికి రాజుకలడు. రీక్స్టాగ్ అనే పార్లమెంటుద్వారా పాలించును.

స్కాండనేవియాలో:— నార్వే స్వీడన్ దేశాలు కలవు. నార్వే వైశాల్యము ౧౨౫౦౦౦ చ. మైళ్ళు. జనసంఖ్య ౨౮ లక్షలకు పైగా కలదు. చేపలుపట్టుట ప్రధానపరిశ్రమ. ఇక్కడినుండే కాడ్ లివర్ ఆయిలు అనే చేపనూనె ఔషధము ఎక్కువగా ఎగుమతి యగును. అగ్గిపెట్టెలకు కాగితాల పరిశ్రమ కీదేశము ప్రసిద్ధిపొందినది. ఓస్లో దీనిముఖ్యపట్టణము. ఈ దేశానికి రాజుకలడు. అతనికి చాలా అధికారాలు కలవు.

స్వీడన్:— వైశాల్యము ౧౭౩౦౦౦ చ. మైళ్ళు. జనసంఖ్య ౬౫ లక్షలు. ఇక్కడ అడవులెక్కువగా ఉన్నవి. ఈ దేశపు ఇనుము చాలా ప్రసిద్ధి. అడవులు, గంధకము ఎక్కువగా ఉండడమువల్ల అగ్గిపుల్లల పరిశ్రమ కీదేశము ప్రసిద్ధి. ఈ దేశము కాగితాలు హిందూస్థానమంతటా విక్రయమగును. స్టాక్ హోం అనేది దీని ముఖ్యపట్టణము. ఈ దేశములో రాజపాలనము కలదు.

స్పెయిన్ దేశము:— ఇది ఎక్కువగా వ్యవసాయ దేశము. ఆలివ్ నూనె, కార్కులు, ఈ దేశమునుండే విశేషముగా సర్వత్ర ఎగుమతి యగును. ఈ దేశము ఉన్ని చాలా శ్రేష్ఠమైనదని ప్రతీతి. సీసము, రాగి, పాదరసము, వెండి, జింక్, ఇనుము, మంగనీస్ ఈ దేశములో నున్నంత యూరోపులో మరెచ్చటను లేవు. సారాయి కూడా ఇచ్చట చాలా ప్రసిద్ధముగా సిద్ధమగును. దీని ముఖ్యపట్టణము మాడ్రిడ్, ఈ దేశానికి రాజుండెను, ఇప్పుడు లేడు.

పోర్చుగల్:—ఇది చాలాచిన్న దేశము ౧ కోటి జనులుకలరు. నూటికి ౬౦ మంది వ్యవసాయముపై జీవింతురు. అక్కడ ఇనుము చాలా దొరకును. కార్కు, మేలైన పింగాణీ పెంకులు ఎగుమతి యగును. లిస్బన్ దాని ముఖ్యపట్టము.

బ్రిటిషుదీవులు:—దీనివైశాల్యము ౮౮౦౦౦ చదరపుమైళ్ళు. ఇందు ఇంగ్లండు స్కాట్లండు చేరినవి. జనసంఖ్య ౫౨ కోట్లు, అచ్చటి జనులను బ్రిటిషువారని, ఇంగ్లీషువారని ఆంగ్లులని, ఆంగ్లేయులని అందురు. అందు నేలబొగ్గు, ఇనుము చాలాకలదు.

ఈ దేశములో ౨౫౦౦౦ మైళ్ల రైలుదారి కలదు. ఈ దేశము కేవలము పరిశ్రమలపై ఆధారపడినది. అందుచేత తన సరకులమ్ముటకై పెద్ద సామ్రాజ్యమును సంపాదించినది. ఆ సామ్రాజ్యముపై తన పరిశ్రమలను మోపి అక్కడినుండి తినుబండారములను సంపదను తీసుకొనిపోవును. ముఖ్యపట్టణము లండన్ అందు జనసంఖ్య ౬౦ లక్షలకన్న మించికలదు. ప్రపంచములోనెల్ల పెద్దనగర మీలండనే. ఇంగ్లండులో నూటికి ౧౧ మందే వ్యవసాయముపై ఆధారపడినారు. ఇంగ్లండునుండి విశేషముగా బట్టలు, ఇనుపసామానులు, మిషనులు, ఉన్నిబట్టలు, మోటార్లు, సైకిళ్ళు ఎగుమతి యగుచుండును. ఇంగ్లండురాజు శాసనబద్ధుడగు రాజు. పార్లమెంటు అధికారానికి బద్ధుడైన నామకార్థపురాజు. ఇంగ్లండు స్కాట్లండులతోపాటు వాటి ప్రక్కన ఉన్న ఐర్ అను ద్వీపము చేరి యుండెను. కాని ఆ ద్వీపము బహుకాలము ఇంగ్లండుతో పోరాడి ౩౦ ఏండ్ల క్రిందట స్వతంత్ర దేశమయ్యెను.

జర్మనీ:—వైశాల్యము ౨౫ లక్షల చదరపుమైళ్ళు. జనసంఖ్య ౮ కోట్లు. దానికి ౧౯౧౮ వరకు కైజర్ రాజు లుండిరి. కాని ఆనాటినుండి అది నానావిధాలుగా మారుతు హిట్లరుకును లోబడి ౧౯౪౫ లో ఓడిపోయి పరాధీన దేశమయ్యెను. జర్మనీ ముఖ్యపట్టణము బర్లిన్. జర్మనీ

పరిశ్రమలకు జగద్విఖ్యాతము. జర్మనులు మందులు, మిషనులు, ఏవస్తువులు సిద్ధముచేసినను అవి మంచివి, ఉత్తమమైనవి, సరసమైనవి అని ప్రసిద్ధిగాంచినవి.

ఆస్ట్రియా:– ౩౦౭౬౬ చదరపుమైళ్ళు. జనసంఖ్య ౬౩ లక్షలు. అచ్చట కాగితాలు, పెన్సిళ్లు, బొమ్మలు ముఖ్యపరిశ్రమలు. ముఖ్యపట్టణము వియన్నా, అది ప్రజారాజ్యమే.

జెకోస్లావియా:–వైశాల్యము ౫౨౭౬౪ చదరపుమైళ్లు. అచ్చట అగ్గిపెట్టెలు, కాగితాలు, బొమ్మలు ముఖ్యపరిశ్రమలు. ప్రేగ(Prague) ముఖ్యపట్టణము. ఇది రిపబ్లిక్.

రుమేనియా:– వైశాల్యము ౫౦ వేల చదరపుమైళ్ళు. జనసంఖ్య ౮౦ లక్షలు. ఇది ప్రధానముగా వ్యవసాయక దేశము. నూటికి ౧౦ మందే పరిశ్రమలపై జీవింతురు. గోధుములు ముఖ్యమగు పంట. బుఖారెస్టు దాని ముఖ్యపట్టణము. ౧౯౪౭ వరకు రాజుండెను. ఇప్పుడు ప్రజారాజ్యము.

ఫ్రాన్సు:–ఇంగ్లండు తర్వాత గొప్పసామ్రాజ్యముకల దేశమిదే. అచ్చట ఇనుము ప్రధానమగు పరిశ్రమ. అచ్చట పట్టు పరిశ్రమకూడా చాలాప్రఖ్యాతి కన్నట్టిది. మంచిసారాయి సిద్ధముచేయుటలో ఫ్రాన్సు దే పెట్టినపేరు. ప్యారీ (Paris) నగరము దాని ముఖ్యపట్టణము. ४౦ లక్షల చదరపుమైళ్ళ వైశాల్యముకల సామ్రాజ్యము ఫ్రాన్సుకు కలదు. సిరియా, ఇండోచీనా, కాంబోడియా, కోచిన్‌చీనా, ఆఫ్రికాలోని గొని భాగాలు దీని అధీనములో కలవు. ఆఫ్రికా తప్ప తక్కిన భాగాలన్నీ స్వతంత్రమై పోతున్నవి. ఫ్రాన్సులో రిపబ్లికు (ప్రజారాజ్య) పద్ధతి కలదు.

ఇటలీ:– వైశాల్యము ౧౧౯౦౦౦ చదరపుమైళ్ళు. జనసంఖ్య ४ కోట్ల ౨౦ లక్షలు. ముఖ్యపట్టణము రోము. ౧౮౦౦౦ ఏండ్ల క్రిందటు

రోము సామ్రాజ్యము జగద్విఖ్యాతి పొందెను. ఈ దేశములో ద్రాక్ష పండ్లు వాటి పరిశ్రమ యెక్కువ. రాజు కలడు.

పోలెండు:— ప్రధానముగా వ్యవసాయ దేశము. వార్సా దాని ముఖ్యపట్టణము. వైశాల్యము ౧౫ లక్షల చదరపుమైళ్ళు జనసంఖ్య మూడున్నరకోటి. రిపబ్లికు పరిపాలన కలది.

బాల్టిక్ రాజ్యాలు:— రష్యాకు పశ్చిమోత్తరముగా ఎస్టోనియా, లాట్వియా, లిథుయేనియా, ఫిన్లెండు, డెన్మార్కు దేశాలు కలవు. ఇవి ముఖ్యమైనవి కావు.

## ఉత్తరఅమెరికా ఖండము

ఈ ఖండములో ౧. కనడా, ౨. సంయుక్త అమెరికా అలాస్కా 3. మెక్సికో, ౪. మధ్యఅమెరికా, ౫. పశ్చిమ ఇండియా దీవులు అను భాగాలు కలవు.

కనడా:— ఇది ఇంగ్లీషువారి వలసరాజ్యము. వైశాల్యము 32 లక్షల చదరపుమైళ్ళు. జనసంఖ్య ౧ కోటి ౨౦ లక్షలు. కనడాలో నానా జాతులుకలవు. ఫ్రెంచివారు, ఇంగ్లీషువారు యెక్కువగా ఉన్నారు. చేపలుపట్టుట అచ్చట చాలా గొప్పపరిశ్రమ. వ్యవసాయము జనుల ప్రధానవృత్తి. గోధుమలు ముఖ్యమగుపంట. అచ్చటగొప్పబంగారుగనులు కలవు. కనడాలోని నికెల్ గనులలో ప్రపంచములోని నికెల్ లోహము లలో నూటికి ౯౦ పాళ్లు దొరకును. అస్బెస్టాస్ అనే లోహము ప్రపంచములోని అస్బెస్టాస్‌లో నూటికి ౯౫ పాళ్ళు అందే దొరకును. ప్రపంచములో టింబరు (కట్టెలో) కనడాది అగ్రస్థానము. ఒట్టావాఅను నగరము కనడా ముఖ్యపట్టణము. ఈ దేశము బ్రిటిషువారి వలసరాజ్యముగా (కాలనీ) ఉన్నది.

సంయుక్త అమెరికారాష్ట్రము:— దీనిని ఇంగ్లీషులో యూ. ఎస్. ఏ. (యునైటెడ్ స్టేట్సు ఆఫ్ అమెరికా) అందురు. ప్రపంచములో నెల్ల అత్యంత భాగ్యవంతమగు దేశ మిదియే.

దీని వైశాల్యము 3౭౮౩౫౭౯ చదరపుమైళ్లు. జనసంఖ్య ౧3 కోట్ల ౫౦లక్షలు. ౨౦౦ ఏండ్లక్రిందట ఆ దేశము ఇంగ్లీషువారికి లోబడి యుండెను. కాని తర్వాత తిరుగబడి స్వతంత్రదేశమయ్యెను. ఆ దేశము లో ౪౮ రాష్ట్రములున్నవి. అన్నియుకలిసి ౪ ఏండ్ల కొకమారొక అధ్యక్షునియెన్నుకొని సెనేటుఅను సభద్వారా రాజ్యము సాగించును.ఆదేశములో వ్యవసాయముపై నూటికి ౨౦ మంది ఆధారపడినారు. తక్కిన వారందరును పరిశ్రమలచే జీవింతురు. గోధుమలు ముఖ్యమగు పంట. ప్రపంచములోని ప్రత్తి పంటలో నూటికి ౬౦ పాళ్ళు ఈ దేశములో పండును. ప్రధాన పరిశ్రములు ఇనుము, ఉక్కుపనులు. సంయుక్త అమెరికాలో పెట్రోలు చాలావొరుకును. ప్రపంచపు పెట్రోలులో నూటికి ౬౦ పాళ్లచ్చట నొరుకును. అచ్చట పెట్రోలు గనులయొద్ద గ్యాలను పెట్రోలు ధర ౪అణాలకన్న తక్కువే. అచ్చట ౨౬౦౦౦౦ మైళ్లరైలు దారి కలదు. అనగా ప్రపంచపు రైలుదారిలో నూటికి ౪౫పాళ్ల రైలు దారి అందుకలదు.

వాషింగ్టన్ దాని ముఖ్యపట్టణము. న్యూయార్కు పట్టణము అమెరికాలోనిదే. అది లండన్ తర్వాత ప్రపంచములోనెల్ల గొప్పనగరము. ఆ దేశములో రిపబ్లిక్ ప్రభుత్వముకలదు.

మెక్సికో:—ఇది ప్రాచీనకాలమందు చాలా నాగరికతపొందినట్టిది. మధ్యకాలములో స్పెయిన్‌వారు గెలిచి చాలాఘోరాలుచేసిరి. ఆదేశములో మక్కజొన్నలు, కాఫీగింజలు ముఖ్యమగు పంటలు. అక్కడ పెట్రోలియం, వెండి, సీసము, తుత్తునాగము, బంగారు విశేషముగా లభించును. ప్రపంచములో నెల్ల యచ్చటి గనులలో యెక్కువ వెండి

దొరకును. దాని ముఖ్యపట్టణము పేరు మెక్సికో అనియే యందురు. దాని వైశాల్యము ౭౬౭౧౯౮ చదరపుమైళ్ళు. జనసంఖ్య ఒకకోటి ౬౦ లక్షలు. ఇందు రిపబ్లికు ప్రభుత్వము అధ్యక్షుని యెన్నిక ద్వారా జరుగును.

## దక్షిణ అమెరికా ఖండము

ఆఖండములో అమెజాన్, ఓరినోకో కొలోరాడో అనేవి గొప్ప నదులు. ఆ ఖండములోని ఆదిమ నివాసులను అణగద్రొక్కి యూరోపు తెల్లజాతులు చాలాభాగా లాక్రమించుకొన్నారు. ఆ ఖండములో ౧౨ భాగాలున్నవి.

| | | |
|---|---|---|
| ౧. పనామా | ౫. గయానా | ౯. ఛిలీ |
| ౨. కొలంబియా | ౬. బ్రెజిల్ | ౧౦. అర్జెంటైనా |
| ౩. ఈక్వడార్ | ౭. పెరూ | ౧౧. పరాగ్వే |
| ౪. వెనుజూలా | ౮. బొలీవియా | ౧౨. ఉరుగ్వే. |

౧. పనామా:—ఆ భాగము ఆదినుండి ఉత్తరఅమెరికాతో కలిసి యుండెను. కొన్ని యేండ్లక్రిందట అచ్చట కాలువతీసి శాంతిమహాసాగరమును అతలాంతిక సముద్రాన్ని కలిపిరి.

౨. కొలంబియా:—అక్కడ చెరకు, కోకో, కాఫీ వంటివి బాగా పండును. గనులలో సమృద్ధిగా వెండి బంగారు దొరుకుతున్నది.

౩. వెనుజూలా:— అది వైరాజ్యము ( ప్రజారాజ్యము ) కోకో, కాఫీ, చెరుకు, పొగాకు, ప్రత్తి, మక్కలు, నీలి, వరి, సమృద్ధిగా పండును. గొప్పనూనెగనులు కలవు ఆ దేశములో రిపబ్లిక్ ప్రభుత్వము కలదు.

౪. ఈక్వెడార్:— చాలా బీదదేశము. కోకో మాత్రమే బాగా పండును. ఆ దేశములో రిపబ్లికు ప్రభుత్వము కలదు.

బొలీవియా:— వ్యవసాయ ప్రధానదేశము. టిన్, రాగి, వెండి బంగారు గనులు కలవు. ఎఱ్ఱయిండియనులే అక్కడ ఉన్నారు. అందు రిపబ్లిక్ ప్రభుత్వము కలదు.

ఛిలీ:— అది వైరాజ్యము (రిపబ్లికు). రాగిగనులు అందు విశేషముగా కలవు. ఆ దేశములోను రిపబ్లికు ప్రభుత్వము కలదు.

బ్రెజిల్ :—అది దక్షిణఅమెరికా ఖండములో సగమువరకున్న దేశము. వ్యవసాయ ప్రధానదేశము. ప్రపంచములోని కాఫీగింజలలో నూటికి ౭౦ పాళ్ళు అచ్చటపండును. ఆ దేశములో విపరీతముగా పందులను పెంచుదురు. లోహాలు, వజ్రాలుకల గనులు చాలాగలవు. మంగనీసు అనునది చాలా యెక్కువగా అందు దొరకును. ఆ దేశములో కూడా రిపబ్లికుప్రభుత్వము కలదు. అన్నీ సులక్షణాలే కాని దేశసంపదను సరిగా వృద్ధిచేయ లేదు.

ఆర్జంటైనా:— వ్యవసాయ ప్రధాన దేశము. గోధుమలు చాలా పండును. అది వైరాజ్యము (రిపబ్లికు).

ఉరుగ్వే:—చాలా వృద్ధిపొందిన దేశము. అందరును తెల్లవారే.

పెరూ:—ప్రాచీనములో చాలా నాగరికత పొందిన దేశము. ౩౦౦ పండ్లక్రిందట మెక్సికోను గెలుచుకొన్నట్లుగా దాన్నికూడా స్పెయిన్ వారు గెలిచిరి. ఇప్పుడు ఆ దేశసంపదను తెల్లవారందరును పంచుకొన్నారు. దాని నూనెగనులను సంయుక్తామెరికా వారు, ప్రత్తిభూములను జపానువారు, జర్మనీవారు రైల్వేలను, ఇంగ్లీషువారు ధనబ్యాంకులను, ఇటలీవారు చక్కెర పరిశ్రమను, పంచుకొన్నారు.

గినీ:—ఈ మండలాన్ని ఫ్రెంచి, ఇంగ్లీషు, డచ్చి (హాలెండు)వారు పంచు కొన్నారు.

## ఆఫ్రికా ఖండము

అదొక విచిత్రఖండము. అత్యుష్ణదేశ మగుటచేత అందలిజనులు కారునల్లగా ఉందురు. వారిని నీగ్రోలని అంటారు. వారు దిగంబరులు గాను లేక గోచీలతోను తిరుగుదురు. వారికి అవసరాలు చాలాతక్కువ. వారు సోమరులు, పిరికివారు, నాగరికత ఎరుగరు.

ఆఫ్రికాఖండాన్ని యూరోపు వాసులందరు ఎవరికబ్బిన భాగాన్ని వారాక్రమించి సరిహద్దు లేర్పాటుచేసుకొని శికానా వేసినారు. ఇంగ్లీషు, ఫ్రెంచి, బెల్జియం, పోర్చుగీస్, ఇటలీ, స్పెయిన్ వారు ఆ ఖండాన్ని పంచుకొన్నారు. అత్యుష్ణముగా ఉండి తెల్లవారికి నిలుచుటకు వీలులేని ఎడారులను, ఎడారివంటి దరిద్రభూములను తెల్లవారు వదలివేసినారు.

బ్రిటిషువారి భాగాలు:—పశ్చిమాఫ్రికా భాగములోని గాంబియా, గోల్డుకోస్టు, లియోన్ మండలాలు. తూర్పున సూడాన్, ఉగాండా, టాంగనికా, కెన్యా, న్యాసాలెండు, రోడీషియా, సొమాలీ దేశము. ఉత్తరమున ఈజిప్టు. దక్షిణమున దక్షిణాఫ్రికా, నేటాల్, ట్రాన్స్వాల్, ఆరెంజ్, మున్నగునవి.

ఈజిప్టు:— పై దేశాలలో ఈజిప్టు చాలాముఖ్యమైనది. సుమారు ౬౦౦౦ ఏండ్లక్రిందట కూడా అది చాలా గొప్ప నాగరికత పొందిన దేశము. అచ్చటి నీలనదియే దానికి ముఖ్యాధారము. దాని మూలాన ౧౨౦౦౦ చదరపుమైళ్లభూమి సిస్తు అగును. ముఖ్యపట్టణము ఖాయిరా. ఈ దేశము ఇంగ్లీషువారికి లోబడినదేశము. ఇప్పుడు స్వాతంత్రత పొందినది.

అబిసీనియా:—ఇది ఈజిప్టుకు తూర్పుననున్నది. పేరుకు స్వాతంత్ర దేశము కాని అది బ్రిటిషువారి కనుసన్నలో ఉన్నది. అచ్చటి హబ్షీలు దక్షిణహిందూస్థాన సుల్తానులయొద్ద సిపాయీలుగా పనిచేసినట్టి వారు.

ఆఫ్రికాఖండ జనసంఖ్య ఇంచుమించు ౨౦కోట్లు. అందు సగము మంది ముసల్మానులు. ఆఫ్రికాలోని దక్షిణభాగములో వజ్రాల గను లున్నవి. ఆఫ్రికా వైశాల్యము ౧౧౨౬౮౬౨ చదరపుమైళ్ళు.

## ఆస్ట్రేలియా ఖండము

ఆఫ్రికాకన్న అధ్వాన్నముగా అష్టదరిద్రముగా ఏర్పడినది ఈ ఆస్ట్రేలియాఖండము. ఇంగ్లీషువారు దానిని తేపాకులుచూపి ఆక్రమించు కొనిరి. ఆదిమ నివాసులగు ఆటవికులను క్రమక్రమముగా మాయ మయ్యేఅట్లు చేసిరి. దానివైశాల్యము ౩౦ లక్షల చదరపుమైళ్ళు. అనగా ఇంచుమించు మన హిందూస్థానమంత రెండంతల దేశము. కాని మన దేశములో ౪౦ కోట్లమంది ఉంటే మన దేశమంత రెండంతల దేశమగు ఆస్ట్రేలియాలో ౮౦ లక్షల మంది మాత్రమే ఉన్నారు. అనగా మైలుకు ముగ్గురు కూడా లేరన్నమాట. వారంతా తెల్లవారే. ఆ ఖండము చాలా ఉష్ణప్రదేశము కాని తెల్లవారికి పనికివచ్చే అట్లు దేవుడు దాన్ని సృష్టించలేదు కాని ఆదేశాన్ని ఆక్రమించుకొన్న తెల్లవారు దాన్ని వదలరు. ఇతర రంగుజాతులవారిని దానిలోనికి రానియ్యరు. ఆ ఖండ ములో బంగారు విశేషముగా లభిస్తున్నది. అందుచేత అది తెల్లవారికి శాశ్వతపట్టాగా ఉండిపోయినది. ఆస్ట్రేలియా ఒక పెద్ద ద్వీపము. చుట్టు సముద్రతీరాన్ని ఆశ్రయించుకొని తెల్లవారు నివసిస్తున్నారు. అక్కడనే వారు వ్యవసాయము బాగా సాగిస్తున్నారు. గోధుమలు చాలా బాగా పండిస్తున్నారు. అచ్చటి గొర్లమందలు ప్రపంచమం దగ్రస్థానము వహించినవి. నేలబొగ్గు, వెండి, ఇనుము, సీసముగనులు కూడా అందు చాలాకలవు. ఆస్ట్రేలియా మొదట ఇంగ్లీషువారి అధీన దేశము. కాని తర్వాత అది తమజాతివారిదే కాన దానిని వలసరాజ్యముగా చేసి తమ అధీన స్వాతంత్ర్య దేశముగా దాన్ని చేసివేసిరి.

న్యూజీలెండు:—ఆస్ట్రేలియాకు సమీపమందే న్యూజీలెండు అను దీవులున్నవి. అవికూడా ఇంగ్లీషువారి వలసదీవులు. ఇంగ్లీషువా రాదీవు

లను ఆక్రమించుకొనుటకు ముందు ఆదీవులలో మోరీ అనే ఆదిమనివాసులుండిరి. ఆదీవులు తమ ఇంగ్లండువలెనే చల్లని దీవులగుటచేత ఆదిమనివాసులను క్షీణించేటట్లుచేసి తామే నిండిపోయిరి. ఇప్పుడు ఆదిమనివాసులందు నూటికి ఇద్దరు మాత్రమే ఉన్నారు. ఆ యిద్దరుకూడా ఏనాడు ఊడిపోతారో యేమో!

ఆ దీవులలో ప్రపంచములో ఎక్కడకూడా లేనన్ని గొఱ్ఱెలున్నవి. పాలు వెన్న పరిశ్రమయందు చాలావృద్ధి యైనది. వెల్లింగ్టన్ అను పట్టణము ఆదీవులకు ముఖ్యపట్టణము. ఆదేశ వైశాల్యము ౧౩,౪౦,౦౦౦ చదరపుమైళ్ళు, జనసంఖ్య ౧౨లక్షలు. అనగా మైలుకొక మనిషికూడా లేడు. అది ఇంగ్లీషువారి వలసరాజ్యము. దానిని రెండవ ఇంగ్లండు అని అందురు. అందుచేత రంగుజాతులను అందుండనీయరు.

## ఆసియా ఖండము

ఆసియాఖండాన్ని ఏషియా అనికూడా అంటారు. ఈ ఖండములోని ముఖ్యదేశా లేవనగా:—

| | | |
|---|---|---|
| ౧. ఇండోచీనా | ౮. తాయిలెండు (సయాం) | ౧౬. హిందుస్థానం (సింహాళము) |
| ౨. చీనా | ౯. సిరియా | |
| ౩. జపాను | ౧౦. పాలస్తీన్ | ౧౭. మలయా |
| ౪. మంచూకో | ౧౧. ఈరాఖు | ౧౮. బర్మా |
| ౫. ఫిలిప్పైన్ దీవులు | ౧౨. ఆసియాలోని రష్యా | ౧౯. టిబ్బెట్ |
| ౬. కొరియా | ౧౩. ఆప్ఘనిస్థాన్ | ౨౦. నేపాళము |
| ౭. తూర్పుఇండియా దీవులు (ఇండోనీషియా) | ౧౪. ఈరాన్ (పర్షియా) | |
| | ౧౫. అరేబియా | |

ఆసియాఖండ వైశాల్యము ౧౭౦౪౩౮౭౨ చదరపుమైళ్ళు. జనసంఖ్య ఇంచుమించు ౧౩౦ కోట్లు.

ఈ దేశాలను తెలుసుకొనుటకు పూర్వము ౩౦౦౦ ఏండ్లకు పూర్వము గొప్ప నాగరికతపొంది సామ్రాజ్యాలను స్థాపించి తర్వాత పేరు గుర్తుకూడా లేకుండా మాయమైపోయిన నాలుగు దేశాలను గూర్చి కొంత తెలుసుకొనవలెను.

ఇప్పటి ఈరాకు ప్రాంతములో అసీరియా, బాబిలోనియా, ఖాల్డియా అను మూడు గొప్ప నాగరిక దేశాలు మూడునాలుగు వేల యేండ్ల క్రిందట వెలసెను. ఇప్పటి పాలస్తీన ప్రాంతములో ఫినీకియా అను దేశముండెను. అదియు ౩౦౦౦ ఏండ్ల క్రిందటి గొప్ప నాగరిక రాజ్యము.

ఇప్పటి ఈరాన్ దేశాని కుత్తరముగా మీడియా అను దేశము కూడా అట్టిదే. ఈ నాల్గింటిని గూర్చి వేరేచరిత్రలు కలవు. అభిలాషులు వాటిని చదువుకొన వచ్చును. (చూడుడు విస్మృత సామ్రాజ్యములు— హైదాబాదు)

ఇక ఆసియాఖండములోని వివిధభాగాలను గూర్చి సంగ్రహ ముగా తెలుసుకొందము.

జపాను:— ఆసియాపైకి దౌర్జన్యజాతి అనియు, సామ్రాజ్యవాది అనియు పేరొంది ౧౯౪౫ లో మంటగలసినది జపాను దేశము. జపాను క్రింద తూర్పు దీవులుకొన్ని, కొరియా మంచూకొ అను దేశాలుం డెను. ౧౯౪౫ యుద్ధములో తన స్వాతంత్ర్యమే కోలుపోయినందున దానిసామ్రాజ్యము మంటకలిసెను. జపానులో చిన్నవిపెద్దవి ద్వీపాలు కలవు. అవన్నీకలసి కూడా హిందూస్థానములో ౧౨ వ భాగముగును. జనసంఖ్య ౮ కోట్లు. జపాను దీవులలో ఎల్లప్పుడు భూకంపాలు కలుగుతూ ఉండును. కాని ప్రమాదకరమగు భూకంపాలు ఏడెనిమిదేండ్ల కొకమారు వచ్చును. జపానులో చాలా దీవులుండుటచేత జపానీలు

సముద్ర వ్యాపారులైరి. పైగా వారిలో సగముమంది చేపలతిండిచేత, చేపలవ్యాపారముచేత జీవింతురు. జపానులో అడవులు చాలాకలవు, అందు బొంగులు, లక్క చెట్లు, కర్పూరపుచెట్లు పట్టుపురుగులకు కావలసిన మల్బరీ (షహతూత్) చెట్లు చాలాకలవు. జపాను అధీనములోని ఫార్మోసాదీవిలో చాలా కర్పూరపుచెట్లు కలవు. మరియు దాని దక్షిణ దీవియగు క్యూషూలోకూడ అవికలవు. ఆరెండుదీవులనుండియే మనదేవుళ్ళకు కర్పూరము లభిస్తున్నది. జపానులో నేలబొగ్గు సమృద్ధిగాదొరుకుతున్నది. జపాను పర్వతాలు కొన్ని అగ్ని పర్వతాలై యున్నవి. వాటినుండి గంధకము సమృద్ధిగా దొరుకుతున్నది. జపానువారు విద్యుత్తును (ఎలెక్ట్రిసిటీ) బాగా వృద్ధిచేసి పల్లెలకుకూడా అందించుతున్నారు. జపానులో పట్టుపరిశ్రమ, రంగురంగుల టస్సర్‌బట్టలు, బొమ్మలు, రబ్బరు సామానులు, చాలా వృద్ధిపొందినవి. వారి అగ్గిపెట్టెలు, ఛత్రీలు, కాగితాలుకూడా ౧౯౩౯-౪౫ యుద్ధానకి పూర్వము మనదేశము నిండా నిండుకొని పోయియుండెను. జపాను ముఖ్యపట్టణము టోకియో. అది ప్రపంచములో మూడవ నగరము.

కొరియా:- అది యుద్ధానికి పూర్వము జపానుక్రింద నలిగి యిప్పుడుఅమెరికా రష్యావారి చేతులలో పడినది. ఎక్కువగా వృద్ధికాని దేశము.

చీనా దేశము:- ఇది చాలా ప్రాచీననాగరికత కలదేశము. హిందూస్థానముకన్న గొప్పవైశాల్యము కలది. జనసంఖ్యకూడా ౪౩కోట్లకు మించినది. చీనాక్రిందనే టిబెటు దేశ మున్నది. కాని అది నామకార్థపు పరాధీనతయే.

కొన్నియేండ్లనుండి చీనా దేశము ప్రజారాజ్యమై యున్నది. దానిలో మంగోలియా, మంచూరియా దేశాలు చేరియుండెను. కాని అవి యిప్పుడు వేరైపోయినవి. చీనానుండియే ఫ్రెంచివారు ఇండోచీనాను లాగుకొనిరి. ఇంగ్లీషువారు బర్మా, మలయాలను లాగుకొనిరి.

చీనా తూర్పుతీరపు రేవులనంతయు తెల్లజాతులవారు పంచుకొనిరి. మన దేశమువలెనే చీనా రాజకీయముగా దుర్బలదేశమై యున్నది. చీనా వ్యవసాయ ప్రధానదేశము. వరి ప్రధానమగుపంట. సగటున ఎకరానికి ౯౦౦సేర్ల వడ్లుపండును. పొగాకు, తేయాకు, సమృద్ధిగాపండును. సోయాగింజలకు చీనాయే ప్రధానదేశము. పట్టుబట్టల పరిశ్రమ ఆ దేశములో విశేషముగా కలదు. ఇనుము, వెండి, నేలబొగ్గు గనులు చాలాకలవు. ఇతర లోహాలుకూడా కొద్దిగాకలవు. కాని చీనా దరిద్రదేశమగుటచేత జపానువారు దాన్ని ఈ ౩౦ ఏండ్లనుండి బాధపెట్టుతూ దాని దేశాలను ఆక్రమించుకొంటూ ఉండడముచేత ఈ గనులన్నీ వృద్ధికాకుండా అట్లే యున్నవి. చీనా ముఖ్యపట్టణాలు పలుమారు మారుతూ వచ్చెను. యుద్ధానికి పూర్వము నాంకింగ్ ఉండెను. ఇప్పుడు చంకింగ్. ఇకముందేదిగానుండునో? చీనా చక్రవర్తిని ౨౫ఏండ్లనాడే తొలగించి ప్రజారాజ్యమేర్పాటుచేసిరి. ఇప్పుడు కమ్యూనిస్టులు దానిని జయించి ఆక్రమించుకొన్నారు.

మంచూకో:— పూర్వము దానిని మంచూరియా అనిరి. వైశాల్యము ౪౬౦,౦౦౦ చదరపుమైళ్ళు. ముఖ్యమగు పంటలు, సోయాగింజలు, జొన్నలు, గోధుములు. ప్రపంచములోని సోయాగింజలపంటలో సగము పంట ఇచ్చటనే పండును. దాన్ని జనులు తిందురు. పైగా దానినూనెతో ఛత్రీబట్టలకు రంగువేసిన నీరింకదు. అదేనూనెను రంగులలో కలుపుదురు. దానితో సిరాను, సబ్బులను చేయుదురు.

ఇండోచీనా:— ఇది ఫ్రెంచివారి బానిసదేశమై యుండెను. వైశాల్యము ౨౮౦,౦౦౦ చదరపుమైళ్ళు. అందు గొప్ప అడవులుకలవు. దానిలోనే ప్రత్తికి ప్రసిద్ధికాంచిన కాంబోడియా మండలమున్నది. ఈ దేశమునకు ఫ్రెంచివారు స్వాతంత్ర్యమిచ్చినారు.

సయాము:— సయామును ఇప్పుడు తాయిలెండు అని అంటున్నారు. పేరుకు స్వతంత్ర దేశము. ౧౯౩౯-౪౫ యుద్ధానికి పూర్వమది

ఫ్రెంచివారి కనుసన్నలలో మెలిగెను. ఇప్పుడు ఇంగ్లీషువారి కనుసన్నలలో నున్నది. వైశాల్యము ౧౯౮,౦౦౦ చదరపుమైళ్లు. వరి ముఖ్యమగుపంట. ముఖ్యపట్టణము బాంకాక్ అది సుందరనగరమని ప్రతీతి. ఈ దేశానికి రాజున్నాడు. కాని యిప్పుడు ఇంగ్లీషు అమెరికా క్రింద నలిగి పోతున్నది.

మలయా:— ఇది ఇంగ్లీషువారి అధీనదేశము. అందు రబ్బరు విపరీతముగా కలదు. ప్రపంచపు రబ్బరుఉత్పత్తిలో మూడవభాగమిందే ఉత్పత్తి అగును. అదే విధముగా మూడవవంతు టిన్ ఇక్కడనే లభించును. ౧౯౩౯ యుద్ధకాలములో అక్కడి టిన్ మనకు రానందున టిన్ డబ్బాలకు చాలాధర పెరిగిపోయెను. టెంకాయచెట్లు అత్యధికముగా ఉండుటవల్ల మలయా కొబ్బెర అమెరికాకు ఇంగ్లండుకుకూడా యెగుమతి అగును.

తూర్పు ఇండియాదీవులు:—వీటిలో సుమత్రా, జావా, సెలిబెస్, బలి, బోర్నియో ద్వీపాలు చేరినవి. వీటినిప్పుడు ఇండోనీషియా అందురు. ఈ ద్వీపాలలో పూర్వము హిందువులు తమ వలసలను స్థాపించి అచ్చటి ప్రజలకు వైదికమతము తర్వాత బౌద్ధమతమును ఇచ్చిరి. తరువాత తురకలు తమ ఇస్లామును వ్యాపింపజేసిరి. ఇప్పటికిన్నీ ఈదీవులలో కొందరు హిందువులున్నారు. బోర్నియోలో సగము ఇంగ్లీషువారిది. తక్కినవన్ని హాలెండు ( డచ్చి ) వారికి వానిసదేశాలై పోయినవి. ఆ దీవులు చాలా సారవంతమైనవి. అందలి లవంగాలు ఏలకులు, జాపత్రి, వక్కలు మున్నగు సుగంధద్రవ్యాలు ప్రపంచమంతటా వ్యాపారమగునవి. అచ్చట సింకోనాచెట్లు విశేషముగా కలవు. వాటినుండి క్వైనైన్ (క్వైనా) ను సిద్ధముచేసి చలిజ్వరాల కిత్తురు. చెరుకు చాలా యెక్కువగా పండుటచేత ఆద్వీపాలచక్కెర మనదేశములో మన చక్కెరకంటే అగ్గువగా అమ్ముతున్నది. అచ్చట రబ్బరు, కొబ్బెర, తేయాకు, కాఫీ, పొగాకు సమృద్ధిగా లభించును. ఇంకొక విశేషమేమనగ ఆ దీవులలో

పెట్రోలుగనులు చాలాకలవు. టిన్ కూడా చాలాకలదు. ఇండోనీషియా డచ్చివారి అధీనమునుండి ౧౯౪౯లో బయటపడి స్వతంత్ర ప్రజారాజ్యమైనది.

ఫిలిప్పైన్ దీవులు:—ఇవి చీనాకు తూర్పున కలవు. చిన్నవి పెద్దవి కలిసి ౭౦౦౦ దీవులున్నవి. ఇవి పూర్వము స్పెయిన్ వారివి. తర్వాత అమెరికావారు వాటిని గెలుచుకొనిరి. ఇప్పుడు అమెరికావారి అధీనములో స్వాతంత్ర్యము పొందినవి. మనిలా అనే నగరము ఈ దీవుల ముఖ్యపట్టణము.

సిరియా:—౬౦,౦౦౦ చదరపుమైళ్ళు. ౩౦ లక్షల జనసంఖ్య. ఫ్రాన్సుకు లోబడినది. వ్యవసాయప్రధాన దేశము.

ఈరాన్:— దీనిని పారిస్, పర్షియా అనియు అంటారు. ౬ లక్షల చదరపుమైళ్ళ వైశాల్యము. జనసంఖ్య ౧ కోటి. వ్యవసాయ ప్రధాన దేశము. నూనెగనులకు ప్రసిద్ధి. అందుచేత ఇంగ్లీషు, రష్యా దేశాలు దాన్ని సాగదీస్తున్నవి. టెహరాన్ ముఖ్యపట్టణము. ౨౩౦౦ ఏండ్లకు పూర్వము ఈరాన్ చాలాగొప్ప సామ్రాజ్యమై యుండెను. ఈరానీలు హిందువులకు ప్రాచీనమందు దగ్గరివారు. ఆర్యశబ్దమే ఈరాన్ అయినది. ఈరాన్‌లోని ఒక మండలముపేరు ఆర్యాణమని యుండెను. ఆజర్ బైజాన్ అనే నగరమును ప్రాచీనమందు ఆర్యబీజము అనిపిలిచిరి. దారా (Darius) చక్రవర్తి క్రీ. పూ. ౫౦౦ ప్రాంతములో తాను ఆర్యపుత్రుడనని శాసనము వ్రాయించుకొనెను. ౧౨౦౦ ఏండ్ల క్రిందటి అరబ్బులలో ఇస్లాము ఉత్పత్తియై విజృంభించెను. వారు ఈరానును గెలిచి అందలి జరథుస్త్రమతాన్ని తుడచివేసి దేశాన్ని ఇస్లాములో కలిపిరి.

పాలస్తీన్:— బ్రిటిషువారి అధీనదేశమై యుండెను. ౯౦౦౦ చదరపుమైళ్ళ వైశాల్యము కలది. జనసంఖ్య ౨౦లక్షలు. ఇప్పుడు స్వతంత్రదేశమైనది. అచ్చట యహూదీలు, అరబ్బులు కలరు.

ఈరాక్:— ఇంగ్లీషుల అధీనదేశము. ౧౭౫౦౦౦ చదరపుమైళ్ళ వైశాల్యము కలది.

ఆఫ్ఘనిస్థానము:—హిందూస్థానానికి పశ్చిమోత్తరమున ఉన్నది. అంతయు పర్వతమయము. అది వ్యవసాయప్రధాన దేశము. స్వతంత్ర దేశము. అందరును ముస్లిములే. ఈ దేశాన్ని అమీర్ అను ప్రభువు పరిపాలించును.

అరేబియా:— ౧౨ లక్షల చదరపుమైళ్ళ దేశము. ఇంచుమించు హిందూస్థానమంతటిది. కాని ముప్పాతికభూమి ఎడారియైనది. జనసంఖ్య ౬౦ లక్షలు మాత్రమే. అరేబియాలోని యమన్ అనే మండలములోనే మోచాకాఫీ అనే పేరుగల కాఫీగింజలు సమృద్ధిగా పండును. అక్కడి కాఫీయే మన దేశములో మొదట మైసూరులో ప్రారంభమై యిప్పుడు యితర ప్రాంతాలలోను వ్యాపించినది. ఖర్జూరపండ్లకు అరేబియా దేశమే ప్రసిద్ధి. అరేబియా ప్రపంచముస్లిముల కందరికిని పవిత్ర క్షేత్రమైనది. అందలి మక్కా మదీనా పట్టణాలకు మన దేశము తురకలలో చేతనైన వారందరును తీర్థయాత్రచేసి వత్తురు. ఆ దేశానికి ఒక ప్రభువు కలడు. అతడు నిరంకుశుడు.

బర్మా:—పూర్వమిది హిందూస్థానములో చేరియుండెను. ౧౯౩౫ లో దాన్ని ఇంగ్లీషు ప్రభుత్వము వేరుచేసెను. అందు విశేషముగా వరి పండును. వరి అక్కడినుండి మన దేశానికి దిగుమతి అగును. రంగూన్ ముఖ్యపట్టణము. బర్మాలో గొప్ప లాభాలు కలుగునని ఉత్తరసర్కారుల తెనుగువారు అక్కడికి చాలా పోతూఉంటారు. ఈ దేశమిప్పుడు స్వతంత్రదేశమైనది.

సింహళము:— హిందూస్థానానికి దక్షిణములో ఉన్న ద్వీపము. ఇంగ్లీషువారి యధీనమండలమై యిప్పుడు స్వతంత్ర దేశమైనది. తేయాకు, కొబ్బెర అతివిస్తారముగా పండును. అది ఎక్కువగా యితర దేశాల కెగుమతి అగును.

టిబెట్:— ఇది నామకార్థముగా చీనాకు లోబడినది. దీనిని మన పూర్వులు త్రివిష్టపదేశమనిరి. దాని తద్భవమే టిబ్బట్. అది హిమాలయమున కుత్తరమున ఉన్నది. కాన చాలా ఉన్నతదేశము. ప్రపంచపుమిద్దె (Roof of the world) అని దాన్ని అంటారు. విశేషకాలము మంచుపడును. చాలా చలియుండును. వైశాల్యము ౪౬౩౨౦౨ చదరపుమైళ్ళు. జనసంఖ్య ఎవ్వరికీ తెలియదు. ౪౦లక్షలుండునని అంచెనా. కొద్దిగా బంగారుగనులున్నవి. కొద్దిగా వ్యవసాయము, కొద్దిపాటి నేత పరిశ్రమలు కలవు. టిబెట్ పరిపాలకుని దలైలామా అందురు. టిబెటులో మనదున్నపోతులవంటి జడలుకల దున్నలుకలవు. వాటిని యాక్ అని అందురు. అవి కొండలలో కాలుజారకుండా తిరుగును. వాటిని టిబెటువారు బరువులు మోయుట కుపయోగింతురు. గొఱ్ఱెలవలె వాటి ఒంటినిండా దీర్ఘమగు వెంట్రుకలుండును.

నేపాళదేశము:— దీనిని రాజపుత్రి మహారాజు పాలిస్తున్నాడు. అతడు నిరంకుశ ప్రభువు. హిమాలయ పర్వతాలలో ౫౪ వేల చదరపు మైళ్ళ వైశాల్యదేశమిది. దీనిని కూడా జయించవలెనని ఇంగ్లీషువారు రెండుమారులు ప్రయత్నముచేసిరి. కాని పర్వతాలలోని దేశము కాన నేపాలు దక్కిపోయెను. పర్వతాలలో హిందూస్థానీ సిపాయీలు ధ్వంసమైరి. అప్పటినుండీ నేపాళముతో ఇంగ్లీషువారు స్నేహముచేసిరి. ఏటేట ఇంగ్లీషువారు వారికే ౧౦లక్షల కప్పము కట్టుతూ వచ్చిరి. కట్టి నేపాళంవారి గోర్ఖా సిపాయీలను తమ సైన్యములో చేర్చుకొనిరి. ప్రపంచములో నెల్లను వీరాతివీరులగు సైనికులెవరంటే గోర్ఖాలు అని ప్రసిద్ధిపొందినారు. గోరక్షక అనే పదమే గోర్ఖా అయ్యెను. ఖట్మండూ అనునది నేపాళరాజధాని. అచ్చట కొన్నిప్రసిద్ధ శైవక్షేత్రాలుకలవు. అచ్చటనే గండకీనది కలదు. దానిలో పుట్టిన సాలగ్రామాలను హిందువులలో చాలామంది పూజింతురు.

నేపాళరాజ్య జనసంఖ్య ౬౦ లక్షలు. ప్రభుత్వాదాయము ఇంచుమించు ౨ కోట్లు.

# యువజన విజ్ఞానము

హిందూస్థానము:—మన హిందూస్థానమును ఇంగ్లీషులో ఇండియా అందురు. మన ప్రాచీనులు దీనిని ఆర్యావర్తమని, భారతదేశమని అన్నారు. దీని వైశాల్యము ౧౫౭౫౧౦౭ చదరపుమైళ్ళు. అందు ౧౧ లక్షల చదరపుమైళ్ళ భాగము బ్రిటిషు ఇండియాది. తక్కిన భాగము దేశప్రభువులది. ఆ ప్రభువులు ఇంగ్లీషువారికి లోబడినవారై యుండిరి. ౧౯౪౭ లో మన దేశానికి స్వాతంత్ర్యము లభించెను. మన దేశములో కొన్ని చిన్నచిన్న ప్రాంతాలను ఇతర తెల్లజాతులవారు కూడా ఆక్రమించుకొని పాలిస్తున్నారు. ఫ్రెంచివారి అధీనములో బెంగాలులోని చంద్రినగోరు, మద్రాసులోని పుదుచ్చేరి ( పాండిచేరి ) కరకాల్, యానాం, మాహే అను స్థలాలున్నూ కలవు. పోర్చుగీసువారి అధీనములో బొంబాయి తీరములోని గోవా, డామన్, డయ్యూ అను రేవులుకలవు.

హిందూస్థానము ఉత్తరదక్షిణముగా ౨౦౦౦ మైళ్ళ పొడవున్నది. తూర్పు పడమరగా ౨౫౦౦ మైళ్ళున్నది. ఉత్తరము పొడవున హిమాలయము దేవుడునిర్మించిన గోడగాఉన్నది. ఆఫ్గనిస్థాన్ మూలలోనుండు హిమాలయ పర్వతములో రెండుమూడు కనుమల దారులున్నవి. బోలాన్ కనుమ ఖైబర్ కనుమ అనువాటినుండియే ఉత్తరమునుండి మన దేశములోనికి రావలెను. మన దేశ మధ్యభాగమందు వింధ్య పర్వతాలు కలవు. పడమటితీరము పొడవునా సహ్యాద్రి పర్వతాలు కలవు. వాటినే ఇంగ్లీషులో పడమటి ఘాటులు అందురు. తూర్పుతీరము పొడవున దక్షిణభాగమందు తూర్పుఘాటులు కలవు. వాటినే మనపూర్వులు మలయపర్వతమని మహేంద్రపర్వతమని అనిరి. నల్లమల ఎఱ్ఱమలలు మన తెనుగుదేశములోని చిన్న పర్వతాలు. అవి తూర్పుఘాటులలో చేరినట్టివి.

ఉత్తరహిందూస్థానములో సింధు, గంగా, బ్రహ్మపుత్ర అను గొప్పనదులు కలవు. వింధ్య భాగాలలో నర్మద, తపతి, అను నదులు కలవు. దక్షిణదేశాన్ని దక్కన్ అందురు. దక్కనులో గోదావరి, కృష్ణ, పినాకిని, కావేరి గొప్పనదులు. తుంగభద్ర కృష్ణకు ఉపనది.

మన దేశమును ఈ క్రిందివిధముగా విభజించినారు. ౧. మద్రాసు రాష్ట్రము ౨. బొంబాయిరాష్ట్రము ౩. సింధుసూబా ౪. బెంగాల్ (వంగదేశము) ౫. ఆగ్రాఔధ్ అను సంయుక్తపరగణాలు ౬. పంజాబ్ ౭. బిహార్ ౮. ఒరిస్సా (ఓఢ్రము) ౯. మధ్యపరగణాలు ( నాగపూర్ రాష్ట్రము) ౧౦. అస్సాం ౧౧. సరిహద్దు(పఠాణ్) సూబా ౧౨. బలూచిస్థాన్.

౧౯౪౭లో మన దేశానికి స్వాతంత్రము నిచ్చి వెళ్ళుతూ ఇంగ్లీషు వారు తురకలెక్కువగా నుండుభాగాన్ని తురకలకుభాగించి దానికి పాకిస్తాన్ అను పేరుపెట్టిపోయిరి. ఇప్పుడు పాకిస్తాన్‌లో చేరిన రాష్ట్రము లేవనగా ౧. సరిహద్దు పశ్చిమోత్తర సూబా ( N. W. F. Province ) ౨. పశ్చిమ పంజాబు ౩. బలూచిస్థాన్ ౪. సింధు ౫. తూర్పున బెంగాలులోను తూర్పులోని సగము భాగము.

హిందూస్థానమునకు ముఖ్యపట్టణము ఢిల్లీ(దేహ్లీ). ప్రాచీనకాలములోని పాండవుల హస్తినాపురమిదే. మొగలాయి చక్రవర్తుల రాజధాని ఇదే. మన దేశములో అన్నిటికన్న పెద్దనగరము కలకత్తా. మన దేశములోని పెద్దనగరా లేవనగా బెంగాలులోని కలకత్తా, పడమట బొంబాయి, తూర్పులో మద్రాసు, మధ్యలోని హైద్రాబాదు.

మన దేశము వ్యవసాయప్రధాన దేశము. నూటికి ౬౫ మంది దానిపై జీవింతురు. ౧౭౫ ఏండ్లు పరాధీనముగా ఉండుటచేత దేశము చాలా దరిద్రదేశమై పోయినది. జనుల సగటు ఆయుర్దాయము ౨౬ ఏండ్లే! మన దేశములో చచ్చినట్లుగా పిల్లలు మరే దేశములోను చావరు. ఇంగ్లండు, జర్మనీ, జపాను, రష్యా, అమెరికావంటి అన్ని దేశాలలో విద్యవచ్చినవారు నూటికి ౯౫ కు పైగా ఉండగా మన దేశములో విద్య వచ్చినవారు నూటికి ౧౪ మందే కలరు.

మన దేశములో పాకిస్తాన్ కాక మొత్తము జనసంఖ్య ౩౦ కోట్లు

అందు హిందువుల సంఖ్య — ౨౫ కోట్లు
ముసల్మానుల సంఖ్య — ౪ కోట్ల ౫౦ లక్షలు.
క్రైస్తవుల సంఖ్య — ౧ కోటి.
సిక్కుల సంఖ్య — ౪౦ లక్షలు.

మన దేశమందు గోధుమలు, జొన్నలు, వరి, ప్రత్తి విశేషముగా పండును.

చెరుకును పండించి చక్కెర చేయుట ప్రపంచములో మొట్ట మొదట హిందూస్థానములోనే ప్రారంభమయ్యెను. కాని ఈనాడు మన కంటె యెక్కువగా యితర దేశాలవారు పండింతురు. ఒక యెకరాలోని చెరుకులో సగటున మన దేశములో సిద్ధమగు చక్కెరను అదే ఒకఎకరములో క్యూబావారు మూడంతలు, జావాద్వీపమువారు ఆరంతలు, హావై అను శాంతిమహాసాగర ద్వీపములోనివారు ఏడంతలు సిద్ధము చేస్తున్నారు. జనుపనార ఒక్క హిందూస్థానములోనే సిద్ధమగుచున్నది. అదియు బెంగాలులోని తూర్పుపాకిస్తానులోనే కలదు. ఇప్పుడు జనుమును ఈజిప్టు, ఈరాన్, జపాన్, దక్షిణామెరికా దేశాలలో కొద్దిగా పండిస్తున్నారు. ప్రత్తికి హిందూస్థానమే జన్మభూమి. ౫౦౦౦ ఏండ్లకు పూర్వముకూడా హిందూస్థానీ నూలుబట్టలే ప్రపంచమంతటా వ్యాపారమగుచుండెను. ౧౦౦ ఏండ్లక్రిందట అమెరికావారు ప్రత్తిని పండించ మొదలిడి ఇప్పుడు మనకంటే ఎక్కువ పండిస్తున్నారు. ౧౯౩౯ లో హిందూస్థానమందంతటను ౩౯౮ బట్టలమిల్లు లుండెను. అందు ౨౨౨ బొంబాయి రాజధానిలో, ౪౯ మద్రాసు రాజధానిలో, ౩౦ బెంగాలులో, ౨౬ యూ. పి. లోను ఉండెను.

నీలి:— దీనిని కూడా హిందువులే కనిపెట్టిరి. అందుచేత దీన్ని ఇంగ్లీషులో ఇండిగో అందురు, అనగా ఇండియాదేశపు రంగు అని

యర్థము. ఇప్పుడు హిందూస్థానములో వేరుసెనగ, ఆముదాలు, నూలు విశేషముగా పండుచున్నవి. హిందూస్థానములో ఖనిజసంపద తక్కువగానే ఉన్నది. నేలబొగ్గు, ఇనుము ఇంతో అంతో దొరుకుతున్నది. ఒరిస్సాలోని సింగభూమి మండలములో ఇనుము చాలా దొరుకుతున్నది. మైకా మాత్రము ప్రపంచములోకెల్ల హిందూస్థానములోనే యెక్కువగా దొరుకును. గయా, హజారీబాగ్, నెల్లూరు జిల్లాలలో ఎక్కువగా లభిస్తున్నది.

రాజపుత్రస్థానములో సంభార్ సరస్సు అనునది కలదు. దాని వైశాల్యము ౯౦ చదరపుమైళ్ళు. ఆ సరస్సులోని నీరంతా ఉప్పునీరే. దానినుండి ఏటేటా ౧-౨ లక్షల టన్నుల ఉప్పును సిద్ధము చేయుదురు. నేలబొగ్గు ఒరిస్సా, బెంగాల్, హైద్రాబాద్, నాగపూరుమండలాలలో దొరుకుతున్నది. పెట్రోలు పంజాబు, సింధు, సరిహద్దు సూబాలలో కొంతవరకు దొరకును. కాని అస్సాములోని లక్కింపూరు జిల్లాలోని డిగ్బాయి అనే స్థలములోని పెట్రోలుగనియే పెద్దగని.

కాగిదములు:— హిందూస్థానములో విద్య చాలా తక్కువయగుట చేత కాగిదాల వ్యయము చాలాతక్కువ. ౧౯౪౦ వరకు మన దేశమందు ఏటేట ౨ లక్షల టన్నుల కాగిదమే ఖర్చగుచుండెను. కాని మనదేశములో ౫౦ వేల టన్నుల కాగిదముమాత్రమే సిద్ధమగుచున్నది. తక్కినది కనడ, నార్వే, స్వీడన్, ఫిన్లెండు, జర్మనీ దేశములనుండి వచ్చెడిది. ౧౯౩౯ లో హిందూస్థానములో ౧౪ కాగిదాలమిల్లు లుండెను. బొంబాయి, తిరువాన్కూరు, పూనా, సాహరాన్పూరు, టిటగర్ (బెంగాలు) హైద్రాబాదు (సిర్పూరుమిల్లు) మున్నగు ప్రాంతాలలో కాగిదం పరిశ్రమాలయాలు కలవు. ఉత్తరహిందూస్థానములో సబాయి (Sabai)గడ్డి అనునది లభించును. దానితో మంచికాగిదాలు సిద్ధమగును. సిర్పూరులో బొంగులనుండి కాగిదాలు చేయుదురు. అవిఅంత మంచివి కావు. కాగిదాలకు కాస్టిక్ సోడా, బ్లీచింగ్ పౌడి రంగులు అవసరము. అవి

మనము ఇతర దేశాలనుండి దిగుమతి చేసుకొంటున్నాము. మధ్యప్రాంతము అని యిప్పుడు పేరుపొందిన మధ్యపరగణాల ( C. P. ) లో ఒక గొప్ప కాగిదాల పరిశ్రమను స్థాపించుతున్నారు. ఇప్పుడు హిందూస్థానములో నదుల జలపాతాలనుండి చౌకవిద్యుత్తు నుత్పత్తి చేయుటకు మొదలుపెట్టినారు. బొంబాయిఘాటులలో, లోనావాలా నీలమూాల, ఆంధ్రీవేలీ అనుమూడు జలవిద్యుత్తు లున్నవి. మైసూరులో కావేరీజల పాతమునుండి శివసముద్ర జలపాతవిద్యుత్తు అను పేరుగల విద్యుత్తును సిద్ధముచేసినారు. జోగుజలపాతము వద్ద మరొకటి సిద్ధమైనది. నీలగిరివద్ద పైకారా జలవిద్యుత్తు నేర్పాటుచేసినారు. మెట్టూరు జలవిద్యుత్తు తంజావూరు, సేలం, ఆర్కాటు, చిత్తూరు, తిరుచనాపల్లి జిల్లాలకు అందింపబడుతున్నది. తిరునల్వేలిలోని పాపనాశనం జలపాతంనుండి ఒక జలవిద్యుత్తు కలదు. పంజాబులో మండీ జలవిద్యుత్తు కలదు. దక్షిణమున పళనికొండలలో పెరియార్ జలవిద్యుత్తును సిద్ధముచేయుచున్నారు. కాశ్మీరులో బారాముల్లా జలవిద్యుత్తును సిద్ధముచేయుచున్నారు. యు. పి. లో బహద్దూరాబాదువరకు నొకటికలదు.

కొన్నియేండ్లనుండి ప్రధాన నగరాలలో బట్టలమిల్లు లేర్పడినవి. ఇనుపపనులను ఒరిస్సాలో తాతాకంపెనీవారు, బెంగాలులో రెండు కంపెనీలవారు, మైసూరు ప్రభుత్వమువారు సాగిస్తున్నారు.

హిందూస్థానములో ౪౩౦౦౦ మైళ్ళ రైల్వే మాత్రమే కలదు. జర్మనీవంటి చిన్న దేశములో ౪౦,౦౦౦ మైళ్ళ రైలుదారి యున్నదనిన మనమెంత వెనుకబడినామో తెలియరాగలదు.

## ప్రపంచములోని మానవజాతులు

ప్రపంచములోని వివిధ దేశాలను గూర్చి సంగ్రహముగా తెలుసుకొనియున్నాము. అందలి మనుష్యులందరును ఒకేవిధముగాలేరు. రూపాలలో, ఆచారాలలో, జనులు ఒక్కొక్క దేశములో ఒక విధముగా

ఉన్నారు. యూరోపులోని జనులు తెల్లగాఉన్నారు. వారు హాట్ సూటులను ధరింతురు. ఉత్తరఅమెరికా వారున్నూ తెల్లగా ఉన్నారు. ఉత్తరఅమెరికాలోని దక్షిణ భాగములోను, దక్షిణ అమెరికాలోను జనులు ఎఱ్ఱగా ఉన్నారు. అక్కడిదీవులను పశ్చిమఇండియా దీవులని, ఆదీవుల మనుష్యులను ఎఱ్ఱఇండియా జాతివారని అందురు. ఆఫ్రికాఖండములో ఉత్తరమందలి ఈజిప్టువారు తప్పితే తక్కినవారి నందరిని నీగ్రోలుఅనిఅందురు. వారు కందెనవన్నెకంటే నల్లగా నిగనిగ మెరుస్తు ఉందురు. వారి వెంట్రుకలు గొఱ్ఱెబొచ్చువలె ఉండును. వారు బట్టలు కట్టరు. స్త్రీలున్నూ పురుషులున్నూ బత్తలనే తిరుగుదురు. ఇప్పుడిప్పుడు గోచీలు పెట్టుకొనుట నేర్చుకొంటున్నారు. వారిలో చాలామంది పూర్వము మనుష్యులనే తినేవారు. ఇప్పటికిని కొందరట్టివా రున్నారని అంటారు. వారి ఆయుధాలు గజముపొడవు అరగజము వెడల్పుగాఉండే డాలులు, బల్లెములు, కత్తులు, అంబులు. వారికి దంతపు సొమ్ములమీద చాలాయిష్టము. వారు శరీరమంతయు దద్దులుపొయ్యేరీతిగా పచ్చ పొడు పించుకొందురు. పండ్లను రాకించుకొందురు. కొందరు పెదవులను సాగ దీయుదురు. మెడనిండా పూసలు వేసుకొందురు. అదే వారలంకార మను కొందురు. జనులు చాలా తెలివితక్కువవారు. బలాఢ్యులైనను చాలా పిరికివారు.

చీనా, జపాను, కొరియా, మలయా, బర్మావారు మంగోలియా జాతివారు. వారికి మిట్టనొసలు, అణగిన ముక్కులుండును. స్త్రీ పురుషులు లుంగీలు కట్టుదురు. వారు పసుపుఛాయకలవారై యుందురు.

తూర్పు దీవులలో ఫిలిప్పైన్ దీవులు, ఈస్టిండియా దీవులలోని వారు కూడా అట్టివారే.

తక్కిన శాంతిసాగర దీవులలోనివారు నల్లనివారు. ఆస్ట్రేలియా ద్వీపములోని వారున్నూ నల్లనివారు. వారంతా బట్టలు కట్టనివారు, మనుష్యులనుకూడా తినేవారు, ఆఫ్రికానీగ్రోలవంటి వారు.

తక్కిన ఏషియాఖండములోని జనులు గోధుమవన్నెవారు.

ఈ విధముగా ప్రపంచజనులు అయిదురంగుల వారై యున్నారు. ౧. నలుపు(నీగ్రో) ౨. తెలుపు(యూరోపు ఉత్తరఅమెరికా) 3. ఎరుపు (ఎఱ్ఱఇండియనులు) ౪. గోధుమవన్నె (హిందూస్థానము, టర్కీ, ఆఫ్ఘనిస్థానము, ఈరాన్ మొ॥) ౫. పసుపు. (చీనా, జపాన్, మలయా, బర్మా, మంగోలియా మొదలగునవి.)

ఈ జనులలోని మరికొన్ని విశేషాలను తెలుసుకొందము.

నీగ్రోలు:— ఆఫ్రికాఖండములో నైగర్ అను మహానది కలదు. బహుశా దానిమూలమున అక్కడి నివాసులకు నిగ్గర్, నీగ్రోఅను పేరు వచ్చెను. అబిసీనియానుండి మనదేశమునకు తురకల రాజ్యాల కాలములో పలువురు సిపాయీలుగా వచ్చి నహబ్షీలు ఇస్లాం అవలంబించి సిద్దీలని పేరుపొందిరి. అందుచేత నీగ్రోలను మనదేశములో సిద్దీలనియు అబిసీనియావారు కాన హబ్షీలనియు పేర్కొనిరి. మనదేశములో కర్నూలు కడపవంటి జిల్లాలు అత్యుష్ణప్రదేశాలు. అంతకంటే యెన్నో రెట్లు హెచ్చుగా ఆఫ్రికాలో ఉష్ణము సదాయుండును. అందుచేత ఆ దేశములోని నీగ్రోలు కారునల్లగా నుందురు. మనకు ఎండకాలములో బట్టలులాగివేసి ఒక ధోవతితోనే యుండుటకు అభిలాషయుండును. అది లేకుంటే బాగుండు ననిపించును కదా. అందుచేతనే అత్యుష్ణకారణముచేత ఆఫ్రికావాసులకు బట్టలవసరము లేదు. వారు చిన్నతనమునుండి ముసలివారై చనిపోవువరకు స్త్రీలు పురుషులు పూర్తిగా బత్తల తిరుగుతుందురు. ఇది మనకు చిత్రముగా నుండును. కాని అట్లలవాటు పడినవారికేమియు ఆశ్చర్యముండదు.

నీగ్రోల కవసరాలు చాలా తక్కువ. వారియిండ్లు బొంగులతో తీగెలతో గుండ్రముగా గడ్డిఆకులతో కప్పుకట్టినవై యుండును. వాటికి ఒకేతలుపుండును. వాటిని క్రాల్ Kraal అందురు.

హిందువులవలెనే నీగ్రోలు చెట్లపుల్లలతో పండ్లను తోముకొందురు. అందుచేత వారిపండ్లు తెల్లగానుండి నల్లని ముఖములో మొగులులో మెరుపువలె మెరస్తూఉండును. వారు వ్యవసాయము చేయుట తక్కువ. మొక్కజొన్నలు పండించి వాటితో అంబలికాచి త్రాగుదురు. గడ్డి యెక్కువగా నుండు తావులలో పశువులను మేపి బ్రదుకుదురు. ఆఫ్రికా అడవులతో నిండినది. నీగ్రోలు వాటినికొట్టి బయలుసేసి వ్యవసాయము చేయవలెనను శ్రద్ధలేనివారు. అందుచేత అడవి జంతువులు అచ్చట చాలాకలవు. మన దేశములో సింహాలు తక్కువ. గుజరాతులో ఉన్నవందురు. కాని ఆఫ్రికాలో అవి చాలాకలవు. మన దేశములోనుండు చిరుతలు పెద్దపులులు అక్కడకూడా కలవు. కాని మన దేశములో లేని ఖడ్గమృగము, తలయెత్తితే ఇంచుమించు ౧౮ లేక ౨౦ అడుగుల యెత్తుగానుండు జిరాఫ్ అను జంతువు చారల గుఱ్ఱమువలె నుండు జీబ్రాఅను జంతువులు అచ్చటయెక్కువగా నుండును. హిపొపొటమస్ అను నీటిగుఱ్ఱాలు నీటిలోనే యెక్కువగా ఉండుట ఆఫ్రికాలో కానవచ్చును, ఏనుగులైతే చాలాకలవు. వాటిని చంపి వాటి దంతములను తెల్లవారికి అమ్ముకొందురు. వారి స్త్రీలు దంతపుసొమ్ములను ధరింతురు. నీగ్రోలకుఅంబు, బాణములు, డాలు, బల్లెము ఆయుధాలు.

ఆఫ్రికా దేశములో అందరున్నూ నల్లవారు కారు. ఉత్తరభాగములో స్పెయినుకు దక్షిణమున మొరాకో దేశము కలదు. అచ్చట జనులు ముసల్మానులైనారు. వారు కొద్దిగా తెల్లగానుందురు. తూర్పున ఈజిప్టు దేశము కలదు. అచ్చటి జనులు గోధుమవన్నె కలవారు.

అసలునల్ల నీగ్రోలు సూడాన్‌లోను, మధ్య ఆఫ్రికాలోని గినీలోను, కాంగో నదిపారు కాంగో దేశములోను, తూర్పుఆఫ్రికా భాగములోను కలరు. సూడాన్ అంటే నల్లవారి దేశము అనియర్థము. ఆఫ్రికా పడమటిభాగపు వంపులో గోల్డుకోస్టు అను మండలము కలదు. ప్రపంచములోపండు కోకోలో ఎక్కువభాగము అందు పండును. ఈ కోకోయే

మనము త్రాగుచున్నట్టి కోకో. ఈ కోకోనుండియే చాకులేట్‌లను ఇంగ్లీషు వారు చేసి మనకమ్ముదురు. కోకో అనుచెట్లకాయలను వేచి వాటిని పొడిచేసి కోకో పొడిని చేయుదురు. మధ్యఆఫ్రికాలో దట్టమైన అడవులు కలవు. అచ్చట వర్షమెక్కువగా కురియును.

మధ్యఆఫ్రికాలోని నీగ్రోలను పిగ్మీలు అందురు. పొట్టివారినిపిగ్మీలని ఇంగ్లీషులో అనుట వాడుకయైనది. ఆనల్లపిగ్మీలు పొట్టివారు. వారికి ఉప్పు, ఇనుము దొరకనందున ఆ రెంటిపై వారికి చాలాప్రీతి. వారు అంత నల్లగా ఉండరు. కొంత గోధుమవన్నెతో నుందురు.

తూర్పుఆఫ్రికాలో కెన్యామండలము కలదు. అందు పైన తెలిపిన విచిత్రజంతువు లన్నియు సమృద్ధిగా కలవు.

దక్షిణాఫ్రికా నీగ్రోలను కాఫిరులందురు. ఇస్లాముమతములో చేరని వారికి కాఫిరులనుటకు కారణ మీజాతియే అనుట స్పష్టము.

దక్షిణఆఫ్రికాలో ఇంగ్లీషువారు, బోయర్లు అను డచ్చి సంకరజాతివారును కలరు. అక్కడ బంగారు వజ్రాల గనులు చాలా దొరికినందున వారా ప్రాంతాన్ని ఆక్రమించుకొన్నారు. ఆ దేశమందు అడవులుకొట్టి రైళ్ళు వేసి కూలీచేయుటకు ౧౦౦ ఏండ్లక్రిందట హిందూస్థానులను తీసుకొనిపోయిరి. ఆ సంతతివారు ఇప్పుడచ్చట కొన్ని లక్షలనుండి యున్నారు.

ఆఫ్రికాఖండములోని మధ్యభాగములో పశ్చిమభాగములో నుండువారు ఇంచుమించు నగ్నముగా తిరుగుదురు. ఇప్పుడు పాశ్చాత్య క్రైస్తవ ప్రచారకుల బోధలవలన బట్టలుకట్టుట నేర్చుకొంటున్నారు. నీగ్రోజాతులకుల నాట్యముపై చాలాప్రీతి. వెర్రిగా కూతలు వేస్తూ గంతులు వేస్తూ గంటలకొలది ఆడుచుపాడుచు వినోదము చేసుకొనుచుందురు.

ఈజిప్టుకు దక్షిణమందుండు నీగ్రోలను బాంగోఅందురు. వారికి పొగాకు తినుట త్రాగుట చాలాయిష్టము. వారు కుక్కమాంసము మాత్రము తినరు. తక్కిన అన్నిజంతువుల మాంసాలను ఎలుకల, పాముల, తేళ్ల మాంసముకూడా తింటారు. అవెంత మురిగితే అంతరుచి అనుకొంటారు.

బాంగోజాతికి దక్షిణములో "నాంనాం" అనే జాతికలదు. వారిలో చాలామంది మనుష్యులను తింటారు. ఇప్పుడది తక్కువైపోయినది. పశ్చిమఆఫ్రికాలోని నీగ్రోస్త్రీలు వెంట్రుకలను నానావిధాలుగా అలంకరించుకొందురు. అచ్చటి నీగ్రోలు నస్యమును ముక్కులో ఎక్కించరు. నాలుకపై వేసుకొని చప్పరించి మ్రింగుదురు. స్త్రీలు ముక్కుకొన దూలమందు రంధ్రముచేసి దాని ద్వారా ఈకెలను దూర్చుకొందురు. పురుషులు నెత్తులను చౌకముగా గుండ్రముగా త్రికోణాలుగా మధ్యభాగమందు గొరిగించుకొందురు. నిన్నమొన్నటివరకు గవ్వలు కూడా అక్కడ ముఖ్యనాణెములుగా చెలామణి యగుచుండెను.అచ్చటి నీగ్రోముఖ్యులు చస్తే వారివెంట కొందరిని చంపి పూడ్తురు. అచ్చటి రాజునకు 3333 మంది భార్యలకంటే యెక్కువమంది యుండరాదని శాసనము కలదు!

నీగ్రోలకు చిన్నచిన్న జమీందారులవంటి రాజులుకలరు. ఆ జమీందారులకు నూర్లకొలది భార్యలుందురు. కొన్ని సమయములలో నీగ్రోలు తమ భార్యలను యిచ్చివేసి పొగాకుకొందురని కొందరువ్రాసినారు. స్త్రీలకు పచ్చ పొడిపించుకొనుట చాలా ఆనందము. చెంపల మీద నొసటిమీద పొట్టమీద, అసగా ఇంచుమించు శరీరమంతటను ఆ పచ్చను పొడిపించు కొందురు. స్త్రీపురుషు లందరును కలిసి నాట్యమాడుతూ పాటలుపాడి ఆనందింతురు. అప్పుడు కోతుల తోళ్లతో చేసిన నగారాలను మ్రోయింతురు. వడ్లగింజలవలె సన్నగా అరుగునట్లు స్త్రీలు తమపండ్లను రాకించుకొందురు. పలువురు గొంతులు సాగు

నట్లుగా ఇరుకైన కంఠెలను ధరింతురు. పెదవులు లాగించుచు సాగ గొట్టుదురు. ఇవంతయు వారు అందమనుకొందురు. పురుషులు నెత్తి నిండుగా ఈకెలను ధరింతురు. స్త్రీలు పిల్లలను వీపులపై బట్టతో కట్టు కొని తిరుగుదురు.

ఎఱ్ఱరంగు జాతులు:— ఉత్తరఅమెరికా ఖండములోని ఉత్తర భాగములో ఎఱ్ఱఇండియా జాతివారు కలరు. వారు కోకోవన్నె కల వారు. వారు అంబుబాణాలతో వేటాడి జీవించేవారు. పూర్వము ఈ జాతివారు అడవులలో తిరిగేవారు. తోలుబట్టలు కట్టువారు. ఈకెల తోను ఏదుపందుల ముండ్లతోను అలంకరించు కొనువారు. చలికాల ములో నీరు మంచుగా మారినప్పుడు కుక్కలను కట్టి చిన్న బండ్లను లాగించి అందు ప్రయాణము చేయుదురు. వర్షాకాలములో చిన్న తెప్ప లపై నదులలో ప్రయాణముచేసి చేపలుపట్టి జీవింతురు. ఉత్తరఅమె రికా యొక్క ఉత్తరభాగములో పైన్, ఫర్, బర్చ్, అను చెట్లు పెరు గును. వీటిపలకలతో ఎఱ్ఱఇండియనులు ఇండ్లు కట్టుకొని వీటి పండ్లను తిందురు. అక్కడి అడవిజంతువుల పైగల ఉన్ని చాలా మృదువైనది. దానిని వారు తెల్లవారి కమ్మి వారినుండి తమ కవసరమగు వస్తువులను కొందురు. నక్కలనుండి, ఎలుగుబంటులనుండి వారు ఉన్నిని తీసి అమ్ము దురు. ఎఱ్ఱఇండియనుల దేశములో బైసన్ అను ఎద్దువంటి అడవిజంతు వులు కలవు. అంబుబాణాలు, గొడ్డండ్లు వీరి ఆయుధాలు. వారు యుద్ధా నికి వెళ్ళితే నానారంగులను శరీరానికి పూసుకొని భయంకరాకారాలు దాల్చి బయలుదేరుదురు. తాము చంపినవారి తలలను తమ గుడారాల ముందు వేలాడగట్టి యుంతురు. తెల్లవారు వీరిదేశములో గుఱ్ఱాలను ప్రవేశపెట్టిరి, ఈనాడు ఎఱ్ఱఇండియనులు గుఱ్ఱపుసవారీలో ప్రపంచమం తటను ఖ్యాతిగాంచినారు. వారు తుపాకులను వాడుటకూడా నేర్చు కొన్నారు.

ఈఎఱ్ఱ యిండియనులు పూర్వము ఉత్తరదక్షిణ అమెరికాఖండా లలో నిండియుండెరి. ఇప్పుడు వారు ఉత్తరఅమెరికాఖండములో ఉత్తర

భాగమందును, దక్షిణభాగమందలి మెక్సికోలోను బహామా దీవుల లోను విశేషముగా ఉన్నారు. పూర్వమువారు నెత్తిన ఈకలటోపీలను ధరించి తోలుఅంగీలను లాగులను తొడుగుచుండిరి. ఇప్పుడు యూరోపు వారి దుస్తులను తొడుగుటకు అలవాటు పడుతున్నారు.

అమెజానులు:—దక్షిణఅమెరికాలో ఉత్తరభాగమున అమెజాన్ అను చాలా గొప్పనది ప్రవహించును. ఆప్రాంతాలలో నివసించే జను లను అమెజానులందురు.ఆప్రాంతమంతా ఎప్పటికినీ ఉష్ణముగానుండును. అయితే చిత్రమేమనగా అక్కడ ౧౨ నెలలు వర్షము కురియుచునే యుండును. అందుచేత అక్కడ అడవులు దట్టముగా పెద్దగా పెరిగిపోయి నవి. ఆ యడవులలో కొండచిలువలు విశేషము. అచ్చటి నదులలో చెరువులలో మొసళ్ళు సమృద్ధిగా నున్నవి. అచ్చటి చేపలకు కూడా రం పాలవంటి పండ్లు, రంపాలవంటి వీపుఎముక యుండును. ఆ చేపలు నీటి లోనికి దిగిన మనుష్యులనుకూడ చంపును. అచ్చట దోమలబాధ అపా రము. జనులు పెద్ద గుండ్రని తీగెలగుడిసెలను కట్టుకొందురు. అందు ౨౦౦ మందివరకు వుండవచ్చును. కాని వెలుతురు గాలికి అందు తావు లేదు. ఆ దేశములో పైన్ ఆపల్ పండ్లు, ఉర్లగడ్డలు, చెరుకు సమృద్ధి. అచ్చటి అడవులలో రబ్బరుచెట్లు చాలాకలవు. వాటిని కాటుపెట్టగా రబ్బరురసము కారును. దానిని పాత్రలలోపట్టి రబ్బరుగా పాకముచేయు దురు.

లాప్‌లెండు జనులు:— యూరోపునకు ఉత్తరభాగమందు అనగా రష్యా, నార్వే, స్వీడను కుత్తరమున లాప్‌లెండు కలదు. అచ్చట కొన్నినెలలు పూర్తిగాఎండ కొన్నినెలలు పూర్తిగాచీకటి యుండును. అచ్చట మంచుగడ్డ లెల్లప్పుడును ఉండును. ఆ జనులు జారుడుబండ్ల నెక్కి రైన్‌డియర్ అను ఒకవిధమగు దుప్పిని కట్టి లాగింతురు. ఆ దుప్పుల పాలు త్రాగుదురు. వాటిని తిందురు. వాటి తోళ్ళతో బట్టలు కుట్టి తొడుగుకొందురు. ఆతోళ్ళతోనే తమగుడారాలు కుట్టుకొందురు.

వాటి కొమ్ములను ఎముకలను కత్తులనుగా కొరడాలనుగా చేసుకొం దురు. వాటి నరాలను దారాలనుగా కుట్టుటకు వాడు కొందురు.

ఎస్కిమోలు:— ఉత్తరఅమెరికాకు ఉత్తరభాగములో ఎర్రయిం డియను లుందురంటిమి. వారుండు తావుకంటే పూర్తిగా ఉత్తరభాగ ములోను, ఉత్తరఅమెరికాకు ఉత్తరములో ఉండే గ్రీన్‌లెండు అను పెద్ద భూఖండములోను ఏషియాఖండములోని కొరియాకు ఉత్తరమున నుండు భూభాగములోను అనగా ఉత్తరధ్రువ ప్రాంతాలలో నివసించే వారందరిని ఎస్కిమోలు అనియందురు. ఆ ప్రాంతాలలో చలి చాలా హెచ్చు, అందుచేత నిరంతరము చలియే యుండును. ఇంచుమించు ౧౦ నెలలవరకు నీరంతయు మంచుగడ్డ కట్టియుండును. అచ్చట రైన్ డియర్ జంతువులులేవు, ఒక చెట్టుకూడా పెరుగదు. అచ్చట సీల్ మరియు వాల్రస్ అను కుక్కమూతి పెద్దచేప లుండును. అవి నీటిలో నుండును. కాని నీటిపైన గజమువరకు గడ్డకట్టి యుండును. ఎస్కిమోల కుక్కలు వాటిని పసిబట్టి మంచుగడ్డను త్రవ్వును. అప్పుడు ఎస్కిమో లచ్చట రంధ్రముచేసి ఆజంతువులను బల్లెములతో పొడిచి లాగి పైకితీసి వాటిని తిందురు. వాటి తోళ్ళను లాప్‌లెండు వారివలెనే ఉడుపులకు వాడుకొందురు. ఆధృవప్రాంతములో ఎలుగులున్నవి. మనదేశమందలి యెలుగులు నల్లనివి. అచ్చటివి తెల్లనివి. ఎస్కిమోలు ఇండ్లు కట్టుకొన వలెనంటే వారికి కట్టెకాని రాయిగాని మన్నుగాని దొరకదు. అంతయు హిమప్రాయమే. అందుచేత వారు మంచుగడ్డలనే రాళ్ళుగా భావించు కొని వాటితో ఇండ్లు కట్టుకొని అందే పరుండుదురు. వాటిని ఇగ్లూలం దుర్రు. అందు రాతిప్రమిదలో సీల్‌జంతువు క్రొవ్వువేసి దీపము వెలిగిం తురు. చిత్రమేమనగా అట్టి మంచు ఇంటిలోపల వెచ్చగా నుండును. ఆయిండ్లవాకిలి రెండడుగులయెత్తుయిఉండును.మన దీపావళిపండుగనాడు అచ్చట చలికాలము ప్రారంభమగును. ఆనాటినుండి మూడు నెలలవరకు ఒకేరాత్రి. సూర్యుడు కానరాడు. ఎండకాలములో మూడు నెలలవరకు ఒకేపగలు, సూర్యుడు గ్రుంకనే గ్రుంకడు.

లాప్‌లెండులో రైన్‌డీరులను బండ్లనులాగుటకు ఉపయోగించితే ఎస్కిమోలు ౧౦ లేక ౧౨ కుక్కలను చక్రములులేని బండ్లకు కట్టి వాటిచే లాగింతురు. వారి ఆయుధాలు కొరడాలు, అంబుబాణాలు, బల్లెములు. ఎండకాలములో మంచు కరుగును కాన వారికి మంచు ఇండ్లుండవు. అప్పుడు వారు తోళ్లతో కట్టిన గుడారాలలో నుందురు. వారికి అగ్ని కరువు. కావున వారు పచ్చిమాంసమునే తిందురు. ఎస్కిమో అను పదమునకు పచ్చిమాంసము తినువారు అని యర్థము. పచ్చిమాంసము తినువారిని మనవారు క్రవ్యాదులు, అస్రిపులు, కోణపులు అని పిలిచి వారు రాక్షసులనిరి.

ఎండకాలము మంచు కరిగి నీరుగా ప్రవహించుట ఎక్కువగా నుండుటచేత ఎస్కిమోలు చిన్న దోనెలను వాడుకొనవలసిన వారై యున్నారు. వారికి కట్టె దొరకనందున ఆదోనెలను కూడా తోళ్ళతోనే కట్టి వాడుకొందురు.

మూడు నెలలవరకు ఎడతెగని రాత్రిగానుండిన కాలములో ఉత్తరధ్రువమందు ఒక వెలుతురు ఆకాశమందు కనిపించును. ఆకాశములో తాటిమానులంతటి క్యాండిల్ దీపాలవలె వరుసగా స్తంబాలవలె నిలిచిన వెలుగు కొన్ని దినాలవరకు నిలబడి యుండును. దానిని ఆరోరా, బోరియాలీ అని యందురు. దానినే మన రామాయణములో "స్వయంప్రభ" అని పేర్కొనిరి. దేవుడు ఆ చీకటిరాత్రిలలో ఎస్కిమోల కాస్వయంప్రభను ప్రసాదించినాడు. ఆ వెలుతురులో ఎస్కిమోలు జీవనముల గడపుదురు.

అరబ్బులు:— అరబ్బులను వారి వేషాలను, వారి భాషను, వారి జంబియాలను మనము మన దేశములో చూచియే యున్నాము. అరబ్బులుండు అరబిస్థాన దేశము సముద్రతీరమందు తప్ప తక్కిన ప్రాంతమంతేయు ఇసుకఎడారి. అందుచేత అరబ్బులు సిరియా, పాలస్తీన్, ఈజిప్టు,

నేసెపాటేమియా దేశాలలో వ్యాపించిపోయిరి. ఎడారులలోని జనుల జీవనమును తెలుసుకొనుటకు అరబ్బులను ఉదాహరణముగా తీసుకొననైనది.

ఎడారులలో నీరు దొరకక ఇసుకలో ప్రయాణము చేయజాలరు. దేవుడు ఒంటెను ఎడారులకొరకే సృష్టించినాడు. ఇసుకలో అవి బాగా నడుచును. వాటికడుపులో నీరుండును. ఎన్నియోదినాలు ప్రయాణము చేసినను, నీరు దొరకనప్పుడు తాము ప్రయాణముచేయు ఒంటెలను కోసి వాటి కడుపులోని నీటిని త్రాగి దాని మాంసము తిందురు. అరబ్బులు ఒంటెపాలు త్రాగుదురు. ఏజంతువుల పాలుత్రాగితే ఆజంతువుల గుణాలు కొంతవరకు అలవడును. హిందువులు ఆవుపాలనుత్రాగి సాధువులైనారు. ఒంటెలకు మొండితన మెక్కువ, తటాలున నుద మెక్కును. కోపమువస్తే తన యజమానినైనా సరే పటుక్కున తలపండు కొరికివేయును. అరబ్బులలో ఈ గుణాలన్నియు కలవు.

ఎడారులలో అందందు ఓయసిస్ అను జలాశయము లుండును. వానిచుట్టు కొంతదూరము ఖర్జూరవృక్షములు, ధాన్యముపంటలు పండును. వాటి నాధారము చేసుకొని అరబ్బులు గుడారములు కట్టుకొని జీవింతురు. అరబ్బుస్త్రీలు జనానాలో నుందురు. వారు పురుషులకు కానరారు. వారు ప్రయాణాలు చేసిన యిన్నూరు మున్నూరు ఒంటెలతో చాలామంది కలిసి ప్రయాణము చేయుదురు. అప్పుడప్పుడు ఎడారులలో తుపాను లేయును. అప్పుడు ఇసుకసంభాలవలె చాలాయెత్తుగా ఆకాశముమీదికి లేచిపడును. ఒంటెల వెంట్రుకలతో కంబళ్లను నేయుదురు. ఒంటెలతిత్తులలోనే అరబ్బులు త్రాగుడునీటిని తీసికొని పోదురు. ఎడారులలో ఉష్ణపక్షులుండును. అరబ్బు దేశములోని ఇండ్లకప్పులు పేటవాలుగానుండవు. అన్నియు చదరముగా నుండును. ఎందుకనగా రాత్రులందు జనులు కప్పులపై పండుకొందురు. ఎడారులలో పగలు చాలా వేడిమి యుండినను సగమురాత్రినుంచి చలిపెట్టును. సాధారణముగా

ఇండ్లన్నియు మట్టిగోడలతోనుండును. ఎడారులలోవర్షము చాలాఅరుదు. అరబ్బులలో బుద్దూ అను జాతివారు హెచ్చు. అరబ్బులకు నలుగురి వరకు భార్యలను పెండ్లాడు అధికారము కలదు. కారణం తెలుపకుండా భార్యలకు విడాకులిచ్చి వెళ్ళగొట్టవచ్చును.

అరబిస్తానుకు ఖర్జూరవృక్షమే జీవనాధారము.అందుచేత ఆ దేశమును ఖర్జూరదేశ మందురు. ఖర్జూరవృక్షము అరబ్బులపాలిటి కల్పవృక్షము. దానిపండ్లను తిందురు. దానినీడలో గుడారాలు వేసుకొందురు. దాని ఆకులతో చాపలు, బుట్టలు అల్లుదురు. ఆకులను పరుచుకొని వాటిపై పరుండుదురు. ఖర్జూరపుకర్రతో పడవలు, గుడారపు స్తంభములు, మున్నగునవి చేయుదురు.

అరబ్బులు ఉష్ట్రపక్షి గుడ్లను తిందురు. ఆ గుడ్లు టెంకాలంత యుండును. వారు మిడుతలను కూడా తిందురు. మిడుతల దండు వస్తే వారికి పండుగ. వాటిని పట్టి వేచి ఆప్యాయముగా భుజింతురు.

అరబ్బుదేశములో తట్టువ గుఱ్ఱాలు చాలా ప్రసిద్ధి నొందినవి. ఒంటెల తర్వాత అరబ్బులకు గుఱ్ఱాలపైన చాలా అభిమానము.

నరభక్షకులు:—ప్రాచీనకాలములో మనుష్యులనుతినేవారిని మనవారు రాక్షసులని అన్నారు. ఆ రాక్షసులు శాంతిమహాసాగరములోని పలు దీవులలో నివసించుచుండిరి. ఆస్ట్రేలియాకు సమీపములో న్యూగినీ అనే పెద్దద్వీపము కలదు. ఆద్వీపనివాసులను పాపువాజాతివారని యందురు. వారు నీగ్రోలవలె నల్లనివారు. వీరిలోని పురుషులు నెత్తి వెంట్రుకలు గుండ్రని విసనకఱ్ఱవలె నెత్తిపై నిలబడునట్లుగా పెంచిసవరింతురు. మన దేశములో కొందరుస్త్రీలు ముక్కులో బులాకిపెట్టుకొన్నట్లుగా అచ్చటి స్త్రీపురుషులు ముక్కు కడ్డముగా పెద్దఎముకనో లేక ముత్యపుచిప్పనో తగిలించు కొందురు.

ఈజాతివారు పెద్ద స్తంభాలను పాతి వాటిపై గుడిసెలుకట్టుకొందురు. లేదా పెద్దచెట్లపై గుడిసెలను కట్టి అందు నివసింతురు. రెండు తాళ్ళమధ్య కట్టెకాములను పెట్టి దాన్ని నిచ్చెనగా వాడుకొని రాత్రులందు దానిని పైకిలాగుకొని గుడిసెలో పండుకొందురు. గతశతాబ్దము వరకు వారు మనుష్యులను తినేవారు. తమశత్రువుల తలలను మాత్రము తినక వాటిని తమయిండ్లకు వ్రేలాడగట్టువారు. స్త్రీపురుషులు నగ్నులుగా తిరుగుదురు. పురుషుడు పెండ్లిచేసుకొనుటకు ముందు తనభార్యకు కుక్కదంతముల హారమును ఒకపందిని, ఒక రాతిగొడ్డలిని, ముత్యపు చిప్పల హారాన్ని ఇచ్చుకోవలెను.

ఆస్ట్రేలియా ఖండ మందంతటను పూర్వము ఆటవికు లుండిరి. కాని ౧౫౦ ఏండ్లనుండి ఇంగ్లీషువారాఖండాన్ని ఆక్రమించుకొని ఆదిమనివాసులను నిర్మూలము చేయుచు వచ్చిరి. అందుచేత ఇప్పుడు ఇంగ్లీషువారు పోజాలని మధ్యఆస్ట్రేలియా ఎడారులలో కొందరు ఆదిమనివాసులు మిగిలిపోయినారు. వారి ఆయుధము బల్లెము. దానితో వారు చేపలనుగూడా పొడిచి చంపుదురు. వారి మరొకఆయుధము విచిత్రమైనది. దానిని బూమరాంగ్ అందురు. అది మూరెడు పొడవుకట్టె. కొంచెము వంకరగానుండును. దానితో వారు పశువులపై విసరితే అది ఆ పశువును చంపి మరల తమచేతిలోనికి వచ్చును. వారు యిండ్లను మట్టితోను గడ్డితీగెలతోను నిర్మించుకొందురు. వారు కత్తులతో తమ శరీరాలపై బొమ్మలు గీసుకొందురు.

ఆస్ట్రేలియాకు తూర్పున ౧౨౦౦ మైళ్ళ దూరములో న్యూజీలెండు దీవులు కలవు. అవి సింహళ ద్వీపమంత రెండంతల వైశాల్యము కలవి. వాటిని ఇంగ్లీషువా రాక్రమించుకొన్నారు. ఆదీవులలో మారీ (Maoris)అను ఆదిమజాతి కలదు. వారికి శరీరమంతటను సందులేకుండా పచ్చ పొడిపించుకొంటే అందమట! వారు పరస్పరంకలిస్తే ముక్కులను రుద్దుకొందరు. అది ప్రేమసూచకము. చాలా కాలానికి మిత్రులు

కలిస్తే వారు ముఖాన్ని కప్పుకొని ఎదుటమదుట కూర్చుని కన్నీరు కాల్వలై పారేవరకు అరచియరచి ఏడ్తురు. తర్వాత మరికొంత దగ్గరంగా చేరి ముక్కులను రుద్దుకొందురు. తర్వాత ముఖాలను తెరచుకొని నవ్వులాడుచు ముచ్చట్లు చేయుదురు. వారిలో ముఖ్యులుచస్తే వారి గౌరవార్థము ఇతరులను చంపి సాపాటు చేయుదురు. ఈ దీవులలోని వారు మనుష్యులను తినుటలో చాలా ప్రసిద్ధికన్నవారు. తమ శత్రువులను చంపి వారి మాంసాన్ని విందుగా ఆరగించేవారు. అట్లుచేసిన తమ శత్రువుల బలమంతయు తమలో చేరిపోవునని అనుకొనేవారు. క్రీ. శ. ౧౮౭౩లో తుదిసారి నరభక్షణ జరిగిన దందురు. ఇప్పుడా యాచారము లేదు.

ప్రాచీన హిందువులు ఈ శాంతిసాగర దీవులలోని నరభక్షకులను గురించి వ్యాపారార్థము విదేశాలకు సంచారము చేసినప్పుడు తెలుసుకొన్నారు. వారిని రాక్షసవర్గములో చేర్చిపురాణాలలోని తమ శత్రువులను ఆవర్గములో చేర్చి వర్ణించిరి.

పసుపుపచ్చ జనులు:— చీనా, జపాను, ఇండోచీనా, బర్మా, నేపాల్, టిబెట్, పరిసర ప్రాంతాలలో పసుపుపచ్చవన్నె జనులున్నారు. వారికి మిట్టనొసలు, మొద్దుముక్కు, ఉబ్బుచెంపలు ఉండును. ఆజనులు సాధారణముగా పొట్టివారు. వారు రంగురంగుబట్టల ధరించుటలో ఆనందము కలవారు.

జపానుదేశములోని ఇండ్లను బొంగులతో కట్టి వాటికి నూనె కాగిదా లంటించి నిర్మింతురు. కాగిదాల ఇండ్లలో జపానువారు నివసింతు రనిన చిత్రముకాదా! ఆ దేశములో నిరంతరము భూకంపములు కలుగుచుండుటచేత ఇటికరాళ్ళతోకట్టినచో జనులు చత్తురు కాన తేలికయగు ఇండ్లను వారు కట్టుకొనవలసిన వారైనారు. జపానుస్త్రీలు తమవెంట మడత విసనకఱ్ఱను తీసుకొని పోవుచుందురు. వారి కొప్పులలో తాబేట్టి చిప్పతో చేసిన దువ్వెన యుండును. జపానులో తాబేళ్ళు కొల్లలుగా

నున్నవి. జపానువారి యిండ్లు చాలా శుభ్రముగా నుండును. వారు అతిథిసత్కారము చేయుటలోను మర్యాదగా వర్తించుటలోను పేరు పొందినారు. జపానువారు చేపలెక్కువగా తిందురు.

చీనాలోని మగవారు పొడువైన జుట్లనుపెంచి వాటిని జడలుగా వేసుకొను చుండిరి. ఆయాచార మిప్పుడించుమించు మాసిపోయి నది. చీనాస్త్రీల అరికాళ్ళు ఎంతచిన్నగా ఉంటే అంత అందమని వారు భావించెడివారు. అందుచేత చిన్నపిల్లలుగా నుండినప్పుడే వారికాళ్లుబట్ట లతో గట్టిగా బిగించుచుండిరి. దానిచే వారుబాధపడి సరిగా నడువలేని వారుగా నుండెడివారు. ఈ 30 ఏండ్లలో ఈ యాచారము పూర్తిగా తొలగిపోయినది. చీనా జపాను వారి లిపి చాలా గందరగోళమైనది. అందు వేలకొలది అక్షరాలున్నవి. అవన్నియు ఉత్తగీతలుగా నుండును. వారు క్రిందినుండి పైవరకు నిలువుగా వ్రాయుదురు. ఎడమప్రక్కన క్రిందిభాగమందు మొదలై పైవరకు చదివి మరల క్రిందినుండి చదువుతూ ఎడమప్రక్కగా కాగిదములో త్రిప్పుచు పుస్తకము పూర్తి చేయవలెను.

చీనావారు చేతులతో అన్నముతినరు. వారు ఎడమచేత అన్నము పళ్ళెమును పట్టుకొని కుడిచేత రెండు పొడవగు కట్టెపుల్లలను పట్టుకొని ఆపుల్లలతో అన్నమును, కూరనుకలిపి ఆపుల్లలతోనే గబగబ నోటిలో మెతుకులను వేసుకొందురు. మనకది చిన్నగారడిగా కనిపించును. చీనా వారి తిండి అసహ్యమైనది. సాధారణముగా వారు కుక్కలను కప్పలను నత్తగుల్లలను తిందురు. ఇండోచీనా దేశము చీనాకు దక్షిణముననున్నది. అచ్చటి జనులయిండ్లు బొంగులతో కట్టియుందురు. భూమిపై గజమెత్తు కట్టెలుపాతి వాటిపై యిండ్లు కట్టుదురు. ఎందుకనగా అచ్చట నిరంతరం భూమినుండి నీరూరుచుండును. పైగా అడవులెక్కువ. అడవిజంతువులు ఊళ్లలో రాత్రులందు తిరుగును.

ఆస్ట్రేలియా ఖండమునకును అమెరికాఖండ పశ్చిమభాగమునకును మధ్యన శాంతిమహాసాగరము కలదు. అందు చాలాదీవులు చిన్నచిన్నవి కలవు. వాటిని దక్షిణసముద్ర దీవులందురు. అందు సమోవా (Samoa) దీవులు, ఫిజీదీవులు అనురెండు దీవుల గుంపులుకలవు. వాటిలో నివసించే జనులు ఆటవికులు. నీగ్రోలవలె నల్లగా కొందరుందురు. మరికొందరు గోధుమవన్నెతో నుందురు. చెరకు, కాఫీ, మొక్కజొన్న, వరి విశేష ముగా ఈదీవులలో పెరుగును. కాని వీటిలోని ప్రధానమైన ఫలవృక్షము టెంకాయ దానిని కోప్రా అందురు. ఈపదము అక్కడి నుండియే మన హిందీలోనికి వచ్చెననియు దానినుండియే మన కొబ్బెర అను పదమేర్ప డెననియు నందురు. ఈదీవులలోని జనులు ఈతలో ఘనులు. మనము కుక్కపిల్లలను బావులలో పారవేసినట్లుగా తల్లులు తమ పిల్లలను నీటిలో వేయుదురు. వారు మునుగకుండ చూచుకొందురు. ఈవిధముగా ఆజను లలో స్త్రీపురుషులందరునూ ఈతలో ప్రవీణులు. వారు నీటిలో ఇతర దేశాల వారికంటె యెక్కువకాలము ఊపిరిపట్టి మునిగి యుండగలరు. అందుచేతనే ఆదీవులలోని జనులు సముద్రము అడుగునకు వెళ్లి అచ్చటి నుండి ముత్యాల చిప్పలను తీసుకొని బయటికినత్తురు. చాలా చిప్పలు ఉత్త వేయైనను ఆచిప్పలకు కూడా విలువకలదు. కొన్నింటిలో మేలైన జాతి ముత్యాలు దొరుకును. ముత్యపుచిప్పలు ప్రధానముగా దొరికే సముద్రము ఈ దీవులచుట్టూ ఉండే సముద్రమే. ఆ సముద్రభాగాన్ని కోరల్ తోటలు అందురు. అనగా సముద్రపు అడుగున ముత్యపు చిప్ప లతో కూడిన తీగెలవంటి సుందరమగు తోపులుండును. అయితే ముత్యాలపై మునిగేవారికి చాలా ప్రమాదాలున్నవి. షార్కు అను రంపపుచేప మనుష్యులను కోసివేసి తినివేయును. పెద్ద నీటిపాములు వారిని చుట్టుకొని చంపివేసి తినును. ఇప్పుడు తెల్లవారు దీవులజనులకు కవచాలు, ఊపిరాడుటకు గొట్టములు మున్నగు పరికరాలిచ్చి వారిని సముద్రంలోనికి దింపుచుండుటచే ప్రమాదాలుచాలాతక్కువ. మనకులభించు మంచిజాతి ముత్యాలన్నియు అచ్చటినుండియే వచ్చును. స్త్రీపురుషులు ముత్యపుచిప్పల హారాలు వేసుకొందురు. వారిప్పుడు క్రైస్తవులైనం

దున తెల్లవారివలె బట్టలు ధరించుటకు నేర్చుకొనుచున్నారు. కాని పూర్వము వారు అర్ధనగ్నులుగానే తిరిగేవారు. సమువాదీవులలో కన్య తండ్రికి పందులు, పడవలు, బల్లెములు, ఓలిగా ఇచ్చి పెండ్లాడుదురు. జనులు గుడిసెలలో నివసింతురు. టెంకాయచిప్పలే వారిగిన్నెలు. అరటి ఆకులలో వారు అన్నము తిందురు. గడ్డితోకాని నారతోకాని అచ్చటి స్త్రీలు చాపలను అల్లుదురు. వాటిని తమ బంధుమిత్రుల వివాహాలలో బహూకరింతురు. ఆ చాపలను అచ్చటివారు బట్టలవలె కట్టుకొందురు.

ఆదీవులలో ప్రొద్దున ఏడుగంటలకు పూర్వమెన్నడును సూర్యోదయము కాదు. అచ్చటి జనులు అతిథిసంస్కారప్రియులు. పందులను, చేపలను తిందురు.

ఫిజీదీవులలో తెల్లవారు ప్రవేశించి సారవంతమగు భూములను ఆక్రమించుకొన్నారు. అచ్చట అరటి, పైనాపిల్, నారింజ, టెంకాయ కొల్లలుగా పండి ఉచితముగా కోరినవారి కందరికిని లభించును. అచ్చటి ఆదిమ నివాసులకు తిమింగిలము పల్లు అంటే చాలా విలువ. తిమింగిల దంతముల హారమును ఆ జనుల దొరయే ధరింపవలెను. ఫిజీదీవులు ౨౫౦ వరకున్నవి. కొన్ని దీవులలో మనుష్యులే లేరు.

ఫిజీదీవులలో రాత్రులందు సన్నని పురుగులు కుట్టును. అచ్చట పాములులేవు. అడవిపందులు విశేషముగా నున్నవి. వాటిని జనులు వేటాడుదురు. వేరే అడవిజంతువు లచ్చటలేవు. జనులెక్కువగా మాంసమునుతినరు. ఆదీవులలో భర్త చనిపోయిన భార్య వెంట్రుకలను కత్తిరించుకొనును.

పూర్వము ఫిజీదీవులలోని జనులు ఆ గడ్డలకు వచ్చిన మనుష్యులను చంపి తినుచుండిరి. తమ శత్రువులనుకూడ చంపి తినుచుండిరి. ఇంచుమించు ౫౦ ఏండ్లనుండి తెల్లవారి ప్రవేశమైన తర్వాత ఆ యాచారము నశించిపోయినది. ఫిజీలో జనులను వేళ్ళతో చూపరాదు.

ఆ విధముగా ఎవరిని చూపితే వారికి కష్టాలు కలుగునని వారి విశ్వాసము.

తుర్కోమనులు:— మధ్యఏషియాలో ఆఫ్గనిస్థానమున ఉత్తర భాగమందు తుర్కిస్థానము కలదు. అచ్చటి తెగవారే పశ్చిమములో గ్రీసువద్ద తుర్కీరాజ్యాన్ని స్థాపించిరి. కాని నిజమైన తుర్కోమనుజాతి వారు ఏషియామధ్య భాగములోకలరు. ఆ భాగము చాలావరకు ఎడారి దేశము. చలికాలములో మంచు కురియును. ఎండకాలములో మాడ్చి వేసే ఉష్ణవాయువు వీచును. తుర్కోమనులకు ఒక ప్రత్యేకస్థానము లేదు. వారా ఎడారులందంతటను సంచారము చేయుదురు. వారి ఆస్తియంతయు గుఱ్ఱములు, ఒంటెలు, గొఱ్ఱెలు. ఈ మూడింటి పాలను మాంసమును భుజింతురు. ముఖ్యముగా గుఱ్ఱములపాలు వారికిష్టము. వారికి వంశావళి చెప్పుకొనుటలో గర్వముకలదు. చిన్న చిన్న పిల్లలతో కూడా ఇటుల చెప్పింతురు. ''మాకు దొరలులేరు. అందరు మాన మానము. మేమందరము రాజులమే'' వారు పెద్దకోట్లను, ఉన్నిటోపీలను ధరింతురు. ఒంటె వెంట్రుకలతో తక్కిపై వారిస్త్రీలు వడుకుదురు. ఆ యున్నితో నేసిన బట్టల కట్టుకొందురు.

(ప్రతి దేశముయొక్కయు జనుల ఆచారవ్యవహారములను సచిత్ర ముగాఇంగ్లీషులో బహుగ్రంథాలను వ్రాసిప్రకటించినారు. People of oll na:ions అనునది అనేక సంపుటాల ఉద్గ్రంథము. అట్టిది తెనుగులో ఎన్నడు ముద్రితమగునో యేమో?)

కాలువలు:— (౧) సూయజ్ కాలువ:— దేవునిసృష్టిని మానవులు మార్చినారు.ఏషియాఖండానికి ఆఫ్రికాఖండానికి భూమి కలిసియుండెను. కాని అది కొన్నిమైళ్ళు మాత్రమే. ఆభాగాన్ని త్రవ్వి సూయజ్ కెనాల్ ను ఏర్పాటుచేసిరి. దాన్ని చేసినవాడు లెస్సెప్సు అను ఫ్రెంచి ఇంజనీయరు. ఆ కాలువమూలాన యూరోపుబడలు మన దేశాలకు ఆఫ్రికాను చుట్టి రాకుండా దగ్గరిమార్గములో వచ్చుటకు వీలయ్యెను.

౨. పనామాకాలువ:—ఉత్తరఅమెరికా దక్షిణఅమెరికా ఖండాలు ఒక చిన్న భూభాగముతో కలిసియున్నవి. అదే పనామామండలము. ఆ చిన్న భూభాగాన్ని త్రవ్వితే అతలాంతిక మహాసముద్రము శాంతి మహాసముద్రము రెండూ కలిసిపోవును. ఆపనిని కూడా ౧౮౭౮ లో లెస్సెప్సు మొదలుపెట్టి నష్టపడెను. తర్వాత సంయుక్త అమెరికావారే దాన్ని మొదలుపెట్టి ౧౯౧౪లో పూర్తిచేసిరి. పనామాకాలువ త్రవ్వుటకు వారికి ౪౦ కోట్లడాలర్లు అనగా ఇంచుమించు ౧౫౦ కోట్ల రూపాయలు (ఒకకోటి పౌనులు) ఖర్చయ్యెను.

క్రీ. శ. ౧౫౫౦ లో ఒక పోర్చుగీసు నావికుడు అంటోనియో బల్వో అనువాడు మొట్టమొదట ఈ కాలువను త్రవ్వుటను గురించి ఆలోచన చెప్పెను. క్రీ. శ. ౧౮౮౦ లో ఒక కంపెనీ ఆ పనిని మొదలు పెట్టెను. కాని అచ్చటి అడవులమూలాన పనిచేయువారు జ్వరబాధితులై చనిపోవుటచేత కంపెనీ దివాలాతీసెను. క్రీ. శ. ౧౯౦౪ లో సంయుక్తఅమెరికా (W. S. A.) ప్రభుత్వ మాపనికి పూనుకొనెను. పదేండ్లు కాలువ త్రవ్వించిరి. అప్పుడుదారిలో ఒక చిన్నగుట్ట అడ్డుతగిలెను. అది ౬ మైళ్ళపొడవు ౩౦౦ అడుగుల లోతు ఉండెను. దాన్నికూడా తొలిచి కాలువను తీసుకొనివచ్చిరి. ఇప్పుడు పనామాకాలువ పొడవు ౫౦మైళ్లు. వెడల్పు కొన్నితావులలో ౧౦౦౦ అడుగులున్ను మరికొన్ని తావులలో ౩౦౦ అడుగులున్ను. ఇంకా కొన్నితావులలో ౧౧౦ అడుగులున్ను కలదు. లోతు ౪౧ అడుగులు. ఇప్పుడు ఒకటిరెండు పెద్దఓడలు ౧౧౩ అడుగులు వెడల్పుకలవి కలవు. కావున వాటికిగాను కాలువను వెడల్పు చేసినారు.

కీల్‌కాలువ:— జర్మనీలో ఉత్తరభాగమునుండి ఓడలు రావలెనన్న డెన్మార్కును చుట్టిరావలసి యుండెను. అందుకుమారుగా బాల్టికు సముద్రమునుండి కొన్నిమైళ్ళు భూమినిత్రవ్వి ఇంగ్లండు సముద్రములో కలిపి జర్మనులు తమ ఓడలకు సౌలభ్యమును కలిగించిరి.

# ప రి శ్ర మ లు

ఇంతవరకు ఏ యే దేశములలో ఏ పరిశ్రములు ప్రధానముగా కలవో కొంత తెలిపినాము. ముఖ్యపరిశ్రమంలనుగురించి ఇచ్చట తెలుపు, చున్నాము.

చేపలు:—లోతు ఎక్కువగా లేని సముద్రాలలో చేపలు విశేష ముగా దొరుకును. ఇంగ్లండువద్దనుండి ఉత్తరసముద్రములో న్యూ ఫౌండ్ లెండ్ లో, నార్వేతీరాలలో చేపలు విశేషముగా పట్టుదురు. జపాను సముద్రములోనైతే అత్యధికముగా ఈపరిశ్రమ కలదు. ఇంచు మించు ౨౦ లక్షల జపానీలు కేవలము చేపలతినియే జీవింతురు. వారు పట్టిన చేపలు తినగా మిగిలి మురిగి ఎరువైపోవును. చేపలఎగుమతి దేశా లేవనగా నార్వే, కనడా, న్యూఫౌండ్ లెండ్. సంయుక్తామెరికా, ఇంగ్లండు.

పశువులు:—ఉత్తరఅమెరికా, అర్జెంటైనా, ఆస్ట్రేలియా, న్యూజీలెండ్ దేశాలలో పశువులు సమృద్ధి. డెన్మార్కు, హాలెండ్, స్వీడన్, స్విస్ దేశాలలో పాలసమృద్ధి కలదు. పాలు, వెన్న, డబ్బాలలో పెట్టి అమ్మి గొప్పలాభాలు సంపాదించుటలో ఈ దేశాలే ముఖ్యమైనవి.

గొఱ్ఱెలు:— ౧౦ అంగుళాలకన్న తక్కువ వానగల దేశాలలో గొర్లమంద లుండవు. ౨౦ నుండి 30 అంగుళాల వానగల దేశాలలోనే నీటి సమృద్ధి. ఎక్కువ వానగల దేశాలలో కాళ్ళరోగాలు వచ్చి గొర్లు నాశనమగును. గొఱ్ఱెలమాంసాన్ని మంచులోపెట్టి చెడకుండా సైన్సు రీత్యా సవరించి డబ్బాలలోపెట్టి న్యూజీలెండ్, అర్జెంటైనా, ఆస్ట్రేలియా దేశాలవారు ఎగుమతి చేస్తున్నారు. ఆస్ట్రేలియాఖండములో ఉండినన్ని గొర్లు ప్రపంచములో మరెందును లేవు. అచ్చటిఉన్ని చాలా శ్రేష్ఠము. అందుచేత ఆదేశపు ఉన్నిబట్టలు ఉత్తమమైనవి.

ప్రత్తి:—ఇప్పుడు సంయుక్త అమెరికాలో ( W. S. A. ) హిందూస్థానములో ప్రత్తి విశేషముగా పండును. బట్టలమిల్లులు ఇంగ్లండులోనే ఎక్కువ. అందు లాంకాషైర్ చాలా ముఖ్యమైనది.

గోధుమలు:— కనడాలోను, సంయుక్తామెరికాలోను గోధుమలు అపారముగా పండును. ౧౮౦౩ లో కనడాలో ఒకడు ఒక పెద్ద గోధుమ గింజల కంకిని ఏరి దానిగింజలను పండించెను. అది విచిత్రమైన పంటపండెను. ఇప్పుడా దేశమంతటా అదే పండింతురు. చెలకభూములలోకూడా గోధుమ పండించదలచి ఒకడు రష్యాకు పోయి పరిశోధనచేసి అడవులలో నట్టిభూములలో పండే గోధుమలను అమెరికాకు తీసుకొనిపోయి పండించెను. ఇప్పుడు డరం ( Durum ) అను నావిత్తనము చెలకలలోకూడా బాగా పండుతుంది.

లోహములు:— ఇంగ్లండులోని షెఫ్ఫీల్డులో ఇనుప పరిశ్రమలు అపారముగా ఉన్నవి. స్వీడనులో స్పెయినులో ఇనుప గనులెక్కువ.

బంగారు:—దక్షిణాఫ్రికా, ఆస్ట్రేలియా, పశ్చిమకనడాలో క్లోండైక్, మెక్సికోలో ఇదెక్కువ. దక్షిణాఫ్రికాలోని విట్ వాటర్స్రాండ్ అనే ప్రదేశములో ప్రపంచములోని బంగారులోని సగము బంగారు దొరుకుతున్నది.

టిన్:—మలయా, బొలివియా ( దక్షిణ అమెరికా ) డచ్చివారి తూర్పిండియాదీవులు, సయాం, చీనాలో ఇది దొరుకును. మలయాలోనే ఇది అత్యధికంగా దొరుకును.

రాగి:— సంయుక్తామెరికాలోని రాకీ పర్వతాలలో, ఛిలీలో, బెల్జియం కాంగోలో (ఆఫ్రికా) కనడాలో జపానులో ఇది దొరుకును. రాగిలో టిన్ కలిపితే బ్రాన్సు అను గట్టి లోహము సిద్ధమగును.

వెండి:— మెక్సికో, సంయుక్తామెరికా, పెరులో లభించును. పలుమారు వెండి, సీసము, జింక్ మూడున్నూ ఒకే గనిలో లభించును. పెరులోని కెర్రోడీ పాస్కో (CerroDe Pesco) అను పట్టణము ౧౪౦౦౦ అడుగుల ఎత్తునున్నది. అందు ౧౪౦౦౦ మంది ఉన్నారు. అచ్చటి చలువవల్ల అక్కడఏపిల్లా పుట్టి ఎదుగలేదు. కాని వెండి అపారముగా లభిస్తున్నందున జనులు వస్తూపోతూఉందురు. ప్రపంచములోని వెండిలో నూటికి ౪౦ పాళ్ళు మెక్సికోలో లభించును.

నైట్రేట్:—దక్షిణఅమెరికాలోని ఛిల్లీలో నుత్తరభాగమున నుండు అటకామా ఎడారిలో లభించును. ఆఎడారిలో మొలక, ప్రాణి అన్నది ఎదుగదు. అందుచేత గొప్పకంపెనీలు రైలుదారివేసి అన్నమునీటిని తీసుకొనిపోయి అక్కడి కూలీలకు సప్లయిచేసి నైట్రేట్‌ను తీయింతురు. ఈ నైట్రెట్‌నుండి నైట్రేట్ ఆఫ్‌సోడా అనునది సిద్ధముచేసి ఎరువుగా వాడుదురు. ఈ యెరువును ఇంగ్లండు, జర్మనీవారు ముఖ్యముగా ఇతర దేశాలవారు కొద్దిగా తెప్పించుకొని పొలాలకు ఎరువుగా, వేయుదురు. చిల్లీలోని ప్రభుత్వాదాయములో ఆరింట అయిదుపాళ్ళు ఈ గనినుండియే వస్తున్నది.

పెట్రోలు:— పెట్రోలున్నదని నిర్ణయించినచోట ఒక రంధ్రము వేసి బోరింగు మెషీన్‌ద్వారా పెట్రోలును తగులువరకు బొర్రపెట్టి అటుపై అందు ప్రేలుడుమందును వదులుదురు. అంతట నూనె పైకుబికి పారును. కొంతకాలాని కాబుగ్గ తగ్గును. అప్పుడు పంపులద్వారా బయటికి తీయుదురు. పెట్రోలు విశేషముగా సంయుక్తామెరికా, రష్యా, మెక్సికో, వెనిజూలా, ఈరాన్, తూర్పిండియా దీవులలో కలదు.

ప్రపంచపు పెట్రోలులో నూటికి ౬౧ పాలు సంయుక్తఅమెరికాలో, ౧౧ పాళ్లు రష్యాలో, ౧౧పాళ్ళు వెనిజూలాలో, 3 పాళ్లు ఈరానులో, రెండున్నరపాలు ఇండోనీషియాలో, ఒక్కటిన్నరపాలు ఈరాఖు

రుమేనియాలలో, రెండు పాళ్ళు మెక్సికోలో, అరపాలు ఇండియాలో లభించుచున్నది.

పొగాకు:—300 వండ్లనుండి పొగాకుచుట్టలను త్రాగుట వృద్ధియై పోయినది. ఇప్పుడు సిగరెట్లు ప్రపంచమంతటను వ్యాప్తిలో నున్నవి. అత్యుత్తమమగు పొగాకును వర్జినియాపొగాకు అందురు. సంయుక్త అమెరికాలో వర్జినియా, కలిఫోర్నియా అను మండలాలుకలవు. అచ్చటి భూములలో అత్యుత్తమమగు సువాసనగల పొగాకుసిద్ధమగును. క్యూబాలోని హవానా అను పట్టణములోని సిగారులు చాలాప్రసిద్ధి. ఫిలిప్పైన్ దీవులలోని పొగాకు వీటి తర్వాత ప్రసిద్ధికాంచినది. మనిలా సిగారులు, చుట్టలు ఫిలిప్పైన్ ముఖ్యపట్టణమగు మనిలాలో సిద్ధమైనవి.

తేయాకు:—ప్రపంచములో నెల్లను ఎక్కువ తేయాకు చీనానుండి వచ్చును. నూటికి ౪౦ పాళ్ళు అచ్చటనే దొరుకును. ప్రపంచమందలి తేయాకు ఉత్పత్తిలోనూటికి ౧౮ పాళ్ళు హిందూస్థానమందును, సిలోనులో ౧౨ పాళ్ళును జావాలో ౮ పాళ్లును జపానులో 3 పాళ్ళును లభించుచున్నది.

జనుపనార:— ప్రపంచములో నూటికి ౯౦ పాళ్ల జనుపనార బెంగాలు ఆసాం మండలాలలో దొరకును. అచ్చట ఏటేట 30 లక్షల ఎకరాలలో దానిని పండింతురు.

రాతినార:— మన దేశములో కొన్నియేండ్లనుండి మాయపట్టు వలెనుండు బట్టలను రాతినారబట్టలని అంటున్నారు. కాని దాని అస్సలు పేరు రాయన్ ( Royon ) ఇది మాయపట్టు. ౧౯౧౪—౧౮ యుద్ధానంతరమిది సృష్టియయ్యెను. కట్టెబెండు అనగా కట్టెపై నార చెక్కు తీయగా మిగిలిన లోపలిభాగము ( Wood Pulp ) పత్తిలో పనికిరాని భాగాలు ( Cotton waste ) కట్టెలు కోయునప్పుడు రాలు కట్టెనుసి. వీటిని కలిపి ముద్దగా చేయుదురు. అట్లగుటకై కొన్నిరసాయన పదార్థా

లందు కలుపుదురు. ఆ ముద్దను సన్నని గ్లాసుగొట్టాల ద్వారా దారాలుగా సాగతీయుదురు. పట్టంత గట్టిగానుండదు కాని దాని కన్న మెరుగుగాను అగ్గువగాను ఉన్నది. ౧౯౨౪ లో ౧౫ కోట్ల పౌనుల తూకం గల రాయిన్ సిద్ధముకాగా ౧౯౩౪ లో ౧౦౦ కోట్ల పౌనులది సిద్ధమయ్యెను. ఈ పరిశ్రమ జపానులోనే ఎక్కువగా నయ్యెను. ౧౯౩౭లో హిందూస్థానము జపాను నుండి ఒకటిన్నరకోటి రూపాయిల రాయన్ బట్టలను కొనెను. హిందూస్థానములో ఎచ్చటను ఈరాయన్ దారము తీయుట లేదు.

భూగోళమును గూర్చి ఎక్కువగా తెలుసుకొన దలచినవారు.

౧. తెనుగులో ఉన్నత పాఠశాలలలో చదివించు భూగోళగ్రంథములో చూడవచ్చును. మరియు ఇంగ్లీషులో ఈ క్రిందివి ఇంగ్లీషు తెలిసిన వారి కుపకరించును.

౨. ఏ. దాసుగుప్త గారి Economic and commercial geography.

3. మెక్మిలన్ కంపెనీవారి Lands and life మొదటి ౨ సంపుటములు.



# యువజన విజ్ఞానము

---

## ఆరోగ్య విధులు

## ౧వ ప్రకరణము

---

మన శరీరతత్త్వమును మనము తెలుసుకొని యుండవలెను. మనకు ౨౫ ఏండ్ల వయస్సువరకు శరీరము పెరుగుతూ వృద్ధి అవుతూ ఉండును. అటు తర్వాత పెరుగదు. కాన చిన్నతనమందే శరీరాన్ని బాగా వృద్ధిచేసుకోవలెను. మన శరీరములోని ప్రతి అవయవమున్నూ ఏదో పనిచేయుచుండును. అందు ముఖ్యమైనవి ఊపిరితిత్తులు, గుండె, మెదడు. గుండె తటతట గడియారమువలె ఎల్లప్పుడును కొట్టుకొంటూ ఉండును. మనము తీసుకొను ఆహారము రక్తమై గుండెలో చేరగా అచ్చటినుండి గుండె శరీరమున కంతయు రక్తాన్నిసప్లయిచేయుచుండును. ఊపిరితిత్తులు గాలినిపీల్చి వదలుచుండును. కడుపు, పేగులు,ఆహారాన్ని జీర్ణింపచేసి అందలి సారాన్ని రక్తముగా మార్చును. పేగులు,మూత్రి

పిండములు,చర్మము, వ్యర్థపదార్థాలను బయిటకు పంపివేయును. మెదడు శరీరములోని అంగములకు పనిచెప్పి చేయించుచుండును. నరాలు, శరీరావయవాలను కదలించుచుండును. మన శరీరములో ౨౦౦ ఎముకలకంటె ఎక్కువగా నున్నవి. ఒక తలలో మాత్రమే ౨౨ఎముకలున్నవి. ఈ భాగాలన్ని మంచిగా పనిచేయునట్లు చూచుకొనుట మన విధి. ఏమైనా చెడినట్లయిన వాటికి చికిత్స ( రిపేర్ ) చేయవలసి యుండును. శరీరమునకు మూలాధారము ఆహారము. ఆహారము శరీరానికి బలమిచ్చి అందు శక్తి నుత్పత్తి చేయును.

శరీరానికి బలమిచ్చే శక్తులను బలకృత్తు లనవచ్చును. వాటిని ఇంగ్లీషులో విటమిన్‌లు ( Vitamins ) అని యందురు. విటమినులు అయిదు. ఏ. బి. సి. డి. ఇ. కాని మొదటినాలుగే ప్రధానమైనవి.

ఏ విటమిన్‌. కండ్లకు, ఊపిరి తిత్తులకు, పేగులకు పనికివచ్చును.
బి ,, మెదడు, నరాలు, మాంసము, Muscles, గుండె, కడుపు, వీటికి పనికివచ్చును.
సి ,, రక్తమునకు పనికివచ్చును.
డి ,, పండ్లు, ఎముకలకు పనికివచ్చును.

మన శరీరమొక ఇంజనువలె పనిచేయును, అందుష్ణముండుటచే మన ఆహారాన్ని అది జీర్ణింపజేసి శరీరమును పోషించును.

అయితే మనము తీసుకొనే ఆహారము మంచిది కానిచో పై విటమినులలో ఏవిటమినులు ఎక్కువగా లోపించునో ఆవిటమినులకు సంబంధించిన అవయవములు దుర్బలమగును.

మన శరీరానికి ప్రకృతి తోడ్పాటు కావలెను. గాలి, వెలుతురు, నీరు కూడా అవసరము. ఇవి శుభ్రముగా ఉండకుండిన లేక లోపించిన శరీరము చెడును. మనకు ఆరోగ్యము, బలము కావలెనంటె వ్యాయా

మము, నిద్ర కూడా చాలాఅవసరము. మనకు అయిదు విధములగు ఆహారములు కావలెను.

౧. Proteins ప్రొటీనులు —మాంసకృత్తులు.
౨. Mineral Salts = ఉప్పు పదార్థములు.
3. Fats = క్రొవ్వుపదార్థములు.
౪. Carbohydrates = పిండిపదార్థములు.
౫. Vitamins = బలకృత్తులు.

పైన తెలిపిన విషయాలనే మరికొంత తెలుసుకొందము. దేవుడిచ్చిన గాలి, వెలుతురును మనము చక్కగా వినియోగించుకొనవలెను. మనము గాలిని నిముషమునకు ౧౬ లేక ౧౭ మారులు పీల్చుచుందుము. గాలిని మనము ముక్కుద్వారానే పీల్చవలెను. నోటిగుండా పీల్చగూడదు. శుభ్రమైన గాలినే పీల్చవలెను. అందుచేత మనయిండ్లకు పెద్దవాకిండ్లు కిటికీలు ఉండవలెను. మరియు ఇంటిచుట్టును మురికి, మైలయుండరాదు. గాలి తక్కువగా పీల్చిన లేక గాలిలో దుర్వాసనలు నిండిన మన ఊపిరితిత్తులు చెడిపోవును. మన యిండ్లచుట్టును మురికియుండిన మనము దుర్వాసనగల గాలినే పీల్చి చెడిపోదుము.

గాలివలెనే వెలుతురు, ఎండ మనకు చాలాఅవసరము. సూర్యుని కాంతివల్ల కూరగాయలలో పండ్లలో విటమినులు సమకూరును. మనుష్యులకు సూర్యుని యెండనుండి డి విటమిన్ లభించును. అది ఎముకలు వృద్ధియగుటకు పనికివచ్చును. ఎండలో తిరుగక నీడలోనే ఉండువారి యెముకలు దుర్బలముగా ఉండును. ఆ ఎండ నెరుగని పిల్లలకు రికెట్ (అస్థిమార్దవరోగము) అను జాడ్యము సంభవించును. పర్దాలో ఉండే స్త్రీలకు డి విటమిన్ లోపించును. ఎండకాలములోని మధ్యాహ్నపు ఎండలోకాని యితర కాలాలలోని మధ్యాహ్నపు తీవ్రమగు ఎండలోకాని చాలాసేపు ఉండరాదు. ఉదయాస్తమయములందలి ఎండ శరీరానికి చాలా మంచిది. ఆ యెండలో సూర్యుని సూర్యనమస్కారములు

చేయుట సంధ్యావందనము చేయుట సంధ్యవార్చుట అనేది మన పూర్వులు ఆరోగ్యానికిగానే ఏర్పాటుచేసిన వారు. సూర్యారాధనలోని రహస్యము ఆరోగ్యమే. సూర్యకిరణాల చికిత్సవల్ల కుష్ఠురోగముకూడా పోవునని మనవారు విశ్వసించిన వారు.

నీరు: - గాలి, వెలుతురు మనకెంత అవసరమో నీరుకూడా మనకు చాలా అవసరము. మన తిండిలో ఎక్కువభాగము నీరేయుండును. మనము తినే కూరగాయలలో ముప్పాతికకంటే ఎక్కువభాగము నీరున్నది. మనము నీరు బాగా త్రాగవలెను. అది చెమటరూపముగా మలమూత్రరూపముగా శరీరములోని మలినమును తొలగించివేయును. అయితే మన దేశములో ప్రభుత్వము కాని ప్రజలుకాని పరిశుభ్రమగు నీటి ప్రాముఖ్యమును గుర్తించలేదు. మన పల్లెలలో జనులు త్రాగుడు నీటిబావులలో స్నానాలు చేయుదురు. ముఖము కాలుసేతులు కడుగుకొందురు. బట్టలుతుకుదురు. అంట్లుతోమి అందే కడుగుదురు. పసులు కూడా అందే త్రాగును. బావిగట్టున లోపలి గోడలలో చెట్లు పెరిగితే కొట్టివేయరు. ఆకులు నీటిలోపడి నీటిని చెడగొట్టును. నాచు ఉండును. ఈవిధముగా ఎన్నివిధాల నీటిని మురికిచేయవలెనో అన్నివిధాలా చేయుదురు. ఆనీటినే కడవలతో తీసుకొనిపోయి అట్లే త్రాగుదురు. నారికురుపులుండువారు బావిలోదిగితే నారిక్రిములు బావిలోచేరి వృద్ధియగును. ఆనీటిని త్రాగువారికందరికీనారులు కలుగును. కలరా(గత్తర)అంటినవారి బట్టలను బావిలో నుదికితే కలరాక్రిములు బావిలోచేరి ఊరివారందరికీ కలరాతగులును. నీరుమురికి అయితేచీముభేదులుకూడా తగులును. టైఫాయిడ్ అనే దీర్ఘజ్వరము మనదేశములో చాలాయెక్కువ. ఆ జ్వరము తగిలితే విడువకుండా ౨౦ లేక ౩౦ దినాలవరకు జ్వరమువచ్చి కొందరికి

సన్నివచ్చి చనిపోదురు. ఆ జ్వరము మురికినీటినుండి కూడా ఎక్కువగా వచ్చును. పై జాడ్యాల క్రిములు మనకంటికి కానరానంతటి సూక్ష్మముగా ఉండును. భూతఅద్దముతో చూస్తే ఒక కడవనీళ్ళలో అవి వేలకొలదిగా కానవచ్చును. కావున జనులు పరిశుద్ధమగు నీటిని త్రాగవలెనంటే దిగుడుబావులను, చేదబావులుగా మార్చవలెను. ఆ చేదబావి చుట్టు శుభ్రముగా ఉంచవలెను. బయటినీరు బావిలోకి పోకుండా చుట్టూ కట్ట కట్టవలెను. అట్టి బావినీటిని కూడా బాగా సలసలకాచి ఆరబెట్టి త్రాగవలెను. శుభ్రమైన బట్టను రెండుమూడు మడతలుచేసి దానిలో నీరు వడబోసి త్రాగవలెను. ఇంతమాత్రము ఓపిక లేక మనమంది లక్షలకొలదిగా జాడ్యాలుతగిలి చనిపోతారు లేదా దుర్బలులౌతారు.

ఇక మన ఆహారములో ఏది మనకు బలమిచ్చు ఆహారమో అది గుర్తించి మనము తినుట అవసరము.

ప్రోటీన్:—ఈగుణముకల తిండివస్తువు లేవనగా పాలు, పెరుగు, చల్ల, కోడిగుడ్లు, కార్జ్యము. Liver, మాంసము, చేపలు, ఆకుకూరలు, తవుడుతీయని ధాన్యాలు.

మినరల్ సాల్టులు:— ఇవి ఆకుకూరలలో, పాలలో, పండ్లలో, తవుడుతీయని ధాన్యాలలో ఎక్కువగా ఉండును.

సున్నము (కాల్సియం):— ఇది దంతములను, ఎముకలను, గట్టిపడుటకున్నూ గుండెను బాగా ఉంచుటకున్నూ అవసరము. సున్నపుగుణము శరీరములో లోపించి పండ్లు జబ్బుచేసి త్వరగా రాలిపోవును. ఎముకలు గట్టిగా ఉండవు. సున్నమెక్కువగా ఉండేవస్తువు లేవనగా పాలు,చల్ల,పెరుగులోని నీరు, కోడిగుడ్డులోని తెలుపు, పప్పుధాన్యము,

ఫలములు, ఆకుకూరలు, మునగమామిడి, సారెపప్పు, బాదాము, పెద్ద వారికంటె ఎదిగేపిల్లలకివి చాలాఅవసరము. మాంసములో ఉప్పుకలదు. కాని మాంసము తిననివారు ఉప్పు వాడుకొనవలెను. కాని యేదైనా అధికముగా వాడుకోరాదు. తగినట్లుగా వాడుకొనుటలోనే ఆరోగ్య మున్నది. కూరగాయలలో టమాటోలు (రామములకకాయలు) చాలా శ్రేష్ఠమైనవి. పచ్చి రామములకలనుకోసి అందు కాస్త ఉప్పు కాస్త మిరియాలపొడి చేర్చి తింటే చాలామంచిది. ఆకుకూరలు చాలా శ్రేష్ఠ మైనవి. పుల్లకూరగా బజ్జీగా లేక పొడికూరగా చేసి ప్రతిదినము తిన వలెను. మనయిండ్లలో చాలా కూరగాయలను ఉడికించి ఆ నీటిని పార బోయుదురు. ఆ నీటిని పారబోయరాదు. ఆ నీటిని చారులో కాని లేక పులుసులోకాని పోసి వాడుకొనుట చాలమంచిది. దోసకాయవంటి కూరలను ఉడకబెట్టుటకు మారుగా పచ్చివిగానే పచ్చళ్ళుగాచేసి తినుట ఉత్తమము. అవి రుచికరముగాను ఉండును.

నూనె, నెయ్యి:– వెన్న, నెయ్యి, మీగడ, క్రొవ్వు, నూనెలు ఇవికూడా శరీరానికి చాలాఅవసరము. చేపలు, చేపనూనెకూడా చాలా మంచిది. సోయాగింజలు చాలా శ్రేష్ఠమైనవి.

Cardohydrates = పిండిపదార్థము:– ఇది బెల్లము, ఎర్రచక్కెర, తేనె, పప్పులో యెక్కువగా ఉండును.

విటమినులు: ఏ విటమిన్ ఆకుకూరలలో, పాలలో కోడిగుడ్లలో చేపలలో విశేషముగా ఉన్నది. ఈవిటమిన్ లోపించిన తల్లుల శిశువులు ఎక్కువగా చనిపోదురు. కాన తల్లులు తమ చంటిపిల్లలకు పుష్టిగల ఆహారాన్ని ఇచ్చి ఆరోగ్యముగా పెంచదలచితే పైవాటిని విశేషముగా ఆరగించవలెను. చేపనూనె, గుడ్లు, వెన్న, నెయ్యి, క్యారెట్, మాంసము, రామమునగ, ఆలు, నానబెట్టి మొలకలువెళ్ళిన ధాన్యము, రాగి, సెన గలు, వీటిలోకూడా ఏ విటమిన్ చాలాకలదు.

బి విటమిన్:— తల్లులు తమ పాలలో బలముండి తమ శిశువులు ఆరోగ్యముగా ఉండవలెనంటె బి. విటమిన్ గల పదార్థాలను ఎక్కువగా తినవలెను. భూమినుండి పెరుగు ధాన్యాలను అట్లే తినిన బి. విటమిన్ దొరకును. కాని మనము తవుడుతీసి తింటాము. ఆతవుడులోనే బి. విటమిన్ కలదు. బియ్యము తినేవారు కొద్దిగా రోకటిపోటు వేయించి గంజి వార్చకుండా ఉడికించి తినవలెను. బియ్యాన్ని తెల్లగా గిర్నిలో తవుడు తీయించి తర్వాత దానిని రుద్దిరుద్ది నాలుగుమారులు కడిగి నీరు పారబోసి తర్వాత గంజిపెట్టి దాన్నికూడా పారబోసి ఏమిన్ని సారములేని మిగిలిన పిప్పిఅన్నమును తింటారు. తుదకు ఆ గంజినైనా పట్టిపెట్టుకొని అందు కాస్త ఉప్పుకలిపి త్రాగితేకూడా కొంతలాభముండును. అన్నము తినేవారు తమ అన్నములో అయిదవభాగము పప్పు తినవలెను. దినానికి ౫ ఔన్సుల (ఒకఔన్సు అర్ధచటాకు) కంటే యెక్కువ పప్పును తినరాదు. ఎక్కువ తింటె కడుపునకాయాసము కలుగును. గంజివార్చిన బియ్యముతోపాటు ఒక ఔన్సు (అర్ధచటాకు) పప్పుమాత్రమే తినేవారికి బెరిబెరి అను జాడ్యముకలిగి చనిపోతారు. అట్టివారికి కాళ్ళువాచి పక్షవాతము వచ్చును. గుండె జబ్బుచేయుట ఈ జాడ్యలక్షణాలు. ఈ విటమిన్ శరీరములో లోపించిన అజీర్ణము, అతిసార విరేచనములు మలబద్ధకము, కడుపునొప్పి, నరాల దౌర్బల్యము, అనుజాడ్యాలు కలుగును. బీ విటమినులుండే వస్తువులేవనగా కోడిగుడ్లు, కార్జ్యము, టమాటో (రామములకకాయలు) గోధుమపిండి, రాగులు. (తయిదలు) చిక్కుడుగింజలు, పప్పుధాన్యాలు, సోయాగింజలు, క్యాబేజి, ఉల్లి, పాలు, గడ్డలు ఆకుకూరలు.

సి విటమిన్:— హిందూస్థానములో స్కర్వీ (శీతాదము, లవణరక్తవ్యాధి) అనే జాడ్యము చాలాకలదు. విటమిన్ (సి) లోపించిన ఈ జాడ్యము కలుగును. అప్పుడే చెట్టునుండి తెంపిన పండ్లలో, కూరగాయలలో, ఆకుకూరలలో ఇది కలదు. గోధుమలు జొన్నలు, వరి, మున్నగునవి నానబెట్టి మూటగట్టి రెండుదినాలుంచితే అవి మొలకలెత్తును.

ఆ మొలకలలో ఈ విటమిన్ కలదు. మొలకలతో ఆ ధాన్యముతింటే రుచికి రుచి బలానికి బలము కలుగును. పాలలో కొద్దిపాటి సి విటమిన్ కలదు. పాలనుకాచిన అదికూడ తగ్గిపోవును కాని పచ్చిపాలు త్రాగితే కొన్నిజాడ్యాలు రావచ్చును. పాలిచ్చే పశువులు చాలా ఆరోగ్యముగా ఉండవలెను. వాటి పొదుగులను బాగాకడిగి పాలుపిండువారు చేతులు శుభ్రముగా కడుగుకొని పాత్రను శుభ్రముగా తోమి కడిగి శుభ్రమైన స్థలములో పాలుపిండితే అట్టి పచ్చిపాలు త్రాగిన మంచి ఆరోగ్యము కలుగును. అట్లు వీలులేనిచో పాలను రెండుమూడుమారులు పొంగు వచ్చువరకు కాచియే త్రాగవలెను. మనకు వంటలుచేయుట సరిగా తెలియదనే చెప్పవలెను. వంటచేయుట ఒక పెద్దశాస్త్రము. మన వంట లలో కారము పులుసు చాలా వేయుదుము అది చాలా చెడ్డది. వీలై నంతవరకు ఇది చాలా కొద్దిగా వాడవలెను. వంట వండునప్పుడు పాత్ర లను తెరిచి యుంచరాదు. ఆవిరిలో విటమినులు ఎగిరిపోవును. పాత్రలను మూసియే వండవలెను. మరియు కూరగాయలు సగము ఉడి కించి తినుట మరీమంచిది. రుచులకుగాను మసాలాలను వాడుదుము. అవి నాలుకరుచికే కాని శరీరానికి హితకారికావు. కొందరు పిండివంట లలో, కూరలలో, రొట్టెలలో సోడా వేసి కలిపి వండుదురు. అది చాలా చెడ్డపని.

క్యాబేజిలో, పప్పుధాన్యాల మొలకలలో, నారింజపండ్లలో, టమాటలలో, సంత్రాలలో, సి విటమిన్ ఎక్కువగా ఉండును.

డి విటమిన్:—డి విటమిన్ పాలు, వెన్న, నెయ్యి, గుడ్లు, చేపనూనెలో ఎక్కువగా ఉండును. కొద్దిగా కొబ్బెరలోకలదు. సూర్యకిరణాలలోనూ కలదు. మన దేశములో నూనె అంటుకొని స్నానము చేయుదురు. అట్టి వారు ఎండలో కూర్చుని నూనె బాగా అంటించుకొని స్నానముచేస్తే డి విటమినను పొందిన వారగుదురు. విటమిన్ డి లోపించిన వారిపండ్లు తొందరగా ఊడిపోవును.

ఉత్తరహిందూస్థానములో గోధుమరొట్టెలే తిందురు. దక్షిణదేశములో బియ్యమే తిందురు. వరియన్నము తినువారు బలహీనులై యుందురు. కూనూరులో ఒక వైద్యుడు కొన్ని యెలుకలను పట్టిపెట్టి వాటికి మన దేశములోని పంజాబీ, పఠాన్, మరాఠీ, బెంగాలీ, మద్రాసీ జనులు సాధారణముగా తినేతిండిని వేరువేరుగాపెట్టి తర్వాత వాటిని తూకము చేసి చూడగా ఆ యెలుకల బరువులో భేదము కనపడెను.

మన ఆహార మీక్రింది విధముగా ఉండుట ఆరోగ్యకరము. ప్రొద్దున, రాత్రి ఒక్కొక్కగిన్నెడు పాలు, ఆకుకూరలు, సగమురొట్టె సగము దంపుడుబియ్యం అన్నము, మజ్జిగ, వెన్న, నెయ్యి, సగంఉడికిన కూరగాయలు, పండ్లు, బెల్లము, మాంసము తినేవారు మాంసము, కోడిగుడ్లు, చేపలు, ఇవి తింటే ఆరోగ్యకరముగా ఉండును.

శరీరానికి వ్యాయామము చాలాఅవసరము. కాయకష్టము చేయని వారు ప్రొద్దున, సాయంత్రము వ్యాయామము చేయవలెను. ఒకటిరెండు మైళ్ళనైన బిరుగ నడిచిరావలెను.

ప్రతిదినము స్నానము చేయవలెను. మనము స్నానము సరిగా చేయము. గబగబ నాలుగుచెంబుల నీళ్ళు మీద చల్లుకొందుము. గోరు వెచ్చనీరు మంచిది. చన్నీరు మరీమంచిది. సర్వాంగములు బాగాతోము కొనవలెను. పొత్తికడుపువీపు కటిభాగముచుట్టు బాగా తోముకో వలెను. అరికాళ్ళు మీగాళ్ళు బాగారాకవలెను. ప్రతిదినము తలదిగ పోర స్నానముచేయుట మంచిది.

మన దంతములను (పండ్లను) మనము చాలా బాగా ఉంచుకొన వలెను. ప్రతిదినము వేప లేక కానుగపుల్ల లేక ఉత్తరేణివేరుతో బాగా రుద్దవలెను. ఎక్కువగా ఉప్పువేసి మెత్తగానూరిన కట్టెబొగ్గుతో కూడా రుద్దవలెను. భోజనానంతరము వ్రేలుతో రుద్ది కడుగుకోవలెను. రాత్రి పండుకొనుటకు ముందు నోరు బాగా కడుగుకొని పండుకొన

వలెను. విటమిన్, ఏ. డీ. లుకల ఆహారాలు బాగాతినవలెను. ఇప్పుడు పండ్లపొడులు చాలా అమ్ముతారు. అవన్నీ నష్టకారులు. పండ్లపేస్టులు వాడుతారు అవికూడా ద్రవ్యనష్ట హేతువే. వాటికి బ్రష్షుకావలెను. ఆ బ్రష్షులో క్రిములుచేరును. రెండుచుక్కల కార్బనులో తగినన్ని నీరు పోసి అందు బ్రష్షునునాన్చి కడిగి వాడవలెను. అంతఓపిక ఎవరికుండును. కాన మన పండ్లపుల్లలే శ్రేష్ఠము. పండ్లపుల్లలు మెత్తగా ఉండవలెను. వాటి పైపొట్టు తీయరాదు. అట్లే నమలి మెత్తగా అయిన తర్వాత పండ్లకు రుద్దవలెను.

మనకు చక్కని సరియగు ఆహారము కావలెనంటే దినానికి ఈక్రింది విధముగా తినవలెను.

| | | |
|---|---|---|
| పిండిరొట్టెలు | ౧౨ | ఔన్సులు |
| దంపుడుబియ్యము | ౬ | ,, |
| మాంసము | ౨ | ,, (అది తిననివారు దానికి |

మారుగా వెన్న పాలను ఎక్కువగా తినవలెను)

| | | |
|---|---|---|
| పాలు | ౨౦ | ,, |
| నూనెలు | ౧ | ,, |
| నెయ్యి | ౧॥ | ,, |
| కూరగాయలు | ౮ | ,, |
| ఆకుకూరలు | ౮ | ,, |
| పప్పు | ౨ | ,, |
| చక్కెర | ౧ | ,, |

రెండు ఔన్సులు ఒక చటాకు అని తెలుసుకొనవలెను. కెలరీలు అను బలపదార్థములు మన తిండిలోకలవు. ప్రతిదినము ఒకనికి ౨౮౦౦ కెలరీలు సగటున కావలెను. మన దేశములో ఇప్పటి పంటలనుబట్టి సగటున మనిషికి ౨౦౦౦ కెలరీలే దొరకుచున్నవి. దీన్నిబట్టి జనులతిండి చాలా

అనారోగ్యకరముగా ఉన్నదని విశదమగును. హిందూస్థానములో జనుల సగటు ఆయుర్దాయము ౨౭ సంవత్సరాలు. ఇతర దేశాలలోని జనులు పుష్టికల ఆహారము తిని, విరివిగా వైద్యసహాయము పొంది, విద్యావంతులై, ఆరోగ్యవిధుల ననుసరించి జీవించుటచేత ఆ దేశాలలో జనుల ఆయుర్దాయము మనకంటే యెక్కువగా కలదు.

| | | | |
|---|---|---|---|
| కనడాలో జనుల | సగటుఆయుర్దాయము | ౫౯ | ఏండ్లు |
| సంయుక్త అమెరికాలో | ... | ౬౧ | ... |
| జర్మనీలో ... | ... | ౬౦ | ... |
| ఇంగ్లండులో ... | ... | ౬౦ | ... |
| ఆస్ట్రేలియాలో ... | ... | ౬౩ | ... |
| జపానులో ... | ... | ౪౬ | ... |
| హిందూస్థానములో | ... | ౨౭ | ... |

హిందూస్థానములో ౭౩౦౦ వైద్యాలయాలు (హాస్పిటళ్ళు)ఉన్నవి. అనగా ౪౧౦౦౦ మంది కొక వైద్యాలయము కలదు. ౪౫౦౦౦ డాక్టర్లు కలరు. అనగా ౮౦౦౦ మంది కొక డాక్టరు కలడు. ఇంగ్లండులో ౭౭౬ మంది కొక డాక్టరు కలడు. ఇంగ్లండు లెక్కప్రకారము మన దేశములో గ్రామాని కొకడుచొప్పున ౭ లక్షల డాక్టర్లుండవలెను.

## అంటు రోగాలు

మన దేశములో కలరా తగిలినమనిషిని చూస్తే అందరున్నూ పారిపోతారు. కారణమేమనగా కలరా తగిలినవాని వద్దకుపోతే తమకున్నూ ఆ జాడ్యము తగులునని వారికి భయము. కాని ఎందుకు తగులును? ఎట్లాతగులును? అన్నది మాత్రము వారికి తెలియదు. ప్లేగుకూడా అట్టిదే అని వారికి తెలియును. ఈ రెండు జాడ్యాలు తప్పితే ఇక ఏ జాడ్యాలకున్నూ పల్లెజనులు భయపడరు. ఇది వారి అజ్ఞానము. కలరా, ప్లేగువలె ప్రత్యక్షముగా కానరాకున్నను వారికి తెలియకుండా అంటుజాడ్యా

లుగా ఉండేవి చాలా కలవు. కలరా ప్లేగు తగిలినవారిద్వారా బాగున్న వారికిన్ని ఎట్లా వ్యాధి అంటుకొనిపోతుందో అదేవిధముగా గజ్జి, తామర, గవదబిళ్లలు, కండ్లకువచ్చు జబ్బులు, అమ్మ (స్ఫోటకము, తట్టు) క్షయ, దగ్గు, చలిజ్వరము (మలేరియా) టైఫాయిడ్ జ్వరము, ఇవన్నీ అంటువ్యాధులే అని బాగా తెలుసుకోవలెను. క్షయరోగి దగ్గితే గళ్ల ఉమ్మివేస్తే, ఎంగిలిచేసిన తట్టలు వదలితే వాటిలో క్రిములుచేరి ఇతరులకు గాలిద్వారాకాని, ఎంగిలివాడుట ద్వారాకాని క్షయ వ్యాపించుకొనిపోవును. తామర గజ్జి కలవాని పుండ్లనుతాకి బాగా కడుగుకొనకుంటె వాడు వాడిన బట్టలను వాడుకుంటే ఇతరులకు గజ్జి, తామర వ్యాపించును. కండ్లకు వచ్చినవారి కండ్లపై చీకటీగలువాలి మళ్ళీ బాగున్నవారి కండ్లపై వాలితే ఆ జబ్బు వ్యాపించును. కలరా వచ్చిన వారి వాంతి, భేదులమీద ఈగలు వాలి అవే ఇతరులు తిను ఆహారము మీద, త్రాగే నీటిమీద వాలితే వాటిని వాడిన వారికిని కలరా తగులును. చలిజ్వరమున్నవారిని కరచిన దోమలు బాగున్నవారిని కరిస్తే వారికిన్నీ జ్వరాలు వచ్చును. టైఫాయిడ్ అనేది చాలా దీర్ఘమైన జ్వరము. ౧౭దినాలనుండి ౪౦ దినాలవరకుండును. దానిలోనే సన్ని కనిపించును. అదికూడా ఆ రోగుల మలముపై వాలిన ఈగలవల్ల నీటిద్వారా వ్యాపించును. ఈ భయంకర రోగాన్ని జనులు చాలా నిర్లక్ష్యము చేస్తారు. రోగిని చాలాజాగ్రత్తగా చూచుకొనక సన్ని వచ్చే అట్లుచేసి వాతలువేసి చంపివేస్తారు.

మన దేశములో మరొక భయంకరజాడ్యము కలదు. అది 'నారి'. దిగుడుభావులలో నారిపుండుకల మనిషిదిగితే వాని నారినుండి వేల నారి పిల్లలు అందుచేరి లక్షలుగా వృద్ధినొందును. ఆనీరు త్రాగినవారి కంతా నార్లు సంభవించును. నీరు సలసల కాచితే అవి చచ్చును. కాచిన నీరు త్రాగితే చాలా జాడ్యాలు రావు.

క్రిములనగా కంటికి కనబడని అతిసూక్ష్మమగు పురుగులు. అట్టి క్రిములు గాలిలో, నీటిలో, మురికిలో, బురదలో కోట్లకొలదిగా

ఉండును. వాటివల్లనే చాలాజాడ్యాలు వచ్చును. ఈవిషయాన్ని ఫ్రాన్సు దేశపు శాస్త్రవేత్తయగు పాశ్చ్యెయర్ అను నతడు ౨౦౦ ఏండ్ల క్రిందట కనిపెట్టెను.

ఒక చదరపు అంగుళములో వేయికాదు లక్షకాదు కోటికాదు ౪౦ కోట్ల క్రిములు ఇమిడిపోవును. మనము దిగుడుబావులలోని నీటిని శుభ్రముగా నుండునని త్రాగుదుము. కాని అట్టి బావులలోని నీటిలోని ఒక్కొక్క నీటిచుక్కలో ఎంత మలినమున్నదో మనకంటికి కానరాదు. అసలు వస్తువును ౧౦౦౦ అంతలు పెద్దగా కనబడే అట్లుగా భూతద్దముతో ఒకే ఒక మురికినీటిచుక్కను చూచి అందు ఎన్ని పురుగులు చెత్తకణములు కనబడునో అది చూచినట్లయిన మనము మళ్లీ ఆ నీటిని ఎన్నిటికినీ త్రాగుటకు ఇష్టపడము. ఈ పటమున కనపరచినది ఒకేఒక మురికి నీటిచుక్క. ఆనీటిచుక్కను ౧౦౦౦అంతలు పెద్దదిగా కనబడునట్లు భూతద్దముతో చూచిన అందెట్టి ఘోర భయంకర దృశ్య మున్నదో కానరాగలదు.

ఒక్క మురికినీటిచుక్క లోని సన్నని క్రిములు మానవులను చంపినంత ఏయితర భయంకర జంతువులు కూడా చంపుటలేదు. దక్షిణాఫ్రికాలో యుద్ధానికై వెళ్ళిన ఇంగ్లీషుసైన్యములో చాలామంది మురికినీరును త్రాగి చచ్చిరి. శత్రువుల తుపాకీగుండ్లకంటే యెక్కువగా ఆ మురికినీటి వల్లనే ఇంగ్లీషుసైనికులు చచ్చిరి. హిందూస్థానములో కలరా, ప్లేగుల జ్వరాలు, ఆమప్రివర్తులు, కడుపురోగాలు, ఇవన్నియు మురికినీటి బావులవల్లనే కలుగుచున్నవి. కలరా (మారి—గత్తెర)ను వ్యాపింపజేసే క్రిములు అతిసూక్ష్మమైనవి. ఇచ్చట కనబరచిన పటములోనివి కలరా క్రిములు. అవి స్వాభావముగా ఎంత ఉండునో అంత ౧౫౦౦ అంతలు పెద్దవిగాచేసిన అవి సన్నని ఎర్రిచీమ్మలంత కనబడును.

హిందూస్థానములోని చావులలో ౧౦౦ కి. ౮౦ పాళ్ళ చావులు క్రిములమూలాననే అని తెలుసుకొనిన మనము ఎంతటి మురికిలో

జీవించి రోగాలు తెచ్చుకొని నష్టపడుతున్నామో ఊహించుకొన వచ్చును. క్రిములలో చాలాక్రిములు అపాయముచేయనివి కలవు. అన్నీ అపాయము చేసేవైతే ప్రపంచము నిర్జీవమై కేవలం క్రిములు మాత్రమే నిలుచును. మనము తినుపదార్థాలమీద "బూజు" పట్టుటను చూచు చుందుము. ఆ బూజు అనేది లక్షల క్రిములగుంపు. కాని అవి మనకపాయము చేయనివి కాబట్టి బీదవారు ధనికులు బూజును తొలగించి తినే పదార్థాలవల్ల అపాయాలుకలుగుటలేదు. పండ్లు మురిగిపోవును. ఆమురిగిన భాగములో లక్షలకొలది కానరాని క్రిములుండును. క్రిములు చీకటిలో వృద్ధియగును. క్రిములను చంపవలెనంటే రెండుమూడు దినాల కొకమారు తినువస్తువులను బట్టలను యెండలో చాలాసేపు పెట్టవలెను. మరియుఇండ్లలో అన్నిమూలలలోను బాగా వెలుతురు గాలి వచ్చునట్లుగా ఏర్పాట్లు చేసుకొనవలెను. కిటికీలు తలుపులు ఎప్పుడును మూసియుంచ రాదు.

ప్రత్యేకముగా మన ముఖ్యశత్రువులను గురించి తెలుసుకొన వలెను. మనుష్యులను ఎక్కువగా చంపునదేది? పెద్దపులులా సింహాలా పాములా గుండాలా? అవేవియుకావు! మనకు భయంకరమైన శత్రువు ఈగ. అది పనికిరానిదిగా, అపాయము చేయనిదిగా, కరువనిదిగా, మనకు కనబడును. అది పామువలె కరువదు. పులివలె కొరకదు. దోమవలె నల్లివలె జలగవలె రక్తము పీల్చదు. కాని నిజముగా దానివంటి నీచాతినీచమైన అసహ్యామైన అంటరానిదైన మురికిదైన జీవము ప్రపంచములో మరొకటిలేదు. హిందువులు తమ తోడిసోదరులను తమ స్వమతస్థులను అంటరాని వారినిగా చేసినారు. నిజమైన అంటరాని ఈగలను మాత్రము లెక్కచేయక ఏటేట లక్షలకొలది కలరా, జ్వరములు, రక్తభేదులు, గజ్జి, మున్నగు రోగాలతో చత్తురు. అవన్ని ఈగలవల్ల కలిగినవే.

ఈగ అత్యంతముగా అసహ్యకరమైన మలస్థానములలో గుడ్లు పెట్టును. అక్కడనే వాటిపిల్లలెదుగును. పాయఖానాలు, చచ్చినజంతు

వులు, రొచ్చుగుంటలు, మురిగినపండ్లు, చీము,రక్తము, పెంటలు,ఇట్టివే ఈగల ఆటపట్టులు. ఒకక్షణములో చచ్చి మురిగిన జంతుశవాలపై వాలును. మరుక్షణము మడికట్టుకున్న సనాతనుని శుభ్రమైన అన్నముపై వాలును. ఒకక్షణము గద్దలు తినే దిక్కులేని జీర్ణశవముపై వాలును. కొంతసేపటిలో దొరవారి బిర్యానీపై వాలును. ఒకక్షణము కలరా పీనుగపై వాలును. మరుక్షణము రెండవ యింటిలో "చా" ఆరగించు చున్న యువతి టీకప్పులో పడును. ఆసుపత్రిలలోని రోగులపుండ్లపై వాలివాలి అక్కడినుండి అదేపనిగా ప్రయాణముచేసి సమీపములో నున్న పాఠశాలలోని అమాయికబాలురపై వాలును. వీధిలో బిచ్చ మెత్తుకొను కుష్ఠరోగిపై వాలి మరుక్షణము కలలుకాంచు తొట్లిలోని శిశువు పెదవులపై వాలును. పాయఖానా దొడ్డిలోని మలముపై స్వేచ్ఛగా త్రొక్కులాడి దేవునింటిలో దేవరకు పెట్టిన నైవేద్యముపై కాళ్లైనన కడుగుకొనక అట్లే వాలి అపచారము చేయును. మన సనాతనులు అంటరానివారు తాము ఆరగించేటప్పుడు చూచితే చీదరించు కొని అన్నమును పారవేయుదురు. కాని రోగులపై మలముపై శవములపై వాలివచ్చిన ఈగలు తమ అన్నముపై ఎన్నివాలినను లెక్క పెట్టరు. క్షయరోగి దగ్గి గళ్లను నేలపై ఉమ్మివేస్తే ఈగలు దానిపై వాలి క్షయక్రిములను తమకాళ్ళకంటించుకొని ఆరోగ్యవంతుల ఆహారాలపై వదలినచో వారికి క్షయరాగలదు. ప్లేగుజ్వరాలవారి మలముపైన వాలిన ఈగలవల్ల ఇతరుల కాజ్వరాలు వ్యాపించును. కలరా వచ్చిన వారి వాంతులపై మలముపై వాలిన ఈగలవల్లనే ఇతరులకు కలరా వ్యాపించును. కావున ఈగలే నిజమైన అంటరాని వర్గమని మనమందర మున్ను గ్రహించవలెను. ఈగలను నిర్మూలించుటకై వాటిని చంపు చుండవలెను. "అహింసా పరమోధర్మః" అని పఠించి ఊరకుంటే ఈగల కాసంగతి తెలియదు. అవి మనపై కనికరించవు. మనలను చంపు టకు అవి సర్వదా ప్రయత్నము చేయుచుండును అన్నది మరచి పోగూడదు,

ఈగలను చంపదలచినవారు ఫర్మాల్ డెహైడ్ (Farmal dehyde) అను విషమును మందుల అంగడిలో కొనవలెను. ఒక గిన్నెడు నీళ్లలో ఒక చెంచెడు ఫర్మాల్ డెహైడ్‌ను వేసి కలిపి అందు చక్కెర మరింత కలిపి ఒకతట్టలో పోసియుంచిన ఈగలు తీపికై వచ్చి దానిని త్రాగి చచ్చును. పొటాష్ బైక్రోమేట్ (B'chromate of potash) అనునది కూడా నీటిలో కలిపిపెట్టితే ఈగలను చంపును. ఈ రెండును చాలా చౌకమందులు. లేదా సరచ్చును దంచి అందు బెల్లమువేసి ఉడికించి లావు కాగిదముపై పూసి పెట్టవలెను. ఈగలు దానిపై వాలితే కాళ్ళు అందే అంటుకొని పోవునంత జిగటగా కాచవలెను. మురిగినపండ్లు తిన రాదు. మంచిపండ్లను కొని వాటిని బాగా కడిగి తినవలెను. అంగళ్ళ లోని మిఠాయిపై వేల యీగలు వాలియుండును కావున వాటిని కొన కుము. ఇంటిచుట్టును పెంటలు మురికి లేకుండా శుభ్రముగా నుంచుము. ఈగలు మన ప్రబల హంతకులని సదా జ్ఞాపక ముంచుకొనుము.

మన పల్లెజనులు క్రిములను గురించి బాగాఎరిగి యుండవలెను. తెలిసేరీతిగా చెప్పినను వారు వినరు. అంతటి మూఢత్వము వారిలో ఉన్నది. క్రిములు గాలి నీరు తిండి ద్వారా శరీరములో వ్యాపించును. కలరా ప్లేగుక్రిములు, దోమలు, మిన్నల్లులు అనే పురుగులు కరుచుట చేత క్రిములు రక్తములో వ్యాపించును. క్రిములు శరీరములో చేరినం తనే కోట్లకొలదిగా వృద్ధిపొంది ప్రాణులను హింసించును. బఱ్ఱెలు, ఆవులు రోగాలతో నుండిన వాటిపాలను త్రాగినవారికి క్షయవంటి రోగాలు వచ్చును. మన దేశములో పాలుపిండువారు పాత్రలు సరిగా కడుగక పొదుగులు బాగాకడుగక పాలు పితుకుదురు. అట్టిపాలనుపచ్చివి గా త్రాగితే రోగాలు వచ్చును. బాగా మూడుపొంగులు వచ్చువరకు కాచి త్రాగితే అపాయ ముండదు.

పైన తెలిపిన అంటురోగాలు రాకుండా రక్షించు కొనవలె నంటే మన మీక్రింది విధులను అనుసరించవలెను.

౧. ప్రతిదినము శరీరాన్ని బాగారుద్దుకొని స్నానముచేసి బట్టలను శుభ్రముగా ఉదికి కట్టుకొనవలెను.

౨. ప్రతిదినము ఇంటినేకాక అన్నిమూలలను, ఇంటిచుట్టునూ శుభ్రముగా ఊడ్పించి, నీరు చల్లించి కడిగించవలెను. వీధులను ఊడ్పించవలెను. పల్లెలలో ఇండ్లముందో వెనుకనో పిల్లలు మలమూత్రాలు వదలుదురు. వీధిలోని మురికిఅంతా గాలిలోలేచి ఇండ్లలోనికి వచ్చును.

3. ఇండ్లకు పెద్ద వాకిండ్లు, పెద్ద కిటికీలు ఉండవలెను. పూర్వకాలపు చతుశ్శాలాభవంతులు చాలామంచివి. ఇంటిలోనికి వెలుతురు, గాలి, ఎండ బాగారావలెను. పూర్వము హిందువులు నిత్యహోమము చేసేవారు. దానివల్ల సుగంధ ద్రవ్యాల పొగ ఇల్లంతా వ్యాపించి గాలిలోని క్రిములను చంపుచుండెను. ఇప్పుడా యాచారము పోయినది. చీకటి గదులలో క్రిములు, దోమలు, కొల్లలుగా వృద్ధియై రోగాలు తెచ్చును. ముఖ్యముగా క్షయరోగాలకు చీకటిగదులు చాలా అనుకూలస్థలాలు. ఇండ్లు శుభ్రముగా ఉండిన ఈగ లుండవు. ఈగలు లేకుంటే చాలా రోగాలుండవు. ఈగలు పెంటలపై మలమూత్రాలపై రోగుల చీమురక్తములపై వాలినప్పుడు వాటికాళ్ళకు రోగక్రిము లంటుకొనును. ఆకాళ్ళతో ఆ యీగలు తినే ఆహారముపై ఆగినచో ఆ క్రిములు ఆహారమునందు వ్యాపించు కావున తినే ఆహారాన్ని కూరగాయలను మూసియుంచవలెను.

౪. ఎప్పటికిన్ని దోమ తెరలను మంచాలకు కట్టుకొని అందు పరుండవలెను. మన ధనికులు ఎన్నోవ్యయాలు చేస్తారు. కాని దోమ తెరలపై శ్రద్ధ వారికుండదు. బీదలు కల్లుసారాలకై నెలకు ఒక్కొక్కడు ౧౫ రూపాయిలైనా తగుల బెట్టుదురు. కాని

దోమ తెరలు కొనేదానికి పైకం లేదందురు. చలిజ్వరాలు వస్తే బీదలకు కూలి నష్టమేకాక వైద్యునికి మందుల కిచ్చే ద్రవ్య నష్టము కూడా కలుగును.

౫. అమ్మ (స్ఫోటకం) రాకుండా పిల్లలకు టీకాలు తీయించవలెను. తల్లులకు టీకాల లాభము తెలియక, టీకాలు తీయించక పిల్లలను కోలుపోయి దుఃఖిస్తూ ఉంటారు.

౬. ఎండ చాలా ఉపకారి. ఎండలో ధాన్యము నెరిపి ఉంచితే అందలి పురుగులు చచ్చునని రైతులకంతా తెలియును. అట్లే తమ పడకలను, బట్టలను, మంచములను పలుమారు ఎండలో వేయుట మంచిది.

౭. అంటురోగాలుకల రోగులవద్దకు వెళ్ళితే తాము తొడిగిన బట్టలను తడిపివేయవలెను. రోగుల నంటితే సబ్బుతో చేతులు కడుగుకోవలెను. అంటురోగాలు కల యిండ్లలో రోగుల మలమూత్రాలను నిర్లక్ష్యముగా దొడ్లో, వీధిలో, పెంటలో పారవేయరాదు. రోగుల మలమూత్రాలను పారవేసి వాటిపై బూడిద మన్ను కప్పి రావలెను. అట్టి పాత్రలను బాగా కడుగవలెను. రోగులవద్ద నున్నవారు, మలమూత్రా లెత్తినవారు చేతులను సబ్బుతో కడుగుకోవలెను. రోగుల బట్టలను సలసల క్రాగు నీటిలో ముంచి తర్వాత ఉదుకవలెను. ఇంటిలోని యితరులను రోగులవద్దకు పోనీయరాదు. ముఖ్యముగా పిల్లలను దూరముగా ఉంచవలెను. రోగికి గదిని శుభ్రముగాచేసి ప్రత్యేకించి యుంచవలెను.

౮. మనము త్రాగేనీరు చేదబావులదిగా నుండవలెను. ఆ నీటిని కూడ సలసలకాచి చల్లార్చి వడగట్టి త్రాగవలెను. ఈ చిన్న శ్రమ కోర్వక చాలామంది రోగాలు తెచ్చుకొంటారు.

ఊరబావులలో సున్నము ఆరునెలల కొకమారు బాగా కలిపించ వలెను. తాలూకా డాక్టరుకు వ్రాస్తే పొటాసియం పర్మాంగనేట్ అనే మందును పంపును దానిని బావిలో కలుపవలెను. ఫినైల్ అనునది దుకాణాలలో దొరకును. దానిని కొని ఒకటికి ఇంచుమించు ౧౦ అంతల నీరుకలిపి గదులను కడిగించి మురికికాలువలు కడిగించి మలమూత్రి విసర్జనస్థలాలను కడిగించ వలెను. సాంబ్రాణి, గుగ్గిలం పొగను గదులు మూసి నింపి ౧౦ నిముషాలు గదులు మూసి యుంచవలెను. మురికి గుంటలలో కాలువలలో దోమలు గుడ్లుపెట్టును. కాని అట్టిచోట కిరొసిన్‌నూనె చల్లవలెను. మన యిండ్లలోని అంట్లను తోమిన తర్వాత వాటికిని పర్మాంగనేట్ ఆఫ్ పొటాషును నీళ్ళలో కలిపి వాటితో కడుగవలెను.

ఈవిధముగా పై ఎనిమిది విధులను శ్రద్ధచేసి అనుసరించిన మనకు పిల్లలకు చాలా బాధలు అపాయాలు తప్పిపోవును.

మనము నివసించు ఇండ్లు సరియైనవి కావు. పెట్టెలవలె బిగించి గోడలలో కిటికీలు లేక, ఉండినను చిన్నవిగానుండి గోడలు ఎత్తులేక, మట్టి గోడలు కలవై, అందము చందములేనివై, మోటువై యుండును. ధనికులుకూడా పల్లెలలో మంచియిండ్లు కట్టరు. కట్టినవారు వాటిని శుభ్రముగా నుంచరు. కర్నాటక ప్రాంతాలలోను, కొన్ని తెలంగాణా ప్రాంతాలలోను పశువులను ఇండ్లలోనే కట్టివేసి వాటితోపాటిగా ఇంటివారు నివాసము చేయుచుందురు. ఈ విధానాలన్నీ మారవలెను. ఎత్తయిన స్థలాలు, తంపులేని స్థలాలలో ఇండ్లు కట్టవలెను. ఇండ్లను ఉత్తరదక్షిణ ముఖాలుగా కట్టవలెను. తూర్పుపడమరగా ముఖాలుచేసే ఇండ్లలో ఎదురెండలవలన బాధ కలుగును. ఇండ్లలో ఎలుకలు కొక్కులు ఉండకుండునట్లుగా నేల కప్పు మంచిగా కట్టవలెను. గోడలకు గచ్చువేయవలెను. వంటశాల స్నానముగది, సామానుగది, భోజనశాల ఇవన్ని ఇంటి వెనుక భాగములో నుంచ వలెను. అందు పెరడు ఉండవలెను.

పాయఖాన అందు వంటగదికి భోజనంగదికి దూరముగా నుండవలెను. పండుకొను గదులు, వరండాలు, చదివే గదులు, స్నేహితులతో కూర్చును గదులు, స్త్రీలగదులు ఇంటి ముందుభాగములో నుండవలెను. ఇండ్లకు మంచి ఇంజనీయర్లతో ప్లానులు వేయించుకొని కట్టవలెను.

ఇండ్లను శుభ్రముగా నుంచుట మున్నగు విషయాలను డొమెస్టిక్ సైన్సు పుస్తకాలలో చదువుకొన వలెను.

## మనిషి విలువ

పశువులు చస్తే వాటిమాంసము విక్రయమగును. వాటి తోళ్లనుండి కొమ్ములనుండి ఎన్నో వస్తువులు చేయుదురు. మనిషి తాను జీవసృష్టిలోనెల్ల నుత్తముడని గర్వించును, కాని మనిషి చనిపోతే వాని శవము ౧౦రూ॥ల విలువకూడా చేయదు. శరీరములోనూటికి ౫౯పాళ్లు నీరుండును. మిగత భాగానికి ఒక శాస్త్రవేత్త ఇట్లా విలువ కట్టినాడు. మనిషిలోని కొవ్వునుండి ఏడు సబ్బుబిళ్ళలు చేయవచ్చును. శరీరములోని నీరు ౧౦ గ్యాలనుల పీపాకు సరిపోవును. గంధకద్రవ్యము ఒక చిన్న గోలీల సీసాకు సరిపోవును. లోహద్రవ్యము ఒక రెండంగుళాల చీలకు సరిపోవును. కర్బనము ౯౦౦౦ పెన్సళ్ళకు సరిపోవును. సున్నపుద్రవ్యము ఒక కోళ్ళగూటికి సున్నము వేయదగినంత దొరుకును. భాస్వరము ౨౨౦౦ అగ్గిపుల్లలకు సరిపోవును. ఇంతే. అంతాకలిసి పదిరూపాయిలకు చెల్లిపోవును.

## దీర్ఘాయుష్య నియమములు

అమెరికాలోని ప్రసిద్ధ వైద్యు లీ క్రింది దీర్ఘాయుష్య నియమములను ప్రకటించినారు.

౧. నీ గదులన్నింటిలో బాగా వెలుతురు గాలి వచ్చునట్లు చూచుకొనుము.

౨. నిర్మల ప్రదేశములలో తిరిగి వ్యాయామము చేయుము.
3. వీలైనంతవరకు వరాండాలలో పరుండుము.
౪. దీర్ఘముగా ఊపిరి పీల్చుము.
౫. మితిమీరి తినవద్దు.
౬. మాంసములను, మసాలాపాకములను అరుదుగా వాడవలెను.
౭. తిన్నగా తిని బాగా నమిలి మ్రింగుము.
౮. ప్రతిదినము మలబద్ధకము లేకుండా ప్రవర్తి కావలెను.
౯. వంపులేకుండా చక్కగా నిలువుము, కూర్చునుము, నడువుము.
౧౦. దంతములు, నాలుక, శుభ్రముగా నుండునట్లు రుద్ది కడుగుము.
౧౧. విషయుక్తములైన వానిని లేక రోగములు కలిగించు క్రిములను శరీరమందు ప్రవేశించకుండా జాగ్రత్తగా నుండుము.
౧౨. అత్యధికముగా కష్టించకుము. అలసినప్పుడు అలసట తీర్చుకొనుము. దినము ౭ నుండి ౯ గంటలవరకు నిద్రపొమ్ము.
౧3. కోపతాపాలు వర్జించుకొని శాంతచిత్తతలో నుండుము.

## ఉచితముగా సేవించే వైద్యులు.

ఆరుగురు వైద్యులు నీ సేవలో సదాసిద్ధులై యున్నారు.

సూర్యకాంతి, నీరు, విరామము, గాలి, వ్యాయామము, సరియగు ఆహారము. ఈ ఆర్గురు నీవు పిలిచీ పిలువకమునుపే సుముఖులై నీ సేవలో నుందురు. నీరోగాలను వారు బాగు పరుతురు. నీ విచారములను పోగొట్టుదురు. నీసేవచేసియు ఒకదమ్మిడీ కూడా తీసుకొనరు —
(ఒక ఇంగ్లీషు పద్యభావము.)

తూకము లీ క్రిందివిధముగా అర్థము చేసుకొనవలెను.

| | | |
|---|---|---|
| ౨ ఔన్సులు | = | ౧ చటాకు. |
| ౨ పౌనులు | = | ౧ తూకముసేరు. |
| ౧౦ పౌనులు | = | ౪౫౩౬ గ్రాములు (గుంజలు) |
| ౧౦ తులములు | = | ౧౧౪ గ్రాములు. |

## ఆరోగ్యమును గూర్చిన సామెతలు

ఒక సంవత్సరానికి ప్రణాళిక వేయదలచితే ధాన్యము నాటుము. పదేండ్లకు ప్రణాళిక వేయదలచితే చెట్లను నాటుము. నూరేండ్లకు ప్రణాళికను వేయదలచితే మనుష్యులను నాటుము.

— చీనా సామెత.

దశమాతా హరీతకీ. (కరకకాయ పదితల్లులంతటిది)

వెలుతురును ఇంటిలోనికి రానీయకుంటే డాక్టరును రానీయ వలసి వచ్చును.

జీవించుటకై తినుము. తినుటకై జీవించకుము.

పరిశుభ్రత దేవత్వమునకు తర్వాతిది.

ఈగలను మనము చంపకుంటే అవి మనల చంపును.

"ధర్మార్థ కామమోక్షాణాం ఆరోగ్యం మూలకారణం"

"సర్వమన్యత్పరిత్యజ్య శరీరమను పాలయేత్"

రోగి పరిసరాల కపకారి (అతని జాడ్య మితరుల కంటునుకాన)

## ఆరోగ్యవిధులను గురించి చదువదగిన గ్రంథాలు

౧. మహాత్మాగాంధీగారు — ఆరోగ్యమార్గము.

౨. A health reader P. C. Wren.

౩. Food.

౪. Home & village doctor S. C. Das gupta.

౫. చలిజ్వరము } విజ్ఞానచంద్రికా మండలి

౬. కలరా }

౭. చంటిబిడ్డ } టి. వరలక్ష్మమ్మగారు హైదారాబాద్

౮. శిశురక్షణ }

౯. ప్రసూతి — శిశుపోషణ. కొమర్రాజు అచ్చమాంబగారు బెజవాడ.
౧౦. మద్రాసు క్రిస్టియన్ లిటరేచర్ సొసైటీవారి ఈగ, దోమ, మున్నగు తెనుగు లఘుపుస్తకాలు.
౧౧. Nuitrition numerous bulletins published by the Department of food Government of Inndia. New Delhi.
౧౨. Domestic science. M s. Hannahsen (Longmans Green & co)
౧3. Health and longevity by Selmon.

ఈ గ్రంథమును తెనుగులోకూడా ప్రకటించినామని ఈ క్రింది విలాసమువారు తెలిపినారు.

(ఓరియంటల్ వాచ్మన్ పబ్లిషింగ్ హౌస్. సాలిస్బరీ పార్క్, పూనా.)



# యువజన విజ్ఞానము

## ౧౦ వ ప్రకరణము

---

## ప్రపంచ మహనీయులు

"మహాజనో యేనగతః సపంథాః"

నాలందా విద్యాపీఠముయొక్క ఆదర్శములలో నొకటి

"క్రోధమును క్షమచే జయించుము"
"దుర్మార్గుని సత్కర్మలచే జయించుము"
"లోభికి దానమిచ్చి జయించుము"
"అసత్యవాదిని సత్యముచే జయించుము."

చను వారెల్లను జనులం ।
జనిపోయిన వారి పుణ్యసత్కథ లెల్లన్ ।
వినవలె, కనవలె, మనవలె ।
అనిమిషులకు దెల్పగూడ దంత్యము వేమా॥

యద్యదాచరతి శ్రేష్ఠః
తత్తదేవేతరో జనః
సయత్ ప్రమాణం కురుతే
లోకస్తదను వర్తతే॥ శ్రీమద్భగవద్గీత.

"Lives of great men all remind us
We can make our lives sublime
And departing, leave behind us
Foot prints on the sands of time"

Long fellow
psolm of life.

# మహనీయుల చరిత్ర

ప్రపంచములో సర్వకాలములందు తమ ధైర్యశౌర్యములచేత, ధార్మికతచేత, మతబోధచేత, కవితచేత, నూతన వస్తునిర్మాణ పరిశోధనలచేత, ప్రఖ్యాతులైన వారినిగూర్చి మనము తెలుసుకొనుట అవసరము. మనకు దొరికిన ౬౦౦౦ ఏండ్ల ప్రపంచ చరిత్రలో వేలకొలది మహానుభావులు పుట్టి లోకమందు తమ పేర్లను నిలిపిపోయిరి. వారందరిని గురించి వ్రాయుట కిందు వీలుండదు. కాన గతకాలపు కొందరి మహనీయులను గూర్చి మాత్రమే ఇందు చాలా సంగ్రహముగా సూచించినాము. ప్రతివారి చరిత్ర తుదిలో తెలిసినంతవరకు వారిని గూర్చిన సమగ్రచరిత్రను సూచించినాము. తెనుగులో ఉండు వాటికడ ( తె ) అని వ్రాయుదుము. తెనుగులో దొరకక ఇంగ్లీషులో దొరికిన (ఇ)అని వ్రాయుదుము.

ఇందు అంకెలన్న క్రీస్తు తర్వాతికాలమని గ్రహించవలెను. క్రీస్తునకు పూర్వకాలమును తెలుపుచోట మాత్రము క్రీ. పూ. అని వ్రాయుదుము. హిందూస్థాన చరిత్రలో అలెగ్జాండరు, శివాజీ, అక్బరు, అశోకుడువంటివారి విషయాలు విపులముగా వచ్చినందున వారినిగూర్చి పేర్కొనలేదు.

మరియు సమకాలికులగు ఆధునికులను గూర్చి యిందు వ్రాయ లేదు.

## శంకరాచార్యులు

దక్షిణహిందూ దేశములో హిందూమతమునకు సేవచేసినవారు ముగ్గురు ఆచార్యులు, వారిలో శంకరాచార్యులు మొదటివారు. అతడు ౭౮౮ లో జన్మించెను. ౧౬ ఏండ్లవరకే అన్ని శాస్త్రలను గోవింద భట్టు అను గురువులవద్ద నేర్చి సన్యాసము పుచ్చుకొనెను. అతడు తిరు వాన్కూరు సంస్థానములోని కొట్టయ్యంజిల్లాలో కాలడి అనే గ్రామము లోపుట్టెను.తండ్రి పేరు శివగురువు. తల్లిపేరు ఆర్యాంబ. హిమాలయము నుండి కన్యాకుమారివరకు గుజరాతు మొదలుకొని పూరీవరకు నాలుగు మూలలా తిరిగి జైనబౌద్ధాల నోడించి వైదికమతాన్ని బలపరిచెను. భగవద్గీతకు, దశోపనిషత్తులకు, బ్రహ్మసూత్రాలకు భాష్యము వ్రాసెను. శతాధిక గ్రంథాలను రచించెను. బదరీ కేదారములో, శృంగేరిలో, జగ న్నాథములో, ద్వారకలో నాలుగు మఠాలను స్థాపించెను. వీరి సిద్ధాం తము అద్వైతసిద్ధాంతము. పరమాత్మలోని అంశయే జీవాత్మ. ఉత్తమ జీవులు పరమాత్మలో లీన మగుదురు. జ్ఞానమే ముక్తికి ప్రధానమని వారు బోధించిరి. వారు 3౨ ఏండ్ల వయసులోనే చనిపోయి రందురు. వారి మతానుయాయులను స్మార్తులని యందురు. ఇట్టి మహాత్ముడు ప్రపంచములో పుట్టలేదు ఇక పుట్టడు. అని మాక్సుమూలర్ అను జర్మను పండితుడు వ్రాసెను. (చూ. శంకరచరిత్ర, తెనుగులో కొన్నిగలవు.)

## రామానుజాచార్యులు (౧౦3౭—౧౧3౭)

శ్రీమద్రామానుజాచార్యులు క్రీ.శ. ౧౦3౭లో జన్మించి నూరుసంవత్స రములు జీవించిరి. వారి తండ్రి కేశవభట్టు, తల్లి కాంతిమతీదేవి. అతడు మద్రాసునగర సమీపమందుండు శ్రీ పెరుంబుదూరను గ్రామమందు

జన్మించెను. అతడాంధ్రుడని ఇటీవల శ్రీ గొట్టుముక్కల రమాకాంతాచార్యులుగారు పరిశోధించి సకారణముగా నిరూపించినారు. చిన్నతనమందతడు కంచినగరములో యాదవప్రకాశుడు అను గురువునొద్ద విద్యాభ్యాసము చేసెను. గురువునుమించిన శిష్యుడగుటచే గురువునకు ఈర్ష్య కలిగి శిష్యుని చంపింప ప్రయత్నము చేసెననియు, కాని రామానుజులవారు దైవసహాయముతో దానినుండి తప్పించుకొనె ననియు చెప్పుదురు. అతడు తన ౩౦ వ ఏటనే సన్యసించెను. భగవద్గీతపైన, బ్రహ్మసూత్రములపైన అతడు భాష్యము వ్రాసెను. శ్రీవైష్ణవ సిద్ధాంతానుసారముగా విశిష్టాద్వైతమును సమర్థించుచు అతడు భాష్యము వ్రాసెను. భక్తివల్లనే ముక్తి కలుగునని వారిమతము. జీవాత్మలు ముక్తిదశలో పరమాత్మలో లీనమగునని అద్వైతులనిరి. అటుకాదు జీవాత్మలు భగవత్సన్నిధిలో సూక్ష్మరూపముతో నిత్యానందముతో ఉండునని విశిష్టాద్వైతము బోధించెను. రామానుజులు సన్యాసియైన తర్వాత శ్రీవైష్ణవ మతవ్యాప్తికై ఆంధ్రదేశము మొదలుకొని కన్యాకుమారి వరకుండు దేశాలలో ప్రచారము చేసిరి. అతని వెంట ౧౨౦౦౦ శిష్యులును ౭౦౦ వైష్ణవ సన్న్యాసులును ౭౪ భక్తులును ఉండెడివారని యందురు. తమిళదేశములోని కుళోత్తుంగరాజు శైవుడై వైష్ణవులను కష్టపెట్టి చాలా హింసించెను. రామానుజాచార్యులు అతని రాజ్యమునుండి వెళ్ళిపోవలసి వచ్చెను. అప్పుడతడు మైసూరులోని బల్లాళరాజు నాశ్రయించెను. తమిళరాజులు హింసించేకొలది శ్రీవైష్ణవమతము వ్యాప్తి నొందుచుండెను. దానికి ముఖ్యకారకులు శ్రీమద్రామానుజుల వారే! రామానుజుల కాలమునుండియే తెనుగుదేశములో వైష్ణవము ప్రబలమయ్యెను. ఆ కాలములో శైవమతమువారు కులకట్టుబాట్లను ధ్వంసముచేసి శూద్రులను పూర్తిగా ఆకర్షించిరి. రామానుజులును అదే విధానమవలంబించి సమాశ్రయణ మందిన వారందరును సమానులే యనియు శ్రీవైష్ణవమందు కులతత్త్వాలకు తావులేదనియు బోధించిరి. తమ గురువులు మోక్షసాధకమగు తిరుమంత్రమును బోధించి ఇతరులకు చెప్పితే

నరకానికి పోదు వనగా అతడు శ్రీరంగగోపుర మెక్కి అందరికిని ఆ మంత్రాన్ని బోధించి అంతమంది స్వర్గానికిపోయిన గుర్వాజ్ఞోల్లంఘనముచే తానొకడు నరకానికి వెళ్ళుటకు భయము లేదనెను. అతడు ప్రతిదినము కావేరీస్నానముచేసి మల్లుజను అంటరానివాని బుజముపై ఊరి దేవాలయమునకు వెళ్లెడివాడు. భక్తులలో నీచోచ్చతలను అతడు పాటింపలేదు. రామానుజులు శైవులను వైష్ణవులైనరాజులచే హింసింపజేసె నందురు. అందెంత సత్యమున్నదో తెలియదు. అతడు తన తుదికాలమందు ౧౦ ఏండ్లపాటు శ్రీరంగమందే నివాసముచేసెను.

## ఆర్కిమిడీస్ (ARCHIMEDES)

ఇతడు క్రీ. పూ. ౨౮౭ ప్రాంతమున ఇటలీకి దక్షిణమున ఉన్న సిసిలీ అనే ద్వీపములోనిసైరాక్యూజ్ అనే నగరములో జన్మించిన గ్రీకు జాతివాడు. ఆకాలములో అతనిని మించిన గణితశాస్త్రవేత్త, యంత్రశాస్త్రవేత్త మరొకడు లేకుండెను. సదా శాస్త్రధ్యాననిమగ్నుడై యుండేవాడు. సిసిలీరాజు కిరీటమును చేసిన కమసాలి బంగారములో వేరులోహమును కలిపెనని రాజు కనుమానము కలిగెను. కాని దానిని గుర్తుపట్టుట ఆ కాలమందు కష్టమైయుండెను. ఆర్కిమిడీసును విచారించగా అతడు చాలాదినాలు అదే ఆలోచనలో నుండెను. ఒకనాడు చెరువుకిరింది తొట్టిలో నీరు వదలి అందు దిగంబరుడై స్నానము చేస్తుండగా నీటిలో వేసిన వస్తువులు ఎంతనీటిని తొలగించునో అంత మేరకు తమ బరువును పోనాడుకొనును అను సిద్ధాంతమును గుర్తించి అదే ఆనందముతో వివస్త్రుడై వీధులగుండా పరుగెత్తుతూ యూరకా! యూరకా!! (ఎరుక అయ్యెను ఎరుక అయ్యెను) అని గ్రీకుభాషలో రంతులుపెట్టెను. అతడు చాలా యంత్రాలను కనిపెట్టెను. "నాకు ఒక లివర్‌ను (లివను కలిగించునది) నిలుచుటకు భూమండలము బయట స్థలమును ఇస్తే భూమండలాన్ని ఎత్తివేస్తాను" అని అనేవాడట. ఇతడు చాలా శాస్త్ర (సైన్సు) గ్రంథాలు వ్రాసెను. రోమువారు

పై రాకాన్యాసు ముట్టడి వేయగా ఇతడు తన యంత్రాలతో వారి ఓడలను ముంచెను. రోము సిపాయీలు అతని పేరు చెప్పితే వణికేవారు. మూడేండ్లు ముట్టడి వేసి తర్వాత ద్రోహుల సహాయంతో నగరాన్ని గెలిచిరి. ఒక సిపాయి ఆర్కిమిడీసును తన సేనాని పిలిచెనని పిలువగా రేఖా గణిత రేఖలు గని ఆలోచనలో వున్న అతడు పలుకలేదు. సిపాయికి కోపమువచ్చి తల తెగవేసెను. (౧౦౦ మహనీయులచరిత్ర ౩)

One hundred great lives (Times of India)

## గాలిలియో
(౧౫౬౪–౧౬౪౨)

ఇతడు ఇటలీలోని పైసాపట్టణములో జన్మించెను. ఇతడు భౌతిక శాస్త్రాలలో గొప్ప పరిశ్రమచేసెను. చాలా క్రొత్తవిషయాలు కనిపెట్టెను. నక్షత్రశాస్త్రములో అపూర్వమగు ప్రజ్ఞను ప్రకటించెను. దూరదర్శినీ యంత్రమును (టెలిస్కోపును) కనిపెట్టెను. ఆ యంత్రముతో ఖగోళములోని క్రొత్త క్రొత్త ముచ్చట్లను ప్రకటించి ప్రపంచాన్ని ఆశ్చర్యములోముంచెను. క్రైస్తవుల పవిత్ర బైబిల్ మతగ్రంథములో భూమి అచలమనీ దానిచుట్టూ సూర్యుడు తిరుగునన్ని వ్రాసిరి. గాలిలియో భూమే సూర్యునిచుట్టు తిరుగునని వ్రాసెను. క్రైస్తవ మతపీఠానికి పట్టరాని కోపము వచ్చెను. రోములో అతనిని విచారించి అతడు మతాపచారము చేసెననియు క్షమాపణ కోరవలెననియు తీర్పు చెప్పిరి. "చిత్తము నాదితప్పే క్షమించండి" అని చెప్పి కోర్టు బయట వెళ్ళుతూ "ఏమన్నా సరే! భూమి తిరుగుతూనే వుంది" అనుకుంటూ వెళ్ళిపోయెను. తర్వాత అతని బిడ్డ చచ్చెను. అతడున్నూ గ్రుడ్డివాడయ్యెను. అక్కడికిన్నీ తన పరిశోధనలు మానలేదు. తన శిష్యులతో తన నూతన సిద్ధాంతాలను పరీక్షింపజేసి వ్రాయించుచుతూ ఉండెను. అతడు చంద్రునిలో పర్వతాలున్నవని కనిపెట్టెను. క్రొత్త నక్షత్రాలజాడ మొదట చూపించిన దతడే. సూర్యునిలో మచ్చలున్నవని చెప్పినదతడే. ఇట్టి వెన్నియో కనిపెట్టెను.

(౧౦౦ మహనీయుల చరిత్ర ౩)

## ఆర్యభట

ఇతడు క్రీ.శ. ౫౦౦ సంవత్సరప్రాంతమందుండిన హిందూ భౌతిక శాస్త్రపరిశోధకుడు. గాలిలియోకంటే ౧౦౦౦ ఏండ్లు ముందుండినవాడు. ఇతడు వెదురులొట్టలలో అద్దాలుపెట్టి సూర్యాది గ్రహాలను నక్షత్రాలను చూచి భూమికి సూర్యునికి ఉండుదూరము సూర్యచంద్రుల వైశాల్యము మున్నగు నక్షత్రశాస్త్రవిశేషాలు సరిగా వ్రాసెను. ఈనాడు యంత్రాలతో కనిపెట్టినవారు ఆర్యభట సిద్ధాంతాలనే చెప్పుతున్నారు. గాలిలియోను పొగిడే తెల్లవారికి ఆర్యభటుడు కానరాడు. అతని సూర్యసిద్ధాంతమను గ్రంథము చాలా గొప్ప జ్యోతిశ్శాస్త్ర గ్రంథము. అతడు గుప్తరాజుల కాలమువాడనియు చంద్రగుప్త విక్రమాదిత్యుని కాలమువాడనియు అందురు. అతనికించుక తర్వాతివాడగు బ్రహ్మగుప్తుడు భూమండలములో సకల వస్తువులు భూమిపైపడును, అది ప్రకృతి ధర్మము అని నిరూపించెను. దానిని ౧౦౦౦ ఏండ్ల తర్వాత సర్ ఐజక్ న్యూటన్ అను ఇంగ్లీషువాడు ఆకర్షణ న్యాయము (Law of Gravitation) అని వ్రాయగా అతడెంతో అద్భుత శాస్త్రవేత్తయని పొగడిరి. కాని బ్రహ్మగుప్తుని పేరు ఎవరున్నూ స్మరించరు.

## థామస్ అల్వా ఎడిసన్
(౧౮౪౭–౧౯౩౧)

అమెరికాలో ఓహియో మండలములోని మిలాన్‌లో ఫిబ్రవరి ౧౮౪౭లో అతడు జన్మించెను. చిన్నతనములో అతడు తరగతిలో కడపటి పిల్లవాడు. "మొద్దబ్బాయి" అని అతని పంతులు పేరుపెట్టెను. అతడు పత్రికలను రైలులో అమ్ముకుంటూ ఒక సైన్సు పరిశోధన (లేబరేటరీ)సామానునుకూడా అందుంచుకొనెను. ఒకనాడు రైలు కుదింపువల్ల తనసామానులోని భాస్వర మంటుకొని రైలుడబ్బాకుప్రమాదము కలిగెను. రైలు అధికారి ఇతని సామాను విసరివేసి చెంప వాయగొట్టెను. దానితో అతనికి యావజ్జీవము చెవుడు కలిగెను.

కొంతకాలము తర్వాత ఒక టెలిఫోన్ కచ్చేరీలో పనికి చేరెను. కాని అది సరిపడక దమ్మిడీకూడా లేనివాడై న్యూయార్కు నగరము చేరెను. కాని తన శక్తిని ప్రకటించి క్రొత్త పనిముట్లను కనిపెట్టి వాటినుండి గొప్ప ధనికుడయ్యెను. ఆతడు విద్యుత్స్విచ్చులను, టెలిఫోనులను, గ్రామఫోనులను, మూవీఫిల్ములను ఇంకను చాలా చాలా వస్తువులను కనిపెట్టెను. ఆతనిని గారడీవాడు అని పిలిచిరి. అమెరికా యూరోపు ఖండములలోని నానా దేశాలవారు ఇతనిని గౌరవించి బిరుదులను, సన్మానములను సమర్పించిరి. అతడు ౧౧౦౦ క్రొత్త విషయాలను కనిపెట్టి వాటిని ఇతరులు సిద్ధముచేయకుండా "పేటెంటు" చేయించుకొన్నాడనిన అతనికన్న మించిన సైన్సువేత్త లేడని చెప్పవచ్చును. అతని యుపజ్ఞ సకల మానవలోకానికి ఉపకారియైనది. అతడు ౧౮ అక్టోబరు ౧౯౩౧లో ౮౪ ఏండ్ల వయస్సులో చనిపోయెను.

## సాక్రటీస్

(క్రీ. పూ. ౪౬౯—౩౯౯)

ఇతడు మన వేమనవంటి మహాబోధకుడు, జ్ఞాని. ఇతని శిష్యులు ప్లేటో, అరిస్టాటల్ ప్రభృతులు గురువును మించిన విజ్ఞులు. గ్రీకు దేశపు ముఖ్యపట్టణమగు ఏథెన్సులో జన్మించెను. తండ్రి ఒక శిలాశిల్పి. తల్లి మంత్రసాని. అందుచే తాను మంత్రశిల్పి యయ్యెను. ఆ కాలములో గ్రీకులంతా భటులై యుండెడివారు. ఇతడున్నూ చాలా యుద్ధాలలో మహాయోధుడన్న ఖ్యాతిని గాంచెను. తన జీవితమంతా చర్చలోనే గడిపెను. ఆతడు వ్రాసినదేదీ లేదు. ఆతడెల్లప్పుడూ మాట్లాడుతూ చర్చిస్తూ బోధించేవాడు. తన తత్వానికి తగినట్లు చలికాలములోకూడా అంగీ తొడుగకుండెను. కాళ్ళకు చెప్పులు లేకుండెను. దినం వీధులలో రచ్చకట్టులపై కూర్చుని జనులతో చర్చించేవాడు. ప్రభుత్వ మన్యాయం చేయమంటే చేయకపోయెను. ఆతనిని చంపుటకు ప్రభుత్వం ప్రయత్నించేయగా ప్రజలు తిరుగబడి దాన్ని అంతము చేసిరి. ఆతనికి జాంతిప అను గయ్యాళి పెండ్లాముండెను. ఒకనాడు ఆమె యెంత అరిచి

తిట్టినా సాక్రటీసు పలుకక శిష్యులతో చర్చిస్తుండెను. తుదకామె అతని నెత్తిపై ఒక కడవెడునీళ్ళు గుమ్మరించెను. "ఓహో! ఉరుమురిమి ధారావర్షము కురిసెను" అన్నాడు సాక్రటీసు నెమ్మదిగా. సాక్రటీసు ధనికులను ప్రభుత్వాన్ని ఖండించేవాడు. అతనికి వారు శత్రువులై అతడు గ్రీకు దేవతలను నిరాకరించెననియు ఎతెన్సు యువకులను తప్పుదారుల నడిపించెననియు నేరము మోపిరి. క్షమాపణను అతను కోరలేదు. వదలితే తన బోధలను మానననెను. న్యాయస్థానమువారు అతడు చావవలెను లేదా దేశత్యాగము చేయవలెను అని చెప్పిరి. గొప్ప ధనమిచ్చి తప్పించుకొనుమనిరి. ౪౦ రూకలిస్తానులే అని వెక్కిరింపుగా అనెను. తుదకు అతనికి విషము త్రాగించునట్లు తీర్పుచెప్పిరి. మూడు వారాలు సంకెళ్ళతో జెయిలులో నుంచిరి. చివరి క్షణము వరకు నవ్వుతూ ఏ చింతలేక శిష్యులతో ప్రసంగిస్తూ ఒకచేత విషం తీసుకొని త్రాగి మళ్ళి ప్రసంగిస్తూ చస్తూచస్తూ ఓ రే నేనొకచిన్నపనిని మరచితిని దానిని చేయండి అని చనిపోయెను. అతడు చావంటే అంత అవలీల అని నిరూపించెను. (౧౦౦. మ. చ.)

## హమ్మురాబీ

ఈరానుకు పశ్చిమములోని దక్షిణమెసొపొటేమియా దేశములో అతి ప్రాచీనకాలములో బాబిలోనియా 'రాజ్యముండెను. దానికి క్రీ. పూ. ౨౧౦౦లో ౪౩ ఏండ్లు హమ్మురాబీ అను ధర్మ ప్రభువు పాలించెను. అతడు శత్రువులగెల్చి విజయాలుపొంది రాజ్యాన్ని పెంచి తన ప్రజలను కన్నకుమారులవలె ప్రేమించి పాలించెను. ధర్మశాసనములను కావించి వాటిని తర్వాత కాలమున అశోకచక్రవర్తివలె రాళ్ళపై చెక్కించెను. అందలి కొన్ని నీతులిట్లుండెను. "బలవంతులు బలహీనులను కష్టపెట్టరాదు", "అనాథ స్త్రీ బాలురను రక్షించవలెను", బాధితులకు న్యాయము కలుగవలెను". అతని కాలములో చతుర్వర్ణములుండెను. న్యాయస్థానముల నేర్పాటుచేసి అందు న్యాయాధీశులను అతడు నియ

మించెను. వారుఅన్యాయపుతీర్పులనుచేసినచో వారినిశిక్షించెను. తనదే తుది అపీలుకోర్టు. హత్యానేరములో అబద్ధాలుచెప్పిన సాక్షులకు మరణ దండన విధించెను. వైవాహిక శాసనాలు కావించి భార్యాభర్తల ధర్మాలను సరిగా వ్యాపింపజేసెను. భార్యకు భర్త ఆస్తిలో భాగ మిప్పించెను. స్త్రీలపై అపనిందల వ్యాపింపజేసిన పురుషుల నొసటిపై వాతలువేయించుచుండెను. రైతులు పంటభూముల బీడుపెట్టిన శిక్షితులగుచుండిరి. శిక్షాస్మృతి మాత్రము కఠినముగా నేర్పాటు చేసెను. కన్ను పోగొట్టినవాని కన్ను తీయించెను. ఎముక విరిచిన వాని ఎముకను విరిపించెను. వైద్యులు తప్పుడువైద్యముచేసి రోగికి కష్టము కలిగించిన వైద్యులకు శిక్షయిచ్చెను. ఎక్కువ వడ్డీ తీసుకో కుండా శాసించెను. విద్యను ప్రజలకు బాగా చెప్పించెను. ఇటికెల మీద వ్రాయించి వాటిని కాల్పించుచుండిరి. అవే ఆకాలపు పుస్త కాలు. ఇటికెపలక జాబులను తీసుకొనిపోవుటకు తపాలావారి నేర్పాటు చేసెను. హమ్మురాబీ రాత్రింబగళ్లు కష్టించి ప్రజలమేలుకై పాటు బడిన ఉత్తమరాజు.

(Some makers of History. Blackie Co.)

ఇక ముందు దీని గుర్తు S. M. H.

## హన్నిబల్

ఇతడు క్రీ.పూ. ౨౪౭లో ఉత్తర ఆఫ్రికాలో ట్యూనిష్‌మండలము లోని కార్తేజిలో జన్మించెను. ఆ కాలములో కార్తేజీ నగరము గొప్ప ఖ్యాతికివచ్చియుండెను. రోమువారు కార్తేజీతో ౨౦ ఏండ్లు యుద్ధము చేసి ఓడించి తమకు లోబరుచుకొని యుండిరి. హామిల్కార్ అను నతడు హన్నిబల్ తండ్రి. అతడు స్పెయినులో రాజ్యస్థాపనచేయ ససైన్య ముగ వెళ్లుచుండగా ౯ ఏండ్ల హన్నిబల్ తండ్రివెంట పోవుటకు పోరు పెట్టెను. తండ్రి బాలుని దేవతా విగ్రహముపై చేయిపెట్టమని "నేను యావజ్జీవము రోమువారితో శత్రుత్వము సాధింతును" అని శపథము చేయించెను. నాటినుండి తన దేశస్వాతంత్ర్యమునకు రోముపై పగ సాధించుటకు ఎదురుచూస్తూ ఉండెను. అతడు పెద్దవాడై స్పెయిన్

మండలాధిపతి యయ్యెను. రోమువారి యితర ద్వీపాలను గెలిచి ఇటలీ పైననే దండయాత్రకు బయలుదేరెను. క్రీ. పూ. ౨౧౮లో ఒక లక్ష సైన్యముతో పిరనీస్ పర్వతాలను దాటి దారిలో అడ్డమువచ్చిన గాలులను జాతిని ధ్వంసముచేసి ఆల్ప్సుపర్వతాలను దాటి ఇటలీ చేరెను. మంచుతోనిండి ఎత్తయిన ఆ పర్వతాలను మళ్లీ సైన్యముతో దాటిన మహావీరుడు నెపోలియన్. ఆ పర్వతాలలోని జనులు హన్నిబల్ సైన్యముపై గుండ్లను త్రోసిరి. మంచులో గుర్రాలు, ఏనుగులు, మనుష్యులు జారి చాలామంది చచ్చిరి. అన్ని ఆటంకాలను జయించి హన్నిబల్ ఇటలీ చేరగానే అక్కడ రోమాసైన్యము తన నెదిరించెను. కాని దానిని అవలీలగా జయించెను.

తర్వాత ఇటలీలోని అపెన్నైన్ పర్వతాలలో రోము సేనానిని చంపి వాని సైన్యము సగం ధ్వంసముచేసి తర్వాత సగాన్ని ఖైదుపెట్టి రోము నగరము గడగడ వణకుచుండగా దాన్ని ముట్టడించెను. రోము వద్ద రోముయొక్క ౮౬౦౦౦ సైన్యము హన్నిబల్ యొక్క ౫౦౦౦౦ సైన్యముతో ఢీకొనెను. రోము సైన్యములో ౭౦౦౦౦ మంది చచ్చిరి. వారి సేనానులు చచ్చిరి. రోము నిరాధారయయ్యెను. హన్నిబల్ పొరపాటు చేసెను. తాను జాగుచేసి మరింత సైన్యము పంపుమని కార్తేజీకి తెలిపెను. కాని వారు పంపరైరి. అదే అతని పతనానికి కారణం. అభిమానములేని జాతిలో గొప్పవారికి వృద్ధియుండదు. తుదకు హన్నిబల్ దేశత్యాగముచేసి తన ౭౦వ ఏట విషము త్రాగి చనిపోయెను.

## మార్కోపోలో

ఇటలీదేశములోని వెనిస్ నగరములో మార్కోపోలో జన్మించెను. రైళ్ళు భద్రతలేని ఆ కాలములో చీనా హిందూస్థానము మొదలుగా అతి దూర దేశాలలో చాలాయేండ్లు సంచారము. ఆ కాలపు

దేశములనుగూర్చి అచ్చటి జనులనుగూర్చి గ్రంథము వ్రాసినవాడే మార్కో-పోలో. చీనాలో మంగోల్ సామ్రాజ్యమును ఆకాలములో కుబ్లాఖాన్ అను చీనా చక్రవర్తి పాలనము చేసెను. మార్కో-పోలో తండ్రి ఆ చక్రవర్తిని ౧౨౬౯లో చూచివచ్చెను. మళ్లీ క్రీ.శ.౧౨౭౧లో మార్కోను వెంట తీసుకొని ప్రపంచ పర్యటనకై వెళ్లెను. అప్పుడు మార్కోకు ౧౭ ఏండ్ల వయస్సు. అతడు ౨౪ ఏండ్లపాటు సంచారము చేసెను. వారు ౪ ఏండ్లు నడిచి ౧౨౭౫లో కుబ్లాఖానును చూచిరి. ౨౪ ఏండ్లవరకు నానాదేశాలు తిరిగి తండ్రి కొడుకులు తమదేశము చేరిరి. మార్కో తల్లి తన భర్త తొడిగే బొంతల పేర్వానిని ఒక బిచ్చగానికి దానముచేయగా భర్త చాలా దుఃఖించి ఊరి వారధిమీద కూర్చొని ఒక చక్రము త్రిప్పుకుంటు ఉండగా జనులు మూగుతూ ఉండిరి. మూడవదినము అట్టి గుంపులో బిచ్చగాడు కనబడగానే వానికి పెద్దమొత్తమిచ్చి ఆ బొంతను కొనెను. అందరున్నూ అతనిని పిచ్చివాడనుకొనిరి. ఇంటిలో ఆబొంత అతుకులను కోయగా దానినుండి వజ్రాలు రత్నాలు జలజలరాలెను. జపానువారు వెనిసువారితో యుద్ధముచేయగా అందు మార్కో-పోలో బందీ యయి రెండేండ్లు జెయిలులోనుండిన కాలములో తోచక దేశాల విశేషాలు వ్రాసెను. కుబ్లాఖాను కాగిదం నోట్లను ప్రచారంచేసినట్లు, ఖాను భవనంకప్పు బంగారుదిగా నుండినట్లున్నూ వ్రాసెను. హిందూస్థానములోని తెనుగుకాకతీయుల రాజ్యాన్ని, రుద్రమదేవి ప్రభుత్వాన్ని వర్ణించెను. సింహళములోని ముత్యాల పరిశ్రమను వర్ణించెను. పోలో వ్రాసిన చరిత్ర యూరోపు జాతులకు ఏషియాను దిగమ్రింగుట కువ్విళ్లూరించి ఏషియా పతనానికి నాంది యయ్యెను.

## కొలంబస్

౧౪౩౬–౧౫౦౬

కొలంబస్ అమెరికాను కనిపెట్టెను అని ప్రసిద్ధి. అనగా యూరోపు దేశమువారికి ఉత్తర దక్షిణ అమెరికా ఖండాలను కబళించుటకు

బాట చూపినవాడయ్యెను. ఆతని కాలమువరకు ఉభయ అమెరికా ఖండాలుండినట్లు యూరోపు దేశము వారికి తెలియనే తెలియదు. కొలంబసు ఇటలీదేశమువాడు. జెనోవా వాసి. యువకుడుగా నున్న కాలములో పశ్చిమాన దేశాలున్నవని అతడు విశ్వసించెను. పెద్ద వాడైన తర్వాత స్పెయిన్ రాజు నాశ్రయించి మూడు ఓడలను మందిని సంబారాలను తీసుకొని 3 ఆగష్టు ౧౪౯౨లో ప్రయాణ మయ్యెను. ౧౨ అక్టోబరునాడు బహామా దీవులలో ఒక దీవిని చేరిరి. అవే తూర్పు ఇండియా దీవులని వారనుకొనిరి. కాని తప్పు తెలుసు కొని ఆ దీవులకు పశ్చిమ ఇండియాదీవులనీ అచ్చటి జనులకు ఎర్ర ఇండి యనులని పేరు పెట్టిరి. దీవి గడ్డపై దిగగానే దీవిలోని ఆదిమనివా సులు భయపడి పారిపోయిరి. కొలంబసు కత్తిని లాగి భూమిని ముద్దాడి తన దేవునికి మొక్కులిడి స్పెయిన్ రాజ్య జండాను పాతి ఇది స్పెయి ను రాజు దేశమైపోయినది అని తన మందికి పంచభూతాలకు ప్రకటిం చెను. అక్కడి ఆదిమనివాసులను కొందరిని పక్షులు కొన్నిటిని బంగారుమట్టిని కొంత తీసుకొని తిరిగిపోయి స్పెయిన్ రాజుకు చూపి ఆనందింపజేసెను. మళ్ళీ ౧౪౯౩లో వెళ్ళి జెమైకా మున్నగు దీవులను చూచెను. మూడవమారు మళ్ళీ వెళ్ళి మరికొన్ని దేశాలను చూచెను. చూచినవన్నీ స్పెయినుకు గెలిచి యిచ్చినట్లే. నాల్గవమారు అమెరికా తీరము చేరెను. (S M.H)

## వాస్కోడగామా

ఒకదిక్కు అమెరికాను చూచినంత మాత్రానే స్పెయినుకు చెందిపోతూవుంటే, స్పెయిను ప్రక్కన ఉండే పోర్చుగల్ దేశమువారికి వేరే ఖండాలను గెలుచుకోవాలెనను దురాశ పుట్టెను. హిందూ స్థానములో తేనె, పాలు ఎక్కడబట్టినా కాలువలుగా ప్రవహిస్తున్నవనీ కోహినూరు వజ్రాలు, బంగారు అషర్ఫీలు తేరకు తేరకుగా లభించు వనీ కథలు కల్లలు యూరోపువారు వినిరి. విన్నగడియయే హిందూ

స్థాన పతనానికి కారణమయ్యెను. హిందూస్థానానికి అంతవరకు తుర్కీ మీదుగా ఎర్రసముద్రము మీదుగా వెళ్ళేవారు. ఆ దారిలో తురకలు తెల్లవారిని పోనియ్యనందున ఆఫ్రికాచుట్టును తిరిగి సముద్రమువీద హిందూస్థానానికి ఓడలలో పోవుమార్గము కనిపెట్టదలచిరి. తరువాత జులై ౧౪౯౭లో పోర్చుగీసు జాతివాడగు వాస్కోడగామా అనువాడు సముద్రముపై ప్రయాణముచేసి ఆఫ్రికాను చుట్టి హిందూస్థానములోని కాలికట్ రేవును చేరెను. ఆ దేశపురాజును సముద్రరాజనిరి. దానిని పోర్చుగీసువారు నోరుతిరుగక జామరిన్ అనిరి. జామరిన్‌తో మూరులు తురకలుకూడా వ్యాపారము చేయుచుండిరి. వారు గామాను చంపజూచిరి. అందుపై జామొరిన్‌కు గామాకు సముద్ర యుద్ధం జరిగెను. మేలైన తుపాకులతో గామాయే గెలిచెను. పోర్చుగీసువారు మన దేశములో కొలది దేశ మాక్రమించుకొనుట దానితో ప్రారంభమయ్యెను. అది నాంది. తరువాత ఫ్రెంచివారు, ఇంగ్లీషువారు వచ్చిరి. అది హిందూస్థాన చరిత్రలో ప్రసిద్ధముగు విషయము.

## జేమ్సుకుక్

తమ తెల్లసోదరులనుజూచి ఇంగ్లీషువారికిని ఖండాంతరములను చూచినంతనే గెలుచుకోవలెనను ఆశ పుట్టెను. శాంతిమహాసాగరములో చాలాచాలా ద్వీపాలు దుర్బలస్థితిలో నున్నవని వాటిని చూచినంతనే గెలువవచ్చునని ఇంగ్లీషువారు విశ్వసించిరి. ౧౭౬౯లో అతడు ఓడలతో మందితో ప్రయాణముచేసి న్యూజీలెండు, ఆస్ట్రేలియా చేరెను. ఆస్ట్రేలియా దక్షిణతీరములో దిగి బ్రిటీషు జండాను అందు పాతి ఈ ఖండము ఇంగ్లీషురాజుది అని పంచభూతాలకు ప్రకటించెను. కుక్ మూడుమారులు ఇంగ్లండునుండి శాంతిమహాసాగర ద్వీపాలకు ప్రయాణముచేసెను. మూడవమారు హవై ద్వీపాలలోని ఆదిమనివాసులతో తగవు పెట్టుకొనగా వారతనిని చంపివేసిరి. కుక్ మూలాన ఇంగ్లీషువారికి ఆస్ట్రేలియాఖండము న్యూజీలెండు మరికొన్ని ద్వీపులు లభించెను.

## విలియం షేక్స్పియర్

ఇంగ్లండులోని స్ట్రాఫర్డు ఆన్ ఆవన్‌లో ౨౨ ఏప్రిల్ ౧౫౬౪లో జన్మించెను. మన దేశములో కాళిదాసు కెట్టి కీర్తికలదో అట్టి కీర్తి షేక్స్పియరుకు కలదు. ఆతడు బీదవాడు. ధనికులు నాటకాలకు పోతే వారి గుర్రాలకు కావలికాసి డబ్బును సంపాదించుకొనుచుండెను. కొంత కాలానికి ఒక నాటకశాలలో పాత్రధారిగా ఏర్పడెను. ఆ యనుభవమే అతనికి ముఖ్యమయ్యెను. దాన్నిబట్టి అతడు ఉత్తమోత్తమ నాటకాలను రచించెను. తన ౨౬వ సంవత్సరమందే నాటకాలు వ్రాయ మొదలుపెట్టెను. మోదాంత విషాదాంత నాటకాలను వ్రాసెను. అతనిలో లోకానుభవము, ప్రకృతిసౌందర్య పిపాస అత్యంతముగా ఉండెను. ఆతని వర్ణనలవంటి వాటిని ప్రపంచకవులు అరుదుగా వ్రాసినారు. ఆతని నాటకాలు ప్రపంచమందలి అన్ని భాషలలో అనువదింపబడినవి. "మేము ఇంగ్లండునైనా పోగొట్టుకుంటాము కాని షేక్స్పియరును పోనాడుకొనము" అని ఒక యింగ్లీషు అభిమాని అన్నాడు. అతనిలో దేవుడావేశించెనని వాల్టేరువంటివాడనెను.

## జార్జ్ వాషింగ్‌టన్

అమెరికా సంయుక్తరాష్ట్రాలలోని వర్జినియాలో ఇతడు ౨౨ ఫిబ్రవరి ౧౭౩౨లో జన్మించెను. అంతవరకు అమెరికాలోని ౧౩ సంయుక్తరాష్ట్రాలు ఇంగ్లీషు ప్రభుత్వానికి లోబడియుండెను. ఇంగ్లండు ప్రభుత్వమువారు అమెరికా వారిపై అన్యాయంగా పన్నులను హెచ్చించిరి. పార్లమెంటులో అమెరికా ప్రతినిధు లుండనిది పన్నులు విధించరాదని, ప్రాతినిధ్యములేనిది పన్నులు వేయరాదు అని (no taxation without representation) అమెరికావా రాక్షేపించిరి. ఇంగ్లండు వినలేదు. ఇద్దరికీ యుద్ధం ప్రారంభమయ్యెను. అమెరికా సైన్యానికి వాషింగ్టన్ సేనాని యయ్యెను. ౪ జులై ౧౭౭౬నాడు అమెరికా

స్వాతంత్ర్య ప్రకటన కావింపబడెను. మొదటి యుద్ధాలలో అమెరికా సైన్యమోడెను. కాని అప్పుడే ఫ్రెంచివారికి ఇంగ్లీషువారికి యుద్ధాలు చెలరేగినందున వారు అమెరికాకు సహాయపడిరి. దానిమూలాన ఇంగ్లీషు సైన్యాలోడిపోయెను. మార్చి ౧౭౮౯లో వాషింగ్‌టన్ స్వతంత్ర అమెరికాకు మొదటి అధ్యక్షుడయ్యెను. అతడు ౧౭౯౯లో చనిపోయెను. అతడు గొప్పవంశమువాడు. అతనిపూర్వీకులు ఇగ్లండు నుండి వెళ్లియుండిరి. వారి యింటి నిషాన్ నక్షత్రాలు, పట్టెలు, గరుడపక్షి. అవే యిప్పుడు అమెరికా జండాకును, జాతీయ చిహ్నానికిని ఏర్పాటైనవి. S. M. H.

## అబ్రహాం లింకన్

ఇతడు అమెరికాయొక్క ౧౬వ సభాపతి. అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని కెంటకీలో ౧౮౦౯లో జన్మించెను. వాషింగ్‌టన్ తర్వాత ఇతనిని అమెరికావారు చాలా గౌరవిస్తారు. ఇతడు బీద వాడు. కట్టెపలకమీాద బొగ్గుతో వ్రాసి చదువు నేర్చుకొనుటకు ప్రతి దినం ౮ మైళ్లు నడిచి బడికిపోయి వస్తుండెను. అతడు చాలా కరుణ కల వాడు. జంతువుల హింసనుకూడా ఓర్వకుండెను. తెల్లవారు ఆఫ్రికాలో నీగ్రోవారిని బలవంతముగా దొంగిలించి ఇంగ్లండులో అమెరికాలో బానిసలనుగా అమ్ముచుండిరి. అట్టి నీగ్రోలు అమెరికాలో ఇప్పుడు పదిలక్షలున్నారు. లింకన్ కాలములో వారిని సంకెళ్ళలో వేసి కొరడాలతో కొట్టి పనితీసుకుంటూ వుండిరి. అబ్రహాం ఒక ఓడలో ఉద్యోగియై యీా దృశ్యాలుచూచి అదరిపోయెను. అతడు బహు గ్రంథాలు చదివి తుదకు ౧౮౩౬లో వకీలయ్యెను. తన వృత్తిలో ప్రఖ్యాతుడై కాంగ్రెసు అను అమెరికా శాసనసభలోనికి ఎన్నుకో బడెను. క్రమముగా ప్రసిద్ధి పొంది ౧౮౬౦లో అమెరికాదేశ సభాపతి యయ్యెను. ౧ జనవరి ౧౮౬౩నాడు అమెరికాలో బానిసలెవ్వరున్నూ ఉండరాదనీ, బానిసలందరూ స్వేచ్ఛకలవారనీ శాసించెను.

_నిపై రాష్ట్రములో అంతర్యుద్ధాలు జరిగెను. కాని అవన్నీ అణచి
_యబడెను. లింకన్ రెండవమారుకూడా సభాపతిగా ఎన్నుకోబడెను.
_ని బానిసలుండవలెనని యుద్ధము చేసిన పక్షము వాడొకడు అతనిని
_ల్చి చంపెను. బానిసజాతులకు ముఖ్యుడు అబ్రిహాం లింకన్.

(ఆబ్రహాం లింకన్ కర్త హరిసర్వోత్తమరావుగారు. తె)

## చాణక్యుడు

ఇతడు ఆంధ్రబ్రాహ్మణుడని కొందరంటున్నారు. జగద్విఖ్యాతి
_ంచిన రాజనీతి నిపుణుడు. మహాసామ్రాజ్యము నేలిన నవనందుల
_ంట గలిపి చంద్రగుప్తమౌర్యుని చక్రవర్తిగా చేసిన మేధావి. ఇతడు
_ంద్రగుప్తుని మగధలో క్రీ. పూ. 3౨౧లో పట్టాభిషిక్తుని చేసెను.
_న చాణక్యుడున్నూ ఆకాలమువాడే. అతనికి విష్ణుగుప్తుడని పేరుం
_ను. కౌటిల్యుడు అనికూడా పలువురు పేర్కొన్నారు. అనగా కుటిల
_జనీతికలవాడనిఅర్థము. కాని అతడుకుటల దేశమువాడగుటచే కౌటల్యు
_ముడయ్యెనని యిప్పుడు కొందరు చరిత్రకారులంటున్నారు. అతని
_ద్భుత చర్యలనుగూర్చి జనులు పురాణాలుగా కథలుగా పెంచి
_వాసిరి. సంస్కృతములో ముద్రారాక్షసమను నాటక మతనిగూర్చియే
_ది. అది తెనుగులోను అనువదితమైనది. అతడు చిన్నతనమందే
_ప్రజ్ఞ కలవాడు. నవనందులతనిని సభలో అవమానముచేయగా వారిని
_ంసము చేయుదునని ప్రతిజ్ఞచేసి యట్లే యొనరించి వారి దాయాది
_గు చంద్రగుప్తుని పట్టాభిషిక్తుని చేసెను. రాజనీతి విశారదులలో
_తనికన్న మించిన భారతీయుడు లేడని ప్లీట్ వ్రాసినాడు. అతడు
_సిన అర్థశాస్త్రము అత్యద్భుత గ్రంథమని పాశ్చాత్యులుకూడా
_శ్చర్యపడినారు. అతని అర్థశాస్త్రాన్ని తర్వాతివారగు పంచతంత్ర
_రుడు, కామందకుడు, యాజ్ఞవల్క్యుడు, వాత్స్యాయనుడును అను
_ంచినారు.

## లెయనార్డో డావించీ
(౧౪౫౨-౧౫౧౯)

ఇతడు ఇటలీలోని వించి అను గ్రామములో జన్మించెను. ఇతడు గొప్ప సంగీత విద్వాంసుడు, కవి, చిత్రకారుడు, శిల్పి, యంత్రవేత్త, ఇంజనీయరు, వేదాంతి, సైన్సువేత్త, గొప్పవక్త. కాని ఇతడు యూరపులోని ఉత్తమ చిత్రకారుడుగానే లోకమందు ప్రసిద్ధి వహించెను. ఇతడు ప్రకృతిని చిత్రించినవారిలో మొదటివాడు. మిలాన్ లోని రాజు వద్ద తన కాలమును ఎక్కువగా గడిపెను. ఇతడు చిత్రించిన వాటిలో ఏసుక్రీస్తుయొక్క కడనాటి భుక్తి యను చిత్రము ఉత్తమోత్తమమనీ, అట్టిది ప్రపంచమందు దరుదనీ ప్రతీతి. మోనాలిసా అనే చిరునవ్వు నవ్వు స్త్రీ చిత్తరువు ఇతని రెండవ మహాచిత్రము. ఇతడు సైన్సులో విమానాలను నిర్మించు సూచనలు చేసియుండెను. ఇట్టివెన్నో తన చిత్తు పుస్తకాలలో వ్రాసియుండెను. కాని అవి అతడు చనిపోయిన 300 ఏండ్లకుకాని బయటపడలేదు. (౧౦౦ మ. చ)

## జోన్ ఆఫ్ ఆర్క్
(౧౪౧౨-౧౪౩౧)

ప్రపంచ మహారథిక శ్రేణిలో చేరునట్టిది ఈ ఫ్రెంచి వనిత. బానిస దేశాలకంతా జ్యోతివంటి స్వాంతత్ర్యలక్ష్మి. దేవాంశ కల్గి యుండినట్టిది. ఆమె పేరు ఫ్రెంచిభాషలో జీన్ డ ఆర్క్. ఆమె మ్యూస్ నదీతీరమునసుండు డామ్రిమీ అను గ్రామములో గ్రామ ముఖ్యుడును వ్యావసాయకుడునగు వానికి జన్మించెను. ఆమెకు చదువు రాదు. కాని చాలా పవిత్ర. తండ్రి గొర్లమందను కాచి సాయపడి నట్టిది. ఆమె తండ్రితాతల కాలములో అనేక సంవత్సరాలనుండి ఇంగ్లండుకు ఫ్రాన్సుకు యుద్ధాలుజరుగుతూ ఫ్రాన్సులోని కొన్ని భాగాలు ఇంగ్లీషువారి వశమయ్యెను. ఆమె చిన్నతనములోని ఫ్రాన్సురాజు

దిక్కులేనివాడయ్యెను. అతని తల్లియే వానిలో రాజరక్తములేదని ప్రకటించెను. ఆమె వ్యభిచారిణియగుటచేత ఆమాట నిజమయ్యెను. ఫ్రాన్సులోని జమీందారులు కొందరు ఇంగ్లీషువారిలో కలిసిరి. దేశమంతా ఇంగ్లీషువారి పాదాక్రాంతమయ్యెను. జోన్‌కు ౧౨ ఏండ్ల వయసురాగా ఆమె దేవుని సందేశాలు వినిపించినట్లయ్యెను. ఏవో ధ్వనులు వినవచ్చెను. ఏవో దృశ్యాలు కానవచ్చెను. అందుపై తాను కన్యకగానే యుండునట్లును దేశానికి ముక్తి నిప్పించునట్లును నిశ్చయించుకొనెను. తన ౧౭వ ఏట మగదుస్తులతో రాజువద్దకు వెళ్ళి తాను సేనను నడుపుదునని నచ్చజెప్పి ౪౦౦౦ సైన్యముతో ఆర్లియన్సు అనుచోట ఇంగ్లీషువారిని తాకి ఓడించెను. తర్వాత టూరెల్సుకోటను కూడా యుద్ధముచేసి లాగుకొనెను. తర్వాత మరకొన్ని స్థలాలను అవలీలగా గెలిచెను. ఆమె రాజుకు పట్టాభిషేకము చేసెను. తర్వాత తన దేశమువారే ఆమెపై ఈర్ష్య వహించుటచేత ఆమెను ఇంగ్లీషు వారికి పట్టించిరి. వారు అన్యాయముగా ఆమెను అగ్నిలో కాల్చి చంపిరి. ఆమె హృదయం మాత్రం కాలకపోయె నందురు.

(దేవీ జోన్ – గద్దెలింగయ్య చౌదరి. తె.)

## రుద్రమదేవి

మహారాణీ రుద్రమదేవి ఓరుగల్లు సామ్రాజ్యము నేలిన గొప్ప రాణీ. గణపతిదేవ చక్రవర్తికి కుమారులు లేకుండిరి. ఇద్దరు బిడ్డలే యుండిరి. అందు రుద్రమదేవి పెద్దది. ఆమెకు మగవేషమువేసి శస్త్రమందు శాస్త్రమందును ప్రవీణురాలిని చేసెను. ఆమె క్రీ. శ. ౧౨౬౦ లో పట్టాభిషిక్తురాలయ్యెను. ఆడుదానికిలొంగియుండవలెనాయని ఆమె సామంతాంధ్రులును, దేవగిరిరాజువంటి మహారాష్ట్ర శత్రువులును యుద్ధానికి సిద్ధమైరి. దానిని గమనించి ఆమె ఓరుగంటికి కంపకోట, మట్టికోట, భూమికోట, పుట్టకోట, రాతికోట అను కోటలను ఒకదాని తర్వాత ఒకటి నిర్మింపజేసి ప్రతికోటచుట్టును సైన్యాలను సేనానులను

పెట్టి దుర్గరక్షణ చేసెను. కంచిరాజు, చోళులు, పల్లవులు, పాండ్యులు కొందరు సామంతులు కలిసి ఓరుగంటి రాజ్యముపై యెత్తివచ్చిరి. కాని వారందరున్నూ ఓడిపోయిరి. మరొకదిక్కు దేవగిరిరాజు ఓరుగంటిపై ౩ లక్షల సైన్యముతో దాడిచేసెను. రుద్రమదేవి సేనానులగు రుద్రసేనానియు, నాగన్నయు వారితో పోరాడి ఓడించిరి. రుద్రమదేవి స్వయముగా సేనతో దేవగిరి వరకు శత్రుసైన్యమును తరిమి వచ్చెను. ఆమె సముద్రవ్యాపారమును చాలా వృద్ధికావించెను. ఆమె శైవమతము నవలంబించినట్టిది. అనేక దేవాలయాలను కట్టించి చాలా చెరువులు కట్టించినది. తనపేర యెన్నో గ్రామాలను కట్టించెను. ఆమెకు ముమ్మడమ్మ రుయ్యమ్మ అను కూతురులుండిరి. ముమ్మడమ్మకు ప్రతాపరుద్రుడు కలిగెను. ఆమె ౩౫ సంవత్సరములు రాజ్యముచేసి తన మనుమనిని పట్టాభిషిక్తుని చేసెను.

(ఆంధ్ర రమణీమణులు — ఆంద్ర శేషగిరిరావు. తె.)

## రాణా ప్రతాపసింహ

ఇతడు ౧౫౭౨ నుండి ౧౫౯౭ వరకు రాజ్యముచేసిన రాజపుత్ర వీరుడు. హిందువులలో అట్టి వీరుడు జన్మించి యుండలేదు. దేశభక్తికి, నిర్వక్రపరాక్రమానికి, స్వాతంత్ర్య జీవితమునకు, నిర్భయతకు అతని పేరు ముందుచెప్పి యితరులను పేర్కొన వలసియుండును.

రాజపుత్రస్థానములోని ఆరావళీపర్వత పరిసరాలలో మేవాడ్ మండలము కలదు. అది వీరుల జన్మభూమి. ఆ వీరులలో శిశోదయ వంశమువారు వీరాతివీరులు. ఆ కాలములో అక్బరు చక్రవర్తి ఢిల్లీ నేలుచుండెను. అతడు రాజపుత్రరాజుల కన్యలను పెండ్లాడి, మానసింగువంటి రాజపుత్రులను సేనానులనుగా జేసుకొని రాజపుత్రబలాన్ని వంచివేసెను. కాని ఒక మేవాడ్ రాజులే లోబడలేదు. వారి ముఖ్య పట్టణము చిత్తోడ్, ప్రతాపసింహుని తండ్రి ఉదయసింగు రాజ్యము

చేయుచుండెను. అక్బరు చిత్తోడు ముట్టడివేయగా రాజు పారిపోయెను, అందలి స్త్రీలు జోహార్ చేసిరి అనగా అగ్నిలోపడి భస్మమైరి. అక్బరు చిత్తోడును ధ్వంసముచేసి అందలి ప్రాణులనంతా చంపించి, తాను చంపించిన రాజపుత్రుల జందెముల తూచగా అవి ౭౮౪ మణుగులు తూగెను. నేటికినీ మార్వాడీలు ఏదైనా పని తప్పక కావలెనని మిత్రులను కోరితే తమ జాబులపై ౭౮౪ అంకె వేయుదురు. అనగా చిత్తోడు ప్రాణులనంతా చంపిన పాపాన పోదురని అర్థము. రాణాప్రతాపసింహ కొంతకాలానికి రాజయ్యెను. రాజపుత్ర స్వాతంత్ర్యము నిలబెట్టుదునని శపథము చేసెను. కాని ఆతని రాజ్యము చాలా చిన్నది. రాజపుత్ర సోదర రాజులగు అంబర్, మార్వాడ్, బికానీర్, బుందీరాజు అక్బరుతో కలిసిరి. రాణాప్రతాపుడు ఏమిన్నీ జంకలేదు. గడ్డిపరుపుపై పరుండెను. బంగారు పళ్ళెములలో తినుట మానుకొనెను. చిత్తోడు ముట్టడియైనప్పుడు ప్రజలంతా ఆరావళి గట్లలో దాగవలెనని శాసించెను. ఇంతలో మానసింగును అక్బరు రాణావద్దకు రాయబారమంపెను. తురకకు తలయొగ్గనని రాణా పలికెను. మానసింగు అత్తను అక్బరు పెండ్లాడినందున మానసింగు పతితుడని రాణా అతనితో భుజించకపోయెను. తనకు కడుపునొప్పి కలదనెను. "సరే ఆనొప్పికి మందు తెస్తానులే" అని మానసింగు కండ్లెర్రజేసి గుర్రమెక్కెను, "నీ మామనుకూడా తీసుకొని రా" అని యొక రాజపుత్రుడనెను. మానసింగు తాకిన వస్తువులను గంగాజలముతో శుద్ధిచేసిరి. అతనితో మాట్లాడిన వారంతా సచేల స్నానముచేసిరి. రాజపుత్రులంతా తనతో బాంధవ్యం చేస్తే మేవాడు రాణా చేయలేదని అక్బరు మేవాడు తుడిచివేయ సంకల్పించెను. హల్దీఘాటువద్ద రాణాకు మానసింగు వెంటవచ్చిన అక్బరు సైన్యానికి యుద్ధం జరిగెను. ఆ యుద్ధములో అక్బరుపక్షాన రాజపుత్రులు, రాణాప్రతాపు పక్షాన రాజపుత్రులు యుద్ధంచేసిరి. అక్బరు దళనాయకుడగు బదేనీ అనువాడు ఆసఫ్ ఖాను "అయ్యా! మన రాజపుత్రులెవ్వరో మంది యెవ్వరో ఎట్లు గుర్తింతును" అని అడుగగా అందరిపైనా బాణాలువేయుము. ఎవ్వరు

చచ్చినా కాఫర్లేకదా చచ్చేది. అది ఇస్లాముకు లాభమేకదా'' అనెను. అతడట్లే చేసెను. యుద్ధములో ఎవ్వరికీ జయము కలుగలేదు. పైగా మొగలు సిపాయీలు యెప్పుడు రాణా తమమీద పడునో అని గడగడ వణకుతూ ఉండిరి. మరొకప్పుడు అక్బరు స్వయముగా ౬ నెలలు రాణాకు సమీపదేశములోనుండి సేనల పంపెను. కాని రాణా వాటిని లెక్క-పెట్టనేలేదు. ఒకమారు అక్బరుసేనానియగు మిర్జాఖాన్ జనానా రాణాచేతులలో ఖైదీయయ్యెను. రాణా వారిని బిడ్డలవలె గౌరవించి సారెపెట్టి పంపించెను. రాణాకు వత్తిడి చాలా అయ్యెను. రాణా గట్లలో నివాసము చేసెను. చెట్లక్రింద గడ్డి గింజలను తిని జీవించెను. అడవి జంతువులు పిల్లల చేతులలోని రొట్టెల లాగుకొని పోవుచుండెను. అట్టి స్థితిలోనుకూడా రాణా జితోస్మి అనలేదు. తుదకు వేసారి దేశ త్యాగముచేయ సిద్ధముకాగా భామాషా అను నతడు ౨౫ లక్షల రూపాయలు ౨౫౦౦౦ అష్రిఫీలు యిచ్చెను. దానితో మరల సేనను కూర్చుకొని తనరాజ్యాన్ని చుట్టుపట్టుల రాజ్యాలను అన్నింటిని మొగ లులనుండి లాగుకొని ౧౫౯౭లో స్వతంత్రవీరుడై సమస్త హిందూ లోక పూజ్యుడై పరమపదించెను. ఒకనాడు శతల్ అను భట్రాజు అక్బరుకు తన రుమాలను తీసి సలాము చేసెను. కారణ మడుగగా ఆ రుమాలను మహారాణాప్రతాపు తనకు తొడిగించి యుండెననీ రాణా ఎవ్వరికీ తలయొగ్గినవాడు కానందున అతడిచ్చిన రుమాలకూడా తల యొగ్గదనీ చెప్పెను. రాణా స్వాతంత్ర్య శక్తిని ఈ ఘట్టము బాగా నిరూపిస్తున్నది.

(రాణాప్రతాపసింహుని సమగ్ర చరిత్రకై ఇంగ్లీషులోని టాడ్ రచించిన రాజస్థాన్ అను గ్రంథమును, తెనుగులో రాజశేఖర కవి గారు రచించిన రాణాప్రతాపసింహ అను ఉత్తమ పద్యకావ్యమును చదువవలెను).

## దుట్టగామని

క్రీ. పూ. ౧౬౧ — ౧౩౭

హిందూస్థానానికి దక్షిణములో సింహళద్వీపము కలదు. దానిని రావణుని లంక యందురు. కాని అది లంక కాదు. సింహళద్వీపములో అశోకునికాలములోనే బౌద్ధమత వ్యాప్తి జరిగెను. అంతకు పూర్వము జనులు హిందువులై యుండిరి. ఆ ద్వీపాన్ని చాలా మారులు తమిళులు (అరవవారు) జయించి పాలించుతూ వచ్చినారు. స్వాతంత్ర్యము కోలుపోయినందుకు అతిబాధపడిన వారిలో దక్షిణ ప్రాంతములోని రోహణలో తమిళుల సామంతుడైన కాకవర్ణుని పెద్ద కుమారుడగు గెమును. అతడు చిన్నతనమునుండి తండ్రియొక్క శాంతతను ధ్యానమానసమును లెక్కపెట్టక తమిళులపై యుద్ధము చేయ గోరెను. తండ్రిని నిరాకరించగా ఆతనికి గాజులంపి అలంకరించుకొనుమని చెప్పి రాజ్యత్యాగము చేసి అడవులపాలై తండ్రి చనిపోగా రాజ్యము నేల మొదలిడిన తమ్ముని పారదోలి పట్టాభిషిక్తుడై తమిళులపై యుద్ధము చేసెను. తమిళుల కోటలన్నీ క్రమక్రమముగా పట్టుకొని వారిని సింహళమునుండి పూర్తిగా తరిమి తమదేశ రాజధానియగు అనూరాధపురములో రాజ్యము చేసెను. దేశమును చక్కగా పాలించెను. అందరికిన్నీ ఉచితచికిత్స చేయ ద్వీప మంతటా వైద్యశాలలు కట్టించెను. బీదలకు వృద్ధులకు ఉచిత భోజనము లేర్పాటు చేసెను. ౯ అంతస్థుల బౌద్ధాయతనమును ౧౬౦౦ స్తంభాలపై వెండి బంగారు రేకులతో పొదిగించి కట్టించెను. ప్రపంచములోని పరాధీన జాతులకంతా ఆదర్శపాత్రులగు వీరులలో ఇతడొకడు.

(Great men of India. Times of India)

(మ. చ.)

## నెపోలియన్ చక్రవర్తి

౧౭౬౯ — ౧౮౨౧

ఇతడు జగదేక వీరాతివీరులలో అగ్రగణ్యుడు. ఇంగ్లీషువారికి ప్రబల శత్రువు. అందుచేత ఇతనిని ఇంగ్లీషువా రెంతైనా దూషిస్తూ

వచ్చినారు. మధ్యధరాసముద్రములో కార్సికా అనే ద్వీపము కలదు. అందితడు ౧౭౬౯లో జన్మించెను. ఇతడు లెక్కకు ఇటలీజాతివాడు. కాని ఫ్రాన్సులో సేవచేసి ఫ్రెంచివాడనియే లోకానికి ప్రసిద్ధి యయ్యెను. ౧౭౯౨లో అతడు ఒక చిన్న దళాధిపతి (కెప్టను) గా ఉండెను. ఫ్రాన్సురాజులు నిరంకుశముగా నుండిరి. ప్రజలు తిరుగబడిరి, రాజుపారిపోయెను. ఆ కల్లోలములో పరరాజులు ఫ్రాన్సుపై దాడివచ్చిరి. నెపోలియన్‌బోనాపార్టు వారి నోడించగా అతని మిలిటరీ ఉపజ్ఞకు మెచ్చుకొని జనులు అతనిని సర్వసేనానిని చేసిరి. ఆ ఊపుతో అతడు ౧౭౯౬ నుండి వరుసగా రష్యా, స్పెయిన్, ఆస్ట్రియా, ఇటలీ, ఇంగ్లండు, హంగరీ మున్నగు దేశాల సైన్యాలను ఓడిస్తూ యూరోపునంతా గడగడ వడకించెను. యూరోపు చక్రవర్తి యయ్యెను. ఆల్ప్సు మంచు పర్వతాలను సైన్యముతో దాటి శత్రువుల దాకెను. అతని పేరు చెప్పితే సవాలక్షసైన్యము ఒక గంటలో కూడేది. అతనిలో అట్టి ఆకర్షణశక్తి యుండెనని ఇంగ్లీషువారు కూడా ఒప్పుకున్నారు. తుదకు ౧౮౧౪లో యూరోపు రాజులంతా ఇంగ్లీషువారి ప్రక్కబలముతో కలిసి నెపోలియనును ఓడించి మధ్యధరాసముద్రములోని ఎల్బా ద్వీపములో బంధించిరి. అక్కడినుండి కొన్ని దినాలలో తప్పించుకొని వచ్చెను. విజేతలైన ఇంగ్లీషు రష్యా మున్నగు దేశాలవారు ఫ్రాన్సుపై ఏమేమి నష్టాలు మోపవలెనను విషయం ఆలోచిస్తూనే ఉండిరి. నెపోలియన్ వచ్చెననేవరకు అందరూ దద్దరిల్లిరి. నెపోలియనును చూచేవరకు లక్ష సైన్యము కూడెను. వారితో వెంటవెంట మహాయుద్ధాలు నాలుగయిదు చేసి శత్రుల జయించెను. కాని తుదకు వాటర్లూ యుద్ధములో ౧౮౧౫లో ఓడిపోయెను. ఈతడవ అతనిని హెలీనా అనే చిన్న ఆఫ్రికా దీవిలో బంధించి ఇంగ్లీషువారు కాపలాకాచి చాలా కష్టపెట్టి అవమానము చేసిరి. బందీ అయిన ఆరేండ్లకు అతడు చనిపోయెను. అతని లీలలు కరుణాగాథలు, ఉపకారాలు, పరిపాలనదక్షత, విద్యా ప్రయత్నము మున్నగు ఉత్తమగుణాల చరిత్ర లనంతములు. అతని ఉత్తమ చరి

త్రను ఆబట్ వ్రాసెను, అదే చదువకొన దగినది. అది తెనుగులో కూడా అనువదింపబడినది.

# గ్యేరిబాల్డీ

(౧౮౦౭ – ౧౮౮౨)

దాస్య దేశాలకు ఆరాధనీయులగువారిలో గేరిబాల్డీ ఒకడు. దాస్య దేశాలకు లేక క్రూరరాజ పరిపాలిత దేశాలకు ముక్తివచ్చే కాలములో ఒకదిక్కు రాజకీయ తత్త్వబోధకులు బయలు దేరుతారు. వారి వెనువెంట సేనానులు బయలు దేరుతారు. ఫ్రాన్సులో రూసో కాల్వేరులున్నూ, నెపోలియనున్నూ బయలు దేరిరి. అమెరికాలో, జఫర్సన్, తామస్ పెయిన్‌తో పాటు వాషింగ్‌టన్ బయలు దేరెను. రష్యాలో టాల్‌స్టాయతో పాటు లెనిన్ బయలు దేరెను. హిందూస్థానములో చాణక్యునితో పాటు చంద్రగుప్తుడు, సమర్థరామదాసుతో పాటు శివాజీ, మాధవ విద్యారణ్యులతో పాటు బుక్కరాజు బయలు దేరిరి. అట్లే ఇటలీలో మట్జినీతో పాటు గ్యారిబాల్డీ వచ్చెను.

రోము ఇటలీకి ముఖ్యపట్టణము. రోము సామ్రాజ్యం ౨౩౦౦ ఏండ్ల క్రిందట యూరోపు, ఆఫ్రికా, ఏషియా ఖండాలలోని భాగాలను జయించియుండెను. అట్టి దేశము మన హిందూస్థానమువలెనే పతితమై పోయెను. ఇటలీ క్రీ. శ. ౧౮౦౦ వరకు చిన్నచిన్న తుంటలై ఫ్రాన్సు స్పెయిన్, ఆసియా, జర్మనీవారి విభాగాలకులోనై పరాధీనతనొంది యుండెను. అట్టి దేశమునకు దాస్యవిముక్తి కలిగించిన వీరుడే గ్యారిబాల్డీ సేనాని. అతడు నీస్‌లో ౧౮౦౭లో జన్మించెను. ౧౮౩౪లో ఓడలలో ఉద్యోగంచేస్తూ దాన్ని వశపరచుకొని తిరుగుబాటు చేయవలెనని గ్యారిబాల్డీ ప్రయత్నించి విఫలుడై పారిపోయెను. అతనిని తలగొట్ట అధికారులు తీర్పు చెప్పిరి. అక్కడనుండి పారిపోయి దక్షిణ అమెరికాలోని బ్రెజిల్ మున్నగు దేశాలవారికి సాయపడి అక్కడ ప్రజారాజ్యాలు స్థాపించుటకు కారకుడయ్యెను. ౧౮౪౮లో గ్యారిబాల్డీ ఇటలీలో

దిగెను. మళ్ళీ అచ్చట పోరాటము చేసెను. రెండు మారులు ఫ్రెంచి వారిచే ఓడి రెండుమారులు దేశాంతరమందు దాగెను.

పదేండ్లవరకు అమెరికాలో దాగియుండెను. మళ్ళీ గ్యారిబాల్డీ ఇటలీపై దూకెను. అటు మట్జినీకూడా చేరెను. సిసిలీ ద్వీపము నుండి ౨౦వేల సైన్యమును కూర్చిరి. "దేశభక్తులకు తిండియే జీతము" అని గ్యారిబాల్డీ వారికి చెప్పెను. వారు తమకన్న మూడంతల సైన్యాన్ని ఎదిరించి ఓడించిరి. ఒకమారు యుద్ధములో గ్యారిబాల్డీ గాయపడి ఖైదీయయి విడుదల పొందెను. మళ్ళీ యుద్ధముచేసి గెలిచెను. తుదకు ౧౮౭౧లో ఇటలీ దేశములో పరరాజులెవ్వరూ లేకుండాచేసి ఎమాన్యుయల్‌ను అఖిల ఇటలీకి రాజును చేసెను.

రెండుపక్షులకు అతడు దినం గింజలు వేసేవాడు. ౧౮౮౨లో అతడు చనిపోయేవేళ అవి వచ్చెను. సేవకులు వాటి రంతులను మాన్పుటకు వాటిని జోపిరి. "వద్దు వద్దు. నేను వెళ్ళిన తర్వాత దినం వాటికి గింజలు వేయండి" అని గ్యారిబాల్డీ పరమపదించెను. (౧౦౦ మ. చ.)

## ఛత్రసాల్
(౧౬౫౦ – ౧౭౩౩)

తెనుగు దేశపు బొందిలీలు బుందేల్‌ఖండ్ అను ఉత్తరహిందూస్థాన మండలమునుండి సిపాయీవృత్తిలో మన ప్రాంతాలలో ఉండిపోయినవారు. ఔరంగజేబు కాలము హిందూమతమునకు అఖండ దుర్దినము. అంతములేని అమావాస్యగా నుండెను. అతడు హిందువులపై చేసిన ఘోరాలకు అంత్యము లేకుండెను. అట్టి ఘోరాలకు ఛత్రసాలుని తండ్రి గురియై చచ్చెను. ఛత్రిసాలుడు ౧౭ ఏండ్ల వయసులోనే మొగల్ సేనలో గొప్ప బహద్దరు అనిపించుకొని యుద్ధము చేసెను. కాని తనకు తన మతానికి అపకారము చేసిన ఔరంగజేబును కొలుచుటకన్న మించిన పాపము లేదనుకొనెను. అంతలో అతడు శివాజీ ఛత్రపతితో కలిసెను. అతని దీవెనలపొంది మొగల్ సామ్రాజ్య

విచ్ఛేదమొనర్చి తన దేశ స్వాతంత్ర్యమును నిలుపుకొన నిశ్చయించెను. మొదట కొన్ని మొగలుకోటలు పట్టుకొనెను. సేనల నోడించెను. అందుపై పలువురు హిందూసర్దారు లతని పక్షానచేరిరి. ఆతడు విజృంభించి మొగల్ ప్రాంతాలపై బడెను. ఔరంగజేబుకు కోపంవచ్చి రణదుల్లాఖాను అను సేనానివెంట పెద్ద సేనను పంపెను. ఆతడోడెను. బఖాఖాన్ రూపీఅనే పేరుపొందినమహాసర్దారును ససైన్యముగాపంపెను. ఆ సైన్యం నాశనమయ్యెను. అనేక యుద్ధాలలో పోరి గెలిచిన ధీరుడని తహావ్వర్ ఖానుని సైన్యముతో ఢిల్లీ చక్రవర్తి పంపెను. వానిని ఛత్రిసాల్ పిరికిపందయై పారునట్లు తరిమి కొట్టెను. మరొకమారు షేక్ మహమ్మదు అనే బహద్దరును ఛత్రసాలునిమీాది కంపెను. షేకుగారే ఖైదీయయి ౨ లక్షలిచ్చి తన ఖైదీని విడిపించుకొని పారిపోయెను. ఢిల్లీలో ప్రత్యేక దర్బారుచేసి యిక ఛత్రిసాలుని వంచుటకు మిర్జా సదుద్దీన్ ఈరానీయే తగినవాడని వానివెంట మహాసైన్యము నిచ్చి పంపిరి. వాడున్నూ తన్నులుతిని పారిపోయెను. ఈ విధముగా మరెన్నో యుద్ధాలు జరిగెను. అన్నింటిలోను నిర్వక్రపరాక్రమ వీరుడై గెలిచిన వీరుడు ఛత్రసాల్. ఓటమి యెరుగక ఔరంగజేబు సామ్రాజ్య విధ్వంసమునకు ముఖ్యకారకు డితడే.

(Flowers of Hinu Chivalry. Hemachandra Rai. ఇ.)

## మాహద్జీ సింధియా

ఇతడు రాణోజీ సింధియా అను వీరుని కుమారుడు. ఇతనికి నల్గురన్నలు ఒక తమ్ముడుండిరి. అందరూ యుద్ధాలలో ప్రాణాలిచ్చిన వీరులు. ౧౭౬౧లో పానిపట్ యుద్ధములో మహారాష్ట్రులోడిపోయిరి. మాహద్జీ సింధియా కత్తిదెబ్బలు తినెను. కాని తర్వాత కోలుకొనెను. పీష్వా మాధవరావు అతనిని మాలవదేశముపైకి పంపెను. సింధియా దాన్ని ౧౭౬౯లో ముసల్మానులనుండి లాగుకొనెను. ఆ కాలములో

షాహెఆలం ఢిల్లీసింహాసనముపై ఉండెను. అతనివద్ద నజిబుద్దౌలా అనే మంత్రి యుండెను. సింధియాయున్నూ ఇతర సేనానులున్నూ ఢిల్లీపై దండెత్తగా మంత్రి గడగడ వడకి లోబడి పోయెను. నజిబుద్దౌలా చచ్చెను. వాని కొడుకు జబితాఖాను షాహెఆలంపై ప్రభావము వేసి చాలా క్రూరాలు చేసెను. బేగముల చెరిచి ఘోరాలొనరించెను. సింధియా ఢిల్లీకి వెళ్ళగా వాడు లోబడిపోయెను. సింధియా గ్వాలియర్ ను గెలిచెను. తన సైన్యానికి యూరోపులో సెవాయ్ దేశమువాడగు (De Boigne) డిబాయిన్ అనే వాన్ని నెలకు ౧౦౦౦౦ రూపాయలు జీతమిచ్చి ఏర్పాటు చేసెను. అట్టి సైన్యముతో సింధియా ఢిల్లీకి పోయెను. షాహెఆలం ఆతని శరణుజొచ్చి సర్వాధికారము సింధియా కిచ్చెను. సింధియా ఆగ్రాపై దాడివెడలియుండిన కాలములో షాహెఆలంను జబితాఖాను కొడుకు గులాంఖాదిర్ ఇంచుమించు తన ఖైదీ చేసుకొని దాచిన ధనమంతా అప్పజెప్పుమనెను. ఆతని వద్ద పైకము లేకపోయెను. అతనిని కొట్టించి, బేగముల కొట్టి, అవమానపరచి షాహెఆలం కండ్ల నూడపెరికి కాలితో త్రొక్కెను. సింధియా కిది తెలియగానే ఢిల్లీకి వెళ్లెను. ఖాదిర్ పారిపోయెను. వానిని తుదకు పట్టి తెప్పించి, కండ్ల పెరికించి, కాలు సేతులు నరికించి తలగొట్టించెను. షాహెఆలంకు ౫ లక్షల పెన్షను యిచ్చి ఢిల్లీ రాజ్యముపై సింధియా తన అధికారాన్ని చెలాయించెను. అది ౧౭౮౮లో జరిగెను. ఆ తేదీతో ఢిల్లీ సామ్రాజ్యము ముగిసిన దనవలెను. మరొకమారు హిందువులు ఢిల్లీ సామ్రాజ్యమును వశపరచుకొనిరి. అది సింధియా వలన నయ్యెను. ౧౨ ఫిబ్రవరి ౧౭౯౪లో మాహాద్జీసింధియా చనిపోయెను. (Flowers of Hindu Chivalry. Hemachandra Rai, ఇ.)

## సంత్ ఫ్రాన్సిస్

సెయింట్ (సంత్) ఫ్రాన్సిస్ క్రీ. శ. ౧౧౮౨లో ఇటలీలోని అస్సిసీ అను ఊరిలో జన్మించెను. అతడు గొప్ప ధనికుని కుమారుడు.

యౌవనములో సర్వసుఖాలను అనుభవించి విషయలోలుడై యుండెను. ఒకమారు రెండు కక్షుల పోట్లాటలో పాల్గొని ఒక ఏడు జెయిలులో నిర్బంధింపబడెను. బందీగృహము ప్రపంచములో అనేక మహనీయులను సిద్ధము చేసినది. అందు వీరొకరు. జెయిలులో నున్నప్పుడు వీరిలో గొప్ప భావపరివర్తనము జరిగెను. ఏసుక్రీస్తువంటి జీవనమే సరియగు జీవనమని అతడు నిశ్చయించుకొనెను. మన వేమనవలె మారినాడన్నమాట. అప్పుడతనికి ౨౦ ఏండ్ల వయస్సు. అప్పటినుండియు అతి మితజీవియై అహింసాసాధకుడై ప్రజాసేవ చేస్తూవచ్చెను. కుష్ఠరోగులసేవ చేసెను. బీదలపాలిటి సేవకుడయ్యెను. రోగులకు పరిచర్యలు చేసెను. పశుపక్షులను తుదకు పంచభూతాలను తనవలెనే ప్రేమించవలెనని బోధించెను. అతడు తుదికాలములో ముస్లిములకు క్రైస్తవమత బోధ చేయబోయెను. ౧౨౧౯లో ముసల్మానులతనిని జెయిలులో బంధించి ఈజిప్టు సుల్తాను ముందు నిలబెట్టిరి. అక్కడకూడా సుల్తానుకే క్రైస్తవమత బోధలు చేయ మొదలుపెట్టెను. సుల్తాను దయతలచి అతన్ని వదలిపెట్టి పంపించివేసెను. అతన్ని క్రైస్తవ లోకము నేటికినీ చాలా భక్తితో పూజిస్తున్నది. అతని యనుయాయివర్గమిప్పటికినీ కలదు. ఆ వర్గమువారినే ఫ్రాన్సిసియనులు అని యందురు.

## రాబర్ట్ బ్రూస్

బ్రిటిషు దీవులలో ఇంగ్లండు, స్కాట్లండు, ఐర్లండు అను మూడు భాగములు కలవు. ఇంగ్లండు రాజులు స్కాట్లండు రాజులు వేరువేరుగా నుండిరి. కాని ఇంగ్లీషువారు ఏడెనిమిదినూర్ల ఏండ్ల పర్యంతము స్కాట్లండుతో పోరాడి తుదకు దానిని వశపరచుకొని తమతో కలుపుకొనిరి. స్కాట్లండులోని స్కాట్ జనులు తమ స్వాతంత్ర్యమునకై చాలా త్యాగాలుచేసిరి.

క్రీ. శ.  వరకు ప్రథమ ఎడ్వర్డు అను రాజు రాజ్యము చేసెను. అతడు క్రూరుడు. నిరంతరము స్కాట్లండు రాజులతో

యుద్ధాలుచేసి తన చేజిక్కిన యోధుల నందరిని తలగొట్టించుచు వచ్చెను. వాలస్ అను రాజు అతనితో పోరాడి పట్టుబడెను. ఎడ్వర్డు అతని తల గొట్టించెను. పిమ్మట రాబర్టు బ్రూస్ అను నతడు రాజయ్యెను. బుచన్ అను సామంతరాణి అతనికి కిరీటము పెట్టెను. ఆమెను ఎడ్వర్డు పట్టి తెప్పించి ఒక పంజరములో పెట్టి పెద్దకోటపైనుండి వ్రేలాడ గట్టించెను. సైన్యము నంపి బ్రూసు నోడించగా బ్రూసు పారిపోయి దాగుకొనెను. అతనికి సహాయము చేసిన వారందరిని చంపించుతూ వచ్చెను. బ్రూసు దిక్కులేనివాడై అడవులలో దాగియుండెను. అతని రాణి అడవులలో జీవించలేదని ఆమెను కోటకు పంపగా ఆ కోటను ముట్టడించి ఆమెను బందీగా ఎడ్వర్డు పట్టి తెప్పించి బంధించెను. ఆమెను విడిపించుటకై పోరాడిన బ్రూసుతమ్ముడు యుద్ధములో బందీయై ఎడ్వర్డు ఆజ్ఞలచే వధింపబడెను.

ఒకనాడు దిక్కులేనివాడై ఒక యింటిలో బ్రూసు దాగియుండగా ఒకసాలెపురుగు తన అల్లికగూడునుండి క్రిందపడి మరల దానిని పొందుటకై పైకి ప్రాకుచు క్రింద పడుటను గమనించెను. తనలో నుండి తీగె నల్లుచు దానిపై ప్రాకుచు అది తెగుటచే క్రిందపడుచు మరల మరల ప్రయత్నముచేసి యెనిమిదిమారులు క్రిందపడి తొమ్మిదవమారు తన స్థానమును చేరుకొనెను. బ్రూసు ఆదృశ్యమును చూచి ఒక చిన్న సాలెపురుగు తన పట్టు విడువక తుదకు విజయమందిన మానవులును ప్రయత్నము చేసిన యెందుకు తమ యభీష్టమును పొందలేరు? నేను తుదివరకు పోరాడితీరుదును అని నిశ్చయించుకొనెను.

౭౦౦ భటులను కూర్చుకొని ఎడ్వర్డు సైన్యముతో పోరాడి ఓడిపోయెను. స్కాటులలోని ధనికులగు దొరలు ఇంగ్లీషు రాజు ద్రవ్యమునకు దాసులై ద్రోహము చేసిరి. మరల బ్రూసు అడవుల పాలయ్యెను. మనిషి రక్తాన్నిపీల్చే వేటకుక్కలను కూడా అతని జాడ తీయుటకై ఇంగ్లీషు రాజు వదలెను. ఒక తడవ వాటినుండి తప్పించుకొనుటకై ఒక నిండు నదిలో పడి యీదుకొని అవతలి గట్టు చేరెను. ఒకే ఒక

అనుచరునితో అతడు దట్టమగు అడవులలో ఆకలితో తిరిగెను. ఒకనాడు గొల్లలవలె నుండువారు కొందరు వారి కాహార మిచ్చిరి. వారిరువురును తిని పండుకొనిరి. కొంతసేపటికి ఆహార మిచ్చినవారు తన యనుచరుని పొడిచి చంపి తనపై వచ్చులోపల బ్రూసు మేల్కొని ఆ ముగ్గురిని ఒక్క త్రుటిలో చంపి యచటినుండి వెళ్ళిపోయెను. అక్కడినుండి తిరుగుతూ ఒక వితంతువు యొక్క యింటికి వెళ్లెను. ఆమె యతనికి స్వాగత మిచ్చుచు నిట్లనెను "ఒక వ్యక్తికి గాను నే నందరికీ ఆతిథ్యమిచ్చు చున్నాను. నీకు స్వాగతము". "ఆ వ్యక్తి ఎవరు" అని బ్రూసు అడిగెను. "మా ధర్మప్రభువు బ్రూసు" అని ఆమె యనెను. "నేనే" అని బ్రూసు అనగానే ఆమె మోకాలు వంచి రాజపూజ చేసి "తమకు అనుచరులు లేరే. నా కుమారులు ముగ్గురున్నా నీ కనుచరులు" అని వారి నతని సేవలో నుంచెను.

దైవానుగ్రహము బ్రూసుకు ప్రారంభమయ్యెను. ఒకటి తరువాత నొకటిగా తన దేశములోని కోటల నన్నింటిని గెలిచెను. ఇంతలో క్రూరుడైన ప్రథమ ఎడ్వర్డు చనిపోయెను. రెండవ ఎడ్వర్డు గొప్ప సైన్యముతో బ్రూసును ఎదిరించెను. క్రీ. శ. ౧౩౧౪లో బానక్బరన్ వద్ద యుద్ధము జరిగెను. అది స్కాట్లండు చరిత్రలో చాలా గొప్పయుద్ధము. అందు ఇంగ్లీషు సైన్యము సంపూర్ణముగా ఓడెను. 30,000 మంది యుద్ధభూమిపై చచ్చిరి. తక్కినవారు పారిపోయిరి. ఎడ్వర్డురాజు ప్రాణాల దక్కించుకొనుటకై మహావేగముతో పారిపోయెను. రాబర్టు బ్రూసు స్వతంత్రరాజయ్యెను. తన వద్ద నుండిన ఖైదీలను వదలి వారికి మారుగ తన భార్యను ఇంగ్లీషు రాజు ఖైదినుండి విడిపించుకొనెను. తాను దిక్కులేక అడవులలో తిరిగిననాడు సాయపడిన వారందరికినీ ఇనాములిచ్చెను. తనకు ఆశ్రయ మిచ్చిన వితంతువును మరచిపోలేదు. ఆమెకు చాలా భూములను శాశ్వతముగా ఇనాముగా నిచ్చెను. రాజ్యమును సర్వజనప్రియంకరముగా పాలించెను. నేటికినీ బ్రూసు పేరు చెప్పితే స్కాటు జాతివారికి అపారమగు భక్తి, ఆనందము కలుగును

(ఇంగ్లీలో జి. ఏ. హెంటీ. In freedom's cause స్వాతంత్ర్యార్థము అను పేరుతో బ్రూసు యుద్ధాలను అత్యంత రమ్యముగా రచించినాడు.)

## హోమర్

హిందువులకు వ్యాసుడు, వాల్మీకి ఈట్లో గ్రీకుదేశపు గ్రీకులకు హోమర్ అట్టివాడు. మన వ్యాస వాల్మీకుల కాలము మనకు తెలియదు వారి హోమర్ కాలము వారికి తెలియదు. హోమర్ ట్రాయి యుద్ధమును ఇలియడ్ అను పురాణముగా వ్రాసెను. హెలెన్ అను సుందరాంగి విటుని వెంట పారిపోగా దాని భర్త గ్రీకురాజుల సహాయముతో ట్రాయిని ముట్టడించి గెలిచి అందలి జనులను చంపి తన హెలెన్‌ను తిరిగి తెచ్చుకొని యేలెను. ఆ యుద్ధము క్రీ. పూ. ౧౨౦౦నాడు జరిగెనందురు. కాన హోమర్ క్రీ. పూ.౧౦౦౦ నాటివాడందురు. అతడు గ్రీసు దేశములోని వాడే కాని ఎక్కడ జన్మించెనో తెలియదు. అతని పురాణము మన భారతము వంటిది. అతడు ఒడిస్సే అను మరొక పురాణాన్ని వ్రాసెను. అతడు మహాకవి యూరోపులో అతడే ఆది కవి అంటారు.

## వర్జిల్

గ్రీసువారికి హోమర్ ఎట్టి కవియో రోమువారికి వర్జిల్ అట్టి కవి. అతడు ఇటలీలోని మంటువాలో క్రీ. పూ. ౭౦లో ౧౫ అక్టోబరునాడు జన్మించెను. అతడు చాలా గ్రంథాలు వ్రాసెను. కాని ఈనియడ్ పురాణము వల్లనే అతడు ప్రఖ్యాతుడయ్యెను. అది ఈనియాస్ అను ట్రాయి రాజు వంశపు వాని చరిత్ర. వర్జిల్ లాటిన్ భాషలో ఉత్తమ కవి. అతడు క్రీ. పూ. ౧౯లో సెప్టెంబరు ౨౧ నాడు చనిపోయెను.

## స్మిత్

దక్షిణ అమెరికా ఉత్తర భాగములో బ్రిటిషు గయానా దేశము కలదు. అది ఇంగ్లీషువారి వలస రాజ్యము. దాని వైశాల్యము ౯౦౨౭౭ చదరపు మైళ్ళు. అందు బంగారు గనులున్నవి. అడవులు సమృద్ధి. చెరుకు, వరి ఎక్కువ. నారింజ, అరటి, నిమ్మ, టెంకాయలు అడవి చెట్లవలె సమృద్ధిగా కలవు. అచ్చటికి పశ్చిమ ఆఫ్రికా నీగ్రో లను బలవంతముగాను, మోసముతోను పట్టుకొనిపోయి మనిషిని ౭౦ పౌనుల ప్రకారము బానిసలనుగా ఇంగ్లీషు పౌరులు కొంద రమ్మికొని ధనికులైరి. క్రీ. శ. ౧౭౯౦ వరకే ఇంగ్లీషు స్పెయిన్ వర్తకులు ౭ లక్షల నీగ్రోలను అమెరికా ఖండాలలో అమ్మియుండిరి. ఆ విధముగా నీగ్రో బానిసలు గయానాలో ౭౭౦౦౦ మంది చేరిరి. ఇంగ్లీషువారేమో ౩౫౦౦ మందే యుండిరి. ఆ బానిసలను వారు తెల్లవార ౬ గంటలనుండి సగం రాత్రి వరకు కొరడాలతో వీపులు పగులగొట్టి సగం తిండి పెట్టి ఘోరముగా హింసించి, వారి స్త్రీలను చెరిచిరి. వారికి బట్టలీయ కుండిరి. నీగ్రో బానిసలు స్త్రీ పురుషులు నగ్నముగా తిరిగిరి. అట్టి స్థలానికి క్రైస్తవ ప్రచారానికిగాను జాన్‌స్మిత్ అను ఇంగ్లీషు పాదిరి ౧౮౧౭లో వెళ్ళెను. అతడు ౧౭౯౦లో ఇంగ్లండులో జన్మించిన బీద వాడు.

గయానాలో మర్రే అను గవర్నరు మహా ఘోర రాక్షసుడు. అక్కడ వుండే తెల్లవారంతా భూములలో బానిసలతో పని చేయించి అపారంగా లాభం పొందిరి. బానిసలకు చదువువస్తే మాట వినరని వారిని చదువు చదువనీయలేదు. మతబోధకూడా కానియ్యలేదు. స్మిత్ వచ్చిన కొంత కాలములో బానిసలలో చాలామంది చదువ నేర్చు కొనిరి. క్రైస్తవ మతములో చేరిరి. అది తెల్లయజమానులకు సహింప రానిదయ్యెను. వారు నీగ్రోలను చాలా బాధపెట్టిన వారు తిరుగ బడిరి. తిరుగబడగా వారిలో నాలుగయిదు నూర్లమందిని కాల్చి

చంపిరి. తక్కిన వారిని ఘోరముగా హింసించిరి. వారి తిరుగుబాటుకు స్మిత్ ఫాదిరీయే కారణుడని అతనిని బంధించియుంచి లేనిపోని తప్పుడు నేరాలు మోపి అతనిని ఉరిదీయ నాజ్ఞాపించిరి. కాని అంతలోనే స్మిత్ జెయిల్‌లోని కష్టమువల్ల ౧౮౨౪లో చనిపోయెను. ఇంగ్లండులో అందుపై పెద్ద సంచలనము జరిగెను. పార్లమెంటువారు ౨ కోట్ల పౌనులను తెల్ల యజమానులకిచ్చి నీగ్రో బానిసలకంతా ముక్తి నిప్పించిరి. ఆ ముక్తికి మూలకారకుడు స్మిత్. అతనిని తమ పాలిటి క్రీస్తుగా నీగ్రోలిప్పటికీ పూజిస్తారు. క్రీ. శ. ౧౮౬౧లో ఒక సంయుక్త అమెరికాలో మాత్రమే ౪౦ లక్షల నీగ్రోలు బానిసలుగానుండిపోయిరి. వారిని విముక్తి చేసిన నాథుడు అబ్రహాం లింకన్.

(Smith of Demarard by David Chamberlain.)

## యువన్‌చ్వాంగ్

ఇతడు చీనా దేశము వాడు. చీనాలో టంగ్ వంశము వాడగు టాయిచంగ్ అనే గొప్ప చక్రవర్తి రాజ్యము చేసెను. అతనికి మహమ్మదు పైగంబర్ తన మతమును స్వీకరించుటకై జాబు పంపెను. అతడు తన రాజ్యములో మసీదు కట్టించి ఇస్లాం ప్రచారకులకు తావిచ్చెను. అట్టి విశాల హృదయుని కాలమందే యువన్ చ్వాంగ్ ఉండెను. అప్పుడు హిందూస్థానమందు హర్ష చక్రవర్తి రాజ్యము చేస్తూ ఉండెను. చీనా యాత్రికుడు కాలి నడకతో గోబీ యెడారి గుండా హిమాలయ పర్వతాలగుండా నడిచి హిందూస్థానము వచ్చి తక్షశిల నలందాది బౌద్ధ విద్యా పీఠాలను చూచి కొన్ని యేండ్లు ఈ దేశమందుండి సంస్కృత పాలీభాషలు నేర్చెను. తర్వాత ఆంధ్ర దేశమందలి అమరావతీ ప్రాంతాలను చూచి మనదేశము నుండి నూర్లకొలది సంస్కృత పాలీ బౌద్ధ గ్రంథాలను తీసుకొని జావా సుమత్రాది ఇండొనీషియా ద్వీపాలద్వారా చీనాకు వెళ్ళెను. హిందూస్థానములో అతడు ౧౪ ఏండ్లు సంచారము చేసెను. అజంతాలో, నలందాలో కొన్ని యేండ్లు చదువుకొనెను. చాలా సంస్కృత గ్రంథాలను చీనా

భాషలోనికి పరివర్తనము చేసెను. అయిదేండ్ల కొకమారు ప్రయాగలో శ్రీహర్షుడు మహా సత్రయాగము చేయుచుండెను. అందొకమారు యువన్ చ్వాంగ్ పాల్గొనెను. హర్షుని ముఖ్య పట్టణమగు కన్యాకుబ్జము (కనేజ్)లో అతడు కొన్ని నెలలుండెను. అతడు చీనాకు వెళ్ళి తన యాత్రా విశేషాలను వ్రాస్తూ హర్షుని ధర్మరాజ్యాన్ని హిందువుల నైతిక విశిష్టతను ధార్మికతను వేనోళ్ళ శ్లాఘించి వ్రాసెను.

తన ప్రయాణాలను గూర్చి వ్రాసుకొనెను. హ్యూన్ చ్వాంగ్ గోబీ ఎడారిలో ఒకమారు నాలుగు దినాలు నీరులేక అవస్థపడెను. దైవానుగ్రహముచే బఃఖ్ దేశము చేరి అచటినుండి కాబూలు చేరెను. జలాలాబాదులోని ఒకగుహలో అతనికి బుద్ధుని ఆకారము తేజస్సహిత ముగా కాన్పించెనని వ్రాసుకున్నాడు. అచ్చటినుండి గాంధార దేశము ద్వారా ప్రయాణము చేసి కన్యాకుబ్జము చేరెను. పులకేశియొక్క చాళుక్యరాజ్యములో సంచారము చేసి అచ్చటి జనులు పగ సాధింతు రని, శరణు జొచ్చినవారికి ప్రాణమిత్తురని, శత్రువులకు ముందు తెలిపి యుద్ధము చేయుదురని, ఓడిన సేనానికి చీర కట్టించి ఆత్మహత్య చేసు కొనునట్లు చేయుదురనీ, జనులు తెల్లని బట్టలు కట్టుదురనీ, పరిశుద్ధ ముగా నుందురనీ, మోసములేని వారని న్యాయపరులనీ వ్రాసినాడు.

నలందా విద్యాపీఠాన్ని చాలా బాగా వర్ణించినాడు. అందు ౧౦౦ విద్యార్థుల తరగతిగదు లుండెనని ౧౦౦౦౦ విద్యార్థులుండిరని దగ్గరి గ్రామాలనుండి వారి భుక్తికి జనులు యిచ్చుకొను చుండిరనీ, క్రమ శిక్షణ చాలా కఠినముగా ఉండెననీ, వ్యాకరణము, వైద్యము, తర్కము, మీమాంసము నేర్పుచుండిరనీ, విద్యలో ఉత్తములగువారిని ఏనుగుపై ఊరేగించి పంపుచుండిరనీ, ఓడినవారిని గుంతలలో త్రోయుచుండిరనీ వ్రాసెను.

హ్యూన్ చ్వాంగ్ తన దేశమును అనేకవిగ్రహాలతో, అనేక తాళపత్రగ్రంథాలతో, అనేక విచిత్ర వస్తువులతో క్రీ. శ. ౬౪౬లో

చేరుకొనెను. అతడు క్రీ. శ. ౬౬౮లో ౬౫ ఏండ్ల వయసులో చని పోయెను.

## సైమన్ బొలివర్

ఇతడు దక్షిణఅమెరికాలోని ఉత్తరతీరమందుండు కరకాస్ అను పట్టణములో క్రీ. శ. ౧౭౮౩లో జన్మించెను. ఇతడు స్పెయిన్ జాతి వాడు. కొలంబస్ అమెరికాను చూచిన తర్వాత దక్షిణ అమెరికాలో సగము ఖండము స్పెయిను వశమయ్యెను. తక్కిన భాగములో బ్రెజిల్ పోర్చుగల్ వశమయ్యెను. తర్వాత ఇంగ్లీషువారు, ఫ్రెంచివారుకూడా విజయంచేసి మిగిలిన దేశాన్ని వశపరచుకొనిరి. అట్టి దక్షిణ అమెరికా దేశానికి స్వాతంత్ర్యమును సంపాదించిన భక్తుడు బొలివర్. అతడు స్పెయిన్ జాతివాడే అయినను దక్షిణ అమెరికాలో పుట్టినవాడగుటచే ఆ ఖండమందలి అభిమానముతో స్పెయిన్ దేశముపైననే అమెరికా జనులను ఎగలేపి యుద్ధాలు చేసెను. రెండు యుద్ధాలలో ఓడి ప్రక్కన నుండు ఇంగ్లీషువారి జెమైకాలో దాగెను. మూడవమారు ప్రయత్నం చేయగా అతడే గెలిచెను. ఆ తర్వాత దక్షిణ అమెరికా ఖండములోని వెనుజూలా, కొలంబియా, ఈక్వడార్ అను మండలాలను కలిపి (రిపబ్లికు) ప్రజారాజ్యాలుగా చేసెను. ప్రజలు వాటి మొదటి అధ్యక్షునిగా అతనినే ఎన్నుకొనిరి.

ఈ మూడు దేశాల స్వాతంత్ర్యమును చూచి బ్రెజిల్ వారున్నూ తిరుగబడి ప్రజారాజ్యాన్ని స్థాపించుకొనిరి. అర్జెంటైనా, ఛిల్లీ దేశాలున్నూ అట్లే చేసెను. పెనామా, పెరూ మండలాలు స్వతంత్రి మగుటకు బొలివర్ సహాయపడెను. పెరూకు దక్షిణమున నుండు పెద్ద దేశానికి బొలివర్ పేర బొలివియా అను పేరు పెట్టిరి. దక్షిణ అమెరికా ఖండములో నాలుగయిదు స్థలాలకు అతనిపేరే పెట్టిరి. దక్షిణ అమెరికా ఖండ స్వాతంత్ర్య కారకుడు బొలివర్ అని ఆ ఖండమంతా అతన్ని పూజిస్తున్నది.

## డార్విన్
(౧౮౦౯ – ౧౮౮౦)

ఇతడు ఇంగ్లీషువాడు. ౧౮౨౫లో వైద్యము ప్రారంభించి రెండేండ్ల తర్వాత అది తనకు సరిపడదని వృక్షజంతు శాస్త్రాల నభ్యసించెను. తర్వాత దక్షిణ అమెరికా తీరాలలో, శాంతి మహాసాగర ద్వీప తీరాలలో పరిశోధనలు చేసెను. కొన్ని యేండ్ల తర్వాత వృక్ష జంతు జీవితములో నైసర్గికపు మార్పు (natural selection) ఎల్లప్పటికీ ఉంటుందనీ, దేశకాల నైసర్గిక పరిస్థితులను బట్టి వృక్ష జంతువులలో మార్పులు కలుగుననీ నిరూపించెను. వేల లక్షల యేండ్ల క్రిందట భూగర్భములో నిలిచిపోయిన కళేబరాలను చూచి అట్టి రూపముగల జంతువు లిప్పుడు లేకుండుట గమనించి అది నశించిపోయెను. కాని వాటినుండియే చాలాచాలా మార్పులు పొంది ఇంకొక జాతియేమో అన్న భ్రాంతిని కలిగించే వేరుజాతి మనకు కనిపిస్తున్నదనీ అదే మత్స్య న్యాయమని (Survival of the fittest) నిరూపించెను. ఈ సిద్ధాంతాన్ని చాణక్యుడు మత్స్యన్యాయమని చెప్పియుండెను. అనగా చిన్న చేపను పెద్ద చేప మింగితే పెద్ద చేపను రంపపు చేప (షార్కు) తిమింగిలము మింగితే వాటిని మనిషి చంపి తింటాడు. అదే సిద్ధాంతాన్ని నీతి బోధకులు "వీరభోజ్యావసుంధరా" అనిరి. ఆ సిద్ధాంతాన్నే డార్విన్ బోధించెను. అదే సిద్ధాంతము ననుసరించియే అతడు మనిషి కోతి నుండి ఏర్పడెను అని నిరూపించెను.

## బిస్మార్క్
(౧౮౧౫ – ౧౮౬౧)

క్రీ.శ. ౧౮౧౫లో నెపోలియన్ వాటర్లూ యుద్ధములో ఓడి ఖైదీ అయ్యెను. అదే ౧౮౧౫లో బిస్మార్క్ అను జర్మన్ సేనాని జన్మించెను. యూరోపు దేశములోని జాతీయత అనేది ప్రతి దేశములో

ప్రబలుటచే అవి బలవత్తర దేశాలయ్యెను. జర్మనీలో జాతీయత బిస్మార్క్ కాలము వరకు కలుగలేదు. అక్కడ పెద్దపెద్ద జాగీర్దారు లుండిరి. వారిని యూంకర్లు అనిరి. ఆ వర్గములోనే బిస్మార్కు పుట్టెను. ౧౮౬౨ లో ప్రష్యా ప్రధానమంత్రి యయ్యెను. కాగానే ప్రతివాడూ నిర్బంధముగా మిలిటరీలో చేరవలెనని శాసించెను. కొన్ని యేండ్లలో ప్రష్యాలోని సేన యూరోపులో సాటిలేని దయ్యెను. ఆస్ట్రియాదే అంత వరకు పైచేయిగా ఉండెను. దానిపై యుద్ధముచేసి లోబరుచుకొనెను. అప్పుడు ఫ్రాన్సులో నెపోలియన్ మనుమడు మూడవ నెపోలియన్ రాజుగా ఉండెను. అతడు ప్రష్యా వృద్ధిని సహించలేక యుద్ధ ప్రకటన చేసెను. అదే బిస్మార్కున్నూ కోరుతూ ఉండెను. శత్రు భయము చూపి జర్మనీలోని సంస్థానాల నన్నింటిని ఏకము చేసెను. ఫ్రాన్సుతో యుద్ధముచేసి నెపోలియనును బందీగా పట్టుకొని యుద్ధం ఖర్చులు వసూలుచేసి ఆల్ సేస్ లోరైన్ అనే మండలాలను లాగుకొనెను. (ఆ మండలాలను ౧౯౧౪-౧౮ యుద్ధములో ఫ్రెంచివారు మళ్ళీ లాగుకొనిరి) ౧౮౭౧లో ప్రష్యా రాజును జర్మన్ చక్రవర్తిగా బిస్మార్కు పట్టాభిషేకము చేసెను. అతన్ని జర్మనీయొక్క ఉక్కు మనిషి (iron man) అని అంటారు.

## త్యాగరాజు

దక్షిణ హిందూస్థానమంతటను సంగీత ప్రియులకంతా ప్రప్రథమ వంద్యుడు త్యాగరాజస్వామి. అతడు ౧౦౦ ఏండ్ల క్రిందట చనిపోయినను అతని కీర్తి హిందూస్థాన మంతటను వ్యాపించినది. అతడు శ్రీరామ భక్తుడు. శ్రీరాము డతనికి ప్రత్యక్షమైన కథలను అతని భక్తులంతా నమ్ముతారు. అతడు సంస్కృతాంధ్రాలలో గొప్ప విద్వాంసుడు. అతని కీర్తనలలో తెనుగు నుడికారము సమృద్ధిగా ఇమిడియున్నది. సంగీత శాస్త్రములో ఎవ్వరున్నూ గానము చేయుటకుగాని గీతముల రచించుటకుగాని భయపడే అరుదైన కొన్ని రాగములతో కృతులను

రచించెను. అతని కీర్తనలన్నీ తెనుగులోనే ఉండినను ఆ కీర్తనలను తమిళులే యెక్కువగా గానము చేయుదురు. మళయాళీలకు కూడా అవే ఆశ్రయమైనవి. తమిళులలో గొప్ప "భాగవతారులు" తమిళ భాషలో త్యాగరాజు ననుకరింపబోయి బోరగిలపడిరి. అతడు ౨౪౦౦ పైగా కీర్తనల రచించెను. ప్రహ్లాద భక్తి విజయము, నౌకా చరిత్రము అను రెండు యక్షగానాలను రచించెను. దీపకము, కోకిలధ్వని, నభోమణి, రంజని, సుపోషిణి, సారమతి అను అరుదైన రాగాలకు కృతులు రచించెను.

తంజావూరును షాహజీ మహారాజుగారు రాజ్యం చేసిన కాలములో గిరిరాజకవి అను నతడుండెను. అతని కైదుగురు కుమారులు. కడగోటివాడు రామబ్రహ్మం. అతడు తిరువరూరులో ఉంఛవృత్తితో జీవించుచుండగా అతని కిద్దరు కుమారులు కలిగిరి. అందు రెండవ వాడే త్యాగరాజు. అతడు ౪ మే ౧౭౬౭ సోమవారమునాడు జన్మించెను. తర్వాత ఆ కుటుంబము తిరువయూరు అను ఊరికి కదలెను. అది తంజావూరు రాజ్యములోనిది. తంజావూరు రాజు తనకు రామాయణ పారాయణము చేయుటకు రామబ్రహ్మము నేర్పాటుచేసి పశుపతి కోయిలలో భూమి నినాముగా యిచ్చెను. త్యాగరాజు తల్లి పేరు శాంతమ్మ. త్యాగరాజు తన తండ్రి వద్దనే సంస్కృతాంధ్రములను సంగీతమును అభ్యాసము చేసెను. తంజావూరు ఆస్థాన సంగీత విద్వాంసుడుగా సొంటి వెంకటరమణయ్య అను నాంధ్రుడుండెను. అతని గానమునకు బాలుడగు త్యాగరాజు ముగ్ధుడగువాడు. అందుపై అతని తండ్రి సొంటివారితో మాట్లాడి త్యాగరాజుకు సంగీతము నేర్పు నేర్పాటు చేసెను. రెండేండ్లలో గురువు శిష్యునికి చెప్పదగినది లేకపోయెను.

త్యాగరాజు ౧౮వ ఏట అతని తండ్రి చనిపోయెను. అన్నదమ్ముల విభాగములలో త్యాగరాజు ఇంటిదేవర యగు శ్రీరామ పంచాయతన విగ్రహమును పొంది సంతోషపడెను. కంచిలోని శ్రీ రామకృష్ణయతీం

ద్రులు త్యాగరాజును కలిసి ౯౬ కోట్ల మారులు శ్రీరామ జపము చేయుమని చెప్పెను. త్యాగరాజు ఆ పనిని ౨౦ ఏండ్లలో పూర్తి చేసెను. అప్పుడు శ్రీరాము డతనికి దర్శన మిచ్చెనందురు. అప్పుడే "ఏల నీ దయరాదు" అన్న పాట రచించెనందురు. తిరువాన్కూరులో పట్కాళి గోవిందమారర్ అను మహా సంగీత విద్వాంసుడు త్యాగరాజు కీర్తనలు విని ఆనందపరవశుడయ్యెను. ఆ సమయములోనే "ఎందరో మహానుభావులు" అను కీర్తనను అతడు రచించెను. త్యాగరాజు సంగీత ప్రశస్తిని విని ఉత్తర హిందూస్థానములో నుండిన రామదాసు అను విద్వాంసుడు త్యాగరాజుందుకావుకు వెళ్ళి వారిని దర్శించి ధన్యుడయ్యెను. త్యాగరాజు కీర్తిని విని మైసూరు మహారాజాయున్నూ తిరువాన్కూరు మహారాజాయున్నూ అతన్ని తమతమ ఆస్థానాలకాహ్వానించిరి. రామభక్తుడగు త్యాగరాజు తన సంగీత విద్యను మానవులకు అమ్ముకొన దలచలేదు. మహారాజుల ఆశ్రయాన్ని నిరాకరించిన త్యాగయ్య ఎంతటి వెర్రివాడో అని అందరూ అనుకొనిరి. త్యాగరాజు తుదికాలములో తిరుపతికి వెళ్ళెను. అచ్చట "తెర తీయగరాదా" అని పాడి వేంకటేశ్వరుని ముందున్న తెరను తీయించెను. అచ్చటినుండి మద్రాసుకు వెళ్ళెను. అచ్చట సుందరేశ మొదలియారు అను నతడు రు. ౧౦౦౦ లను సమర్పించుకొనగా నిరాకరించెను. అంత్య కాలములో త్యాగరాజు సన్యాసాశ్రమములో ప్రవేశించెను. ౬ జనవరి ౧౮౪౭ నాడు స్నానసంధ్యలుచేసి చుట్టాలు, భక్తులు, అభిమానులు పరివేష్టించియుండ తన కులదైవతమగు శ్రీరామ పంచాయతన విగ్రహము ముందు హారతి యిచ్చి "గిరిపై నెలకొన్న" అను తుది కృతిని రచించి పాడి సాష్టాంగ దండప్రణామ మాచరించి ప్రాణాలు వదలి సమాధిస్థుడయ్యెను. తిరువయ్యారులో అతని సమాధి కలదు. వారి నిర్యాణ దివసమునుండి వారము దినాలు ఏటేట సంగీత సభలు అచ్చట జరుగును,

# మహర్షి దయానంద సరస్వతి

శ్రీ మద్దయానంద సరస్వతీయతీంద్రులు క్రీ. శ. ౧౯వ శతాబ్దములోని అసామాన్యమగు మహచ్ఛక్తి. శ్రీ వారి కాలములోని పరిస్థితుల గమనిస్తే వారి గొప్పతనము మరింత వ్యక్తమగును. ౧౮౦౦ నుండి ౧౯౦౦ వరకు హిందువులు పతితులైరి. ఒక దిక్కు తురకలు ఒకదిక్కు క్రైస్తవులు వారిని తమ తమ మతాలలో కలుపుకొను చుండిరి. పైగా హిందువులు రాళ్ళురప్పల పూజిస్తారు. అంటు ముట్టు కలవారు పసరాలకు మొక్కుతారు. నీచకర్మలు చేస్తారుఅని తూర్పార పట్టుతూ ఉండిరి. అట్టి నిస్సహాయ స్థితిలో శ్రీ దయానందు లవతరించిరి. హిందువుల వైదికమతములో ఈ కుళ్ళంతా లేకుండెననీ మళ్ళీ వైదికమతాన్ని పునరుద్ధరించి మధ్య పెరిగిపోయిన పౌరాణిక మతాన్ని తొలగించి హిందువులలో దార్ఢ్య ప్రతిఘటన శక్తి కలిగించవలె నని శ్రీ వారు ఆర్య సమాజమును స్థాపించిరి. ఇస్లాం మతము క్రైస్తవ మతము తార్కికబుద్ధికి సమాధానము చెప్పలేదని శాస్త్రీయముగను(Scientific) తార్కికముగను, శుద్ధమైన మతము ఆర్యమతమే అని వారు సర్వమతాల ప్రతినిధులతో వాదించి విజయధ్వజమెత్తిరి. ఋషి భవిష్యద్దృష్టి కల వాడు. దయానందులకట్టి దివ్యదృష్టి యుండెను. వారి కింగ్లీషు ఏమిన్నీ రాకుండెను. కాని ఇంగ్లీషు చదివిన పండితులకన్న మించిన సంస్కారమును చేసెను. ఈనాడు రాష్ట్రభాష హిందీ కావలెనన్నారు. ఆ నాడు శ్రీ వారు తమ మాతృభాష హిందీ కాకున్నను హిందీలోనే ప్రచారము చేసిరి. ఈ నాడు జాతీయతకు ప్రాముఖ్యమున్నది. ఆ నాడే శ్రీవారు దానికే అగ్రస్థానమిచ్చిరి. ఈ నాడు స్వదేశీపైన అభిమాన మెక్కువ, ఆనాడే శ్రీవారు స్వదేశీ వస్తువుల ప్రచారము చేసిరి. అస్పృశ్యతా దోషమే కాక కులాల భేదాలను నిర్మూలింప ప్రచారము చేసిరి.

శ్రీవారి మొదటి పేరు మూలశంకర. వారు క్రీ. శ. ౧౮౨౪లో గుజరాతు దేశములోని మోర్వీ సంస్థానములో టంకర అనే గ్రామము

లో జన్మించిరి. వారి తండ్రి పేరు కర్సంజీ. అతడు ఔదీచ్య బ్రాహ్మణుడు. గొప్ప జమీందారు. శైవుడు. మూలశంకరు తన ౧౪వ యేట శివరాత్రినాడు దేవాలయములో జాగరణ చేసెను. ఆ నాడు తనకు శివుడు కనపడునని అందరు నిద్రపోయినా లింగాన్నే చూస్తూ రాత్రంతా కూర్చున్నాడు. కాని శివునికి మారుగా అతనికి ఎలుక కనబడింది. అది లింగముపై పాకులాడి లింగము ముందుండు ప్రసాదాన్ని ఆరగించినది. తండ్రిని లేపి ఇదేమి శివుడు అని అడుగగా ఒక తిట్టు జవాబుగా దొరికెను. తర్వాత నిజమైన శివుని కనుగొందమని ఇల్లు విడిచి పారిపోయెను. తండ్రి భటులు వెదకి పట్టుకొని వచ్చిరి. మళ్ళీ పారిపోయెను. ఈ తడవ దొరకలేదు. సన్యాసుల నాశ్రయించెను. వారందరు దొంగ సన్యాసులని తెలిసిపోయెను. తుదకు మటూరాలో గ్రుడ్డి సాధువగు స్వామీ విరజానందులవారి దర్శనమయ్యెను. స్వామివారివద్ద సంస్కృతమభ్యసించెను. విద్య పూర్తి కాగానే శ్రీ స్వామిగారు గురుదక్షిణ కోరిరి. "నేను వైదికమత ప్రచారము చేయుదును" అను శపథము చేయుమనెను. అట్లే అతడు చేసెను. మూలశంకరు దయానందసరస్వతీ నామధేయముతో మొదట దురాచారాలలో తగుల్కొన్న హిందూమత సంస్కారము చేసెను. కాశీకి వెళ్ళి అక్కడి పండితులపై సవాలువేసి ౧౬ నవంబరు ౧౮౬౯నాడు కాశీరాజాధ్వర్యములో పండిత సభ చేసెను. పండితులు స్వామిగారి సవాళ్ళకు జవాబుకు మారుగా కోలాహలము చేసిరి. స్వామిగారు ఏడుమారులు కాశీకి వెళ్ళి సవాళ్ళు వేస్తూ వచ్చిరి. ఏడుమారులున్నూ అల్లరిచేయుట తప్ప అచ్చటి పండితులకు వేరే మార్గము తోచదయ్యెను. ౭ ఏప్రిల్ ౧౮౭౫నాడు బొంబాయిలో స్వామివారు ఆర్యసమాజ స్థాపనము చేసిరి. తర్వాత శ్రీ వారు సత్యార్థ ప్రకాశికను, ఋగ్వేదాది భాష్యభూమికను, పాణినీయవ్యాఖ్యను, ఇంకా అనేక గ్రంథాలను రచించిరి. జోధపూరురాజుకు శ్రీ వారు నీతిబోధలు చేసిరి. అందొకటి రాజాగారు తన ఉంపుడుకత్తెను తొలగించుమనుట. అందుపై ఆ యుంపుడుకత్తె శ్రీ దయానందులవారికి విషము పెట్టించి చంపించెను. శ్రీ వారు ౩౦ అక్టోబరు ౧౮౮౩లో

(విక్రమశక ౧౯౪౦ దీపావళీ దినమునాడు) బ్రహ్మసాయుజ్యము పొందిరి.

ఆర్యసమాజమునకు దశసూత్రాలను శ్రీవారు నిర్మించియుండిరి. అవేవనగా :—

1. సమస్త విద్యలకు ఆదిమూలము పరమేశ్వరుడు. 2. అతడు నిరాకారుడు. 3. వేదమే సద్ధర్మ పవిత్ర ప్రమాణ గ్రంథము. 4. సత్యమునే ఆచరించవలెను. (సత్యంవద) 5. ధర్మమునే ఆచరించవలయును. (ధర్మంచర) 6. ప్రపంచమున కుపకారము చేయుట ఈ సమాజోద్దేశము 7. అందరినీ ప్రేమించవలెను. 8. అవిద్య అజ్ఞానము తొలగించవలెను. అందరి యున్నతియే తన యున్నతి అని ఎరుంగవలెను. 10. సమాజ నియమములకు అందఱు బద్ధులై యుండవలెను.

(ఆర్యసమాజము — పండిత గోపదేవ్.)

## హజరత్ ఉమర్

మహమ్మద్ పైగంబర్ గారి తర్వాత ఇస్లాం మతమును రాజ్యాలకు శాసించే అధికారిని ఖలీఫా అనిరి. హజరత్ ఉమర్ గారు రెండవ ఖలీఫా. ఖలీఫాలందరిలో ఉత్కృష్టుడితడే యని పేరుగాంచెను. సత్యాసత్యముల విచక్షణ కలవాడగుటచే. అతనికి అల్ ఫారూఖ్ అను బిరుదముండెను. ఆర్యులలోని గోత్రాలవలె అరబ్బులలో వంశముల గుంపులు ఏర్పాటుగా ఉండెను. ఆ గుంపును ఖబీలా అనిరి. ఖబీలాలలో పరస్పరం కలహాలుండేవి. ఉమర్ గారు చాలా బలీయమగు ఖురేష్ అను ఖబీలాలోనివాడు. చిన్న తనములో ఇతడు ఒంటెలకాపరిగా జీవించెను. ఇతడు చాలా బలాఢ్యుడు. చదువునేర్చి కవిత కూడా అల్లగలిగినవాడు. ఇతడు హజరత్ మహమ్మదుగారికంటే ౧౩ ఏండ్లు చిన్నవాడు. ఇస్లామంటే ఇతనికి పట్టరాని కోపము. తన దాసి ఇస్లాములో చేరినదని విని దాన్ని చావమోది దానికి మూలకారకుడగు పైగంబర్ గారినే చంపి

వేయవలెనని బయలుదేరెను. దారిలో ఒక డెదురై ఇట్లనెను. "నీ చెల్లెలు నీ బావ ఇస్లాంలో చేరినారు. మొదట నీ యిల్లు సరిపెట్టుకో" ఉమర్ ఆగ్రహోదగ్రుడై చెల్లెలిని చాలా బాధించి కొట్టి విసిగి తుదకు ఖురానులో ఏముందో చదువు మనెను. కొంత వరకు విని అందలి చక్కని శైలికి భావములకు ముగ్ధుడై అప్పుడే ఇస్లాం స్వీకరించెను. మక్కాలోని జనులు కొద్దిగా సాటి ముసల్మానులను చాలా బాధించుతూ వుండిరి. అందుచేత పైగంబరుగారు తన ఇస్లాములో చేరిన మందితో మదీనాకు వెళ్లెను. ఉమర్ కూడా వారి వెంట నుండిరి. సిరియాను గెలుచుటకుగాను ముస్లిములు తమ శక్తి కొలది ధనము నియ్యవలెనని ఒకమారు పైగంబరుగా రడిగిరి. ఉమర్! నీవేమి తెచ్చినావనిరి. "నా ఆస్తిలో సగం తెచ్చినాను" అని ఉమర్ అనెను. 'అబూబకర్ మరి నీవేమి తెచ్చినావు" అని పైగంబరుగారనిరి. "నా ఆస్తి నంతా తెచ్చినాను" అని అబూబకర్ అనెను. "అబూబకర్ ఎప్పుడు పట్టినా నాకు సిగ్గు వచ్చు రీతిగానే చేయుము" అని ఉమర్ అనెను.

మొదటి ఖలీఫా అబూబకర్ చనిపోవునప్పుడు ఉమర్ గారిని ఖలీఫా చేసిపోయెను. ఉమర్ లోని గొప్పదన మేమనగా అతడు సిరియా, పర్షియా, ఈజిప్టు, జెరుసలెం, పాలస్తీన్, దిమిష్కు దేశాలను గెలచినను సర్వతంత్రస్వతంత్రుడైనను అతడు ప్రభుత్వ కోశమునుండి ఏమియు తీసుకొన్నవాడు కాడు. చాలా మితముగా జీవించెను. కష్టించే బీద అరబ్బులకు అతనికీ భేదము లేకుండెను. ఒకమారు పర్షియా చక్రవర్తి సుందర యువతులను, ధనరాసులను, వివిధ వస్తువులను కానుకగా పంపెను. రాయబారులు అరబ్బుల డేరాలలో తిరుగుతూ ఉమర్ గా రెక్కడ అని అడుగుతూ వెళ్ళిరి. అదిగో ఆ ఖర్జూరవృక్షము క్రింద బట్టలు కుట్టుకుంటున్నాడని చూపిరి. వారు దిగ్భ్రాంతులై కానుక లిచ్చిరి. దాసీ లవసరము లేదని వాపసు చేసెను. తక్కిన వస్తువులను ప్రభుత్వ కోశములో చేర్చెను. అతడు జెరుసలెమును ముట్టడించగా అందలి పెద్దలు ఉమర్ గారికే స్వయముగా నగరమును వశపరచుమనిరి.

అతడొక ఒంటెను ఒక సేవకుని తీసుకొని వెళ్లెను. ఇద్దరును ఒంటెపై వంతుల ప్రకారం ఎక్కి ప్రయాణం చేసిరి. దారిలో ఆగి ఇద్దరున్నూ ఒకే కట్టె కంచములో ఆరగించిరి. తుదకు విచిత్రమేమనగా జెరుసలెం దగ్గరకు వెళ్ళునపుడు ఒంటెపై ఎక్కేవంతు బానిసకు వచ్చెను. "హజరత్ ఇక నగర సమీపమందు తామే ఒంటె నెక్కుట గౌరవముగా ఉండునుఅని బానిస అనెను. "అదెట్లు ఎవరేమనుకున్నా సరే మన ఒడంబడిక ప్రకారం నీవే ఎక్కవలెను." అని వానినే ఒంటెపై ఎక్కించి తాను ఒంటెను నడుపుకుంటూ నడిచెను. జెరుసలెం జనులు ఒంటెపై వాడే ఖలీఫా అనుకొనిరి. కాని బానిస వారికి ఉమరును చూపించగా వారాశ్చర్య చకితులైరి. ఒకతడవ అతనికి బట్టల తానులిచ్చిరి. వాటిని అచటివారికి పంచి పెట్టెను. అందరితో పాటు తానున్నూ ఒకటి తీసుకొనెను. కాని అది తన కోటుకు చాలక వచ్చెను. తనకొడుకు తన భాగాన్ని ఇయ్యగా దాన్ని అతికించి కుట్టి తొడుగుకొనెను. ఒకమారు తన కొడుకు సారాయి త్రాగెను. ఉమర్ అతన్ని చచ్చేవరకు కొట్టెను. అతడు మోటైన మందము రొట్టెను ఖర్జూరములను మాత్రమే తినుచుండెను. తన భార్య తన బిడ్డలకు కూడా ఏమియు నియ్యకుండెను. అతడు న్యాయ పరిపాలనము చాలా నిష్పక్షపాతముతో చేసెను. మారువేషాలతో తన రాజ్యాలలో తిరిగి ప్రజల కష్టాలను గుర్తించి సహాయపడుచుండెను. అట్టి త్యాగపురుషుడు కావుననే అతనిని నాయకత్వములో అరబ్ ముస్లిములు బహుదేశాలను గెలిచి ఇస్లామును వ్యాపింపజేసిరి.

## వరాహ మిహిరుడు

గుప్త చక్రవర్తులు రాజ్యము చేసిన కాలములో ఉత్తర హిందూస్థానమందు క్రీ॥ శ॥ ౫౦౦ కును ౬౦౦ కును మధ్య కాలములో వరాహమిహిరుడు అను బహుశాస్త్రవేత్త యుండెను. అతని ప్రజ్ఞ ఉపజ్ఞ నానాముఖములలో విజృంభించి యుండెను. అతడు రచించిన బృహత్సంహిత యను సంస్కృత గ్రంథమును చదివిన అతని సర్వజ్ఞత్వము

వెల్లడి యగును. అతడు జ్యోతిశ్శాస్త్ర పారంగతుడు. గణిత శాస్త్ర మందు ప్రవీణుడు. నక్షత్ర శాస్త్రమందు ప్రజ్ఞకలవాడు. లోహశాస్త్ర మందు అద్భుత ప్రవేశము కలవాడు. కత్తులను సిద్ధముచేసి వాటికి పదును మెరుగు ఇచ్చు పద్ధతులను తెలిపినాడు. (అధ్యాయం ౫౦ బృహత్సంహిత). బంగారు, రత్నములు, మణులు, ముత్యములు మున్నగు వానిలోని మంచి చెడ్డలను పరీక్షించు విధానములను తెలిపినాడు. (అధ్యాయములు 3 మరియు ౮౧) వృక్షశాస్త్రమును గురించి వ్రాసి నాడు. ఆకాలములో పండ్లు కాయునట్లుగా ఫలవృక్షములకు చేయవలసిన చికిత్సయు వ్రాసినాడు. (అ. ౫౫) జంతుశాస్త్రము నెరిగిన వాడు. గుర్రములలో, ఏనుగులలో, కుక్కలలో మరియు నితర జంతువులలో మంచి చెడ్డ జాతులను గుర్తించు విధానములను తెలిపినాడు. (అ.౬౨-౬౪) శిల్పశాస్త్రమును గురించి వ్రాసినాడు. దేవాలయములు, రాజభవన ములు, సాధారణ గృహములు మున్నగువాని నిర్మాణమును గూర్చి నివేదించినాడు. (అ. ౫3) జలార్గళ శాస్త్రము అనగా ఏ భూమిలో ఎంత నీరు లభించును అను విషయమును గూర్చి వ్రాసినాడు. (అ.౫౪). వాతావరణ శాస్త్రమును గురించి వ్రాసినాడు. ఎట్టి మేఘాలు ఎట్టి గాలిలో ఎంత వర్షించును అను విషయాలను గూర్చి వ్రాసినాడు. (అ. ౨౧-౨౮) వైద్య చికిత్సలలో శరీరములోనికి ఇనుమును, పాదరస మును శుద్ధి చేసి భస్మముచేసి యిచ్చుటను గూర్చి ప్రచారము చేసెను.

తనకన్న పూర్వము భారతదేశములో జోతిశ్శాస్త్రమందు అయిదు విధములగు సిద్ధాంతము లుండెనని పంచసిద్ధాంతిక యను విష యమును గూర్చి వ్రాసెను. అతడు బృహజ్జాతకము, లఘుజాతకము అను గ్రంథములను గూడ రచించెను. అతని బృహత్సంహితను లఘు జాతకమును అల్బెరూనీ క్రీ. శ. ౧౧ వ శతాబ్దములో అరబీలోనికి తర్జుమా చేసెను.

(భారతీయ ఇతిహాస పరిషత్తువారు ప్రకటించిన న్యూ హిస్టరీ ఆఫ్ ది ఇండియన్ పీపిల్ అను గ్రంథములో చూడుడు. పుటలు. ౪౨౧-౪౨౨.)

# ఫాహియాన్

ప్రాచీనకాలములో బుద్ధుని జన్మదేశమును చూచి ముక్తి పొంద గోరిన చీనా బౌద్ధులు పలువురు ఘోరకష్టములను అనుభవించి గోబీ ఎడారిని దాటి హిమాలయ పర్వతాలను దాటి హిందూస్థానమునకు కాలినడకతో వచ్చి బౌద్ధక్షేత్రాలను విహారాలను దర్శించి పోతూ ఉండిరి. అట్టివారిలో చరిత్ర కెక్కినవాడు ఫాహియాన్ అను చీనా ప్రథమ యాత్రికుడు. అతడు అయిదుమంది మిత్రులతో క్రీ. శ. ౪౦౦ నాడు బయలుదేరి లాంప్నూర్ ఎడారిని దాటెను. మండుటిసుకలో ఏ ప్రాణిని కూడా కననివారై తమకన్న ముందు వెళ్ళినవారి శవాలను చూస్తూ ౧౭ దినాలు ప్రయాణము చేసిరి. తుదకు ఖోటాన్ నదిని చేరి అక్కడినుండి యార్ఖండు నదిని దాటి హిమాలయము సమీపించిరి. దాన్ని దాటి పెషావరు చేరిరి. పెషావరు చేరువరకు నలుగురు మిత్రులు చనిపోయిరి. మిగిలిన మిత్రునితో గుప్తరాజ్యములోనికి వచ్చిరి. అప్పుడు రెండవ చంద్రగుప్తుడు (విక్రమాదిత్యుడు క్రీ. శ. ౩౭౫ – ౪౧౩) రాజ్యము చేయుచుండెను. ఆ రాజ్యములోని హిందువులను గూర్చి ఫాహియాన్ ఇట్లు వ్రాసెను. "జనులు సుఖులై యున్నారు. రాజు దయాపరుడు. ప్రజలు మద్యముల త్రాగరు. ఆహారానికి జంతువుల చంపరు. చండాలురే యీ రెండు చేయుదురు. వారు ఊళ్ళలోనికివస్తే గంటకొట్టుతూ జనులను దూరము పొమ్మని హెచ్చరిస్తూ వత్తురు. సారాదుకాణాలు లేవు. జనులు పందులను కోళ్ళను పెంచరు. గవ్వలు కూడ నాణెములుగా చెల్లును."

ఫాహియాన్ పాటలీపుత్రము, అయోధ్య, గయ, కపిలవస్తు మున్నగు ప్రదేశముల చూచి చీనాకు తిరిగి పోదలచెను. తనవెంటవచ్చిన తుది సహచరుడు హిందూదేశమందే నిలిచిపోదు ననెను. సింహళ ద్వీపములో బుద్ధుని అస్థులు కొన్ని కలవనివిని అచ్చటికి వెళ్ళి అనూరాధ పురములోని బుద్ధచిహ్నములను దర్శించుకొని అచ్చటినుండి ఓడలలో చీనాకు ప్రయాణమయ్యెను. నడిసముద్రములో తుపాను చెలరేగెను.

నావికులు దానికి కారణము విచిత్ర వస్తువులతో ప్రయాణము చేసిన ఫాహియానే అని తలచి అతన్ని ఒక దిక్కులేని దీవిలో పారవేసి పోదల చిరి. కాని అందొక డట్లుచేసిన తమరాజుతో చెప్పి అందరిని శిక్షింప జేయుదు ననెను. తుదకు ఫాహియాన్ చీనా చేరెను. అతడు ౨౦ ఏండ్లు విదేశ సంచారము చేసి యుండెను. వేలకొలది చీనాసోదరులు తానుచూచిన దేశాలలోని విశేషాలను అడిగి విసిగించినందున అతడు తన యాత్రాచరిత్రను వ్రాసిపెట్టెను.

ఇంచుమించు అదేకాలములోను అంతకుపూర్వమున్నూ తర్వాత నున్నూ హిందూస్థానమునుండి పలువురు హిందువులు, బౌద్ధులు చీనాకు వెళ్ళియుండిరి. వారిలో నారాయణస్వామి అను దాక్షిణాత్యు డొకడు. క్రీ. శ. 3౦౦ర ప్రాంతములో కుమారజీవుడు అను హిందూస్థాన బౌద్ధుని చీనా చక్రవర్తి పిలిపించుకొనెను. అతడు అక్కడనే చనిపోవు వరకుండి పాలీ సంస్కృతములలోని బౌద్ధగ్రంథములను చీనా భాషలోనికి అనువదించెను. చీనాలో 3౦ ఏండ్లు జీవించెను. అతచ్చడట చనిపోయి నప్పుడు అగ్ని సంస్కారము చేసిరి. శరీరమంతా భస్మమయ్యెను. కాని నాలుక మాత్రము అట్లే యుండెనని చీనావారు విశ్వసించిరి. ఇట్టివా రెందరో కలరు. కాని వారు ఫాహియాన్ హూన్‌చ్వాంగులవలె తమ చరిత్రలో వ్రాయనందున, పాశ్చాత్యులు హిందూస్థానపు గొప్ప వారికి తమ గ్రంథాలలో ప్రాముఖ్య మియ్యనందున అట్టివారు ప్రకట నకు రాలేదు.



# యువజన విజ్ఞానము

## రాజకీయ పరిజ్ఞానము

## ౧౧ వ ప్రకరణము



రాజ్యము, ప్రభుత్వము, పరిపాలనము, రాజ్య నిర్మాణము, ప్రజా రక్షణము, న్యాయస్థానములు, ప్రజారోగ్య విచారణ మొదలగు విషయములను గూర్చి తెలుపునది రాజకీయ శాస్త్రము.

దీనికి మూలాధారము రాజ్యము (State). రాజ్యమంటే యేమి. దానికి ముఖ్యాంగములు నాలుగు. (౧) ప్రజలు, (౨) దేశము, (౩) నిర్మాణము, (౪) స్వతంత్ర పరిపాలనాధికారము.

ప్రజలులేనిది రాజ్యము లేదు, రాజు లేడు. దేశము లేనిది ప్రజలు లేరు, రాజు లేడు. ఆ ప్రజలు అది తమ దేశమని ఎకస్థులై పరస్పరము కలహించక ఒక అధికారానికి లోబడవలెను. అట్టి దేశమును పాలించే

ఒక సంస్థ, లేక రాజు, లేక అధికారి, లేక నియంత యుండవలెను. అదే ప్రభుత్వము. ఆ ప్రభుత్వము పరాధీనముగా ఉండరాదు. ఇంగ్లండు, అమెరికా, రష్యా వంటివి రాజ్యాలనబడును. ఇప్పుడు ఇండియా కూడా స్వతంత్రత పొందినందున రాజ్యము అను నిర్వాచనములోనికి వచ్చినది.

ప్రభుత్వము, రాజ్యము అనునవి భిన్నములు. రాజ్యము పై నాలుగు లక్షణాలున్నంత వరకు మారదు. ప్రభుత్వము మారవచ్చును. రాజుద్వారా పాలనముండునట్టిది ప్రజాపరిపాలనగానో నియంత పాలనగానో మారిపోవచ్చును. కాన ప్రభుత్వమనగా శాసనసభ, మంత్రి సభ, న్యాయస్థానములు అను మూడు శక్తులను కలిసినట్టి పరిపాలనము. జాతి అను పదము విశేషముగా వాడుకలో ఉన్నది. జాతి (నేషన్) అంటే యేమి? కొంతకాలమువరకు రాజకీయ శాస్త్ర పండితులు జాతి అంటే ఒకమూల మానవ శాఖనుండి వచ్చిన జనులు. సమాన సంస్కృతి కలిగి, ఒకేభాష మాట్లాడి, ఒకే మతము కలిగి సమానాచార వ్యవహారములు కలిగి, స్వతంత్ర ప్రభుత్వముకలవారుగా ఉండినచో అట్టి జనులను ఒక జాతివారని నిర్వాచించిరి. ఇప్పుడు పై లక్షణా లన్ని జాతి కవసరము లేదని అంటారు. ఎందుకంటే ఒకే శాఖవారుగా ఉండే దేశాలు అరుదు. అమెరికాలో ఫ్రెంచి, జర్మను, ఇంగ్లీషు, జ్యూలు ఉన్నారు. స్విస్సు దేశములో జర్మన్, ఫ్రెంచి, ఇటలీవా రున్నారు. ఇంగ్లండులోనే స్కాటులు, ఇంగ్లీషులు, వెల్షువారు భిన్నభిన్న జాతుల వారున్నారు. ఒకే ఒక భాష కలవారై యుండవలెను అంటే పై దేశాల జనులను ఒకే జాతివారన వీలులేదు. రష్యాలో ౧౭౦ భాషలు మాట్లాడేవారున్నారు. కాని రష్యా దేశము వారి నంతా రష్యను లంటూరా లేదా? స్విస్సు దేశములో మూడు భాషలు మాట్లాడినా అక్కడి జనులను స్విస్సుజాతివారని అంటారు. ఒకే మతము కలవారు కూడా ప్రతి దేశములో కానరారు. తుర్కీలో ముస్లిములు, క్రైస్తవులు; తుదకు నాస్తికులున్నా కలరు. పై లక్షణా లన్ని ఉంటే జాతికి ఉత్తమమే కాని అందు కొన్ని లోపించినను అది జాతి కాకపోదు. కావున ఒక జాతికి

అది నివసించే భూ భాగముపై అభిమానము కలిగి దాని ఆధిక్యత స్వాతంత్ర్యమును నిలుపుకొనుటకై ఏభావన కలిగియుండునో ఆభావనయే జాతీయత అనబడును.

ప్రపంచములో నానావిధములైన ప్రభుత్వాలున్నవి. ఆదికాలములో రాజులు లేకుండిరి. తర్వాత బలాఢ్యుడైనవాడు నాయకుడై రాజయ్యెను. కాని కొన్ని తావులలో రాజులను తొలగించి ప్రజలే వైరాజ్యాలను (రిపబ్లికులను) స్థాపించుకొనిరి. రాజులు నిరంకుశులుగా పలుమారు పాలించిరి. అందుచేత కొన్ని దేశాలలో రాజు శాసనసభ లేక పార్లమెంటుకు లోబడి యుండునట్లు చేసిరి. అనగా అతడు నామ కార్థపు రాజయ్యెను. మరికొన్ని దేశాలలో కొందరు ధనికులు చేరి తమ కనుకూలమగు విధముగా రాజ్యము చేసిరి. మరికొన్ని తావుల దుష్టరాజులను తొలగించి ప్రజాప్రభుత్వాలను స్థాపించిరి.

ఇప్పటి కాలములో ప్రపంచములో వర్తించే వివిధములగు ప్రభుత్వ విధానాలు కొన్ని ఏర్పడినవి. అందు ముఖ్యమైన వేవనగా (౧)రాజ్యపాలనము (Monarchy) (౨)ధనికవర్గ పాలనము (Oligarchy) (3) ప్రజాపాలనము (Democracy) దీనినే రిపబ్లిక్ (వైరాజ్యము) అని కూడా అంటారు. రాజులు నిరంకుశముగా పాలించే రాజ్యాలిప్పుడు లేవు. రష్యాలో జార్ చక్రవర్తు లుండేవరకు అక్కడి పరిపాలనము నిరంకుశముగా నుండెను. ఇప్పుచ్చడట ప్రజా పరిపాలనమే కలదు. హిందూస్థానములోని పరిపాలనము నిరంకుశ పరిపాలనమే. దేశీ సంస్థానాలలోని పరిపాలనము నిరంకుశ పరిపాలనమే. కాని హిందూస్థానమంతా పరాధీన దేశముకాన అది చర్చకు రానేరదు.

ఇక నిప్పుడు మిగిలినవి రెండే విధములగు ప్రభుత్వాలు.(౧)శాసనబద్ధ రాజరికము, (౨) ప్రజాప్రభుత్వము. ఈ రెండున్నూ రెండు విధాలుగా ఉండును. (౧) యూనిటరీ విధానం (౨) ఫెడరల్ విధానం. యూనిటరీలో, చేరిన మండలాల కంతా కేంద్రప్రభుత్వము నుండియే

ఆజ్ఞలు లభించును. ఫెడరల్ విధానములో కేంద్రప్రభుత్వముయొక్క అధికారాలు మండలాల, అధికారాలు ఏవేవో శాసనములోనే నిర్ణయమై యుండును. ప్రభుత్వము మరల రెండు విధాలుగా ఉండును. (౧) పార్లమెంటరీ—అనగా అందు మంత్రివర్గము, కార్య నిర్వాహక వర్గము శాసనసభకు లోబడి యుండును. (౨) నాన్ పార్లమెంటరీ—శాసన సభకు లోబడని మంత్రివర్గము. కాన పై విధానములను ఈ విధముగా విభజింప వచ్చును.



## —♦ రాజరికము ♦—

రాజు పరిపాలించే విధానములో నిరంకుశ పాలనము కల స్వతంత్ర రాజ్యా లిప్పుడు లేవు. పరాధీనమైన సామ్రాజ్య పాలిత దేశాలలో అదింకా ఉన్నది. జపాను దేశములో నిరంకుశ రాజ్యముండెను. వారు ౧౯౪౫ లో ఓడిపోగా అది పోయెను. శాసనబద్ధుడగురాజు ఇంగ్లీషు రాజు. అతడు పార్లమెంటు చెప్పినట్లు వినవలెను. ఇంగ్లండు, స్కాట్లండు కలిపి గ్రేట్ బ్రిటన్ అంటారు. అందు ప్రజలచే ఎన్నుకొన బడినవారు పార్లమెంటులోని కామనులను సభలో ఉంటారు. రెండవ సభ లార్డుల సభకలదు. కాని దానికేమీ అధికారాలులేవు. ఆ రెండుసభలు కలిసి పార్లమెంటు అగును. దానికి గ్రేట్ బ్రిటన్ రాజగు ఇంగ్లీషురాజు లోబడియుండును.

## —♦ ప్రజాపాలనము. ♦—

రాజులేని దేశాలే యిప్పుడు ప్రపంచములో ఎక్కువగాఉన్నవి. అచ్చటిప్రజలే శాసనసభల ద్వారా పరిపాలింతురు. ఆ శాసనసభ వారిచే మంత్రిసభ ఎన్నుకోబడును. ఆ మంత్రిసభ శాసనసభకు లోబడియుండును. దానినే బాధ్యతాయుతప్రభుత్వ మందురు. కొన్నియేండ్ల కొక మారు క్రొత్తయెన్నికలు జరుగుచుండును.

పూర్వము హిందువులు సభ, సమితి అను శాసనసభల ద్వారా రాజును శాసనబద్ధునిగా చేసి పాలించిరి. హిందూస్థానములో బుద్ధుని కాలమునకు పూర్వమే కొన్ని రిపబ్లిక్‌లు అనగా వైరాజ్యములు రాజులేని పరిపాలనలు ఏర్పడియుండెను. గ్రీసులోకూడా ప్రజాపాలనమే యుండెను. రోములోకూడా ప్రజాపాలన ముండెను.

యూరోపులో మొదలు రాజులే పాలించిరి. వారు నిరంకుశులుకాగా ఒక్కొక్క దేశములో తిరుగుబాటుచేసి రాజులను తొలగించి ప్రజలే తమ ప్రతినిధుల ద్వారా పరిపాలనము నేర్పాటుచేసిరి. అట్టి పరిపాలనలలో అప్పుడప్పుడు నియంతలు (డిక్టేటర్లు) బయలుదేరిరి. వారు క్రొత్త క్రొత్త సిద్ధాంతాలు లేవదీసిరి. అట్టివారిలో ముఖ్యులు జర్మనీ

లోని హిట్లర్, ఇటలీలోని ముసలోని, రష్యాలో స్టాలిన్. హిట్లర్ మూలాన నాజీతత్త్వము, ముసలోనీమూలాన ఫాసిస్టుతత్త్వము ఏర్పడెను. రష్యాలో కమ్యూనిజం ఏర్పడెను.

—♦ నాజీ సిద్ధాంతము. ♦—

జర్మనీలో హిట్లర్ నేషనల్ సోషలిస్టుపార్టీ అనుదాన్ని లేవదీసెను. అదే నాజీపార్టీగా మారెను. ఈ పార్టీయే జర్మనీని పాలించినదయ్యెను. నాజీపార్టీతప్ప వేరుపార్టీ యుండరాదని, ఉంటే దాన్ని ధ్వంసం చేయవలెనని వారనిరి. అట్లే ప్రతిపక్షులను ధ్వంసంచేస్తూ వచ్చినారు. దేశములో అందరికీ బలవంతముగా సైనికశిక్షణ యిచ్చినారు. నాజీపార్టీయే ప్రభుత్వముకాని ప్రభుత్వ మనేది వేరే లేదని అన్నారు.

—♦ కమ్యూనిస్టు సిద్ధాంతము. ♦—

కమ్యూనిస్టు సిద్ధాంతము రష్యాలో పుట్టినట్టిదికాదు. అది కారల్ మార్క్సు అను జర్మన్ రాజకీయ తత్త్వవేత్త చేతను, ఎంజెల్సు అను మరొక తత్త్వవేత్త చేతను సృష్టింప బడినట్టిది. కాన మొదలు మార్క్సు సిద్ధాంతమును తెలుసుకొంటే కమ్యూనిస్టు సిద్ధాంతము సోషలిజం సులభముగా అవగాహన మగును.

## మార్క్సు సిద్ధాంతము

కమ్యూనిస్టులబైబిల్, వారిఖురాన్, వారి వేదము కారల్ మార్క్సు వ్రాసిన 'కాపిటల్' (పూంజీ) అనే గ్రంథము, అందలి ముఖ్య సిద్ధాంతమేమనగా ప్రపంచములో యంత్రయుగము చాలా వృద్ధికి వచ్చినది. ధనికులైన వారంతా తమ ధనాన్ని వాటాల మూలముగా గాని, లేక ఒక్కొక్కరుగా కాని యంత్రాలయాలలో భూమిలో నింపివేసి, తాము స్వయముగా కష్టించక యంత్రాలలో కూలీలచేత పని చేయించుకొని, భూమిని సాగు కిచ్చియో లేక జీతగాండ్రను పెట్టుకొనియో సేద్యము చేయించి అపార లాభాలను గడిస్తున్నారు. ఈ విధముగా రెండు వర్గాలేర్పడుతున్నవి. ఒకటి ధనికవర్గము(పూంజీవాళ్లు, క్యాపిటలిస్టులు)వారు

కేవలము ద్రవ్య బలముపై బ్రదికేవారు. వారు తమ ధనాన్ని పెద్ద పెద్ద వాటాలద్వారా యంత్రాలయాలలోనో భూసేద్యములలోనో పెట్టి కష్టము చేయకుండా ఇంట్లో కూర్చొని కూలీలచేత పని చేయించుకొని సంవత్సరాని కొకమారు లాభాలను (డివిడెండును) పంచుకొంటూ సుఖపడుతూ ఉంటారు. రెండవ వర్గమువారు బంగారు మోసే గాడిదల వలె ఆపూట తిండిలేక తమ శరీరకష్టాన్ని ధనిక వర్గాని కమ్ముకొని ఆదినం కూలీని చేసుకుని పోయి రొట్టె తీసుకొని జీవితము గడిపే కూలీ వర్గము (లేబరర్లు, భగేలాలు, శ్రమజీవులు, కార్మికులు, పారిశ్రామిక వర్గము, వర్కింగ్ క్లాస్). దీని పర్యవసానమేమి? ధనికులు మరింత హెచ్చుగా ధనికులౌతారు. బీదలు మరింత బీదలౌతారు. అప్పుడు సంఘర్షణ బయలు దేరును. చచ్చేఅంత స్థితి వస్తే ప్రాణికోటి ఎదురు తిరుగుతుంది. కూలీ వర్గము తిరుగుబాటు చేసి ధనికుల ధనాన్ని బలిమితో లాగుకొంటుంది, కూలీలు ఆ విధముగా ధనికులతో పోరాడి విప్లవము చేసి గెలిచి వారిధనాన్ని లాగుకొన్నతర్వాత వారిచేతిలోపడినధనాన్ని భూమిని యంత్రాలను ఏమిచేస్తారు? తామున్నూ పూంజీదారులుగా మారి ఇదివరలోని ధనికులనో లేక శక్తిచాలని ఇతరజనులనో తమ కూలీలనుగా చేసుకొందురా? అటయితే మళ్ళీ మొదటికథవద్దకే వచ్చినట్లగును. అటుకాగూడదు. దేశప్రభుత్వము పూంజీనంతా తనవశము చేసుకోవలెను. భూమి, గనులు, ఫ్యాక్టరీలు, మిల్లులు, ఇండ్లు, ఇట్టివన్నీ ప్రభుత్వము వశపరుచుకోవలెను. కార్మికులకంతా బాగా జీతమిచ్చి, అవసరమైన పనులన్నీ చేయించవలెను. ప్రభుత్వము నడుచుటకుగాను జడ్జీలు, కలెక్టర్లు, పోలీసువారు, టప్పావారు మున్నగువారంతా అవసరముకదా. వారికంతా కూలీ లేక జీతము లేక ప్రతిఫలము ప్రభుత్వమిస్తున్నదా లేదా? అట్లే యంత్రాలలో, గనులలో, వ్యవసాయములో పనిచేసేవారికంతా ప్రభుత్వము ప్రతిఫలమనండి, కూలీఅనండీ, పైకమిచ్చి పనిచేయించుకొనుటలో విచిత్రమే మున్నది? అట్టిప్రభుత్వములో జడ్జీయున్నూ కలెక్టరున్నూ (తాలూక్దారున్నూ) టప్పా జవానున్నూ, మిల్లుకూలీయున్నూ, భూమి భగేలాయున్నూ ఇంచుమించు సమానము

గానే యుందురు. కష్టానికి తగినంతఫలము దొరకును. ఇంట్లో వేలు, లక్షలు, కోట్లు దాచుకొనుట కెవ్వరికీ వీలుండదు. అందరూ కష్టించవలెను సుఖముగా జీవించవలెను. ఆ సుఖజీవనానికి ప్రభుత్వమే బాధ్యతవహించును. కాని వంచనలేని కష్టానికి ప్రతిపౌరుడున్నూ బాధ్యుడై యుండును. ఈ సిద్ధాంతాన్నే మార్క్సు బోధించెను. దీనినే సోషలిజం (సామ్యవాదము) అని అంటారు. ఈ సోషలిజంలో దేశములోని జనులంతా పూంజీదారులే! కొందరు ధనికులు, కొందరు కూలీలు అనే విచక్షణలేదు: అందరికీ సమానమగు ఆస్తి హక్కులుండును. సమానమగు ఆస్తి ఉండునన్నందుననే ఈ సిద్ధాంతాన్ని కమ్యూనిజంఅందురు. రానురానూ సోషలిజమునకున్నూ కమ్యూనిజమునకున్నూ శాస్త్ర భేదమువచ్చెను. మన ద్వైతులకు, విశిష్టాద్వైతులకు ఎట్లు శాస్త్ర భేదమున్నదో ఈ రెంటికిన్ని అంతే భేదము. సోషలిస్టులు నెమ్మదిగా దేశములో భావ విప్లవము కలిగించి పార్లమెంటు లేక శాసనసభలుకలలోట్లకు తమసిద్ధాంతాన్ని అంగీకరించే సోషలిస్టులను సభ్యులనెన్నుకొని తమసభ్యులే యెక్కువ అయినతర్వాత ఇంకేమున్నది, సోషలిస్టు ప్రభుత్వాన్ని స్థాపించి పై సిద్ధాంతాలను ప్రచారములోనికి తెచ్చి శాసించి పాలించేది! కాని కమ్యూనిస్టులు తొందరపాటిగాండ్లు. అబ్బో! అంత నిదానముమీద పనులుసాగునా! పూంజీదారులు తమ ద్రవ్యబలముచే కార్మికవర్గాన్ని ముందుకు రానిస్తారా! నల్లకుక్క తెల్లకుక్క అయినట్లే! కూలీవర్గము హింసామార్గాననే పూంజీదారులమీదపడి వారిని మట్టుపెట్టి వారినుండి పూంజీనంతా లాగుకొని సామ్యసిద్ధాంతాని కనుకూలమగు రాజ్యాన్ని స్థాపించవలెను అని కమ్యూనిస్టులవాదము.

మార్క్సు సిద్ధాంతాన్ని ఇంగ్లండులో కొందరు సోషలిజం అను పేరుతో స్థాపించిరి. కాని ఇంగ్లండును 300 మంది కోటీశ్వరులగు క్యాపిటలిస్టులు పాలిస్తున్నారు కాన అచ్చట సోషలిజం తలయెత్తలేక పోయినది. ఫ్రాన్సు, ఇటలీ, ఆస్ట్రియా, హంగరీలలో ౧౮౪౮లో సోషలిజం తల యెత్తెను. కాని అచ్చటి ప్రభుత్వాలు దానిని ఘోరముగా

హింసించి అణచి వేసిరి. ఈ విధముగా కమ్యూనిస్టులు సోషలిష్టులను ఆక్షేపించినది అక్షరాలా నిరూపణ అయ్యెను. రష్యాలో కమ్యూనిష్టు సిద్ధాంతాన్ని లెనిన్, ట్రాట్‌స్కీ అనువారు ప్రచారము చేసిరి. వారిని మొదట మొదట బాల్‌షవిక్కులు అని అనిరి. అనగా ప్రజావర్గము వారు అధిక సంఖ్యాక వర్గము వారు అని అర్థము. రష్యా చక్రవర్తి జార్ అనేవాడు మహా దుర్మార్గుడు. వానికి ధనికవర్గమువారు జాగీర్దారు ముఠా (డ్యూకులు) దాసానుదాసులు. వారంతా కలిసి ప్రజాసామాన్యాన్ని ఈగలవలె దోమలవలె చూస్తూ వుండిరి. అంతలో (౧౯౧౪–౧౯౧౮) యూరోపు యుద్ధం వచ్చెను, రష్యా జర్మనీపై యుద్ధము చేసెను. జర్మనీ రష్యా జార్ పని పట్టించుటకు దాగియుండిన లెనిన్ వీరుని, అతని అనుయాయులను రష్యాకు పంపిరి. అంతా కల్లోల మయ్యెను. జార్‌ను, జాగీర్దార్లను, జార్ భార్యను, కొడుకులను, బిడ్డలను, లాచపురుగు అనేది లేకుండా అందరినీ సఫై చేసిరి. రష్యాలో కమ్యూనిస్టు రాజ్య మేర్పడెను. కమ్యూనిష్టుల సిద్ధాంతము బలవంత ముగా విప్లవ మార్గములో పూంజీ దారులను ధ్వంసము చేసి రాజ్యము స్థాపించుట అనేది రష్యాలో నిరూపిత మయ్యెను.

క్రీ॥ శ॥ ౧౮౭౮ లో ఫ్రాన్సులో ప్యారీ నగరములో సోషలిష్టులను ౧౦ వేలమందిని చంపివేసిరి. జర్మనీలో కూడా సోషలిజమును తల యెత్తనీయ లేదు. యూరోపులోని ఇంగ్లండు, ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీ మున్నగు దేశాలలో పూంజీదారులే ప్రభుత్వాధికారాలలో ఉన్నారు. వారే పార్లమెంట్లలో శాసన సభలలో ఉన్నారు. వారు సహజముగా మార్‌క్సు సిద్ధాంతా లంటే మండిపడుతారు. అతని సిద్ధాంతాలంతా తప్పు సిద్ధాంతాలని చాలా గ్రంథాలు వ్రాయించినా, ఎన్ని వ్రాయించినా మార్‌క్సు సిద్ధాంతాలకు దినదినాభి వృద్ధిగా వ్యాప్తి జరుగుతూ ఉన్నది.

## ఫాసీజం

కమ్యూనిస్టు సిద్ధాంతములో ప్రభుత్వమే పూంజీదారుని (ధనిక వర్గముయొక్క) స్థానము నాక్రమించి ధనము ను ఇచ్చు యంత్రిలను,

గనులను, భూములను, మున్నగువాటిని ప్రభుత్వమే సాగించవలెననుట కలదు. అట్టి కమ్యూనిజంయొక్క వెర్రివికారరూపమే నాజీజం, ఫాసీజం అను సిద్ధాంతాలు.

ఫాసీజమును ౧౯౨౨లో ఇటలీలో ముసలోనీ సృష్టించెను. ఈ తత్వప్రకారము ప్రభుత్వము ధనికులనుండి భూములను, ఫ్యాక్టరీలను, మున్నగువాటిని తీసుకొనదు. కాని ఫ్యాక్టరీ యజమానులకు భూస్వాములకు, వ్యాపారులకు, తుదకు కూలీలకు వారి ఆర్జనములో స్వాతంత్ర్య మిచ్చుటలేదు. ప్రజాపరిపాలిత దేశాలలో వ్యక్తికి స్వాతంత్ర్యమిచ్చి నారు. అతడు ఇతరులను హింసించకుండా మోసగించకుండా మాత్రము కట్టుదిట్టములు చేసినారు. కాని ఫాసీజములో వ్యక్తికి ప్రాధాన్యము లేదు. ప్రభుత్వమే (State) సర్వతంత్ర స్వతంత్రమైనదని అంటారు. ప్రభుత్వాన్ని సర్వవిధాలా బలపరుచవలెను. అందుకుగాను ప్రజలు తమ స్వాతంత్ర్యాన్నికూడా కోలుపోవలసినదే. ప్రభుత్వాన్ని బలహీన ముగా చేయు ప్రయత్నాలనన్నింటినీ కఠినముగా అణచివేయవలెను అనుటయే ఫాసీజం.

భూస్వాములు ప్రభుత్వానికవసరమగు పంటలే పండించవలెను. పరిశ్రమలవారు ప్రభుత్వముకోరిన సరకులనే సిద్ధముచేయవలెను. అట్టి వారి లాభాలనుకూడా కొద్దిపాటిగానే తీసికోవలె. మిగిలిన లాభ మంతా ప్రభుత్వము తీసికొనును. కూలీలు శ్రమజీవులు సమ్మెలు కట్ట రాదు. సమ్మెలవల్ల దేశానికినష్టము. ఎందుకంటే పరిశ్రమలాగి ఉత్పత్తి తక్కువగును. అనవసరమనిపించితే ప్రభుత్వము కూలీలకు, యజమాను లకు మధ్య నిలిచి పరిష్కారంచేయును. ఇది రాష్ట్ర ధనసంపత్తిని గురిం చిన కట్టుబడి.

ఇక భావాలనుగురించి విచారించితే అది మరీఘోరం. బళ్లలో పిల్లలకు ప్రభుత్వము పసందుచేసిన విద్యావిధానమునే అవలంబించ వలెను. యువకులంతా ఎట్టిభావాలు అలవర్చుకోవలెనో అదిన్నీ ప్రభు త్వమే నిర్ణయిస్తుంది. ఉపాధ్యాయులే భావాలు బోధించవలెనో ఆ

నిర్ణయము ప్రభుత్వమే చేస్తుంది. ఇక్కడనే ఫాసీజంయొక్క లోపము న్నది. భావాలే ప్రపంచాన్నంతా సాగిస్తున్నవి. భావాలకే పెద్ద పెద్ద సామ్రాజ్యాలు భయపడిపోతున్నవి. అందుచేతనే సరిపడని పుస్తకాలను జప్తీచేస్తారు, నిషేధిస్తారు. ఆ భావాలు వెల్లడించినవానిని దేశం నుండి వెళ్ళగొట్టుతారు. జెయిలులో వేస్తారు. ఈ పనిని సామ్రాజ్య దేశాలంతా తమకు లోబడిన దేశాలలో చేస్తున్నారు. పైగా అమెరికా వంటి యితర దేశాలలో ఏ టేటా లక్షలు అవసరమైతే కోట్లు వ్యయం చేసి తమ మంచితనాన్ని తమ పాలితదేశాల అధ్వాన్నాన్నిగూర్చి తప్పుడుప్రచారం చేస్తుంటారు. ఇక సామ్రాజ్యతత్వానికి ఫాసీజముకు భేదమేమంటే, సామ్రాజ్యాలు కలవారు తమ సొంతదేశాలలో భావనిరోధము చేయరు. వారు తమ అధీనదేశాలలోనే భావనిరోధము చేస్తారు. ధప్పుడుకూడా కొంతవరకు స్వాతంత్ర్యమిస్తారు. కాని ఫాసీజంలో తమ సొంతదేశములోనే అనగా ఇటలీలోనే భావనిరోధం చేసినారు. తమకు విరుద్ధముగా ఆచరించినవారిని స్వతంత్రభావాలను ప్రకటించినవారిని వారు ఘోరముగా అణచివేసినారు. ఇటలీలో ముసలోని ఒక నియంతగా (డిక్టేటర్) ఏర్పడెను. కాన అతడే ప్రభుత్వము. అతనిభావాలే ప్రభుత్వభావాలు. ప్రభుత్వభావాలే ప్రజలభావాలై యుండవలెను. అట్లు సమ్మతించనివారిని జెయిళ్ళలో వేసినాడు. ఇంకేమైనా అంటే చంపించినాడు.

అదే ఫాసీజంలోని దుర్బలత్వము. ప్రజలు యుద్ధములో మనసారా సహాయపడలేదు. తుదకు ఇటలీ పడిపోయిననాడు. ఇటలీప్రజలే ముసలోనీని ఉరిదీసి చిత్రవధచేసిరి. ఫాసీజం అంటే ప్రభుత్వ దౌర్జన్యమునకు మారుపేరైపోయెను.

## రాజ్యవిధులు (Functions of the State)

రాజ్యముయొక్క పరిపాలనము ప్రజలకు సౌఖ్యము కలిగించి వారి ఆర్థిక నైతిక సాంఘికాభివృద్ధికి తోడ్పడవలెను. కావున రాజ్యవిధానముయొక్క విధులేవనగా:—

(౧) రాజ్యములో శాంతి, భద్రత, క్రమత (Order) ఏర్పాటు చేయుట. (౨) ప్రజల ప్రాణ, ధన, రక్షణ. (౩) న్యాయస్థానముల ద్వారా ప్రజలహక్కులను పరిష్కరించుట. (సివిల్ క్రిమినల్) ధనోద్భవ, హింసోద్భవ వాదముల న్యాయపరిష్కారము. (౪) ప్రజల ప్రాథమికహక్కులను కాపాడుట. (౫) ప్రజల ఆరోగ్యము. (౬) విద్యనిప్పించుట. (౭) ఆదాయ వ్యయములను విచారించుకొనుట. (౮) దేశరక్షణము. (౯) విదేశాలతో సంబంధవ్యవహారములు. (౧౦) దేశవ్యాపార పరిశ్రమల అభివృద్ధి. (౧౧) రైల్వేలు. (౧౨) టప్పా, తంతీ. (౧౩) బీదలకు, వృద్ధులకు, వికలులకు ఆధారము చూపించుట. (౧౪) నిర్మాణములు మొదలగునవి.

## పార్లమెంటరీ పద్ధతి.

ఇప్పుడు ప్రజాపరిపాలనముకల దేశములలో ప్రజా ప్రతినిధుల ద్వారా ప్రభుత్వములు సాగుచున్నవి. ఇంచుమించు ౨౦ సంవత్సరములకు మించిన వయసుకలవారందరును వోటు అధికారమును పొందియున్నారు. ఒక్కొక్క దేశములో నాలుగేండ్లకో, ఐదేండ్లకో ఒక నియమితకాలముప్రకారము ఒకమారు దేశమంతటా ఎన్నికలు జరుపుదురు. ప్రజలు తమకు నచ్చినవారికి తమవోట్లు నిత్తురు. ప్రతిజిల్లాలో, ఎక్కువ వోట్లు పొందినవారిని శాసనసభలోనికి తీసుకొందురు. ఆ శాసనసభను పార్లమెంటు అని సెనట్ అని వివిధనామములతో పేర్కొందురు. అట్లు ఎన్నుకొనబడు సభ్యులలో కొన్ని పార్టీలుండును. ఏ పార్టీలో అత్యధికసభ్యు లుందురో ఆ పార్టీవారినుండియే మంత్రు లెన్నుకొనబడుదురు. ఆ మంత్రులలో ఒక ప్రధానమంత్రి నియుక్తుడగును. ఆట్టి మంత్రివర్గము మరల శాసనసభా సభ్యులకు లోబడియుందురు. అధిక సంఖ్యాకులగు సభ్యు లేది నిర్ణయింతురో దానినే మంత్రివర్గము అమలుపెట్టవలసి యుండును. ఈ పద్ధతినే బాధ్యతాయుత ప్రభుత్వమందురు. ఈ పద్ధతిలో నిరంకుశతకు తావులేదు.

ఇంగ్లండులోని పార్లమెంటు సామ్రాజ్యాన్ని అంతయు శాసించును. ఇంగ్లండులో రాజు కలడుకాని అతడు నామకార్థపు రాజే, అతడు పార్లమెంటు నిర్ణయాలపై సంతకాలు పెట్టువాడే! సంయుక్త అమెరికా రాజ్యములో సెనెటు అను శాసనసభపై సభాపతియను పదవిని ఒకడు పొందియుండును. అచ్చటి పరిపాలనము ప్రజారాజ్యతంత్రము పైననే ఆధారపడియున్నది.

ఇప్పుడు భారత దేశము స్వతంత్రదేశ మైనందున దానికికూడా ప్రజారాజ్యమే ఏర్పడినది. ప్రజలనుండియే ప్రభుత్వము అధికారము పొందుచున్నది అను ప్రధానసూత్రమును మొట్టమొదటనే ఇండియా ప్రభుత్వ మంగీకరించినది.

స్విట్జర్ లెండు దేశము ప్రజారాజ్యమునకు ఉత్తమమైన ఆదర్శ మని రాజకీయ శాస్త్రజ్ఞులంతా అంగీకరించినారు.

ప్రపంచమంతయు క్రమక్రమముగా ప్రజారాజ్య తంత్రమునే స్వీకరిస్తూ ఉన్నది.

రాజకీయశాస్త్ర మొక గొప్ప శాస్త్రమైపోయినది. దానినిగురించి విపులముగా తెనుగులోకూడా అనేక గ్రంథాలు వెలువడినవి. వివరములు తెలియగోరువారీ క్రింది గ్రంథాలు చదువగలరు.

౧. ఆధునిక రాజ్యాంగపద్ధతులు. ౨ సంపుటములు : ఆచార్య యన్. జి. రంగాగారు.

౨. ప్రభుత్వము : శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు.

3. వోటు : ,, ,,

౪. నమ్మాళ్వారు(మద్రాసు) ప్రకటించిన రాజకీయపుస్తకములు

౫. ప్రాథమిక స్వత్వములు : సు. ప్ర.

ఇంకా చాలాకలవు.

# యువజన విజ్ఞానము



## విజ్ఞాన విశేషములు



## ౧౧వ ప్రకరణము



మనము ప్రతిదినము చూచునట్టివి ప్రపంచమంతటా కానవచ్చుచుండును. కాని దేవ నిర్మాణాలలో అనేకాద్భుత వస్తువులున్నవి. అవి ఒకస్థలమున నుండవు. ప్రపంచమంతటా అక్కడక్కడ అవి కానవచ్చును. పైగా మానవుడు తన బుద్ధిచాకచక్యము చేత చాలా అద్భుతమగు వస్తువులను నిర్మించినాడు. ఈ రెండింటిని మనము కొంతవరకు తెలుసుకొన ప్రయత్నింతము.

పూర్వకాలములో అనగా ౨౦౦౦ ఏండ్లకుపూర్వము యూరోపు దేశమువారు ప్రపంచములో ఏడే అద్భుతవస్తువు లున్నవని తలచిరి. అవేవనగా:—

(౧) రోడ్సులోని కలోసస్.

గ్రీకుసముద్రములో రోడ్సు అను ద్వీపముకలదు. దాని రేవువద్ద పెద్ద ఓడలుకూడా విగ్రహము కాళ్ళక్రిందుగా పోవునట్లుగా ఒకగొప్ప సూర్యదేవతయొక్క కంచువిగ్రహాన్ని నిర్మించిరి. దూరముగానున్న రెండు పెద్ద సముద్రపుగుండ్లపై విగ్రహంకాళ్లు పెట్టియుండిరి. క్రీ. పూ. ౨౯౦లో దాన్ని నిర్మించిరి, కాని కొంతకాలములో అది పడిపోయెను.

(౨) ఫారోసు (Pharos).

అనేది ఈజిప్టువద్దనుండిన ఒకదీవి. ఓడలకు రాత్రి బాటచూపుటకై ఆ దీవిలో క్రీ. పూ. ౨౯౪ లో ఒక దీపగృహము కట్టిరి.

(౩) మాసోలియం.

ఏషియామైనరులో హాలికార్నసస్ అనేపట్టణములో మాసోలస్ అను పర్షియాచక్రవర్తుల సుబేదారు పరిపాలిస్తూ ఉండెను. అతని భార్య క్రీ. పూ. ౩౫౩ లో తనభర్త చనిపోగా అతనికొరకు గోరీని దానిపై గొప్పభవనాన్ని నిర్మించి, దానిపై ౧౦ అడుగుల భర్త విగ్రహాన్ని పెట్టించెను.

(౪) డయానా దేవాలయం.

ఏషియామైనరులో ఎఫీసిస్ అను పట్టణములో క్రీ. పూ. ౫౫౨ లో ఒకగొప్ప దేవళమును ముగించిరి. దాన్నికట్టుటకు ౨౨౦ ఏండ్లు పట్టెను. దానిలో ౧౨౦ స్తంభాలుండెను. ఒక్కొక్క స్తంభము ౬౦ అడుగుల యెత్తుండెను. అది కొంతకాలానికి ధ్వంసమయ్యెను. దానిని డయానా అను గ్రీకుదేవతకై నిర్మించియుండిరి.

(౫) జ్యూపిటర్ విగ్రహము.

ఫిడియాస్ అనే గ్రీకుశిల్పి క్రీ. పూ. ౫౦౦ ఏండ్ల ప్రాంతమందు ఏతెన్సు అను గ్రీసుదేశపు నగరమందు జూపిటర్ అను దేవతావిగ్రహాన్ని నిర్మించి దానిపై బంగారురేకు వేయించెను. అదెన్నడో ధ్వంసమైపోయెను.

### (౬) బాబిలన్ నందనవనము.

ఏషియా మైనరులోని బాబిలన్ నగరం ప్రాచీనమందు ప్రఖ్యాత నగరము. క్రీ. పూ. ౬౦౦ ఏండ్లనాడు సమ్మురామత్ అనురాణి నగరములో ఎత్తయిన గట్టిప్రదేశముపై అపూర్వ సుందరవనములను పెంచెను.

### (౭) పిరమిడులు.

ఈజిప్టుదేశాన్ని పాలించే ఫెరూవా అను రాజుల శవాలకు గోరీలు కట్టిరి. వాటినే పిరమిడ్లు అని యందురు. అవి క్రీ. పూ. ౩౬౦౦ ప్రాంతాలలో కట్టినవి. అవి త్రికోణాకారముగలవి. ఒక్కొక్కటి ౪౮౦ అడుగుల ఎత్తువరకున్నవి. అవి యిప్పటికిన్ని చెడకుండా ఉన్నవి.

అటుతర్వాత ౫౦౦ ఏండ్ల క్రిందటివరకు మరి యేడు వస్తువులు అద్భుతమైనవని వారు తలచిరి. అవేవనగా—

### (౧) రోమునగరములోని కొలీసియం.

క్రీ. శ. ౮౦ లో ఇటలీ ముఖ్యపట్టణమగు రోమునగరములో ౬౧౫ అడుగుల పొడవుగలిగి ౧౬౦ అడుగుల యెత్తుగల మూడంతస్థుల భవనములను నిర్మించిరి. అందు ౫౦ వేలవరకు జనులు కూర్చొనుటకు స్థలముండెను. నగరములోని గొప్పయుత్సవాలందు జరుగుచుండెను.

### (౨) చీనా భిత్తి.

భయంకర శత్రువులనుండి తమదేశాన్ని రక్షించుకొనుటకై చీనావారు క్రీ. పూ. ౨౨౮ నుండి క్రీ. పూ. ౨౧౦ వరకు ౧౫౦౦ మైళ్ళ దూరముగల ఒకగొప్ప కోటగోడను నిర్మించిరి. దాని వెడల్పు ౧౩ అడుగులు, యెత్తు ౨౦ అడుగులు.

### (౩) అలెగ్జాండ్రియా గోరీలు.

ఈజిప్టుదేశములో అలెగ్జాండ్రియా నగరములో క్రైస్తవులు తమ పూర్వుల గోరీలను నిర్మించిరి. అవిచాలా సుందరభవనాలని ప్రసిద్ధి వహించి యుండెను.

(౪) ఇంగ్లండులో ఒకతావున స్వాభావికముగా కొన్నిగుండ్లు గట్లలో సుందరముగా ఏర్పడినవి. వాటిని ఇంగ్లీషులో స్టోన్‌హెంజి అందురు.

(౫) పైసా వంకరబురుజు.

ఇటలీలోని పైసా అను నగరములో క్రీ. శ. ౧౧౭౪ లో ౮ అంతస్థుల గుండ్రనిభవనమును నిర్మించిరి. దానియెత్తు ౧౭౯ అడుగులు. అదిప్పుడు ౧౬ అడుగులవరకు వంగియున్నది. అయినను చెక్కు చెదరకుండా ఉన్నది.

(౬) సోఫియామసీదు.

తుర్కీలోని కాన్‌స్టాంటినోపిల్ అను నగరములో క్రీ. శ. ౫౩౭ లో రోమురాజులు ఒక గిరిజాను (మత దేవాలయాన్ని) చాలా సుందరముగా నిర్మించిరి. తుర్కీవారు ఆ నగరాన్ని ఆక్రమించుకొని మసీదుగా మార్చిరి.

(౭) నాంకిన్ పింగాణిబురుజు.

చీనాలోని నాంకిన్ అను పట్టణములో క్రీ. శ. ౧౪౧౩ లో అప్పటి చక్రవర్తి తనతల్లి పాతివ్రత్య సూచకముగా ౯ అంతస్థుల భవనాన్ని నిర్మించెను. దానియెత్తు ౨౬౦ అడుగులు, దాని గోడలనిండా పచ్చని పింగాణి పలకలను అతికించినారు. అది జగత్ప్రసిద్ధ భవనమని ప్రఖ్యాతిగా ఉండెను.

## కాగితం - తుపాకిమందు సృష్టి

చీనావారు చాలగొప్ప నాగరికత పొందియుండిన జాతివారు. వారు ప్రాచీనకాలమందే నాలుగు కొత్త విషయాలను కని పెట్టియుండిరి. (౧) వృత్తలేఖని (Compass). (౨) కాగితములు. (౩) ముద్రణ. (౪) తుపాకిమందు.

-♦ విదేశాలనుండివచ్చి మనదేశములో వ్యాపించిన వస్తువులు. ♦-

మనదేశములో పూర్వము ఆలుగడ్డలు లేకుండెను. ఇది అమెరికాదేశపు కూరగాయ. క్రీ. శ. ౧౬౦౦ లో దీనిని యూరోపులో ప్రవేశపెట్టిరి. దీనిని క్రీ. శ. ౧౬౧౫ లో పాశ్చాత్య వ్యాపారస్థులు తీసుకొని వచ్చి హిందూస్థానములో ప్రవేశపెట్టిరి.

పొగాకు మనదేశములో పూర్వము లేకుండెను. క్రీ. శ. ౧౫౦౭ లో పోర్చుగీసువారు అమెరికానుండి పొగాకును హిందూస్థానములో ప్రవేశపెట్టిరి. ఇప్పుడు దేశమంతట ఇదే నిండి దేశాన్ని నాశనం చేస్తున్నది.

వేరుసెనగ కూడా మనదేశముదికాదు. 3౦౦ ఏండ్లక్రిందట పోర్చుగీసువారు దక్షిణ అమెరికాలోని బ్రెజిల్ అను దేశమునుండి తెచ్చి హిందూస్థానములో దీనిని నెగిడించిరి.

కాఫీ కూడా మనదేశముదికాదు. అరేబియా దేశములోని మోచా అను మండలమునుండి బాబాబుడన్‌సాబ్ అనే తురకసాధువు కాఫీ విత్తనాలను తెచ్చి మైసూరులో దక్షిణభాగములోని గట్లలో నెగిడించి అక్కడనే అతడు నివాసముచేసి చనిపోయెను. ఆ గట్లను ఇప్పటికిని బాబా బుడన్‌సాబ్ గట్లు అని అందురు. ఇంచుమించు అయిదారు నూర్ల ఏండ్లక్రిందట ఇది మనదేశములో ఈ విధముగా నెగిడిపోయెను.

మిరపకాయలు కూడా విదేశాలనుండి వచ్చినవి. పూర్వము మనదేశములో మిరియాలనే కారానికి వాడుకొంటూ ఉండిరి. ఇంచుమించు 3౫౦ ఏండ్లక్రిందట యూరోపు దేశస్థులు అమెరికానుండి మిరపకాయలు తెచ్చి మనదేశములో నెగిడించిరి.

మోసంబీ, బత్తాయి అనే నారింజపండ్లవంటి పండ్లుకూడా మనదేశములోనివి కావు. మోసంబీ, బటేవియా అనే దేశాలనుండి యీ పండ్లు మనదేశములో నెగిడినందున ఆ దేశాలపేర్లతోనే ఈ పండ్లను

హిందూస్థానములో పిలుస్తున్నారు. బటేవియా జావా ద్వీపములోని పట్టణము.

కొబ్బెర. మలయాలో దీనిని కోప్రా అందురు. ఆపదము నుండియే మన కొబ్బెర అనుపద మేర్పడినదని కొందరందురు. అయితే ఇది అక్కడినుండియే వచ్చినదని గట్టిగా చెప్పజాలము. కొబ్బెర పదము అక్కడినుండివచ్చి యొక పర్యాయపదముగా ఏర్పడియుండును. దక్షిణ హిందూస్థానములోను, సింహళములోను విపరీతముగా టెంకాయచెట్లు పెరుగును. టెంకాయ అనగా (టెం =దక్షిణపుకాయ) దక్షిణదేశపు చెట్టుఅని అర్థము. (టెంకణాదిత్యుడు—తెమ్మెరలు, తెంగళ్ అనుపదాలను గమనించునది).

పప్పాయిపండు : దీనిని బొప్పాయి, పొప్పాయిపండు అనియు అందురు. పశ్చిమఇండియా దీవులలో పపాయ అని యందురు. అక్కడి నుండి మనకు వచ్చినట్టిది.

అనన్నాస్ : దీనిని అనాస అనియు అందురు. ఇది అమెరికా ఫలము. అక్కడ దీనిని అనానాస్ అందురు. స్పెయినువారిద్వారా మనదేశానికి వచ్చినది.

సపోటా : ఇది మెక్సికో దేశములోనిది. అచ్చట దీనిని కోచిట్ జపోటల్ (Cochit Zapotal) అందురు. దీనిని స్పెయిన్ వారు జపోట్ అనిరి. దానినే మనకిచ్చినప్పుడు సపోటా అన్నాము.

అత్తిపండు : దీనిని అంజీర్ అనియు అంటారు. ఇది మధ్యధరా సముద్రతీర దేశాలదని అంటారు. కాని ముఖ్యముగా ఇది తుర్కీదేశములో పెరిగినట్టిది. క్రమముగా హిందూస్థానములో ప్రవేశపెట్టబడి వ్యాప్తి పొందినది.

జీడిమామిడి—(ముంతమామిడి) : ఇది అమెరికాదేశముది. అక్కడినుండి హిందూస్థానములో ౪౦౦ ఏండ్లక్రిందట ప్రవేశపెట్టబడెను.

ద్రాక్షతీగెలు : కాస్పియన్ సముద్రతీరాలలోనే అదియుండుండెను. అక్కడినుండి యితర దేశాలలో వ్యాప్తినొందెను. బొంగులు మొదలు చీనాలో నుండెనందురు.

నారింజను అరబ్బులు గ్రీసు దేశమువద్దనుండి సిసిలీ దీవిలో వ్యాపింపజేసిరి.

తాటిచెట్టు హిందూస్థాన నివాసియే.

క్యాబేజి : ఈ కూరగడ్డ మొదట ఈజిప్టు దేశములో నుండెను. అచ్చటినుండి ప్రపంచమంతటను వ్యాపించెను.

పీచ్ పండ్లు, మల్లెతీగెలు : మొదట బర్మా దేశములోనే యుండెనందురు.

గుమ్మడికాయలు మొదట మెక్సికోలో నుండెనందురు.

మాంసంతినేచెట్లు : కొన్నివృక్షాలకు పురుగులను తినుటయే అలవాటు. తమ ఆకులలో పురుగులను బంధించుకొని వాటిసారమును పీల్చుకొనును.

సన్ డ్యూ అను ఇంగ్లీషు పేరుగల చెట్టు అట్టిది. ఈగలు పురుగులు దానిపై వ్రాలితే లేక ఎవరైనా మాంసముతునుకను పరీక్షార్థము దాని ఆకులపైపెట్టితే ఆకులువంగి వ్రాలినవస్తువులపై ఒకవిధమగు రసమును వదలును. ఆ రసమువలన మాంసముకాని, పురుగుకాని కరిగిపోవును. దానిసారమంతా పీల్చినతర్వాత ఆకులు యథాప్రకారము విచ్చుకొనును.

బట్టర్ వర్ట్ అను మరొక ఇంగ్లీషువృక్షమిట్టిదే. ఉత్తరహిందూస్థానములోని ఫరీద్పూరులో ఒకతాటిచెట్టు పొద్దుతిరిగినట్లు లేస్తూ వంగుతూ ఉండుటచే జనులు దానిని పూజించిరి. అట్టివి పలుతావుల లభించినవి. అందు చిత్రము లేదు. దాని వేరులకు ఉష్ణము చలువ ఎట్లెట్లు తగులునో అట్లట్లు అది కదలుచుండును. అంతే!

## —: పెద్ద గ్రంథాలు :—

యూరోపు ఖండములోని గ్రంథాలన్నింటికంటె ప్రాచీనములో పెద్ద గ్రంథము ఇలియడ్ పురాణమని యందురు. దానిలో ౧౫౬౯౩ పంక్తులున్నవి. కాని మన పురాణాలే ప్రపంచములోని పుస్తకాలన్నింటికంటె పెద్ద పుస్తకాలని లెక్కపడినవి.

మహాభారతములో ౨౨౦,౦౦౦ పంక్తులున్నవి.

రామాయణములో ౪౮౦౦౦ „ „

## రత్నాలు.

కొన్ని ప్రసిద్ధిపొందిన ప్రపంచములోని రత్నాలేవనగా :—

ఆర్లాఫ్‌రత్నము. అదొక హిందూ దేవతమీద ఉండినట్టిది. దాన్ని ఒక ఫ్రెంచివాడు దొంగిలించుకొని పోయెను. దాన్ని ఆర్లాఫ్ అను రష్యారాజు ౯౦,౦౦౦ పౌనులకు కొనెను. దాని తూకం ౧౯౪ క్యారట్లు.

కోహినూర్ ఇది గోలకొండరాజు కాలములో తెనుగు సీమలో దొరికినట్టి రత్నము. ఇప్పుడు ఇంగ్లండు రాజు కిరీటము నలంకరిస్తున్నది.

పిట్‌రత్నం. ఇదికూడా హిందూస్థానములోనిది. ౪౧౦ క్యారట్ల తూకముది. ఇది ఫ్రెంచి రాజులవద్ద నున్నది.

నిజాంరత్నం. తూకం ౪౪౦ క్యారట్లు. ఇది హైదారాబాదు నిజాం ప్రభువులవద్ద నున్నది.

ఎక్సెల్సియర్. తూకం ౯౭౧ క్యారట్లు. ప్రపంచ రత్నాలపైకి పెద్ద రత్నం. దక్షిణాఫ్రికా గనులలో వెళ్లినది.

జంతుశాస్త్రవేత్తలు ఈక్రింది జంతువుల గరిష్ఠ వయస్సు ఇట్లు తెలుపుతున్నారు:—

| | | | | | |
|---|---|---|---|---|---|
| తాబేలు | ౩౫౦ | ఏండ్లు | ఏనుగు | ౧౦౦ | ఏండ్లు |
| మొసలి | ౩౦౦ | ,, | గద్ద | ౧౧౮ | ,, |
| తిమింగలము | ౫౦౦ | ,, | చిలుక | ౫౦ | ,, |
| గాడిదలు | ౧౫ | ,, | ఒంటె | ౪౦ | ,, |
| వాది | ౧౦ | ,, | గుఱ్ఱము | ౨౭ | ,, |
| సింహము | ౪౦ | ,, | పావురము | ౨౦ | ,, |
| నెమిలి | ౩౦ | ,, | బాతు | ౫౦ | ,, |
| కాకి | ౧౦౦ | ,, | కుక్క | ౩౪ | ,, |
| పిల్లి | ౧౩ | ,, | ఆవు | ౩౦ | ,, |
| కుందేలు | ౫ | ,, | | | |

## — ప్రపంచములో నెల్లను పెద్దవైన వస్తువులు —

**పెద్ద అగ్ని పర్వతము.**

శాంతి మహాసాగరములో ఆస్ట్రేలియాకు సమీపమున ఉండు హవాయ్ ద్వీపములో 'మౌనాలో' అను అగ్ని పర్వతము ౧౩౬౭౫ అడుగుల యెత్తున్నది. అదే ప్రపంచమందలి అగ్ని పర్వతములలో నెత్తైనది.

**ఉన్నత భవనం.** ప్రపంచములో నెల్ల ఎత్తైన భవనము న్యూయార్కు నగరములోని ఎంపైర్ స్టేట్ బిల్డింగ్ అనునది. అది ౧౯౩౧ లో పూర్తియైనది. దానిలో ౧౦౨ అంతస్థులున్నవి. దాని యెత్తు ౧౨౪౮ అడుగులు. అంతకన్న మించిన భవనము మాస్కో నగరములోని సోవియట్ భవనము. దానియెత్తు ౩౦౦ అడుగులు.

**పెద్ద మసీదు.** మసీదు లన్నింటిలో పెద్దది ఢిల్లీలోని జామె మస్జిద్, దానిని షా జహాన్ కట్టించెను.

**పొడవైన పర్వత పంక్తి.** ప్రపంచములో నెల్లను చాలా పొడవైన పర్వతపంక్తి దక్షిణ అమెరికా పశ్చిమతీరము పొడుగున ఉండే ఆండిస్ (Andes) అనే పర్వతపంక్తి. అది ౫౦౦౦ మైళ్ళ పొడవున ఉన్నది.

ధ్వని, వెలుతురు. ధ్వని ఒక క్షణములో ౧౧౫౨ మైళ్ళ దూరము పోవుననియు, వెలుతురు ఒక క్షణములో ౧౮౬౦౦౦ మైళ్ళ దూరము పోవుననియు శాస్త్రజ్ఞులు నిర్ణయించినారు.

అత్యున్నతపర్వతం: హిమాలయ పర్వతమే అత్యున్నత పర్వతము. దానిలోని ఉన్నత శిఖరము ౨౯౦౦౦ అడుగులయెత్తు. దాన్ని గౌరీశంకర శిఖరమని మనమంటాము. ఇంగ్లీషువారు దాన్ని ఎవరెస్టు శిఖరమని అంటారు.

అతి దీర్ఘనది: దక్షిణ అమెరికాలోని అమెజాన్ అనే నది. అది ౪౦౦౦ మైళ్ళ పొడువున ప్రవహించును. దానికి చాలా ఉప నదులున్నవి. అన్నికలిసి ౫౭,౦౦౦ మైళ్ళకన్న ఎక్కువ దూరము ప్రవహించును.

అతి వర్షము: అస్సాములోని చిరాపుంజి అనే పట్టణము మీద ప్రతి సంవత్సరము ౪౦౦ అంగుళాల వాన కురియును. హైద్రాబాదులో సగటున ఏటేట ౩౦ అంగుళాలు కురియును. దీన్నిబట్టి చిరాపుంజిలోని వర్షాధిక్యాన్ని ఊహించుకోవచ్చును. ఇంతకంటె యెక్కువ వాన ప్రపంచములో మరెక్కడా పడినట్టు కానరాదు.

అతిస్వల్ప జనసంఖ్య: జావా, బెల్జియం, హిందూస్థానం ఈ మూడింటిలో ప్రతి చదరపు మైలులో అత్యధిక జనము నివసిస్తున్నది. సగటున జావాలో మైలుకు ౮౦౦ మంది, బెల్జియంలో ౭౦౦ మంది హిందూస్థానములో ౫౦౦ మంది నివసిస్తున్నారు. కాని ప్రపంచములో నెల్లను చాలా తక్కువగా జనులు నివసించే ఖండము ఆస్ట్రేలియా. అది హిందూస్థానమంత రెండంతల దేశమైనా అందు ప్రతి చదరపు మైలులో ఇద్దరు ముగ్గురికంటె యెక్కువ నివసించుటలేదు. అచ్చటి తెల్లవారు రంగు జాతులవారి నెవ్వరినిన్ని రానియ్యమని నిశ్చయమును ప్రపంచానికి ప్రకటించినారు.

మృత సముద్రము. దీని నింగ్లీషులో డెడ్‌సీ అందురు. ఇది పాలస్తీన్ ప్రాంతములో ఉన్నది. ౪౬ మైళ్ళ పొడవు ౧౦ మైళ్ళ వెడల్పు కలదు. సముద్ర మట్టముకంటె ౧౨౯౨ అడుగులు తగ్గుగానే ఉన్నది. దానిలోనికి జోర్డన్ అను నదియు, మరి ౬ ఉపనదులున్ను పారును. దీనిలో ఏ జీవులున్నూ బ్రతికి యుండవు. సముద్రములో చేప లుండునుకదా! కాని యీ మృత సముద్రములో ఒక్క చేపకూడ లేదు. మనుష్యుల కళేబరాలు ఆ నీటిపై వేసిన అవి మునుగక తేలుచుండును. సముద్రములో మినరల్ సాల్టున్నూ (ఖనిజ క్షారము) ఫాస్ఫేటున్నూ (స్ఫురితములు) సమృద్ధిగా ఉన్నవి.

అతిసుందర విహారము. కాశ్మీరు సంస్థానములోని హిమాలయ పర్వత శ్రేణిలో డాల్ సరస్సు కలదు. అందు జహాంగీరు చక్రవర్తి తన ప్రియురాలగు నూర్జహానుకుగాను ఎండకాలపు విహారానికై షాలీమార్ తోటను నిర్మించెను. అందు సుందర భవనాలు సుందర పుష్ప లతలు సుందర వృక్షములు కలవు. ప్రపంచములో అంతకన్న మించిన సుందర విహారస్థలము మరొకటిలేదని ప్రతీతి.

అతిసుందర మీనార్. ఖుతుబుద్దీన్ అనునతడు ఢిల్లీలో క్రీ. శ. ౧౨౧౮లో రాజ్యము చేసెను. తన జయ చిహ్నముగా ఢిల్లీలో అత డొక ఎత్తైన మీనారును కట్టించెను. దాని పేరు ఖుతుబ్ మీనార్. దాని యెత్తు ౨౩౮ అడుగులు. దాని అడుగు ఆవరణము ౪౭ అడుగులు.

అతిపురాతన నగరము. సింధు సూబాలోని సక్కర్ జిల్లాలో కొన్ని దిబ్బలను త్రవ్వగా అచ్చట ౨౫౦ ఎకరాల భూమిలో అతి ప్రాచీనమగు నగరము బయలు పడెను. దానిని మోహెంజోదారో (మోహాన ద్వారము) అని యందురు. అది ౫౫౦౦ ఏండ్ల క్రిందటి నగరమని అందురు.

అతి విశాలమగు వాలుకార్ణవములు : ఇసుక ఎడారిను వాలు కార్ణవమని అంటారు. ప్రపంచములో చాలా ఎడారు లున్నవి. అందు ఇసుక తప్ప మరేమిన్ని ఉండదు. అక్కడక్కడ చిన్నచిన్న ఊట బావు లుండును. వాటి చుట్టూ కొందరు ఆదిమ నివాసులు గొర్ల మందలతో జీవిస్తారు. ఎడారు లన్నింటిలో గొప్పది ఆఫ్రికా ఖండములోని సహారా ఎడారి.

దాని వైశాల్యము ౨౦ లక్షల చదరపు మైళ్ళు. సహారా ప్రక్కన నుండు ట్రిపోలీ, ఫెజ్జాన్ ఎడారులను కలుపుకొనిన దాని వైశాల్యము 3½ లక్షల చదరపు మైళ్ళగును.

దాని తర్వాత గొప్పదగు ఎడారి గోబీ ఎడారి. అది మంగో లియాలో మన హిందూస్థానానికి ఉత్తర దిశలో ఉన్నది. దాని వైశా ల్యము ౧౮ లక్షల చదరపు మైళ్ళు.

నీటిపై తేలే దీవిగడ్డలు : ఆఫ్రికాలోని టాంగనికాలో విక్టో రియా సరస్సు అనునది ఉన్నది. అందు కొన్ని చిన్న దీవిగడ్డలు నీటిపై తేలియాడుచు ఒకచోటినుండి మరొకచోటికి కదిలిపోతూ ఉంటును. ఆ గడ్డలపై చెట్లు చేమలు తీగెలు పెరుగుతూ ఉండును.

అతి విశాల సరస్సులు : ప్రపంచములో నెల్లను పెద్ద సరస్సు కనడాలో కలది. దానికి లేక్ సుపీరియర్ (బృహత్సరస్సు) అని పేరు పెట్టినారు. దాని వైశాల్యము 3౧౮౦౦ చదరపు మైళ్ళు. దాని తర్వాత రెండవ పెద్ద సరస్సు ఆఫ్రికాలోని విక్టోరియా సరస్సు. దాని వైశాల్యము ౨౬౮౨౮ చదరపు మైళ్ళు. దాని పొడవు ౨౫౦ మైళ్ళు. వెడల్పు ౧౫౦ మైళ్ళు.

అగాధమగు కొలను : దక్షిణాఫ్రికాలో చుమెబ్ అను స్థలము వద్ద ఒక కొలను కలదు. దాని లోతును తెలిసుకొనుటకు చాలా ప్రయత్నించినారు. ఇంతవరకు దాని అడుగు గెవ్వరికిన్నీ తెలియరాలేదు.

అత్యున్నత వృక్షము : యూకలిప్టస్ అనే వృక్షాలు అత్యున్నత మైన వృక్షాలు. అవి ४०० అడుగుల యెత్తు వరకు పెరుగును. అవి విశే

పముగా ఆస్ట్రేలియాలో పెరుగును. వాటి కట్టె నుండి మేలైన చెక్కలు, దూలములు లభించును. వాటి నూనె నొప్పులకు వాడుదురు.

లండన్ : ఇది ఇంగ్లండు ముఖ్యపట్టణము. ప్రపంచ నగరాలలో నెల్ల ఇదే గొప్ప నగరము. చుట్టు పెరిగిన భాగాలను కలిపితే దాని వైశాల్యము ౬౯౩ చ. మైళ్ళు. దాని జనసంఖ్య ౮౦ లక్షలు. నగరములో ౭౦౦ రైలు స్టేషనులు కలవు. ౫ లక్షల టెలిఫోను స్టేషనులు కలవు.

కమాన్: కమాను (ఆర్చి) కట్టుటను మొట్ట మొదట కనిపెట్టిన వారు ఈజిప్టు వారని అంటారు. వారి కమానులలో మధ్యన పెద్ద రాయి ఒకటి బిగింపు రాయిగా (Key stone) ఉండేది. తర్వాత గాతిక్ జాతివారు కమాను బిగింపు నడిమి రాయి లేకుండా నిర్మిస్తూ వచ్చిరి.

చక్కెర : ప్రపంచములో మొట్టమొదట బెంగాల్ లో చెరుకు పండించి బెల్లము, చక్కెర చేసిరి. క్రీ. పూ. ౮౦౦ ఏండ్ల ప్రాంతములో చీనావారు బెంగాలునుండి చెరుకు పండించి బెల్లము చేయుట నేర్చుకొనిరి.

పట్టు : పట్టుపురుగులను పెంచి పట్టుబట్టల నేయుట ప్రపంచములో మొట్ట మొదట కనిపెట్టినవారు చీనావారు. వారు తమ రహస్యాన్ని పరదేశాలవారికి తెలుపక పోయిరి. రోము సామ్రాజ్యములో వారి పట్టు బంగారు యెత్తుగా అమ్మెను. క్రీ. శ. ౫౫౦లో జస్టినియన్ చక్రవర్తి రోము సామ్రాజ్యములో పాలించు నప్పుడు పర్ష్యా సన్న్యాసుల నిద్దరిని చీనాకు పంపెను. వారు పట్టుపరిశ్రమ నంతా తెలుసుకొని చేతి బొంగుకట్టె లొట్టలలో పట్టు గ్రుడ్లను దాచుకొని తీసుకొని పోయిరి. ఆ దొంగతనము పట్టుబడియుండిన వారి తల లెగిరిపోయి యుండును. జస్టినియన్ ఆనంద పరవశుడై తన రాజ్యములో పట్టు పురుగుల నెగడించెను.

రైల్వేగేజి : ప్రపంచములో ఒక్కొక్క దేశములో రైల్వే లైనుల మధ్యన వెడల్పు భేదించి యున్నవి. కొన్ని ౩ అడుగుల ౩ అంగుళాలుండును. కొన్ని నాలుగున్నర, కొన్ని ౫ అడుగుల పైగా ఉండును. కాని స్టాండర్డ్ రైల్వే గేజ్‌లు అనేవి ౪ అడుగుల ఎనిమిదిన్నర అంగుళాల వెడల్పు ఉండును. కారణ మేమనగా రైలు ఇంజనును కనిపెట్టిన జార్జిస్టీవెన్‌సన్ పూర్వము ఇంగ్లండు నేలిన రోము వారు ఇంగ్లండులో ఒక కోట గోడను కట్టి దానిపై బండ్లు నడిపించినది చూచెను. ఆ బాట ౪ అ. ౮½ అం. ఉండెను. వారు అనుభవములో ఆ వెడల్పు బండ్లకు సరిపోవునని నిర్ణయించి యుందురు. రైలు దారులకున్నూ అదే (స్టాండర్డ్) ఏకమానముండవలెనని ఏర్పాటు చేసెను.

హిందూస్థానములో మొట్టమొదట రైలు నడక ౧౮ ఏప్రిల్ ౧౮౫౩ నాడు ప్రారంభింప బడెను. బొంబాయినుండి ఠాణా అను స్థలము వరకు అనగా ౨౧ మైళ్ళ దూరముగల రైల్వేయే పూర్తి అయి ప్రారంభింప బడెను. దాని గేజి ౫ అడుగుల ౬ అంగుళాలు. అప్పటినుండి నేటివరకు రైల్వేల వృద్ధి చీమ నడకతోనే నడిచింది. ౧౮౮౩ లో ౧౦, ౦౦౦ మైళ్ళు రైల్వేదారి నిర్మాణ మయ్యెను. ౧౯౪౬ వరకు ౪౧౦౦౦ మైళ్ళ దారి యేర్పడెను.

తిండివస్తువులలో నీరు : మనము తినే పండ్లలో కూరగాయలలో నీరే యెక్కువ, ఘనపదార్థము తక్కువ.

| | | | | |
|---|---|---|---|---|
| సేప్ (ఆపిల్) లో | ౧౦౦ కి | ౮౨ | పాళ్ళు | నీరు. |
| దోసకాయలలో | ,, | ౯౫ | ,, | ,, |
| పాలలో | ,, | ౮౨ | ,, | ,, |
| ఆలుగడ్డలో | ,, | ౭౫ | ,, | ,, |
| కోడిగుడ్డులో | ,, | ౬౬ | ,, | ,, |

పెద్ద గడియారములు : న్యూయార్కులోని న్యూజర్సీలో ఒక ఫ్యాక్టరీ పైన ప్రపంచములో నెల్ల పెద్ద గడియారము కలదు. గంటల

తెలుపు గుండ్రని బిళ్ల (Dial) అడ్డ కొలతయే ౩౮ అడుగు లున్నది. దానిలోని నిముషాలను చూపు ముల్లు ౧౪ అడుగులకంటె యెక్కువ పొడవున్నది. పూర్వ కాలములో పగటి వేళను లెక్కించుటకై ఒక్కొక్క దేశములో ఒక విధమగు పద్ధతి యుండెను. కొందరు ఒక పెద్ద కట్టెను పాతి దాని నీడకు గుర్తులు పెట్టి కాలమును గుర్తు పెట్టుకొనుచుండిరి. కొరియా దేశములో జనుప త్రాటికి ముడులు వేసి దాన్ని కాల్చి అది కాలే కొద్ది గంటల లెక్కించుకొనేవారు. ఇప్పటికిన్ని అచ్చట కొన్ని పల్లెలలో ఈ ఆచార మున్నదట.

ఒక గిన్నెలో అడుగున రంధ్రము వేసి దానిలో ఇసుక నింపి అది పూర్తిగా పడిపోయిన అది ఒక నియమిత కాలమని యూరోపులో లెక్కిస్తూ ఉండిరి.

ఒక గిన్నెకు అడుగున రంధ్రము వేసి దానినొక నీటి పాత్రలో వదలుచుండిరి. ఆ గిన్నె నీటితో నిండి మునుగగానే ఒక గంటనో గడియనో లెక్క వేసికొని దానిలోని నీరు వంచి మరల నీటిపై వదిలేవారు. ఈ పై రెండు పద్ధతులను హిందువులు వాడుకొనుచుండిరి. పగలు ౩౦ గడియలనీ రాత్రి ౩౦ గడియలనీ వారు విభజించిరి. ఒక్క గడియలో నీరు నిండి మునిగే గిన్నెను నీటిపై వదలి అది నిండగా గంట కొట్టేవారు. పగలు ౩౦ వరకు కొట్టి, రాత్రి కాగానే మళ్ళీ ఒకటినుండి తెల్లవారు వరకు ౩౦ గడియలు లెక్కపెట్టి గంటలు కొట్టేవారు. మధ్యాహ్నము దాటిన తర్వాత ౧-౨ గంటల ౨౪ నిముషాలకు ౧౬ గడియల లెక్క పెట్టి ౧౬ గంటలను ఓరుగంటి చక్రవర్తులు మ్రోగింప జేస్తూ ఉండిరని క్రీడాభిరామములో వర్ణించినారు.

కొన్ని దేశాలలో సూర్యుని నీడను చూపించుటకై ఒక చక్రము చెక్కి దానిపై ఒక ముల్లును పెట్టేవారు. ఆ ముల్లు నీడను బట్టి కాలము గుర్తించుచుండిరి. ఇప్పటికిని కాశిలో అట్టి (Sundial) వాటిని చేసి అమ్ముతున్నారు.

## — సముద్రాల లోతులు. —

ఒక్కొక్క మహాసముద్రము ఎన్ని అడుగుల లోతుకలదో ఈ క్రిందిపట్టిక తెలుపును.

| సముద్రము. | అడుగులు. |
|---|---|
| శాంతి మహాసాగరము | ౩౫ ౪౧౦ |
| అతలాంతిక ,, | ౨౭ ౯౬౨ |
| హిందూ ,, | ౨౨ ౯౬౮ |
| అర్కిటిక్ ,, | ౧౬ ౬౩౪ |
| మధ్యధరాసముద్రము | ౧౨ ౨౭౬ |
| జపాన్ ,, | ౧౦ ౨౧౦ |
| బాల్టిక్ ,, | ౧౨౦౦ |
| ఎర్ర ,, | ౭ ౨౫౪ |

## తేయాకు (టీ).

ఇది మొదట చీనా హిందూస్థానము సింహళములలో పెరిగెను. కాని చీనాలోనే దీనిపానము ప్రారంభమయ్యెను. క్రీ. శ. ౮ వ శతాబ్దము వరకే చీనాలో తేనీటితాగుడు అధికముకాగా చక్రవర్తి దానిపై పన్ను వేసెను. క్రీ. శ. ౧౭ వ శతాబ్దములో తేనీరు మొదట ఇంగ్లండులో ప్రారంభమయ్యెను. అప్పుడు తేయాకు ౧ పౌను తూకమునకు ౧౦౦ నుండి ౧౭౦ రు॥ వరకు ధరయిచ్చిరి. ౧౦౦ ఏండ్లతర్వాత దాని క్రయము ఒక పౌనుకు ౧౭ నుండి ౨౦ రూ॥ అయ్యెను. అమెరికాలో తేనీరు క్రీ. శ. ౧౭౫౦ ప్రాంతములో వ్యాపించెను. అస్సాంలో తేయాకు అడవులనిండా అనాదిగాపండి రాలిపోతూ ఉండింది. ఇంగ్లండులో దాని వ్యాప్తిచూచి ఇంగ్లీషువారు అస్సాం తేయాకు అడవులంతా వశపరచుకొని అపారమగు లాభాలు పొందిరి.

## — రైళ్ళవేగము. —

ఈ క్రిందిరైళ్ళు గంట కెన్నిమైళ్ళ వేగముతో పోవునో తెలుపబడినది.

| | | | |
|---|---|---|---|
| జర్మనీలో బర్లిన్ నుండి హానోవరకు | గంటకు | ౮౩ | మైళ్ళ వేగము. |
| అమెరికాలో యూనియన్ ఫసిఫిక్ రైల్వే | ,, | ౮౧ | ,, |
| బెల్జియంలోని నేషనల్ రైల్వే | ,, | ౭౫ | ,, |
| ఫ్రాన్సులో ,, ,, | ,, | ౭౫ | ,, |
| రోములో ఇటాలియన్ స్టేటురైల్వే | ,, | ౭౨ | ,, |
| లండన్‌లోని ఒకరైలు | ,, | ౭౧ | ,, |

## —: గ్రంథాలయాలు. :—

ప్రపంచములో నెల్లను గొప్ప గ్రంథాలయా లేవో ఈ క్రింద తెలుపబడినవి.

లెనిన్ మాస్కోలైబ్రిరీ : ఇది మాస్కోలో ఉన్నది. ౯౦ లక్షల పుస్తకాలుండునట్లు౧౯౨౭లో కట్టినారు. ఇంకా అన్నిపుస్తకాలు చేరలేదు.

లెనిన్‌గ్రాడ్ లోని: పబ్లిక్ బిబ్లియోధికాలో ౪౮ లక్షల ౫౦ వేల అచ్చుపుస్తకాలు, ౩౩౧౦౦౦ వ్రాతపుస్తకాలు కలవు.

బర్లిన్‌లోని బిబ్లియోధిక్ గ్రంథాలయం:— ౨౫ లక్షల అచ్చుపుస్తకాలు, ౧౯౦౦౦ ప్రాచ్యలిఖిత పుస్తకాలు.

వాషింగ్టన్ (అమెరికా) కాంగ్రెసులైబ్రిరీ:—౩౪ లక్షల అచ్చుపుస్తకాలు.

లండన్—బ్రిటిష్‌మ్యూజియం: ౪౦ లక్షల పుస్తకాలు.

రోము వాటికన్‌లైబ్రరీ: ౫ లక్షల అచ్చుపుస్తకాలు, ౫౪ వేల వ్రాతపుస్తకాలు.

ప్యారి (Paris) బిబ్లియోతిక్ నేషనల్: ४० లక్షల పుస్తకాలు ౫౦ లక్షల మాసపత్రికలు, ౧౨౫౦౦౦ వ్రాతపుస్తకాలు.

వియన్నా— నేషనల్ బిబ్లియోతిక్: ౧౩ లక్షల గ్రంథాలు.

మాడ్రిడ్— బిబ్లియోతిక్ నేషనల్: ౧४ లక్షల పుస్తకాలు. ౩౧౦౦౦ వ్రాతపుస్తకాలు, ౩౦ వేల మాసపత్రికలు.

ఫ్లోరెన్స్— సెంట్రల్ బిబ్లియోతిక్ నేషనల్: ౯ లక్షల అచ్చు పుస్తకాలు, ౧౨ లక్షల లఘుపుస్తకాలు, ४౫ వేల సంగీతగ్రంథాలు, ౨౩ వేల వ్రాతపుస్తకాలు, నాలుగున్నరలక్ష జాబులు.

మ్యూనిఖ్— గ్రంథాలయం: ౧౬ లక్షల పుస్తకాలు. ౫౦ వేల వ్రాతపుస్తకాలు.

ఆక్స్‌ఫర్డు (ఇంగ్లండు) బాడ్లియన్ లైబ్రరీ:— ౧४ లక్షలపుస్తకాలు.

బోస్టన్ (అమెరికా) పబ్లిక్ లైబ్రరీ: ౧౭ లక్షల పుస్తకాలు.

టోకియో (జపాన్) ఇంపీరియల్ లైబ్రరీ:— ౮ లక్షలపుస్తకాలు.

— కాలమానమును కనిపెట్టినవారు. —

ఇప్పుడు ౧౨ నెలలు ౩౬౫ దినాల లెక్క ప్రపంచ మంతటను కలదు. ఈ పద్ధతిని మొదట కనిపెట్టినవారు బాబిలోనియా దేశమువారు. బాబిలోనియా పర్ష్యా (ఈరాన్) కు పశ్చిమమునందుండిన ప్రాచీనదేశ నామము. బాబిలోనియా పరిశోధకపండితులు ౧౨ నక్షత్రరాసులను, ౧౨ మాసాలను, మాసానికి ౩౦ దినాలను ఏర్పాటుచేసిరి. వ్యత్యాసాలను సవరించుటకై అధికమాసాన్ని వారే నిర్ణయించిరి. అప్పటికింకను సున్నను హిందువులు కనిపెట్టియుండలేదు. అందుచేత ౧౨ వ అంకెయే ఒక యవధిగానుండెను. నేటికిని పాశ్చాత్యులు డజనుల లెక్కలో నే వ్యవహరింతురు.

— ఖండనామములు. —

ఇంగ్లీషులో యూరోపుఖండమని, ఏషియా లేక ఆసియా ఖండమనీ, ఆఫ్రికాఖండమని అంటున్నారు. ఈ పేర్లెందుకుకలిగెనన్నది చాలామంది యెరుగరు. ఏ భూగోళమందును వ్రాయలేదు. ఈగానుకు పడమట నుండు దేశాన్ని 3000 ఏండ్లక్రిందట అసీరియా దేశమనిరి. ఆ దేశము వారు తమ దేశాన్ని, తమ దేశము చుట్టునుండు ప్రాంతాలను అసుఖండమనిరి. అసు అనిన అసుర (అసీరియా) భాషలో సూర్యోదయమని యర్థము. అసుపదమునుండియే ఆసియా (ఏషియా) పద మేర్పడెను.

ఇరిబ్ అనుపదమునకు అసురభాషలో చీకటియని అర్థము. తమ దేశమునకు భిన్నించిన పశ్చిమభూభాగాన్ని అసురులు ఇరిబ్ ఖండమనిరి. అనగా సూర్యాస్తమయ దేశము లేక చీకటి దేశము అనిరి. ఇరిబ్ పదమే యూరోపు అయ్యెను. ఈ పదాలను గ్రీకులు ఫినిషియావారి ద్వారా గ్రహించి ప్రచారము చేసిరి.

ఆఫ్రికా ఖండమందలి యుత్తరభాగమును ప్రాచీనార్యులు ఋభు దేశమనిరి. దానినే యిప్పుడు లిబియా అంటున్నారు. ప్రాచీన గ్రీకులు కూడా ఆఫ్రికా ఖండమును లిబియాఖండ మనిరి. కావున ఆఫ్రికా ఖండమునకు మొదటి పేరు ఋభుఖండము.

—: వివిధజాతులు సృష్టించినవి. :—

ప్రాచీనమందు నాగరికతపొందిన వివిధజాతులవారి క్రిందివిషయాలను మొట్టమొదట కనిపెట్టిరని ప్రతీతి.

ఈజిప్టువారు రాగి, కంచు, గోధుమలు, నాగలి, అద్దములు, ఇటికెలను కనిపెట్టిరి. సుమేరియావారు తూకములు కనిపెట్టిరి. బాబిలోనియావారు శాసనములను చెక్కించుట, గ్రంథములనుకూర్చుట, నాణెములు చేయుట, కమానులుకట్టుట కనిపెట్టిరి. ఏడుదినాల వారమును, చక్రములోని డిగ్రీలను, జ్యోతిషవిశేషములను కొన్నింటిని అసీరియా

వారు కనిపెట్టిరి. పర్షియావారు హూణులు లాగులను, షేర్వానీలను కని పెట్టిరి. గ్రీకులు రేఖాగణితములో కొన్ని విశేషాలను, స్క్రూలను కని పెట్టిరి. చీనావారు పోర్సలేన్ (పింగాణి), తుపాకిమందు, పట్టు, కంటి అద్దాలు, అచ్చు, నావికుల ధృవదర్శిని (కాంపస్), కాగిదములు కనిపెట్టిరి. హిందువులు గణితశాస్త్రములోని సున్నను, దశాంశము (డెసిమల్), సాముద్రికమును, రసాయనశాస్త్రమును, ధనుర్విద్యను, రేఖా బీజగణితములను మున్నగువాటిని కనిపెట్టిరి.

## మేఘము లెంత ఎత్తులో నుండును.

గాలి యెంత వేడిగానుండునో మేఘములంత యెత్తుగా నుండును. ప్రపంచమందెచ్చటను మేఘాలు ఆరుమైళ్ళకంటె యెక్కువ యెత్తులో పోవు. భూమధ్యరేఖవద్ద ఉష్ణమెక్కువగా నుండుటచేత అచ్చటనే అవి చాలా యెత్తులో పోవును. యూరోపున ఉత్తరభాగాన మంచు చలియెక్కువగా నుండుటచేత అచ్చట మేఘాలు అర్థమైలుఎత్తులో సంచరించును. సాధారణముగా ఉరుము మెరుపుతోనుండు మేఘాలు రెండునుండి నాలుగు మైళ్ళఎత్తులో తిరుగును. పెద్దగాలిచే వీవబడిన మేఘాలు కొన్ని మార్లు ౫౫౦ గజాల యెత్తులోనికిగూడా దిగును.

ఇంతవరకు ముగ్గురునల్గురు అమెరికనులు ఆకాశమాదు ౧౨ మైళ్ళ ఎత్తువరకు విమానములో పోగలిగినారు. వారు ౧౯౩౫ లో ఆవిధముగా వెళ్ళిరి. తర్వాత ఒక జర్మను సైన్సువేత్త ఒక బెలూనును ౨౦ మైళ్ళ యెత్తువరకంపెను. ౧౯౩౯—౧౯౪౫ యుద్ధములో జర్మనులు ౬౦ మైళ్ళ యెత్తువరకు ఆకాశములోనికిపోవు బాంబుగుడ్లను కనిపెట్టిరని యందురు.

## —: అల్యూమినం. :—

ఈ లోహమును ౧౦౦ ఏండ్లక్రిందట కనిపెట్టిరి. క్రీ. శ. ౧౮౨౭ లో వోహ్లాను అను జర్మనువాడు కనిపెట్టెను. ఆ కాలములో వెండితో

సమానముగా దీనినమ్మిరి. మూడవ నెపోలియను తన భోజనంబల్లపై ఓ ల్యూమినం చంచాలనువాడెను. తన కోటుగుండీలు వాటితో చేయించెను. అప్పుడు దీనిధర ఒకపౌనుకు ౧౦౫ సవరనులు. ౧౮౪౦ లో ౭౦ పౌనుల అల్యూమినమే సిద్ధమయ్యెను. ౧౯౨౬ లో ౨ లక్షలటన్నులు సిద్ధంచేసిరి. ఇప్పుడు బిచ్చగాండ్రుకూడా అల్యూమినంపాత్రలే వాడుకొంటున్నారు.

ఇనుము బంగారుకన్న విలువగాఉండెను.

ఒకకాలములో బంగారుకంటె ఇనుమే విలువకలదై యుండెను. క్రీ. పూ. ౧౦౦౦ నాడు యూరోపులో ఇనుము అలవాటు మొదలయ్యెను. గ్రీసుదేశములోని స్పార్టాలో క్రీ. పూ. ౮౦౦ ఏండ్లనాడు ఇనుపనాణెములు ప్రచారంచేసిరి. రోముజనులు వివాహాలలో ఇనుపయుంగరాలను ధరించిరి. అమెరికాలోని మెక్సికోలోని ప్రాచీనులు ఇనుము మట్టి కలిపి ఒక విచిత్రమగు విధానముతో గట్టిపాత్రలు చేయుచుండిరి. ఆ విద్యను వారే మరచిపోయిరి. హిందూస్థానములో క్రీ.పూ. ౩౫౦ లో ఒక ఇనుప జయస్తంభాన్ని ఢిల్లీలో నిలబెట్టిరి. అది నేటికినీ చిలుముపట్టక క్రొత్తగా సిద్ధమైనదానివలెనున్నది. ఇనుమునకు చిలుము రాకుండా చేసేవిద్య రహస్యవిద్యగా ఆ కనిపెట్టినవానితోనే మాయమయ్యెను. ఇట్టివిద్యలు వందలకొలదిగా మనదేశమందు రహస్యవిద్యలుగా నుండి ఆ వ్యక్తులతోనే మాయమౌతూ వచ్చినవి.

వెండి బంగారుకన్న విలువైనది.

ఒకకాలమందు బంగారుకంటె వెండికే ధరయెక్కువగానుండెను. ఈజిప్టులో క్రీ. పూ. ౧౬౦౦ వర కీవిధముగానుండెను. ఆ దేశములో బంగారుపాత్రలపై వెండినీరు కలాయివలె ఎక్కిస్తూఉండిరి. క్రీ. పూ. ౭౫౦౦ నాటినుండి వెండినాణెములప్రచారము వచ్చినట్లు ఒక ఖాల్డియా శాసనం తెలుపుతున్నది.

## జంతువుల ఉపవాసాలు.

ఆహారములేకుండా కొన్నిజంతువు లెంతకాలము జీవించునో పరీక్షించినారు. ప్యారిస్ నగరమందలి జంతుశాలలను ఒక కొండచిలువ నాలుగేండ్లపై ఒక్క దివసం వరకు ఆహారము లేకుండా జీవించెను. ఒంటె అనేకవారాలు ఉపవాసముండగలదు. కప్పలు ఒక సంవత్సరం వరకు తిండిలేక ఉండగలవు.

## జంతువుల గమనవేగము.

గద్దలు, గరుడపక్షులు గంటకు ౧౭౦ నుండి ౧౮౦ మైళ్ళ వేగముతో పోవును.

భూమిపై చిరుతపులికన్న వేగముగాపోవు జంతువులేదు. అది గంటకు ౬౦ మైళ్ల వేగముతో పోవును.

# వివిధములు

టిగ్నామెట్రీ అను గణిత శాస్త్రమును కనిపెట్టినవాడు ౨౦౦౦ ఏండ్లకు పూర్వమే గ్రీకుదేశమందుండిన హిప్పార్కస్ అను పండితుడు.

ప్రపంచ మంతటను అమెరికా (యూ. ఎస్. ఏ)లో అత్యధికమగు, శ్రేష్ఠమగు పొగాకు పండును.

ఎడమచేతి బొటనవ్రేలి ముద్రలను చదువురానివారిచేత పత్రాలపై సంతకములకు మారుగా వత్తింతురు. కారణ మేమనఁగా ప్రపంచములో ఏ యిద్దరి చేతులలోని అంగుష్ఠముద్రలు ఒకే తీరుగా ఉండనే యుండవు.

గడియారములలో క్షణానికొకమారు ఇటు నటు ఊగు గుండ్రని బిల్లను పెండులం అందురు. దానిని కనిపెట్టినవాడు గ్యాలిలియో అను ఇటలీ దేశపు 3౦౦ ఏండ్ల క్రిందటి పండితుడు.

ఇండ్లలో నుండు ఈగల ఆయుస్సు ఎనిమిది వారాలనుండి ౧౦ వారములు.

ప్రపంచములో మానవులకు ఎక్కువగా అంటువ్యాధుల ద్వారా చంపినది—ఎలుక.

తేనెటీగలకు రెండు రెక్కలు కాక నాలుగు రెక్కలుండును.

ప్రపంచములో నెల్లను గొప్ప వారధి అమెరికాలోని సాన్ ఫ్రాన్సిస్కో నగరమందలి ఓక్లెండు బే వారధి.

మానవులలో అత్యధికముగా మాంసముతినే జాతి అమెరికా వారని నిర్ణయమైనది.

చూచుటద్దములకు వెనుక దిక్కున పాదరసము, టిన్ ఈ రెండింటిని శాస్త్రీయ పద్ధతితో కలపి పూయుదురు.

జర్మన్ సిల్వర్ అనునది జర్మనీలో సిద్ధమగు కిరుదు వెండి అని భ్రమపడరాదు. రాగి, నికెల్, తుత్తునాగము (జింక్) అను మూడు లోహాలను కలిపి కరిగించి చేసిన మిశ్రలోహము. అది చాలా దేశాలలో సిద్ధమగును.

అన్ని నక్షత్రాల కన్న మహా వేగముగా తిరుగు నక్షత్రము బుధ నక్షత్రము (మర్క్యూరీ).

నక్షత్రములను స్థూల దర్శినీ యంత్రము (టెలెస్కోపు) తో చూతురు. నక్షత్రాలు—చుక్కలు ఆ యంత్రములలో పెద్దగా కనబడును. ఆ యంత్రాలలో దూరమందలి చిన్న వస్తువులను చూచుటకై ఒక ప్రత్యేకమగు అద్దముండును. దానిని స్థూలీ కరణము (Magnifying glass) అందురు. ఇంతవరకు ౧౦౦ అంగుళాల అడ్డకొలత గల గుండ్రని అద్దముండినది. ఇప్పుడు అమెరికాలో ౨౦౦ అంగుళముల అడ్డకొలతగల గుండ్రని "భూతద్దమును" సిద్ధముచేసినారు. దానిని సిద్ధము చేయుటకు ౨౦ ఏండ్లును ౨౦౦ కోట్లరూపాయిలును పట్టెను. దానినిప్పుడు కాలిఫోర్నియా నగరమందు ౫౦౦౦ అడుగులఎత్తు గల పాలమర్ (Palomar) అను గుట్టపై దానికి తగిన చాలా గొప్ప గొట్టముపై యంత్రములతో సహా అమర్చినారు. అట్టి యంత్రము సులభముగా గుండ్రముగాతిరుగుటకై యంత్రముక్రింద కొన్నిపూట్ల పాదరసమును నింపినారు.

నారు. ఆ యంత్రములో నక్షత్రాలను ఇప్పుడిప్పుడే పరీక్షింప మొదలు పెట్టుతున్నారు,

ప్రపంచమధ్యభాగమును భూమధ్య రేఖయందురు. అక్కడ అత్యుష్ణముండును. భూమిసూర్యునిచుట్టు తిరుగుటలో ఉత్తరదక్షిణధృవముల ప్రాంతాలలో రాత్రి పగలు ఎచ్చుతచ్చులుగా నుండును. కాని భూమధ్యరేఖవద్ద మాత్రము ఎల్లప్పుడు రాత్రింబగళ్లు సమానముగానుండును.

భూమినుండి ౬౨౦ మైళ్ల యెత్తువరకు భూమిపైనుండు వాయువేయుండును. అటుపై ఆ వాయువులో మార్పుకలుగును.

శిశువులుపుట్టిన మొదటి కొన్నిదినాలలో దినానికి ౨౪గంటలలో ౨౨ గంటలసేపు నిద్రింతురు.

మానవులలో ఎక్కువగా నుండే జాడ్యము పండ్ల(దంత)జాడ్యము.

అమెరికా సంయుక్తరాష్ట్రంలో (యూ. ఎస్. ఏ) ప్రపంచము లోసిద్ధమగు సబ్బులలో మూడవవంతు ఖర్చగుచున్నవి.

రేడియం—అనే ఒక అసాధారణ లోహమును కనిపెట్టినారు. దాని వెల ప్రపంచమందలి రత్నాలనుగూడా మించినట్టిది. గ్రాం అనగా ౧౫ ౧/౨ వడ్లగింజలయెత్తు. ఒక్క గ్రాం తూకముగల రేడియం వెల ౪౦ వేల డాలర్లు (డాలరుకు ఇదివరలో ౪ రూపాయీల మారకముండెను. ఇప్పుడెక్కువైనదేమో తెలియదు). శరీరమునుబట్టి జీవరాశిలో పెద్దతలకలవి చీమలు. అవి ఇతరజీవులవలన చావును తప్పించుకొనిన నాలుగేండ్లు బ్రతుకును. వాటికి 'చీమరాణి' యుండును. అది ౧౫ ఏండ్లవరకుకూడా బ్రతుకునని శాస్త్రజ్ఞులు నిర్ణయించినారు.

ఏనుగుతూకము సాధారణముగా పదిటన్నులుండును. కల్తీలేని బంగారులో ౨౪ క్యారట్లుండును. అట్టిబంగారును ౨౪ క్యారట్ల బంగారందురు.

(ఈ 'వివిధములు' 'The New pocket quiz book' నుండి గ్రహింపబడెనవి.)

ఇంగ్లీషులో బాల బాలికల, యువతీ యువకుల విజ్ఞానాభివృద్ధికై అనేక గ్రంథములను సచిత్రముగా ముద్రించినారు. వాటిని చదువుట వలన పాఠకుల ప్రాపంచిక జ్ఞానము చాలా వృద్ధిపొందును. మన పల్లెటూరి వారికి భారత భాగవత రామాయణ కథలు కొంత, తమ ఊరు దాని పరిసరాలు కొంత తప్ప అంతకు మించినవి తెలియవు. మన గ్రామ జనులకు విశాల ప్రపంచములోని విజ్ఞానమును స్థూలముగా నయినను తెలుపవలెను. ఈ దృష్టిలో కొన్ని విషయాలు వివిధాంగ్ల గ్రంథాలనుండి ఏరి కూర్చనైనది. ఇంగ్లీషులో A book of facts, What do you kuow, the wonders of nature, Quiz book వంటివి చాలా గ్రంథాలు కలవు. మనలో అట్టివేవియు తెనుగులో లేవు. పాఠకుల యొక్కయు, రచయితల యొక్కయు దృష్టి యీ వాఙ్మయమువైపునకు ప్రసరింప దగినది.



# ఉపజీవన విజ్ఞానము



## గ్రామ సమస్యలు



## ౧౩ వ ప్రకరణము

హిందూస్థానము గ్రామాలపైననే ఆధారపడినది. హిందూస్థానమందు ఏడులక్షల గ్రామాలుకలవు. ౨౦౦ పట్టణాలే కలవు. హైదరాబాదు సంస్థానములో ౨౨౦౦౦ గ్రామాలుకలవు. గ్రామములలో నివసించుజనులు నూటికి ౮౭ పాళ్ళున్నారు. మనదేశమందే గ్రామాలలో హెచ్చుగా ప్రజలున్నారు. కెనడాలో నూటికి ౪౬, ఐర్ దేశములో ౪౯, ఫ్రాన్సులో ౫౧ పరిమాణము పల్లెలలో ఉన్నారు. ఇతరదేశాలలో జను లెక్కువగా పరిశ్రమలపై ఆధారపడినారు. మనదేశమందు ఎక్కువ జనులు వ్యవసాయముపై ఆధారపడినారు. కాని చిత్రమేమంటే మనం పండించే పంటలు మనతిండికే సరిపోవు. అనగా మన వ్యవసాయము చాలా హీనస్థితిలో ఉన్నదని ఈ క్రిందిపట్టిక తెలుపుచున్నది.

| దేశము. | ఒక ఎకరములోని వరిపంట. పౌండ్లతూకములో. |
|---|---|
| ఈజిప్టు | ౨౯౯౮ |
| ఇటలీ | ౪౫౬౮ |
| జపాను | ౩౪౪౪ |
| సం. అమెరికా | ౨౧౮౫ |
| చీనా | ౨౪౩౩ |
| హిందూస్థానము | ౧౨౪౦ |

తక్కినపంటలుకూడా ఇదే మోతాదుపై పండునని ఊహించుకొనుడు.

ఈ విచారపరిస్థితికి కారణమేమి? మనము దరిద్రులము. రైతులు అప్పులపాలైనారు. జనులలో విద్యలేదు. మేలైన పరికరాలు లేవు. భూమి నిస్సారమైపోయినది. పశుపోషణము సరిగాలేదు. జనులు అనారోగ్యస్థితిలో నున్నారు. మనదేశమందే మరణసంఖ్య హెచ్చు. మనదేశమందే జీవనపరిమాణము అన్నింటికంటె తక్కువ. మన సగటు ఆయుర్దాయము ౨౧ సంవత్సరములు. మన సగటు దినాదాయం యుద్ధానికి పూర్వము ఒకటిన్నరఅణా. ఇప్పుడు ఆరణాలై యుండును.

మనము బాగుపడవలెనంటే పై లోపాలను తొలగించుకోవలెను. గ్రామాలను బాగుపరిచితే ఈ లోపాలు తొలగిపోగలవు. ఎందుకనపట్టణాలలో వైద్యవిద్యాదిసౌకర్యాలు కలవు. గ్రామాలకు లేవు. కావున గ్రామసముద్ధరణ మెట్లుకావలెనో ఆలోచింతము.

౧. ప్రతిగ్రామములో ఉత్తమమగు సహకారపద్ధతిపై సంఘమొకటి యుండవలెను.

౨. గ్రామ పంచాయతీ సంఘమొకటి యుండవలెను.

౩. గ్రామ గ్రంథాలయ ముండవలెను.

ఈ మూడును ముఖ్యమైనవి. ఇవి ఏమిపని చేయవలెననగా

౧. సహకారసంఘము:— సహకార పద్ధతులపై గ్రామజనులకు అప్పులిచ్చి గ్రామావసరములగు బట్టలు మున్నగువానిని తెప్పించి స్వల్పలాభాలపై అమ్మించవలెను. మంచివిత్తనాలు సప్లైచేయవలెను. ప్రభుత్వమునుండి సహకారముపొంది గ్రామజనులకు పశువులకు టీకాలు వేయించుట, మున్నగు విషయములలో తోడ్పడవలెను. ప్రజల ఆర్థిక స్థితిని బాగుపరుచుటలో ఈసంఘము పనిచేయవలెను.

౨. గ్రామ పంచాయతీలు:— గ్రామములో పార్టీలు కక్షలు ఉండకుండా చూచుకోవలెను. వీటివల్లనే గ్రామము నాశనమవుతున్నది. పక్షపాతులుకాక న్యాయపరులైనవారిని ముగ్గురినో అయిదుగురినో గ్రామజను లెన్నుకొని తమ వివాదాల నన్నింటిని పరిష్కరించుటకై కోరవలెను. ప్రతి ఉగాదినాడు క్రొత్తయెన్నికలు చేయవచ్చును. గ్రామములో అమ్మబడు ధాన్యంపై 'కాంటా' వసూలుచేసి దానిని పంచాయతీపరము చేయవలెను. మరియు చందాలియ్యగలవారు చందాలియ్యవలెను. దీనిని పంచాయతివారు గ్రామాభ్యుదయానికై వినియోగించవలెను. ఇంటింటికి కొంతధాన్యము నెలకో సంవత్సరానికో ఒకమారియ్యవలెను. లేదా కల్లములో ధాన్యం వసూలుచేయవలెను. ఈ ధాన్యమునుండి గ్రామమునకువచ్చు వికలాంగులకు, రోగులకు, కుంటి గ్రుడ్డి మున్నగువారికి సహాయముచేయవలెను. ఇక గ్రామములో ఎవ్వరికినీ బిచ్చముపెట్టరాదు. వసూలైన ధాన్యమునుండియే పంచాయతీ సభవారు తగు విచక్షణతో నిజముగా అర్హులగువారికి సహాయముచేయవలెను. ఈ విధముగా భిక్షావృత్తి తొలగిపోగలదు.

గ్రామములోని పారిశుద్ధ్యతకు, వీధులకు, మురికినీటికాల్వలశుభ్రతకు, ఊరిచుట్టు బాటలకు, బావుల పారిశుద్ధ్యతకు, గ్రామారోగ్యమునకు పంచాయతీసభయే బాధ్యత వహించవలెను. ప్రతిగ్రామములో ప్రాథమికచికిత్సలకు అనగా మలేరియాకు క్వైనైన్, కడుపునొప్పులకు, తలనొప్పి చెవినొప్పులకు, కండ్లకువచ్చు రోగాలకు, చిన్నగాయాలకు, అవసరమగు మందులను తెప్పించి యుంచవలెను. ఐయోడిన్, ఫినా

యిల్, పొటాసియంపర్మాంగనేటు వంటివి వుంచవలెను. టీకాలుతీయు వారిని పిలిపించి స్ఫోటకానికి పిల్లలకంతా .టీకాలు తీయించవలెను, ఇవి పంచాయతీపనులై యుండును. ఇంతేకాక.కమ్మరి, వడ్రింగి, సాలె, మున్నగు పారిశ్రామికులవృత్తులు సరిగా సాగునట్లు విచారించుకోవలెను.

3. గ్రంథాలయము:— గ్రామ గ్రంథాలయములో అన్నిపుస్తకాలూ ఉండనవసరములేదు. భారత భాగవత రామాయణములు, పూర్వకవులలోని ఉత్తమకృతులు, ఆధునిక వాఙ్మయములోని ఉత్తమములైనవి వ్యవసాయ పశువైద్య గ్రంథాలు, రాజకీయములు, మంచి నవలలు, నాటకాలు, కథలు, మున్నగునవి ఏరి తెప్పించియుంచిన చాలును. ప్రతిగ్రామానికి కనిష్ఠమొక దినపత్రిక ప్రజల భాషలోనిది తెప్పించవలెను. గ్రామ గ్రంథాలయము నడుపువారు ౫౬ మందియుండిన చాలును. వారుమాత్రము సంపూర్ణశ్రద్ధకలిగి యుండవలెను. గ్రామ ధనికులే గ్రంథాలయ వ్యయమును భరింపవలసియుండును. గ్రంథాలయము గ్రామములోని బాలుర విద్యనుకూడా విచారించుకొనవలెను. గ్రామపాఠశాలలను ప్రభుత్వముచే స్థాపింపజేసి అవి సరిగా పనిచేయకుండిన అధికారులకు తెలిపి పనితీసుకోవలెను. యువకుల ఆటపాటలకు, భజనలకు, .విద్యావ్యాప్తికి, విజ్ఞానవ్యాప్తికి గ్రామ గ్రంథాలయము కేంద్రముగా నుండవలెను. వీలైన వయోజనవిద్యను రాత్రి పాఠశాలలద్వారా సాగించవలెను.

ఈ విధముగా ప్రతిగ్రామములో మూడు చిన్నసంస్థలు గ్రామ జనుల ఆర్థిక, ఆరోగ్య, వైజ్ఞానిక, అవసరాలను విచారించుకొనిన గ్రామాలు త్వరగా వృద్ధికి రాగలవు.

ముఖ్యముగా ఒకవిషయము నుగమనింపవలెను. స్వయంసహాయమే ఉత్తమసహాయము. ప్రతికార్యానికి ప్రభుత్వముపై ఆధారపడరాదు. ప్రభుత్వమునుండి వీలైనంతవరకు పనితీసుకొన ప్రయత్నించవలెను.

కాని వారువచ్చి చేయువరకు ఆగరాదు. తమచేతనైనంతసేవను గ్రామా నికి యువకులు, ధనికులు, విజ్ఞులు చేయవలెను.

గ్రామోద్ధరణమును ఇతరప్రాంతాలలో ఎట్లు చేయుచున్నారో గ్రామములో విద్యావంతులు గమనిస్తూయుండవలెను. పంజాబులోని గిర్గాంలో ఈపని చాలాబాగా జరిగినది. వారు ప్రచురించిన వాఙ్మయాన్ని తెప్పించుకొనవలెను. వారుప్రచురించిన 'సాక్రటీసు సందేశము' అనునది తెనుగులోప్రకటితమైనది. అది ప్రతిగ్రామములో ప్రతివిద్యావంతుడు చదివి ఇతరులకువినిపించి దానిప్రకార మాచరించుకొనవలెను. (ఆ గ్రంథమిప్పుడు మరల అచ్చువేయలేదు. అది విచారకరము).

గ్రామాలను స్వయంపోషకముగా చేయుటకై గాంధీమహాత్ముడు సదా ప్రయత్నించెను. చర్ఖాసంఘమువారు, గ్రామపరిశ్రమ సంఘము వారు చేసినకృషిని గ్రామజనులు తెలుసుకొని తమతమ గ్రామాలలో వాటిని అమలుపరచవలెను.

ఉగాది, దసరా, సరిగా ఆరునెలల అంతరాయములో వచ్చును. ఉగాదిలోని శ్రీరామ నవరాత్రిలు, దసరాలోని నవరాత్రిలను, ప్రజలు గ్రామాభ్యుదయానికి చక్కగా వినియోగించుకొనవలెను. యువకులలో శారీరకవ్యాయామము, ఆటలపోటీలు, భజనలు, ప్రదర్శనములు, ఉపన్యాసములు, మున్నగునవి ఈ నవరాత్రులలో కావించిన జనులలో మంచి అలవాట్లు ఉత్సాహము ఏర్పడును. ప్రదర్శనములు అనగా గ్రామజనుల పరిశ్రమలు, పశుప్రదర్శనములు, నూతన వ్యవసాయక సాధనములు, ఆరోగ్యమునుగూర్చి తెలుపు చిత్రపటాలు, మత్తు ద్రవ్యాలవలనకలుగు నష్టాలను తెలుపు చిత్రములు, యక్షిణీదీపము (మ్యాజిక్ లాంటరన్) ద్వారా ప్రదర్శనములు, బుర్రకథలు, జాతీయ గేయములు, మున్నగునవన్నియు నని యర్థము.

గ్రామ జనులను వ్యవసాయ మొక్కటే పోషించజాలదు. మంచి మేలైన సులభమగు చిన్న యంత్రాల మగ్గములు, రాటములు, మేలైన

వడ్రంగి కౌరముట్లు ప్రవేశ పెట్టవలెను. మరియు తాళ్ళు పగ్గములు చిన్న చిన్న చేతి యంత్రాల ద్వారా పేడునట్టివి. ఉన్ని దారము వడుకు రాటాలు ప్రవేశ పెట్టవలెను. తేనెటీగలను పెంచుట కూడా ముఖ్యమైనది. కోళ్ళను పెంచుట మనకు సరిగా తెలియదు. కోడి గ్రుడ్లు సగము కుళ్ళును. సగము కోడిపిల్లలు పిల్లులపాలు అగును. రోగాలతో కోళ్ళు కొల్లలుగా చచ్చును. ఇవన్నియు తగ్గించి పోషించు అవకాశా లున్నవి. ప్రతియింటి పెరటిలో కూరగాయలు పెంచు అలవాట్లు చేయ వలెను. మంచి కూరగాయల విత్తనాలు తెప్పించి గ్రామ జనుల కమ్మ వలెను. ఆవులను మేకలను పెంచుటలో ఎక్కువ శ్రద్ధ వహించవలెను. ఇండియన్ యూనియన్‌లో పలు ప్రాంతాలలో గ్రామానికొక విత్తనము కోడెను విడుచుటకై సూబా ప్రభుత్వాలు గ్రామానికి ౫౦౦ రూ॥ ప్రకార మిస్తున్నారు. అట్టిదాని వలన రైతులు లాభం పొంద వలెను. ప్రతి రైతు కనిష్ఠ మొక మంచి ఆవును పెంచి విత్తనము కోడెనుండి మంచి కోడెల సంతానమును వృద్ధిచేయ వలెను. పశువులకు టీకాలను విధిగా వేయించవలెను. ప్రతి గ్రామమునుండి కొందరి యువ కులను గ్రామ పరిశ్రమలను నేర్చుకొనుటకు వార్ధావంటి స్థలాలకు పంపి శిక్షణ మిప్పించవలెను.

ఈ యువజనవిజ్ఞానములో క్రిందచెప్పబోవు విషయాలు విపుల ముగా వ్రాయబడినవైనను మరల సూత్రప్రాయముగా ఈ క్రిందివి వ్రాయనైనవి; వీటిని గ్రామజనులు గమనించవలెను.

అకాలమరణానికి మూలకారణము అజ్ఞానం—
అజ్ఞానంవలన దారిద్ర్యము సంభవించును—
దారిద్ర్యమునుండి మురికి (దురాచారాలు) పుట్టును—
మురికివలన జాడ్యములు ఉత్పత్తియగును—
జాడ్యములవలన చావులు తొందరగా కలుగును—
కావున చావుకుమూలము అజ్ఞానమని తెలిసెను—
అజ్ఞానానికి మంచిమందు విద్య—

కుక్షికి కన్నమెంత అవసరమో మెదడుకు విద్య అంత అవసరము—
మగవారికెంత విద్యకావలెనో ఆడువారికంత కావలెను—
విద్యలేనివాడు వింతపశువు—
అవిద్య—అంధకారము రెండును కవల పిల్లలు—
దారిద్ర్యమునకు చికిత్స— వ్యవసాయము, పరిశ్రమలు.
పారిశుద్ధ్యమే ఆరోగ్యమునకు మూలకందము—

మన యిండ్లచుట్టు పూలు, ఫలములు, కూరగాయలు పెంచుట బాగా? ఫల పుష్పాలవల్ల ఆరోగ్యము, అర్థము (పైకము), ఆనందము లభించును. మురికి వలన కలరా వంటి జాడ్యాలు, మరణాలు, రోగాలు, దుఃఖము లభించును.

గ్రామ సౌభాగ్యమే అందరి సౌఖ్యము—
గ్రామ క్షీణతయే అందరికీ నాశనము—

ఐకమత్యము, సహకారము, సేవాభిలాష లేనిది గ్రామాలు వృద్ధికే రావు అను ముఖ్య సూత్రాన్ని ఎవ్వరునూ మరువరాదు. గ్రామ జనులు కలహించుకొన్నను వారు ప్రజాహిత గ్రామ సమస్యలలో మాత్రి మేకమై యుండు విధాలను అలవాటు చేసుకోవలెను.

జనసేవయే ఈశ్వరసేవ,
మానవ సేవయే మాధవ సేవ.

"కర్మణ్యేవాధికారస్తే
మాఫలేషు కదాచన"

అన్న గీతా వాక్యమును శ్రీకృష్ణ భగవానుని ఆజ్ఞను నిత్యస్మరణ చేయుడు.

ప్రజా సేవలోనే మోక్షము కలదు.

సమాప్తము.

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| పీఠిక | ౮ | తాలూకు | తాటాకు |
| ౨౫ | ౮ | షణి | ఫణి |
| ౨౬ | ౧౫ | గాలువ | గొలువ |
| ౩౫ | ౮ | సుఖముల్ | సఖముల్ |
| ౩౯ | ౧ | ౧౯౫౦ | ౯౫౦ |
| ౩౯ | ౧౫ | ౧౬౫౦ | ౧౯౫౦ |
| ౫౦ | ౫ | జరథుస్ట్ర | జరథుస్త్ర— ఇట్లే ౫౦—౫౬ పుటలలో సవరించుకొనుడు. |
| ౫౧ | ౫ | కుజథ | మజథా |
| ౫౬ | ౨౦ | అహార | అహుర |
| ౫౭ | ౨౮ | అహురుజథా | అహురమజథా |
| ౫౭ | ౨౬ | భృంగ్యాంగి | భృగ్వాంగి |
| ౫౯ | ౧ | క్రబూ | హీబ్రూ |
| ౬౫ | ౨౧ | వదలరాఅనిలూ | వదలరాదాయని |
| ౬౫ | ౨౨ | శిష్యుల | శిష్యులతో |
| ౬౬ | ౧ | చూచినావా | చూచినారా |
| ౬౭ | ౧౫ | క్రైస్త్రవ | క్రైస్తవ |
| ౭౦ | ౧౨ | ఉండెమ | ఉండెను |
| ౭౯ | ౧౭ | పీకాల్ | పీకాక్ |
| ౮౦ | ౨౩ | హీందువులు | హిందువులు |
| ౮౧ | ౨౬ | ఏ అబీ | ఏ. బీ. |
| ౮౬ | ౩ | పూర్యి | పూర్వి |
| ౮౮ | ౨ | ఆజెల్ట్ | ఆజెక్ట్ |
| ౯౧ | ౩ | అప్లానీ | అఫ్గానీ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౯౫ | ౧౦ | గ్రిం | గ్రిం |
| ౯౫ | ౧౭ | భాషవేవి | భాషలేవి |
| ౧౦౨ | ౨౧ | గూర్చి | గూల్చి |
| ౧౧౧ | ౧౨ | ఉక్కైతే | అక్కైతే |
| ౧౨౦ | ౨౨ | కపుల | కవుల |
| ౧౨౩ | ౧౯ | రాగములను | నీరౌను |
| ౧౪౬ | ౭ | హీబ్రూ్రాణము | హీబ్రూపురాణము |
| ౧౪౯ | ౨౩ | భూమండము | భూమండలము |
| ౧౫౪ | ౨౩ | పెట్టినందున | కని పెట్టినందున |
| ౧౬౨ | ౭ | ఆంగ్టేయు | ఆంగ్లేయు |
| ౧౬౩ | ౨౦ | గోని | కొన్ని |
| ౧౬౩ | ౨౪ | ౧౮౦౦౦ | ౧౮౦౦ |
| ౧౭౨ | ౧౩ | యుధ్ధానకి | యుద్ధానికి |
| ౧౯౬ | ౧౪ | కాగితములో | కాగితములు |
| ౧౯౭ | ౨౨ | ముత్యాలపై | ముత్యాలకై |
| ౨౧౬ | ౧౯ | మషిని | మనిషిని |
| ౨౨౦ | ౧౦ | తుళ్లై | తోళ్లై |
| ౨౨౫ | ౧౩ | దీరుండును | నీరుండును |
| ౨౩౩ | ౫ | ఊరి | ఊని |
| ౨౩౩ | ౨౨ | యూరకా | యూరకా |
| ౨౬౪ | ౨౦ | భిల్లి | ఛిల్లీ |
| ౨౭౯ | ౨౦—౨౨ | | ఈమూడు పంక్తులెత్తి వేయుడు యుద్ధపూర్వము వ్రాసినవి పొరపాటున నుండిపోయినవి. |
| ౨౮౪ | ౧౪ | లోట్లకు | చోట్లకు |
| ౨౮౫ | ౧౨ | ౧౪౪౮ | ౧౮౪౮ |
| ౨౮౭ | ౧౧ | ఆము | ధము |
| ,, | ౧౨ | ధప్పుడు | అప్పుడు |
| ౩౧౧ | ౧౮ | వత్తింతురు | నొత్తింతురు |

# విజ్ఞానవర్ధినీ గ్రంథావళి





దొరకుచోటు:—

కార్యదర్శి
విజ్ఞాన వర్ధనీ పరిషత్తు
సుల్తాన్ బజారు, హైదరాబాదు–దక్షిణ

---

శ్రీవాణీముద్రాలయము హై. ద.

"ఒడిలోన పంచాంగ ముంచుకొన్నది గాన
కేటు పోయె ననుచు నూరెల్ల వెదకు
పనిలేనిపని వీధి జనుచు గ్రమ్మరు నాత్మ
గృహమంచు నెంచి యిల్లిల్లు దూరు
అపుడు భుక్తి యొసర్చి యడ్రనపే సంకటి
తింటినా యని యింటి తెరవ నడుగు
కురుచదోవతి కట్టుకొని యెవ్వరోయిట్లు
కట్టిపోయి రటంచు గలవరించు
గడియలో దెల్లవారె, భాస్కరుడు గ్రుంకె
జాగు లేలంచు సందెపై సందె వార్చు
కంతెమాయల నుమ్మెత్త కాయ దిన్న
పోలుపు సారెకు దెల్పు నప్పడమి వేల్పు."

ఏవర్ణన యైనను సరే సహజాలంకారములతో స్వభావోక్తులతో చక్కని జాను తెనుగుతో నిండి యుండును.

## గోలకొండ కవులు

విజయనగరరాజుల కాలములో గోలకొండ కుతుబ్షాల కాలములో అందు ముఖ్యముగా ఇబ్రహీంకుతుబ్‌షా కాలములో పలువురు తెనుగుకవు లుండిరి. అందు ముఖ్యులు మొదటి అచ్చతెనుగు కావ్యమగు యయాతిచరిత్రమును వ్రాసిన పొన్నగంటి తెలగనార్యుడు, మలిక్ ఇబ్రహీంకుతుబ్‌షా (మల్కిభరాముని) ఆస్థానకవియైన అద్దంకి గంగాధర కవియునై యుండిరి. ఇతడు తపతీసంవరణోపాఖ్యానమును రచించెను. గోలకొండఖిల్లాలో కరణముగా నుండిన సారంగుతమ్మయ వైజయంతీ విలాసమను మంచికావ్యమును రచించెను. ప్రౌఢకవి మల్లారెడ్డియు ఈ కాలమువాడే. అతడు దోమకొండ ప్రభువులకు పూర్వపురుషుడు, అతడు షట్చక్రవర్తిచరిత్ర మున్నగు పెక్కుగ్రంథాలను రచించెను. నిరంకుశోపాఖ్యానమును వ్రాసిన సంకుసాల రుద్రయ్యయు ఈ కాలమువాడే. ఓరు